DIST. MILK PRODUCERS MUTUALLY AIDED COOP.

# SANGAM DAIRY

## VADLAMUDI - 522 213 A.P.

(An ISO 9001-2000 and 22000-2005 certified Dairy



K. RAJANBABU
CHAIRMAN

This Milk Union is procuring Milk from milk producers of
by paying remunerative price and at the same time supplying
urban consumers at reasonable price.




## MILK AND MILK PROD

1. Whole Milk (6% fat and 9%SNF) 2. Toned Milk (3% fat a
4. Kalakhand (250 grams) 5. Basundi Cups 6. Butter M
(1kg, 1/2kg and 15 kg) 9. Table Butter (10g, 100g
Cooking butter (500g) 12. Mango Drink (1 litr

Telephone Nos. 08644-258281 to 258285(E
City Marketing Office, Amaravthi Road G

**K. GOPINADH**
M.D

# We
## e not just another gineering college!!



e only engineering college with an IT edge. Where every engineer passing out of VVIT ould be a thoroughbred professional waiting to embark on a global multifaceted career. e VVIT academic team is the best in the field focusing on training for tomorrow today.

d's Future is engineered here

- e discipline.
- F nt and Prof sional Faculty.
- Free Aptech Certification course worth over Rs. 25,000.
- A/C classrooms with Multi-modal teaching aids.
- State-of-art Computer Lab with High Speed Internet Connectivity.

**VVIT**

VASIREDDY VENKATADRI INSTITUTE OF TECHNOLOGY

వాసిరెడ్డి వెంకటాద్రి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి

**NAMBUR**

(12 K.M. from Guntur, 25 K.M. from Vijayawada)

**Ph : 0863 - 2119782**

City Centre :

**APTECH**, 4/7, Brodipet, Guntur. Ph : 0863 - 2234336

*The Ultimate Destination for Urigue Pharmaceutical Education*

# VISHWA BHARATHI COLLEGE OF PHARMACEUTICAL SCIENCES

**PERECHERLA, GUNTUR - 522 009. A.P.**

**Phones: 0863-2290958, 2231190, 2290466, 2266789**

**Affiliated to J.N.T. University, Hyderabad.**

**Recognised by Pharmacy Council of India, AICTE, Govt. of A.P.**

. 1997




**LOCATION:** The College is located at Parecherla, 10minutes drive from Guntur in a serene atmosphere. The salubrious setting of the institute creates an aura of its own

**ABOUT SOCIETY:** Bharathi Educational Society established in 1997 with an aim to promote quality technical education in pharmaceutical sciences. It is being led by the expertise of **Smt. O. SAKUNTHALA,** Secretary and Correspondent.

BEST IN CLASS INFRASTRUCTURE
FULLY EQUIPPED LABORATORIES
HIGHLY QUALIFIED AND DEDICATED FACULTY
E-LIBRARY FULLY EQUIPPED WITH BOOKS, NATIONAL ND FOREIGN JOURNALS, DELNET FACILITY
XCELLENT HOSTEL FACILITY FOR BOYS & GIRLS
ACEMENT CELL
NGUAGE LAB TRAINING FOR GRE & TOEFL

*in a world of competition whe e success not possible without hardwork*

# గుంటూరు జిల్లా 'సూర్య' పాఠకులకు 'సర్వధారి' నామ సంవత్సర శుభాకాంక్షలు



రాష్ట్రంలో తొలిసారిగా పదహారు ఎడిషన్లతో అత్యాధునిక టెక్నాలజీతో రూపొందిన సూర్య దినపత్రికకు మీరందిస్తున్న సహాయ సహకారాలకు కృతజ్ఞతాభివందనములు. సూర్య కుటుంబం తరుపున ప్రతి ఒక్కరికి 'సర్వధారి'నామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలు. సామాజిక న్యాయం కోసం రాష్ట్రంలో తొలిసారిగా సమర శంఖం పూరించిన సూర్య దినపత్రికకు రాష్ట్రం నలుమూలల నుంచి విశేషస్పందన లభిస్తోంది. దీర్ఘకాలంగా అధికారానికి దూరంగా ఉన్న వారికి తగిన చేయూతనిచ్చేందుకు సూర్య దినపత్రిక నిర్వహించిన సదస్సులతో ప్రధాన రాజకీయ పార్టీలలోనూ, అధికార యంత్రాంగంలోనూ కదలిక వచ్చింది. నిజాన్ని నిర్భయంగా తేటతెల్లం చేసే రీతిలో సూర్య దినపత్రిక ప్రచురించిన అనేక కథనాలకు ప్రభుత్వం, ప్రధాన రాజకీయ పార్టీలు స్పందించిన తీరు ముదావాహం. సూర్యపై మీరు చూపిస్తున్న అపారమైన ఆదరాభిమానాలు మా బాధ్యతను మరింతగా పెంచుతున్నాయి. అవినీతి అక్రమాలను దునుమాడటం, అభివృద్ధికి ప్రాధాన్యత ఇవ్వడంతో పాటు సంక్షేమ రంగానికి పెద్దపీట వేసేలా ప్రచురించిన కథనాలకు పాఠకుల నుంచి లభించిన స్పందనే ఇందుకు నిదర్శనం. స్వాతంత్ర్య సంగ్రామంలో ఉద్దండులైన సమరయోధులను, దేశపాలనలో పుంభావ సరస్వతులను అందించిన ఘనత గుంటూరు జిల్లాదే. స్వర్ణభారతంలో గుంటూరు జిల్లా సాధించిన ప్రగతి విస్మరించరానిది. ఎన్నో రంగాలలో ఎంతో అభివృద్ధిని గడించింది. మరెన్నో విధాలైన ఆటుపోట్లనూ చవిచూసింది. అయినా అడుగడుగునా ఎదురైన అవాంతరాలెన్నింటినో బాలారిష్టాలుగా తన కొనగోటితో తోసేస్తూ చరిత్ర సృష్టించింది. తనదైన ఉనికినీ చాటుకుంటూ ఈ అయిదు దశాబ్దాల కాలంలో గుంటూరు దినదినాభివృద్ధి చెందుతూ వచ్చింది. ఏ జాతికైనా తమ ప్రాచీన చరిత్ర గర్వకారణమే. సాహిత్య శిల్పకళలను ఆది నుంచి ఆటపట్టుగా ఉన్న ఈ ప్రాంతంలో హిందూ, ముస్లిం, క్రైస్తవ, జైన, బౌద్ధ తదితర మతాలు సహజీవనం చేశాయి. దక్షిణాది రాష్ట్రాలలో మొదటగా గుంటూరు జిల్లాలోనే లూథరన్ క్రిస్టియన్ మిషనరీలు విద్య, వైద్య రంగాలలో ...ము సేవా కార్యక్రమాలకు నాందీ పలికిన గడ్డ ఇది. ప్రపంచ ప్రఖ్యాతి గడించిన కోహినూరు వజ్రాన్ని కన్న రత్నగర్భ గుంటూరు కావడం అందరికీ గర్వకారణం. నవయువ కవి గుర్రం జాషువా అన్నట్లు 'ఏసకొంచెము లేని హృదయంగమంబైన సిసిలైన రంజిల్లు చోటు గుంటూరు' అని. కవిత్రయ మధ్యముడు తిక్కన జన్మస్థలియై కనకస్నానమాడిన కవిసార్వభౌముడు నడయాడిన పుణ్యభూమిగా, ఆచార్య నాగార్జునుని బోధనలు ప్రతిధ్వనించిన పవిత్ర క్షేత్రంగా గుంటూరు చరిత్రను ప్రస్ఫుటింప చేశాయి. స్వాతంత్ర్య సమరయోధులు, ఆచార్య ఎన్‌జి రంగా, వావిలాల గోపాలకృష్ణయ్య, ప్రగడ కోటయ్య వంటి ఉద్దండులు, జాతీయ కవి రాయప్రోలు, అభినవ కవి తిక్కన సీతారామమూర్తి, నవయుగ కవి జాషువా, హేతువాద ఉద్యమ నిర్మాత త్రిపురనేని రామస్వామి, కరుణశ్రీ వంటి ఎందరో కవులు, కళాకారులు, రాజకీయ ఉద్దండులకు పుట్టిన గడ్డగా గుంటూరు సీమ దేశంలోనే ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. విద్య, వైద్య రంగాలలో కూడా తనకంటూ ఒక సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకుని అభివృద్ధి పథంలో మరింత ముందుకు దూసుకుపోతోంది. "ఎండు మిరప ఘాటునైనా మంటు టెండ ధాటినైనా తట్టుకొనెడి దిట్టలున్న పట్టణమ్ము గుంటూరే" అని ఓ కవివరేణ్యుడన్నట్లుగా వ్యవసాయ పరంగా అన్నిరకాల పంటలు పండించి గుంటూరు జిల్లా దేశంలోనే ఒక ప్రత్యేక స్థానాన్ని పొంది ఉంది. వాణిజ్య పంటలకు నిలయమైన గుంటూరు మిర్చి, పొగాకు ఘాటు ప్రపంచం మొత్తం సుపరిచితమే. "ఆహా ఏమి రుచి.. కనరా మైమరచి.." అంటూ ఓ సినీ కవి కలంలో రుచులు చవి చూసిన అచ్చతెలుగు గోంగూరకు మేలిపాదు గుంటూరే కావడం ముదావహం. " సామాజిక రాజకీయ చైతన్యము ప్రస్ఫుటించు ఉద్యమాలకెన్నింటికో ఉనికిపట్టు గుంటూరే"నన్నట్లుగా ఎన్నో ఉద్యమాలకు ఈ గుంటూరే పుట్టినిల్లు. తూర్పున బంగాళాఖాతం, పడమటిన కొండవీటి, కోటప్ప కొండలు, ఉత్తరాన కృష్ణవేణమ్మ హొయలు, దక్షిణాన సుప్రసిద్ధ పట్టణానికి ప్రసిద్ధమై ఈ జిల్లా ఖ్యాతి అనన్యం. ఎంతో మంది కళాకారులు, చేయి తిరిగిన వైద్యులను అందించిన ఘనతా గుంటూరుదే. అటువంటి గుంటూరు జిల్లా అభివృద్ధిలో కీలకపాత్ర పోషిస్తున్న గుంటూరు జిల్లా ఉన్నతాధికారులకు, ప్రజా ప్రతినిధులకు నా అభినందనలు. "సూర్య" దినపత్రిక పాఠకులకు, ప్రకటనకర్తలకు "సర్వధారి" నామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలతో.....మీ

నూకారపు సూర్య ప్రకాశరావు,
చైర్మన్, మేనేజింగ్ డైరెక్టర్ అండ్ చీఫ్ ఎడిటర్

# సిరిసంపదల ఖిల్లా గుంటూరు జిల్లా

ఎవిడి శర్మ, సూర్యప్రతినిధి, గుంటూరు

నూట నాలుగేళ్ళ సంవత్సరాల చరిత్ర కలిగిన గుంటూరు జిల్లా ప్రకృతి శోభలకు సిరిసంపదలకు నిలయమై ధాన్యాగారంగా భాసిల్లుతోంది. ఎత్తైన కొండలు, కోనలు, అడవులు, లోయలు, ఖనిజాలు, తటాకాలు, పంటకాలువలు, నవధాన్యాలు ఎన్నో వాణిజ్య పంటలు పండించే సారవంతమైన భూములు జిల్లాలో ఉన్నాయి. జిల్లాకు ఎటుచూసిన నీటి వనరులు పుష్కలంగా ఉన్నాయి. చుట్టూ కృష్ణానది ప్రవహిస్తోంది. ఇంతటి ప్రాశస్త్యాన్ని సంతరించుకున్న గుంటూరు జిల్లా 1904 అక్టోబరు 1న ఏర్పడింది. జిల్లా ఏర్పడి 104 సంవత్సరాలు పూర్తి చేసుకుంది. గుంటూరు జిల్లాను క్రీస్తు పూర్వం 4వ శతాబ్ది నుంచి నేటి వరకు గణతంత్ర రాజులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, ప్రాచీన పల్లవులు, ఆనందోగోత్రీకులు, బృహత్సాయనులు, విష్ణుకుండినులు, దూర్జయులు, తూర్పు చాళుక్యులు, మాండలిక రాజులు, కాకతీయులు, రెడ్డి రాజులు, విజయ నగర పాలకులు, కుతుబ్‌షాహీలు, మొగలులు, ఆసఫ్‌జాగీలు, బ్రిటీష్ పాలకులు పరిపాలించారు. 1947 నుంచి భారత పాలనా యంత్రాంగం పరిధిలోకి గుంటూరు పాలనా యంత్రాంగం కూడా చేరింది. 1950 జనవరి 26 తరువాత సర్వసత్తాక ప్రజాస్వామ్య వ్యవస్థ ఆవిర్భవించడంతో భారత దేశం రాజులేని రాజ్యంగా రూపొందింది.



గుంటూరు జిల్లాకు తూర్పున బంగాళాఖాతం, పశ్చిమన మహబూబనగర్, ఉత్తరాన నల్గొండ, ఉత్తర ఈశాన్యాన కృష్ణా జిల్లా దక్షిణాన ప్రకాశం జిల్లాలున్నాయి. 11391 చదరపు కిలోమీటర్ల మేర విస్తరించి ఈ జిల్లా చాలా భాగం తూర్పు ఆగ్నేయ దిశగా వాలి ఉన్న విశాలమైన ప్రదేశం ఉంది. అక్కడక్కడా అవశిష్ట పర్వతాలతో అంతర్లీనమై ఉంది. పశ్చిమాన శ్రీశైలం పీఠభూమితోను, తూర్పువైపున డెల్టా అవక్షేపాలతోనూ, కృష్ణా నీటిప్రవాహ మార్గాలున్నాయి. తూర్పు కనుమలతో పరివేష్ఠితమైన ఈ జిల్లాలో నల్లమల, వెంకటాయపాలెం, కొండవీడు మొదలైన ప్రధాన పర్వత శ్రేణులు, సానుకొండ, కాకర్ల కొండలను ఎత్తైన శిఖరాలుగా పేర్కొనవచ్చు.

40 కిలోమీటర్ల సముద్ర తీర ప్రాంతం, 250 కిలోమీటర్ల పొడవున ప్రవహించే కృష్ణానది గుంటూరు, కృష్ణా జిల్లాలను విభజించే సరిహద్దుగా ఉంది. పల్నాడు ప్రాంతంలోని గనికొండ వద్ద జిల్లాలో ప్రవేశించి ఉత్తర తూర్పులను చుడుతూ ప్రవహిస్తోంది. మున్నేరు, చంద్రవంక, నాగులేరు కృష్ణానదికి ముఖ్య ఉపనదులు కాగా ఈ జిల్లా నుంచి ప్రవహించే గుండ్లకమ్మ మరో ముఖ్యమైన నది. నాగులేరు వినుకొండ ప్రాంతంలో కొండల్లో పుట్టి ఉత్తరంగా పల్నాడులో ప్రవేశించి కృష్ణానదిలో కలుస్తుంది. చంద్రవంక పల్నాటి గుండా ఉత్తరంగా ప్రవేశించి కృష్ణానదిలో కలుస్తుంది. నాగార్జునసాగర్‌కు 15 కిలోమీటర్ల దూరంలో మాచర్ల–నాగార్జునసాగర్ రహదారిపై 7వ మైలుపై ఎత్తిపోతల జలపాతం ఉంది.

జిల్లాలో వ్యవసాయానికి అనుకూలించే నాలుగు రకాలైన భూములు ఉన్నాయి. నల్లరేగడి, ఎర్రనేలలు, ఇసుకు, ఒండ్రు నేలలు ఉన్నాయి. జిల్లాలో లభించే ఖనిజాల్లో వజ్రాలు, సున్నపురాయి, గాజు ప్రవాహమార్గాలతో కూడి ఇసుక, రాగి, సీసం, జింకు నిక్షేపాలు, క్వార్జ్ కట్టడపు రాళ్ళు, గృహాలంకర శిలలు జిల్లాలో ప్రాశస్త్యం పొందాయి. ప్రపంచ ప్రసిద్ధి చెందిన కోహినూరు వజ్రం కూడా ఇక్కడే లభించింది. అచ్చంపేట మండలం కోళ్ళూరు గ్రామ సమీపన అతివిలువైన వజ్రాలు వెలికితీశారు. కోహినూరు వజ్రం కూడా ఇక్కడే లభించింది. జిల్లాలో సున్నపురాతిలో 25 శాతం రాష్ట్రం మొత్తం మీద ఇక్కడే ఉత్పత్తి కావడం విశేషం. సిమెంటు,పంచదార, టెక్స్‌టైల్, కాగితం, ఔషధం తయారీ పరిశ్రమల్లో అనేక శ్రేణుల సున్నపురాళ్ళు జిల్లాలో విస్తరించి ఉన్నాయి. 2455 మిలియన్ టన్నుల సున్నపు రాతి నిల్వలు జిల్లాలో ఉన్నట్లు అంచనా. దాచేపల్లి ప్రాంతంలో కొత్తగా అనేక సిమెంటు ఫ్యాక్టరీలు వెలుస్తున్నాయి.

వేలాది కార్మికులకు ఉపాధి లభిస్తోంది. చిలకలూరిపేట, యడ్లపాడు టెక్స్‌టైల్ పరిశ్రమ విస్తరిస్తోంది. దాదాపు 25 నుంచి 35 వరకు మిల్లులు పురోగతిలో ఉన్నాయి. తరాలు మారినా నాగరితకను సంతరించుకునే అమరావతి శిల్పసంపద, ప్రపంచంలోని ప్రత్యేకగుర్తింపును పొందింది. దుర్గిలో 12వ శాతాబ్ధంలోనే బీజం పడింది. అంతర్జాతీయ ఖ్యాతినార్జించే శిల్పులు దుర్గిలో ఉన్నారు. ఇన్ని వనరులున్న ఈ జిల్లాలో రాజకీయంగా విద్యాపరంగా కూడా ఎన్నో మైలురాళ్ళను అధిగమించింది. విద్యాపరంగా గుంటూరు జిల్లా దేశంలోనే ఒక ప్రత్యేకమైన విశిష్టతను సంతరించుకుంది.

రాష్ట్రం నలుమూలల నుంచి వివిధ పోటీ పరీక్షలకు గుంటూరు జిల్లాలో శిక్షణ పొందడం ఆనవాయితీగా మారింది. వ్యవసాయపరంగా గుంటూరు జిల్లా ఎంతో ప్రగతిని సాధిస్తోంది. ఆసియా ఖండంలోనే అత్యంత పెద్దదైన గుంటూరు మిర్చియార్డులో ఏటా కోటిన్నర టిక్కిల మిర్చి విక్రయం జరుగుతోంది. అలాగే భారత దేశం మొత్తానికి గుంటూరు టుబాకో బోర్డు తలమానికంగా నిలుస్తోంది. వాణిజ్య పంటల్లో పసుపు, ప్రత్తి కూడా కీలకపాత్ర పోషిస్తున్నాయి. డెల్టా, సాగర్ ఆయుకట్టులో అయిదున్న లక్షల ఎకరాల్లో వరి పండిస్తున్నారు. ఆహార ధాన్యాలు, వాణిజ్య పంటల ఉత్పత్తులు, చిరుధాన్యాలు, పండ్ల తోటలకు గుంటూరు జిల్లా పెట్టింది పేరు.

తమలపాలకు సాగులో కూడా గుంటూరు జిల్లా ముందంజలో ఉంది. రవాణా పరంగా కూడా గుంటూరు జిల్లా గతంలో కన్నా ఎంతో ప్రగతిని సాధించింది. రైల్వే డివిజన్ ఏర్పాటు ద్వారా జిల్లాకు క్రమంగా రైళ్ళ సంఖ్య పెరుగుతోంది. త్వరలో గుంటూరు జిల్లాకు విమానాశ్రయం, తీరప్రాంతంలో ఓడరేవు, స్పైసెస్ పార్కు రానున్నాయి. విజయవాడ–చిలకలూరిపేట మధ్య జాతీయ రహదారిని ఆరులైన్ల రహదారిగా విస్తరిస్తున్నారు.

# యుగానికి ఆరంభం ఉగాదే

శిరసనగండ్ల సత్యనారాయణ శర్మ,
సీనియర్ సబ్ఎడిటర్, గుంటూరు డెస్క్



మనకున్న పండుగలలో అన్నింటికీ మొదటిదైన ఉగాది పండుగకు ఎంతో విశేషముంది. వసంతకాల ప్రారంభానికి సూచికగా వచ్చే ఈ పండుగ ఇతిహాస పరంగా వైద్య, ఆధ్యాత్మిక పరంగా ఆంధ్రులలో ఒక విశేష ప్రాముఖ్యతను సంతరించుకుందనే చెప్పాలి. ఆధ్యాత్మికపరంగా చూస్తే మనకున్న 60 తెలుగు సంవత్సరాలలో మొద టిదైన ప్రభవ నామ సంవత్సరంలో ఆ సంవత్సరంలో ఉండే ఉత్తర దక్షిణాయాల్లో మొదటిదైన ఉత్తరాయణంలో, ఆ ఉత్తరాయణంలో ఉండే వసంత-గ్రీష్మ ఋతువులలో మొద టిదైన వసంత ఋతువులో వచ్చే చైత్ర-వైశాఖ మాసాల రెండింటిలోనూ మొదటిదైన శుక్లపక్షంలో ఉండే తిథులలో మొదటిదైన పాడ్య మి తిథినాడు ఉండే బ్రాహ్మీ ముహూర్తంలో సృష్టి-స్థితి-లయకారులలో మొదటివాడైన బ్రహ్మ యుగాన్ని ఆరంభించాడు. కనుకనే యుగారంభానికి నాందీ పలికిన యుగాది నేడు ఉగాదిగా మారిందని పెద్దలు చెపుతుంటారు కలియుగం ఆరంభమైన రోజు కాబట్టి యుగ+ఆది=యుగాది అయితే ప్రజల, ప్రాణుల జన్మలకు ప్రారంభమైన ఈరోజు ఉగాది అయిందని కూడా మరికొం దరు చెబుతుంటారు. ప్రాచీనంగా అలవాటు పడిన పద్ధతి ప్రకారం అయితే మొదటగా కాచిన మామిడి కాయ ముక్కలని మొదటగా పండగా వచ్చిన బెల్లా నికి కలిపి దానిని మొదటగా తీసిన చింతపండుతో జతచేసి అందులో మొదటగా కోసిన వేపు పూవును చేర్చి మొదటగా వచ్చిన మిరియపు పొడితో కొద్దిగా కలిపి మొదటగా నరికిన చెరుకుముక్కల తీపితో తయారవ్వగా వచ్చిన పచ్చడిని ఉగా ది పండుగరోజు ప్రాత: కాలంలోనే ఆరోజు తీసుకోబోయే పదార్ధాలకు ముం దుగా తమతమ గృహాలలో అందరికంటే ముందువాడైన దేవదేవునికి నివేదనం చేసిన తరువాత ఆ ప్రసాదాన్ని ఇంటిపెద్దల ద్వారా స్వీకరించడం నేటికీ అనేక ప్రాంతాలో జరుగుతూ ఉంటుంది. ఒక విధంగా ఆలోచిస్తే ఉగాది మాత్రమే సంవత్సరాది పండుగగా ఉండటమే మంచిదని చెప్పాలి. ఎందుకంటే మనవాళ్ళు జరుపుకునే సంవత్సరాదికి (జనవరి 1) పంటలు చేతికి రావు. పంటలు రాకపోవడం వల్ల ఆ సమయంలో చేతిలో డబ్బు ఆడకపోవడం

(మిగతా 6వ పేజీలో)

(5వ పేజీ తరువాయి)

ఒక కారణమైతే ఆసమయంలో రాత్రి మంచు, పగలు వేడితో సతమతమౌతు రాత్రి కనీసం ఆరుబయట నిద్రించే పరిస్థితి ఉండదు. ఉత్తరాయణం ఇంకా 15 రోజులకు కానీ రాకపోతున్న కారణాన ఆ సమయం (జనవరి1) ఏ విధంగా చూసినా ఆపవిత్ర కాలమే అవుతుంది.

# యుగానికి ఆరంభం ఉగాదే



ఉగాది వసంతంలో వచ్చింది కాబట్టే అన్ని పండుగలలోనూ ఈ పండుగకు ఇంత శోభ చేకూరుతోందనే విషయాన్ని చెప్పవచ్చు. వసంత కాలంలో ఏ శుభ కార్యం తలపెట్టినా అది అవిఘ్నం కాకుండా జరుగుతుందని పెద్దల ప్రతీతి. అందుకే నేటికీ కొన్ని ప్రాంతాల్లో రాముడి కల్యాణం అయిన తరువాతనే వివాహాలు పెట్టుకోవడం జరుగుతుంటుంది. అంటే చైత్రశుద్ధ నవమి నాడు శ్రీరామ కల్యాణం జరుగుతుంది. కాబట్టి ఈ తొమ్మిది రోజులు (ఉగాది పండుగ చైత్ర శుద్ధ పాడ్యమి నుంచి) మంచి వివాహముహూర్తాలున్నా వాటిని ఎవ్వరూ అంగీకరించకపోవడం విశేషం. కాగా రామాయణం ప్రకారం వసంత ఋతువులో జరిగిన విశేషాలు పరిశీలించి చూస్తే.. రాముడు తనను చంపడానికి రాగాలడనే విషయం రావణునికి తెలిసింది, ఆంజనేయుడు మొదటిసారిగా శ్రీరామ చంద్రుడిని దర్శించింది, సుగ్రీవునికి అహంకారం పోయి తనకంటే రాముడెంతటి గొప్పవాడోనన్న విషయం అర్థమైందీ ఈ వసంతంలోనే. అదే విధంగా రాముని చేతిలో వాల్మీకికి మోక్షం వచ్చింది ఈ వసంతంలోనే అయితే సీతమ్మకు రాముడి జాడను ఆంజనేయుడు మొదటిసారిగా విన్న వించిందీ, చివరకు రావణవధ జరిగాక అయోధ్యలో సీతారాములు పట్టాభిషిక్తులైందీ ఈ వసంత ఋతువులోనని పురాణ పండితులు పేర్కొనడం విశేషం. అందుకే నేటికీ కొన్నికొన్ని ప్రాంతాలలో అమ్మవార్లకు శర్నన్నవ రాత్రులతోపాటుగా వసంత నవరాత్రులు కూడా తొమ్మిది రోజులపాటు నిర్వహిస్తూ ఉంటారు. కృత యుగం వైశాఖ శుద్ధ తదియ నాడు ప్రారంభమైతే, త్రేతాయుగం కార్తీక శుద్ధ నవమి నాడు ప్రారంభమైంది. ద్వాపర యుగం శ్రావణ త్రయోదశి నాడు ఆరంభమైతే కలియుగం చైత్రశుద్ధ పాడ్యమినాడు ప్రారంభమైంది.

ఇక ష్రడుచుల సమ్మేళనంతో తయారయ్యే ఉగాది పచ్చడిలో మధుర (తీపి), ఆమ్ల (పులుపు), కటు (కారం), కషాయ ( వగరు), లవణ ( ఉప్పు), తిక్త (చేదు) గుణాలు ఉంటాయి. ఇవి ఉన్న పచ్చడిని ఉగాది రోజునే స్వీకరించాలని పెద్దల వినతి. అయితే ఇందులోని తీపిని కలిగించే కొత్తబెల్లం ఆకలిని కలిగిస్తుందని, పులుపునిచ్చే కొత్త చింతపండు కఫవాతాన్ని పొగొడుతుందని, కారం కలిగించే మిరియపుపొడి శరీరంలోని క్రిములను నాశనం చేయడమే కాక దేహంలోని శ్లేష్మ రోగాన్ని సైతం దరిచేరనీయదని పెద్దలు చెబుతుంటారు. అదే విధంగా వగరు పుట్టించే మామిడి ముక్క శరీరంలో లాలాజలాన్ని ఊరించి శరీరంలోని జీర్ణప్రక్రియకు తోడ్పడుతుంది. ఇక ఉప్పు శరీరంలోని ఎముకలని బలపరుస్తుందని, చేదు కలిగిన వేప పువ్వు జీర్ణక్రియ సక్రమంగా పనిచేసేందుకు చర్మవ్యాధులను దరిచేరనీయకుండా ఉపకరిస్తుందని చెబుతుంటారు.

ఆధ్మాత్మిక విషయానికి వస్తే ఏ పనిచేయడానికైనా మంచిరోజును చూసుకోవడం ఆనవాయితీగా వస్తున్న ఆచారం. అందుకే పండుగ నాడు పంచాంగ శ్రవణం వినడం నేటికీ జరుగుతూ ఉంటుంది. తిథి, వార, నక్షత్ర,యోగ, కర్ణములతో కూడినదే పంచాంగమని, అందరికీ తెలిసిందే. కాలస్వరూపుడైన విష్ణువు తిథి అయితే, ఆ దైవాన్ని సేవిస్తూ ప్రదక్షిణం చేసేది 'వార'మని, క్షతం కాకుండా కాపాడేది నక్షత్రమని, సాధనంగా ఉపయోగపడేది కరణం కాగా ఈ నక్షత్రంతో కూడుకున్నది యోగమని పలువురు పురాణ పండితులు పేర్కొంటున్నారు. పంచాంగ శ్రవణం వల్ల ఆయా సంవత్సరాలలో జరిగే లాభనష్టాలతో పాటు వాతావరణ, గ్రహణ స్థితిగతులు, రాజ,పూజ్య అవమానాదులతోపాటు దేశకాలమాన పరిస్థితులు తెలుసుకునే అవకాశం ఉంది. ఇక పంచాంగంలోని తిథి వల్ల సంపద, వారము వల్ల ఆయుష్షు, నక్షత్రం వల్ల పాపపరిహారం, యోగం వల్ల నివృత్తి, కరణం వల్ల కార్యానుకూలత సిద్ధిస్తుందని పెద్దల కథనం. ఇన్ని విశేషాలు తన ఒడిలో దాచుకున్న ఉగాది పండుగ అంటే పిల్లా, పెద్దా అందిరికీ ఆనందదాయకమే.

శ్రీ సర్వధారి నామసంవత్సరం పంచాంగం, రాశిఫలాలు-86,87పేజీలలో

# కాబోయే ముఖ్యమంత్రి చిరంజీవికి ఉగాది శుభాకాంక్షలు



డా॥ జ్యోతిరావుపూలే



డా॥ జగజ్జీవన్‌రావు



డా॥ మౌలానా అబ్దుల్‌కలాంఆజాద్



డా॥ మదర్‌థెరిస్సా



డా॥ బి.ఆర్.అంబేద్కర్



పద్మభూషణ్ చిరంజీవి

సామాజిక సేవే లక్ష్యంగా బిసి, ఎస్సీ, ఎస్టీ, ముస్లిం మైనారిటీ మరియు కాపుల అండదండలతో
రాజకీయ రంగప్రవేశం చేస్తున్న
శ్రీ చిరంజీవిగారు రాష్ట్ర ముఖ్యమంత్రి పీఠాన్ని అధిరోహించాలని ఆకాంక్షిస్తూ...

# లాలమ్మ్స రూరల్ & అర్బన్ డెవలప్‌మెంట్ సొసైటీ

## లక్ష్యాలు... ఆశయాలు... చేయాల్సినవి....



**ప్రజలందరి కోసం :**

+ జనాభా ప్రతిపాదికన అన్ని కులాల ప్రజలకు చట్ట సభల్లో ప్రాతినిధ్యం కల్పించుట.
+ రాజకీయ పదవులు రొటేషన్ పద్ధతిలో అన్ని సామాజిక వర్గాలు అనుభవించుట.
+ రాజకీయ పదవుల్లో స్త్రీలకు కనీసం 15% తగ్గకుండా రిజర్వేషన్ సౌకర్యం కల్పించుట.
+ కేంద్ర ప్రభుత్వం కులాలవారిగా గణాంకాలు సేకరించుట.
+ సుప్రీం కోర్టు, హైకోర్టు జడ్జి నియామకాల్లో రాజ్యాంగబద్ధమైన రిజర్వేషన్లు అణగారిన వర్గాల వారికి కల్పించుట. ఉన్నత న్యాయాధీశులను నియమించేందుకు రిటైర్డ్ హైకోర్టు జడ్జిలు మరియు ప్రముఖ న్యాయవాదులున్న జాతీయ జ్యుడిషియల్ కమిషన్ ఏర్పాటుచేయుట.
+ ప్రభుత్వ సర్వీసుల్లో అసెంబ్లీ, పార్లమెంటుల్లో ఎస్టీ. ఎస్సీలకులాగా బిసిలకు 45%. ముస్లింలకు 8% తగ్గకుండా రాజ్యాంగబద్ధ రిజర్వేషన్లు కల్పించుట.
+ నిరుపేద కుటుంబంలో ప్రతి వ్యక్తికి 8 కిలోల చొప్పున గరిష్టంగా 40 కేజీల బియ్యాన్ని, కేజీకి రూ.2 చొప్పున ప్రతి నెల అందించుట.
+ ప్రతి సంవత్సరం ప్రతి పేద కుటుంబానికి ప్రభుత్వ ఖర్చుతో రెండు జతల చీరలు, దోవతులు అందించుట.
+ పాఠశాల విద్యార్థులకు ఉన్నత పాఠశాల స్థాయి వరకు రోజుకు రెండు పర్యాయాలు భోజనాలు ఉచితంగా ఏర్పాటుచేయుట. రెండు జతల దుస్తులు ఉచితంగా అందజేయుట.
+ ఉన్నత పాఠశాల స్థాయి వరకు నిర్బంద విద్య ఆంగ్ల బోధనతో కల్పించుట.
+ పరిమితులు లేకుండా వ్యవసాయ, చేనేత, చేతివృత్తి, పేద కుటుంబాల్లో 65 సం॥లు నిండినవారికి నెలకు రూ.400 వృద్ధాప్య పింఛను అందజేయుట.
+ చిన్నసన్నకారు రైతుల భూములకు గరిష్టంగా ఐదు ఎకరాలకు ఉచిత విద్యుత్ సరఫరా, కౌలుదారునికి కూడా ఇది వర్తింపచేయుట.
+ పేద ప్రజల గుడిసెలు మరియు ఇళ్లకు రెండు బల్బుల వరకు ఉచిత విద్యుత్ అందించుట.
+ నేటి వరకు బలహీన వర్గాల పథకాల కింద రుణ సౌకర్యం పొంది ఆశించిన ప్రయోజనం పొందలేకపోయినవారికి రుణాలు మాఫీచేయుట.
+ బడుగు, బలహీన వర్గాల సొసైటీలు, కార్పోరేషన్లచే మంజూరు చేయబడే కొత్త రుణాలు, కేవలం పది పైసల వడ్డీకే ఇచ్చుట.
+ పెద్ద అపార్టుమెంట్లలో అగ్ని ప్రమాదాలు సంభవించినప్పుడు మరణించిన కూలీకి ఒక్కరికి రూ.5 లక్షల నష్టపరిహారం చొప్పున భవన నిర్మాణదారుడు బీమా చేయించుట.
+ ప్రజలకు అవసరమయ్యే అన్ని మందులు తయారుచేయుటకు అయ్యే ఖర్చుపై కనీస లాభాలతో రేట్లు ఉండుట.

**ప్రభుత్వ ఉద్యోగుల కోసం :**

+ కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల వలె పదవీ విరమణ వయసు 60 సంవత్సరాలకు పెంచడం, వేతన స్కేళ్లు వారికి సమానంగా ఉండేలా చర్యలు.
+ అన్ని కులాలకు పదోన్నతుల్లో రిజర్వేషన్ల అమలు.
+ నైతిక పతనం, అవినీతికి చెందిన కేసులు మినహా మిగిలిన అన్ని సాధారణ క్రమశిక్షణ కేసులు ఆరు నెలలలోపు పరిష్కారం.

**నిరుద్యోగుల కోసం :**

+ పబ్లిక్ సర్వీస్ కమిషన్ ప్రతి సంవత్సరం పరీక్షలు నిర్వహించి అదే సంవత్సరం ఎంపిక పూర్తిచేయుట.
+ సర్వీస్ కమిషన్‌లోని 11 మంది సభ్యులు అన్ని వర్గాల నుంచి ప్రాతినిధ్యం ఉండేలా చర్యలు.
+ మూడు సంవత్సరాల కాలం పనిచేసిన ఉద్యోగులను శాశ్వత ఉద్యోగులుగా పరిగణించడం, ప్రైవేటురంగంలోనూ రిజర్వేషన్లు.



లాలమ్మ్స

+ కులాన్ని బట్టి కాదు రిజర్వేషన్.
మతాన్ని బట్టి కాదు రిజర్వేషన్.
పేదరికాన్ని బట్టి కావాలి రిజర్వేషన్.
+ కులాన్ని బట్టి కాదు ఎ, బి, సి, డి.
మతాన్ని బట్టి కాదు ఎ, బి, సి, డి.
పేదరికాన్ని బట్టి కావాలి ఎ, బి, సి, డి.

లాలమ్మ్స

# చక్రం తిప్పిన నేతలు

ఎ.వి.డి.శర్మ,
సూర్యప్రతినిధి,గుంటూరు



రాజకీయ రాజధానిగా, విద్యా కేంద్రాలకు నిల యంగా, వైద్య రంగంలో అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన గుంటూరు జిల్లా దినదినాభి వృద్ధి చెందుతోంది. కాకలు తీరిన యోధులకు గుంటూరు జిల్లా పెట్టింది పేరుగా నిలిచింది. జాతీయ రాజకీయాల్లో కూడా చక్రం తిప్పిన నేతలు అనేకమంది గుంటూరు జిల్లాలో ఉన్నా రు. ఎన్.జి.రంగా, కాసు బ్రహ్మానం దరెడ్డి, కొత్త రఘురామయ్య, వావిలాల గోపాల కృష్ణయ్య, భవనం వెంకట్రామ్ వంటి యోధాను యోధులను అందించిన ఖ్యాతి ఈ జిల్లాకే దక్కింది. జాతీయ సంగ్రామంలో పోరాడిన కొండా వెంకట ప్పయ్య పంతులు, పర్వతనేని వీరయ్య చౌదరి జాతీ యోద్యమంలో కీలకపాత్ర పోషించారు. రాష్ట్రానికి ముగ్గురు ముఖ్యమం త్రులను అందించిన సత్తాకూడా ఈ జిల్లాదే కావడం విశేషం వారిలో కాసు బ్రహ్మా నందరెడ్డి, భవనం వెంకట్రామ్, నాదెండ్ల భాస్కర రావు. రాష్ట్ర రాజకీయాల్లో సంచలనం సృష్టిం చిన ఎన్.టి. రామారావు కూడా గుంటూ రులోనే చదివిన వారు కావడం విశేషం.

వామపక్ష ఉద్యమాలలో కూడా గుంటూరు జిల్లా జాతీయ స్థాయిలో కీలకపాత్ర పోషించింది. సి.పి.ఎం. పొలిట్ బ్యూరో సభ్యుడు మాకినేని బసవపున్నయ్య, రాష్ట్ర కార్యదర్శులుగా వ్యవహరించిన కొరటాల సత్యనారాయణ, లావు బాలగంగాధరరావులు రేపల్లె ప్రాంతానికి చెందిన వారు కావడం విశేషం. వేములపల్లి శ్రీకృష్ణ, మల్లయ్య లింగం, కనపర్తి నాగయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, తరిమెల నాగిరెడ్డి తదితరులు కూఢా వామపక్ష ఉద్యమాల్లో కీలకపాత్ర పోషించారు. కాంగ్రెస్ పార్టీలో ముగ్గురు ముఖ్యమంత్రులు గుంటూరు జిల్లా నుంచి ఎంపిక కాగా అనేకమంది కేంద్ర మంత్రి పదవులను కూడా నిర్వహించారు.

కేంద్రంలో మంత్రులుగా పనిచేసిన వారిలో కాసు బ్రహ్మానందరెడ్డి, కొత్త రఘురామయ్య, అంకినీడు ప్రసాద్, వెనిగండ్ల సత్యనారాయణ, సుదీర్ఘ కాలం పాటు మంత్రి పదవులు నిర్వహించారు. బ్రహ్మానందరెడ్డి ఏడున్న రేళ్ళు ముఖ్యమంత్రిగా, మరో ఐదేళ్ళు కేంద్ర మంత్రిగా పనిచేశారు. తెలుగు దేశం పార్టీలో కేంద్ర మంత్రిగా ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు కీలకభూమిక పోషించగా ప్రస్తుతం గుంటూరు జిల్లా నుంచి కేంద్ర మంత్రి వర్గంలో దగ్గు బాటి పురంధరేశ్వరి మానవ వనరుల శాఖ సహాయ మంత్రిగా కొనసా గుతున్నారు. పి.వి. నరసింహారావు మంత్రి వర్గంలో కేంద్ర మంత్రిగా పనిచేసిన కె. కమలకుమారి కూడా గుంటూరు జిల్లాకు చెందిన వారు కావడం గమనార్హం. పి.సి.సి. అధ్యక్షులుగా కోన ప్రభాకరరావు, కొణిజేటి రోశయ్యలు వ్యవహరించారు.

తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత నాదెండ్ల భాస్కరరావు, కోడెల శివప్రసా దరావు, దూళిపాళ్ళ వీరయ్య చౌదరి,జె.ఆర్ .పుష్పరాజ్, అన్నాబత్తుని సత్యనారాయణ, మాకినేని పెదరత్తయ్య, ఈపూరి సీతారావమ్మ, శనక్కాయల అరుణ, ఆలపాటి రాజేంద్రప్రసాద్‌లు మంత్రి పదవులను నిర్వహించారు. ప్రస్తుతం రాష్ట్ర రాజకీయాల్లో కీలక పాత్ర పోషిస్తున్న అనేకమంది నాయకులు జిల్లా నుంచి ప్రాతినిధ్యం వహి స్తున్నారు. ప్రస్తుత క్యాబినేట్‌లో గుంటూరు జిల్లా నుంచి నలుగురు మంత్రులు ప్రాతినిధ్యం వహిస్తు న్నారు.

వారిలో రవాణా శాఖ మంత్రిగా కన్నా లక్ష్మీనారాయణ, పౌరసరఫరాల శాఖ మంత్రిగా కాసు కృష్ణారెడ్డి, మౌలిక సదుపాయాల కల్పన శాఖామంత్రిగా మోపిదేవి వెంకట రమణరావు, గ్రంథాలయాలు, రాజీవ్ విద్యామిషన్, వయోజన విద్యా శాఖా మంత్రిగా మురుగుడు హనుమం తరావు కొనసాగుతున్నారు.

# విద్యా సరస్వతికి మణిహారం గుంటూరు జిల్లా

కె. వెంకుబాబు, మేజర్‌న్యూస్, గుంటూరు ఎడ్యుకేషన్

విద్యారంగంలో గుంటూరు జిల్లా రాష్ట్రవ్యాప్తంగా ప్రాముఖ్యతను సంతరించుకుంది. అరవయ్యవ శతకం నుండి విద్యారంగం జిల్లాలో కాలక్రమేణా ఊపందుకుంది. నేడు అన్ని స్థాయిల్లో ర్యాంకుల పంట పండిస్తూ జిల్లా తనదైన శైలిని, నైపుణ్యాన్ని, పేరుప్రఖ్యాతులను సంతరించుకుంది. తొలుత ట్యుటోరియల్ విద్యకు నగరంలోని రవి ట్యుటోరియల్ కళాశాల వ్యవస్థాపకులు



సి.వి.ఎన్.ధన్ (సి.విశ్వనాథం) ఆద్యుడు. ఆయన సైకాలజీలో పి.జి. చేసి వినూత్న శైలిలో విద్యా బోధనకు శ్రీకారం చుట్టారు. తరువాత కాలంలో అనేక మంది ట్యుటోరియల్ కళాశాలలు స్థాపించి విద్యాసేవ చేశారు. అయితే ఎం.సెట్. ఆరంభంలో సి.వి.ఎన్.ధన్ ప్రత్యేక శిక్షణా తరగతుల నిర్వహణకు ఆద్యుడయ్యారు. ఆయన బాటలోనే చాలా మంది శిక్షణాలయాలు స్థాపించి కోచింగ్ ఇవ్వడం ప్రారంభించారు. తరువాత తరువాత వేల సంఖ్యలో కళాశాలలు ప్రారంభమై జిల్లా ఒక విద్యాజిల్లాగా మారింది.

ఇదే కాకుండా బి.ఇడి., నర్సింగ్ కళాశాలలతో పాటుగా సివిల్స్, గ్రూప్-1, గ్రూప్-2, వివిధ పోటీ పరీక్షలకు శిక్షణ ఇచ్చే కోచింగ్ సెంటర్లు, సి.ఎ., మల్టీమీడియా, యానిమేషన్స్, కంప్యూటర్‌కు సంబంధించిన అనేక శిక్షణాలయాలకు జిల్లా ప్రాముఖ్యతను సంతరించుకుని పరీక్షల్లో ర్యాంకులు సాధిస్తున్న సంస్థలుగా పేరు పొందాయి.

ఆ నాడు శతాధిక చరిత్ర కలిగిన ఆంధ్ర క్రైస్తవ కళాశాల, హిందూ కళాశాలల్లో చదివిన ఎందరో ముఖ్యమంత్రులు, రాష్ట్ర, కేంద్ర మంత్రులు, ప్రజా ప్రతినిధులు, న్యాయశాస్త్రవేత్తలు, ఉన్నత స్థానాలను అలంకరించిన వారెందరో జిల్లాకే గర్వకారణం.

అదే విధంగా గుంటూరు వైద్య కళాశాలలో విద్యనభ్యసించిన ఎందరో వైద్యులు అరుదైన శస్త్ర చికిత్సలు చేస్తూ, ఖండాంతర ఖ్యాతి గడించారు. సినీ, నాటక, సంగీత, సాహిత్య రంగాలలో కూడా గణుతికెక్కిన జిల్లా వాసులు ఇక్కడ విద్యనభ్యసించినవారే. నిజంగా గుంటూరు జిల్లా విద్యాసరస్వతికి మణిహారమే.

### జిల్లాలోని విద్యాసంస్థల వివరాలు

విశ్వవిద్యాలయం:1 ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
ఇంజనీరింగ్ కళాశాలలు:14
ఫార్మసీ కళాశాలలు:10
వైద్య కళాశాలలు:4
న్యాయ కళాశాలలు:2
ఓరియంటల్ కళాశాలలు: 6
పాలిటెక్నిక్:4
అగ్రికల్చరల్: 2
హోమ్‌సైన్స్: 1
డిగ్రీ కళాశాలలు: 106
జూనియర్ కళాశాలలు:231
పిజియో థెరపీ:4
మెడికల్ లాబ్ టెక్నాలజీ:3



# జిల్లా అభివృద్ధిలో వైఎస్ చెరగని ముద్ర



ఎ.వి.డి.శర్మ, గుంటూరు, సూర్యప్రతినిధి

రాష్ట్ర రాజకీయాలు చరిత్రలో భారీ ప్రజాబలంతో ముఖ్యమంత్రిగా బాధ్యతలు స్వీకరించిన వై.ఎస్. రాజశేఖరరెడ్డి గుంటూరు జిల్లా అభివృద్ధిలో కూడా చెరగని ముద్ర వేశారు. పలు భారీ ప్రాజెక్టులకు శ్రీకారం చుట్టారు. ఎంతోకాలంగా పెండింగ్‌లో ఉన్న పులిచింతల ప్రాజెక్టును జలయజ్ఞంలో చేపట్టారు. 2004 అక్టోబర్ 15వ తేదీన పులిచింతల ప్రాజెక్టుకు భూమిపూజ చేశారు. 13 లక్షల ఎకరాల ఆయుకట్టు స్థిరీకరణకు ఈ ప్రాజెక్టు ఉపయోగపడుతుంది. 550 కోట్ల రూపాయలతో పులిచింతల ప్రాజెక్టు, నిర్మాణం, భూసేకరణ, పునరావాసం చేపడుతున్నారు. ఈ ప్రాజెక్టు ద్వారా 120 మెగావాట్ల విద్యుత్ ఉపయోగానికి కూడా అవకాశం ఏర్ప డుతుంది. శతాబ్దకాలంగా జరుగుతున్న పోరాటానికి ఫలితమే ఈ ప్రాజెక్టు అని రైతాంగం విశ్వసిస్తోంది. ఈ ప్రాజెక్టు నిర్మాణం వల్ల ప్రకాశం బ్యారేజి ద్వారా సముద్రంలో కలిసే నీటిలో కనీసం 45 టి.ఎం.సిలను పులిచింతల బ్యాలెన్సింగ్ రిజర్వాయర్‌లో నిల్వ చేసే అవకాశం ఉంది. కృష్ణా, నల్గొండ, గుంటూరు జిల్లాలను కలిపే వారధిని నిర్మించడానికి పులిచింతల డ్యామ్‌ను నిర్మిస్తున్నారు. అలాగే పల్నాటి ప్రాంతంలో అనుపు, గరికపూడిసెల

(మిగతా 11వ పేజీలో)

(10వ పేజీ తరువాయి)

ఎత్తిపోతల పధకాల నిర్మాణాన్ని కూడా చేపట్టారు. తుఫానులు, వరదలకు కకావికలమైన డెల్టా కాలువల ఆధునీకరణకు కూడా ముఖ్యమంత్రి శ్రద్ధ వహించారు. పశ్చిమ డెల్టాలో కాలువలు, డ్రైనులు మరమ్మత్తులకు 1300 కోట్ల రూపాయలు కేటాయించారు. అలాగే నాగార్జున సాగర్ ఆయుకట్టును ఆధునీకరించేందుకు ప్రపంచ

## జిల్లా అభివృద్ధిలో వైఎస్ చెరగని ముద్ర

బ్యాంకు నుంచి 2500 కోట్ల రూపాయలు మంజూరు చేశారు. వీటిల్లో గుంటూరుజిల్లాకు 550 కోట్ల రూపాయలు కేటాయించనున్నారు. అలాగే జిల్లాలో మరో 50 ఎత్తిపోతల పధకాలు వివిధ దశల్లో నిర్మాణంలో ఉన్నాయి. వ్యవసాయ సాగునీటి రంగాలకు ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యత ఇచ్చింది. గుంటూరు జిల్లాలో ఉచిత విద్యుత్ వల్ల దాదాపు 42వేల పంపుసెట్లకు ఉచితంగా విద్యుత్ అందుతోంది. వై.ఎస్. ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన తరువాత రాష్ట్రవ్యాప్తంగా 1200 కోట్ల రూపాయలు విద్యుత్ బకాయిలు రద్దుచేయగా, అందులో గుంటూరు జిల్లాలో దాదాపు 50 కోట్ల రూపాయల వరకు రద్దయ్యాయి. గుంటూరు జిల్లాకు ఒక విమానాశ్రయం, స్పైసెస్ పార్కు, టెక్స్‌టైల్ పార్కు, రెండు సూపర్ స్పెషాలిటి ఆసుపత్రులు మంజూరు చేశారు. గుంటూరు ప్రభుత్వాసుపత్రిని సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రిగా అభివృద్ధి చేయనున్నారు. మంగళగిరిలో మరో సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రిని ఏర్పాటు చేయనున్నారు. గత నాలుగేళ్ళలో జిల్లాలో టెక్స్‌టైల్ పరిశ్రమ భారీగా అభివృద్ధి చెందింది. నిజాంపట్నం నుంచి ఒంగోలు వరకు పోర్టుసిటీ కారిడారు అభివృద్ధి చేయనున్నారు. అలాగే జిల్లాలో భారీ ఎత్తున ఫించన్ల పంపిణీ, రుణాల రద్దు ద్వారా ప్రజలలో ఉన్న అసంతృప్తిని తగ్గించుకోవడానికి ముఖ్యమంత్రి ప్రయత్నిస్తున్నారు. ఇందిరమ్మ పధకంద్వారా జిల్లాలో మూడేళ్లలో రెండున్నర లక్షల ఇళ్ళు నిర్మించాలని లక్ష్యంగా నిర్ణయించారు. గుంటూరు నగరానికి కూడా భారీగానే నిధులు మంజూరు అయ్యాయి. జిల్లా మొత్తం మీద గత నాలుగేళ్లలో భారీ ప్రాజెక్టులు, అభివృద్ధి పనులు వేగవంతంగా సాగుతున్నాయి.

# హంగ్‌కు అవకాశం లేదు

## శాసనసభ ఎన్నికల్లో ఒకేపార్టీకు ఆధిపత్యం!

(ఎ.వి.డి.శర్మ, సూర్యప్రతినిధి,గుంటూరు)

గుంటూరు జిల్లా చరిత్రలో శాసన సభా ఎన్నికల్లో మాత్రం ప్రతిసారి ఒకే పార్టీకి ప్రజలు పట్టం కట్టడం ఆనవాయితీగా మారింది. స్వాంత్రంత్య వచ్చినప్పటి నుంచి దాదాపు మూడు దశాబ్దాలపాటు హస్తగతానికి పరిమితమైన పాలన ఎన్‌టిఆర్ ప్రభజనంలో కొట్టుకుపోయింది. ఆ తరువాత కూడా ఒకే పార్టీకి అధికారం కట్టబెట్టడం సంప్రదాయంగా మారింది. 1983లో మొత్తం 19 స్థానాలను తెలుగుదేశం పార్టీ కైవశం చేసుకుంది. 1985లో 14 స్థానాల్లో తెలుగుదేశం, వామపక్షాలు గెలుపొందగా, ఐదు స్థానాల్లో కాంగ్రెస్ గెలిచింది.

రాష్ట్ర రాజకీయాలను మలుపుతిప్పిన ఎన్.టి.ఆర్.కు కూడా గుంటూరు జిల్లా వాసులు చేదు అనుభవాన్ని మిగి ల్చారు. 1987లో రాష్ట్రం మొత్తం జిల్లా, మండల పరిషత్‌ల్లో తెలుగుదేశం పార్టీ విజయ పతాకాన్ని ఎగుర వేయగా, గుంటూరు జిల్లాలో మాత్రం అందుకు పూర్తి భిన్నమైన ఫలితా లు ఏర్పడ్డాయి. 1987 స్థానిక సంస్థల ఎన్నికల్లో పది మున్సిపాలిటీలు, 43 మండల పరిషత్‌లు జిల్లా పరిషత్ చైర్మన్ పదవిని కాంగ్రెస్ గెలుచుకుంది. అప్పటి నుంచే జిల్లాలో తెలుగు దేశం వ్యతిరేక గాలి ప్రారంభమైంది. 1994లో కాంగ్రెస్ వ్యతిరేక ప్రభం జనంలో 16 చోట్ల ఆ పార్టీ ఓడిపోగా తెలుగుదేశం, వామపక్షాలు విజయ పతాకాన్ని ఎగురవేశాయి.

1995 స్థానిక సంస్థల ఎన్నికల్లో 45 జడ్‌పిటిసి స్థానాలను తెలుగుదేశం గెలుచుకోగా 12 కాంగ్రెస్ గెలుచుకుంది. అలాగే 7 మునిసిపాలిటీలను కూడా తెలుగుదేశం దక్కించుకుంది. తిరిగి 1999 ఎన్నికల్లో తెలుగుదేశం 14 స్థానాలలో విజయం సాధించగా ఐదింటిలో కాంగ్రెస్ గెలుపొందింది. అలాగే 2004 ఎన్నికల్లో కాంగ్రెస్ విజయ దుందుభిని మోగించింది. మొత్తం 19 స్థానాలకు గాను 18 స్థానాల్లో కాంగ్రె స్ గెలుపొందింది.

ఆ తర్వాత జరిగిన స్థానిక సంస్థల ఎన్నికల్లో కూడా తెలుగుదేశం వరుస పరాజయాలను ఎదుర్కొంటుంది. రాబోయే శాసన సభ ఎన్నికల్లో ప్రస్తుతం ఉన్న స్థానాలు అన్నిటినీ నిలబెట్టుకోవడానికి కాంగ్రెస్ పార్టీ ప్రయత్నిస్తుండగా, కోల్పోయిన వైభవాన్ని పునరుద్ధరించుకుని, మెజారిటీ స్థానాల కోసం తెలుగుదేశం పార్టీ తీవ్రంగా కష్టపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. హంగ్ అసెంబ్లీకి ఆంధ్రాలో అవకాశం లేనట్లే, గుంటూరు జిల్లాలోనూ చెరిసగం స్థానాలు, లేక దరదాపుగా సమాన బలాబలాలతో గెలుపొందడం ఇప్పటివరకు జరగలేదు.

రాబోయే ఏడాది కాలంలో రాష్ట్రంలో జరిగే రాజకీయ సమీకరణల్లో ఇదే పరిస్థితి కొనసాగుతుందా లేక ఫలితాల్లో వ్యత్యాసం ఉంటుందా అన్నది చర్చనీయాంశంగా మారింది. చిరంజీవి రాజకీయ పార్టీ ఏర్పాటు చేస్తే ఒకే పార్టీకి మెజారిటీ స్థానం రావడం అన్నది కష్టమని విశ్లేషకులు అభిప్రాయ పడుతున్నారు.





# జిల్లా సమగ్ర నివేదిక



జిల్లా విస్తీర్ణం : 11,400 స్కైర్ కిలోమీటర్లు
జనాభా (2001 లెక్కల ప్రకారం) 44.65 లక్షలు
పురుషులు : 22.50 లక్షలు
మహిళలు: 22.15 లక్షలు
వ్యత్యాసం : 984
(ప్రతీ వెయ్యిమంది పురుషులకు)
గ్రామీణుల శాతం: 28.80
జనసామర్ధ్యం : 392 ( కిలోమీటరుకు)
అక్షరాస్యత : 62.54
పురుషులు : 14,07,402 (57.30 శాతం)
స్త్రీలు : 10,48,563( 42.7 శాతం)
మొత్తం శ్రామికులు : 2190299

స్త్రీలు : 10,48,563( 42.7 శాతం)
మొత్తం శ్రామికులు : 2190299
ప్రధాన శ్రామికులు : 1869886
సగటు పనివారలు : 320413
వ్యవసాయదారులు : 389821
వ్యవసాయ కూలీలు : 1073447
కుటీర పరిశ్రమలు : 53177
రెవెన్యూ డివిజన్లు : 3
మొత్తం మండలాలు: 57
మునిసిపాలిటీలు :11
పట్టణాలు : 11
వాడుకలో ఉన్న భాష: తెలుగు, హిందీ
మతాలు: బౌద్ధం, క్రైసవం, హిందూ, ముస్లీం, జైన్, సిక్కిజం, ఇతరులు
అత్యధిక ఉష్ణోగ్రత: 37.20 - 42 డిగ్రీలు
అత్యల్ప ఉష్ణోగ్రత: 13-15 (సెంటీగ్రేడ్)
సాధారణ వర్షపాతం : 853 మిల్లీమీటర్లు
ఉండాల్సింది : 896 మిల్లీమీటర్లు ( 2005-2006)
అడవి : 4,51,345
పంట విస్తీర్ణం : 4,43,005 (హెక్టార్లలో)
పాడి : 13.36 టన్నులు
మిర్చి : 2.141 టన్నులు
కాటన్ : 2.24 (కప్పాస్)
పశు సంపద: 1.05 లక్షలు
ఎద్దులు : 9.60 లక్షలు
గొర్రెలు: 7.77 లక్షలు
మేకలు : 1.80 లక్షలు
కోళ్ళు: 44.41 లక్షలు
రహదారులు:
జాతీయ రహదారులు : 530.62 కిలోమీటర్లు
రాష్ట్ర రహదారులు 693.457 కిలోమీటర్లు
ప్రధాన జిల్లా రహదారులు 1973.018 కిలోమీటర్లు
పంచాయతీ రహదారులు: 771.081 కిలోమీటర్లు
హాస్పిటల్స్ : 19
ప్రైమరీ హెల్త్ సెంటర్లు : 66
సబ్ సెంటర్లు : 644
వైద్యులు : 559

*(సేకరణ: గుంటూరు డెస్క్)*

# పారామెడికల్ కోర్సులకు విశేష ఆదరణ

కె.వెంకుబాబు, మేజర్‌న్యూస్, గుంటూరు ఎడ్యుకేషన్



వైద్యరంగం సాంకేతికంగా ప్రాధాన్యత సంత రించుకున్న నేపథ్యంలో నేడు ఎం.బి.బి.ఎస్., బి.డి. ఎస్.లకు దీటుగా పారా మెడికల్ కోర్సులు ప్రాధా న్యత వహిస్తున్నాయి. వీటికి నానాటికీ ఆదరణ పెరుగు తోంది. కార్పొరేట్ ఆసుప త్రుల గణనీయంగా పెరగ టంతో ఈ కోర్సులు చేసిన వారికి ఉపాధి అవకాశాలు మెండుగా లభిస్తున్నాయి. నర్సింగ్, ఫిజియోథెరపీ, మెడికల్ లాబ్ టెక్నాలజీ, మెడికల్ ట్రాన్స్క్రిప్షన్ కోర్సుల పట్ల విద్యార్థులు ఆకర్షితులౌతున్నారు. ఎం.సెట్ ద్వారానే ఎంబిబిఎస్, బి.డి.ఎస్.లలో ప్రవేశం కల్గడంతో, పారామెడికల్ కోర్సులు సైన్స్ గ్రూప్ చదివిన ఇంటర్, డిగ్రీ విద్యార్థులకు కూడా ఈ కోర్సులలో ప్రవేశం వుంటుంది. సుమారు 17 పారా మెడికల్ కోర్సులు ఇప్పుడు అందుబాటులో వున్నాయి. వీటికి విదేశాలలో సైతం మెరుగైన ఉపాధి అవకాలు అందుబాటులోకి వచ్చాయి. వైద్య విద్య చదివే ఆర్థిక స్తోమత లేని మధ్యతరగతి, పేద వర్గాలకు ఈ కోర్సులు వరంగా వచ్చి పడ్డాయి. కేవలం ఆసుపత్రులలోనే కాకుండా ఇప్పుడు కొత్తగా వచ్చిన 108 వంటి అబులెన్స్ సర్వీస్‌లో కూడా ఈ కోర్సులు చేసిన వారికి ఉపాధి అవకాశాలు వస్తున్నాయి.



ఇంటర్మీడియట్ చదివే విద్యార్థులకు ప్రత్యేకంగా ఒకేషనల్ కోర్సులు కూడా జూనియర్ కళాశాలల్లో అందుబాటులోకి వచ్చాయి. కేవలం రెండేళ్ళు ఇంటర్ చదివి ఈ రంగాలలో వెంటనే ఉద్యోగాలు వచ్చేందుకు వీలుంది. ఇప్పటికే చాలా మంది ఈ అవకాశాలను అందిపుచ్చుకున్నారు. ఇంజనీరింగ్, మెడికల్ కోసం ఎక్కువ శ్రమ పడలేని వారు, అవకాశం లేని వారు ఈ కోర్సులను చేసి మంచి వేతనాలపై ఉద్యోగాలను సంపాదించవచ్చు.

## కోటి సూర్య తేజమై...

కోటి "సూర్య" తేజమై... విరాజమై.. దేదీప్యమానమై..!
అక్షరాలు సంధించిన సుమశరమై.. సుమధురమై!
అక్షర లక్షల సమూహాల గంగాతరంగమై.. స్వేచ్ఛా విహంగమై!
సరస్వతీ కటాక్షమై.. విలక్షణ వీక్షణమై.. ప్రపంచ ప్రదక్షిణమై!
సప్తవర్ణ సంశోభిత రజితకిరణ రసికరూప సరోజమై.. సరాగమై..
సప్తదివస సమలంకృత చకితరూప లలితగీత కూచితమై.. పూజితమై!
సర్వవిషయ సమాహార సమాచార విలాసమై.. వినోదమై!
సర్వజనుల సమదర్శన రంజనమై.. మనోరంజమై.. ప్రభంజనమై!
మదమరాళ పదవయార కులుకై.. తేనెలొలుకు తెలుగుపలుకై!
మహిళల మణిహారమై.. పాపిట సింధూరమై.. సిగలో మందారమై!
మగధీరుల మగటిమియై.. ఉద్యోగుల శ్రమగీతికయై!
ఉద్యమించు కార్మికుల ఉద్యమాల నేస్తమై.. సాయపడే హస్తమై!
కర్షక ఆకర్షక ఆశయాల సాధనకై.. సత్యశోధనకై!
ఆంధ్రప్రజల హృదయంలో ఉదయించెను "సూర్య" బింబరూపమై!
అందరినీ అలరించగ అరుదెంచును మన "మానసపుత్రిక"
మన దినపత్రిక.. అనుదినపత్రిక... నేటి మేటి దినపత్రిక "సూర్య"
సుప్రభాత "సూర్య" కిరణరేఖయై!
ప్రభాత దర్శన ప్రపంచ నేత్రమై!
జనహృదయ వికాసమై!
ప్రభవించెను కోటి "సూర్య" ప్రభలతో ఉజ్వలమై.. మహోజ్వలమై
తెలుగు వెలుగు ప్రసరించగ దేశం నలుచెరుగులా!
"సూర్య" ఉగాది ప్రత్యేక సంచిక!
ఆంధ్రుల మదిలో మ్రోగే సుస్వరాల విపంచిక!

రచన
భారతుల సునీల్ భార్గవ్
బిటెక్ (3వ సంవత్సరం)
ఆర్.వి.ఆర్.అండ్ జె.సి.కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్
చౌడవరం, గుంటూరు.






# దశ-దిశ ఖ్యాతి

ఎస్.ఎస్.శర్మ, సీనియర్ సబ్ఎడిటర్, గుంటూరు డెస్క్

స్వర్ణభారతంలో గుంటూరు జిల్లా సాధించిన ప్రగతి విస్మరించరానిది. ఐదు దశాబ్దాలలో గుంటూరు జిల్లా ఎన్నో రంగాలలో ఎంతో అభివృద్ధిని గడించింది. మరెన్నో విధాలైన ఆటుపోట్లనూ చవి చూసింది. అయినా అడుగడుగునా ఎదురయ్యే అవాంతరాలెన్నింటినో బాలారిష్టాలుగా కొనగోటితో తోసేస్తూ చరిత్ర సృష్టిస్తూనే ఉంది. తనదైన ఉనికినీ చాటుకుంటూనే వచ్చింది. ఇక్ష్వాకులు, పల్లవులు, విష్ణుకుండినులు, విజయనగరరాజులు, కాకతీయులు, రెడ్డిరాజులు వంటి ఉద్దండులు పాలించిన గడ్డ ఇది. సాహిత్య, శిల్ప కళలకు ఆదినుంచి ఆటపట్టుగా ఉన్న ఈ ప్రాంతంలో హిందూ మతంతోపాటు జైన,బౌద్ధ మతాలు కూడా సహజీవనం చేశాయి. దక్షిణాది రాష్ట్రాలలో మొదటగా గుంటూరు జిల్లాలోనే లూథరన్ క్రిస్టియన్ మిషనరీలు విద్య, వైద్య రంగాలలో తమ సేవా కార్యక్రమాలకు నాందీ పలికాయి. నవయుగ కవి చక్రవర్తి గుర్రం జాషువా అన్నట్లు

"ఏస కొంచెములేని హృదయంగమంబైన
సిసలైన తెనుగు రంజిల్లు చోటు" ఇది.

నిజంగా ఆయన ప్రస్తావించినట్లు గుంటూరు జిల్లా వీరభాషాభిరామ. కవిత్రయ మధ్యముడు తిక్కనకు జన్మస్థలియై, కనకస్నాన మాడిన కవిసార్వభౌముడు నడయాడిన పుణ్యభూమిగా, ఆచార్య నాగార్జునుని బోధనలు ప్రతిధ్వనించిన పవిత్ర క్షేత్రంగా గుంటూరు సీమ ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. జాతీయ కవి రాయప్రోలు, అభినవ తిక్కన సీతారామమూర్తి, నవయుగ కవి చక్రవర్తి జాషువా, హేతువాద ఉద్యమ నిర్మాత త్రిపురనేని రామస్వామి చౌదరి, కరుణశ్రీ పాపయ్య శాస్త్రి వంటి ఉద్దండ కవిపండితులెందరో ఈ సీమను కవితా సుసంపన్నం చేశారు. ప్రపంచ ప్రఖ్యాతి గడించిన కోహినూరు వజ్రాన్ని కన్న రత్నగర్భ మన గుంటూరు జిల్లా. శ్రీనాథుడు అన్నట్లుగా

"ముగ్గురు రాజులకును మోహంబు బుట్టించు
కొమరు మించిన వీడు కొండవీడు
చటుల విక్రమ కళా సాహసంబొనరించు
కుటిలారులకు కాడు....."

అయి నిలచి కొండవీడు గుంటూరు జిల్లా పౌరుష ప్రతాపాలను చరిత్ర

(మిగతా 16వ పేజీలో)












(15వ పేజీ తరువాయి)

పుటలలో సువర్ణాక్షరాలతో లిఖించేట్లు చేసింది. మరో కవివరేణ్యుడు ధనేకులు వెంకటేశ్వరరావు ఉగ్గడించినట్లు

"రాజ్యమ్మున కెద్దానికి
రాజధాని కాకున్నను
రాజధానులెన్నింటికో
రాదారీ గుంటూరే"

అన్నమాటలు అక్షరసత్యాలని రాజకీయ చైతన్యానికి మారుపేరైన ఈ జిల్లా నాయకులు నిరూపించారు. ఆంధ్ర రాష్ట్రానికి నలుగురు ముఖ్యమంత్రులను అందించిన జిల్లా గుంటూరు. సుదీర్ఘ కాలం ముఖ్యమంత్రి పదవిన

# దశ-దిశ ఖ్యాతి

లంకరించిన కీ.శే.నందమూరి తారకరామారావు, ముఖ్య మంత్రిగానే కాక దేశాధ్యక్ష పదవిని సైతం అలంకరించిన తెలుగుబిడ్డ కీ.శే.నీలం సంజీవ రెడ్డి గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాల పూర్వ విద్యార్థులే. ఇక కేంద్ర రాష్ట్ర మంత్రులుగా ఈ జిల్లాకు చెందిన ఎందరో దిగ్గజాలు గుంటూరు ప్రాశస్త్యాన్ని దశదిశలా వ్యాపింప చేసిన వారే.

"సమసమాజ సిద్ధాంతపు చాపకూటి పథకాలను యుగయుగాలనాడే" ఆవిష్కరించి అమలు జరిపిన బ్రహ్మన్న, హరిజనోద్ధరణకు, మహిళాభ్యున్నతికి నడుంకట్టిన ఉన్నవ దంపతులు, స్వాతంత్రోద్యమ కాలంలో నాటక రచయితగా, ప్రయోక్తగా వెలుగుతూ ఉద్యమానికి తన మేధాసం ఎత్తిని అంకితం చేసిన దామరాజు పుండరీకాక్షుడు, ఈ మహోద్యమానికి తన సిరిసంపదలను తృణప్రాయంగా ధారపోసిన దేశభక్త కొండా వెంకటప్పయ్య ఈ జిల్లా వాసులే. " పుల్లరి ఉద్యమంలో పరాయి పాలకులనెదిరించి తుపాకీ గుండ్లకు బలైన కన్నెగంటి హనుమంతు, ప్రజాహృదయాలలో చెరగని పీఠం వేసుకున్న అమరవీరుడు గాదె చిన్నపరెడ్డి, భారతావనిలోనే క్విట్ఇండియా ఉద్యమంలో ముందుకు దూసుకుపోయి నేలకొరిగిన తెనాలి వీరకిశోరాలు ఈ సీమకన్న బిడ్డలే. ఇంకా బ్రిటీష్ పాలకుల తుపాకీ గుండ్లకు ఎదురొడ్డి నిలచి "దమ్ముంటే కాల్చండిరా" అంటూ సవాలు విసిరిన అరవీర భయంకరుడు, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి జన్మస్థలం అవిభక్త గుంటూరు జిల్లాలోనిదే. ఇలా చెప్పుకుంటే పోతే ఈ మహామహుల జాబితాయే పెద్ద గ్రంథమే అవుతుంది.

ఇక జిల్లాలోని పల్నాడు ప్రాంతంలో ఒకప్పుడు సజ్జ, జొన్న వంటి మెట్టపంటలు మాత్రమే పండేవి. అందుకే శ్రీనాధ మహాకవి

"చిన్నచిన్నరాళ్ళు చిల్లర దేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జజొన్న కూళ్ళు సర్పంబులను దేళ్ళు
పలనాటి సీమ పల్లెటూళ్ళు" అంటూ అపహాస్యం చేశాడు.

" జొన్న కలి, జొన్న అంబలి, జన్న అన్నము " తప్ప " సన్నన్నము సున్న సుమీ" అనీ 'అంగడి యూర లేదు వరియన్నము లేదు శుచిత్వమేమి లేదంగనలింపు లేరు' అని ఎద్దేవా చేశాడు.

అయితే నాగార్జునసాగర్ ప్రాజెక్టు వచ్చాక పల్నాడు సస్యశ్యామలమైంది. రాళ్ళసీమ సాగర్ జలాలతో రతనాల సీమగా మారింది. నాగరికతను సంతరించుకుంది. పల్లెటూళ్ళు పట్టణాలైనాయి. తన నాగార్జున సాగర్ ప్రాజెక్టు వచ్చాక పల్నాడు సస్యశ్యామలమైంది. రాళ్ళసీమ సాగర్ జలాలలో రతనాల సీమగా మారింది. నాగరికత సంతరించుకుంది. పల్లెటూళ్ళు పట్టణాలైనాయి. తన నాగార్జునసాగర్ లఘుకావ్యంలో సస్యశ్యామలమైన పల్నాటిని ప్రశంసిస్తూ జాషువా శ్రీనాధుని పరిహాసమాడుతాడు.

*"అంగడి యూరలేదు వరియన్నము లేదు, శుచిత్వమేమిలే*
*దంగనలింపు లేరనుచునప్పుడు పల్కితివిప్ప దందువా*
*అంగన లందరిందు దమయంతులుగా వరియన్న మంతయుం*
*బంగరు బువ్వగా బలికి వ్రాయవెనైషధ కావ్యమున్ కవీ !*

అని నేటి పల్నాటి పరిస్థితిని అభివర్ణిస్తూ జాషువా పలికిన పలుకులు అక్షరసత్యాలు. ఇక జిల్లాలోని పొగాకు వాణిజ్యం ఖండాంతరాలకు వ్యాపించి గుంటూరుకు అంతర్జాతీయస్థాయి గుర్తింపు తీసుకురాగా మిర్చి, పసుపు మార్కెట్లు కూడా విదేశీ మారకద్రవ్యాన్ని విశేషంగా ఆర్జించిపెడుతున్నాయి. జిల్లాలో వైద్యం, ఇంజనీరింగ్, వ్యవసాయ తదితర వృత్తి విద్యా కళాశాలల కూడా మరిని ఏర్పాటు కావడంతో విద్యారంగంలో కూడా గుంటూరు జిల్లా ప్రగతిపథంవైపు పరుగులు తీస్తున్నదనే చెప్పాలి.



నాగార్జునసాగర్‌లో కృష్ణమ్మ పరవళ్ళు



ఉండవల్లి గుహలు



అమరావతి స్థూపం









# స్వాతంత్ర్య సంగ్రామంలో ఎగసిన తెనాలి కెరటం

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్ రిపోర్టర్, తెనాలి



భారత స్వాతంత్ర్య సంగ్రామంలో తెనాలి ప్రాంతం కీలకపాత్ర పోషించింది. బానిస సంకెళ్ళ నుంచి విముక్తి పొందేందుకు ఈ ప్రాంత యువతరం మహోజ్వల పోరాటంలో భాగస్వాము లయ్యారు. ఉవ్వెత్తున ఎగసిన పోరాటంలో ఎంతోమంది త్యాగమూర్తులు తమ జీవితాలను ఉద్యమానికి ధారపోసి ఈ ప్రాంత కీర్తిప్రతిష్టలు దశదిశలా వ్యాపింపజేశారు. 1932 జూన్, జూలై మాసాల్లో 104 మంది సమరయోధులను శాసన ఉల్లంఘన సందర్భంగా ప్రభుత్వం బంధించింది. 1942 ఆగస్టు 12న క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా తెనాలి కేంద్రంగా జరిగిన ఆందోళన పోలీసులతో ప్రత్యక్ష పోరాటం, ఏడుగురు ఉద్యమకారుల మరణం, రైల్వే ఆస్తులకు కలిగిన నష్టం జాతీయ నాయకుల దృష్టిలో నిలిచింది. క్విట్ ఇండియా ఉద్యమాన్ని అణగదొక్కేందుకు గాంధీతో సహా అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అగ్ర నాయకులను అరెస్ట్ చేసినందుకు నిరసనగా ఈ ఆందోళన మొదలైంది. తాలుకా హైస్కూల్ నుంచి ప్రారంభమైన ప్రదర్శన రైల్వేస్టేషన్ చేరుకునే సరికి తీవ్రరూపం దాల్చింది. నార్త్ క్యాబిన్ దగ్గరలో ఉన్న ఆయిల్ ట్యాంకుకు నిప్పంటించిన ఉద్యమకారులు రెండు వ్యాగన్లలో ఉన్న షాహీడెక్కన్ సిగరేట్ ప్యాకేట్ల దిండ్లను, ఆ తర్వాత స్టేషన్‌ను దహనం చేశారు. చైన్నై నుంచి వచ్చిన పాసింజర్ రైలులో నాలుగు భోగీలకు నిప్పంటించారు. అక్కడి నుంచి సబ్‌ట్రెజరీ కార్యాలయం తగలబెట్టేందుకు నిర్ణయించుకున్న ఆందోళనకారులు స్టేషన్ రోడ్డు దాటి ప్రస్తుత రణరంగచౌక్ చేరుకునేసరికి పోలీసులు అడ్డుకున్నారు. వారు ఎన్ని హెచ్చరికలు చేసిన ప్రదర్శకులు ఖాతరు చేయలేదు. అధికారులు కాల్పులకు ఆదేశాలిచ్చారు. మాజేటి సుబ్బారావు, శ్రీగిరి లింగం, లక్ష్మీనారాయణ, తమ్మినేని సుబ్బారెడ్డి, గాలి రామ

(మిగతా 18వ పేజీలో)

(17వ పేజీ తరువాయి)

కోటయ్య, ప్రయాగ రాఘవయ్య, జాస్తి అప్పయ్యలు పోలీసు తూటాలకు నేలకు ఒరిగారు. ఇక్కడ రైల్వేస్టేషన్ దహనం చేసిన కొద్ది సమయంలోనే దుగ్గిరాలలోనూ స్టేషన్‌కు నిప్పంటించారు. ఈ పోరాటం బ్రిటీష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్, సింగపూర్‌లో ఉన్న నేతాజీ సుభాష్‌చంద్రబోస్‌ల దృష్టికి వెళ్ళింది. బెర్లిన్ టోక్యో రేడియోలు ఈ విషయాన్ని ప్రసారం చేశాయి.

కంచర్లపాలెం, కఠెవరం గ్రామాలకు చెందిన చుక్కపల్లి రామయ్య, లక్కరాజు భాసవయ్య, గోళ్ళమూడి బ్రహ్మయ్యలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రచారంచేస్తూ ఉగ్రవాదుల ఉద్యమానికి మద్దతునిచ్చారు. వారి నుంచి బాంబుల తయారీలో శిక్షణ కూడా పొందారు. కొబ్బరికాయల్లో పేలుడు

# స్వాతంత్ర్య సంగ్రామంలో ఎగసిన తెనాలి కెరటం

పదార్థాలు కూర్చి 1909 ఏప్రిల్ 2న బాంబులను సిద్ధం చేశారు. మద్రాసుకు వెళ్ళే వైస్రాయి రైలును పేల్చివేయాలని నిర్ణయించుకుని ముందుగా బాంబుల పనితీరును పరిశీలించేందుకు ఏప్రిల్ 3న కఠెవరం, కంచర్లపాలెం గ్రామాల మధ్య కట్టపై ఒక కొబ్బరికాయ బాంబును ఉంచి వెళ్ళారు. దాన్ని చూసిన ఓ పశువుల కాపరి పగలగొట్టేందుకు ప్రయత్నించి బాంబు పేలి మరణించాడు. బ్రిటీష్ ప్రభుత్వం ముగ్గురిని అరెస్ట్ చేసింది.

1907లో మచిలీపట్నంలో ఏర్పాటైన జాతీయ పాఠశాలలో తెనాలి ప్రాంతానికి చెందిన కొందరు శిక్షణ పొందారు. 1920లో వారు తెనాలిలో జాతీ య పాఠశాలను ప్రారంభించారు. జాతీయ వాదులకు ఈ పాఠశాల స్థావరంగా పనిచే సింది. 1930లో మహాత్మాగాంధీ నాయక త్వంలో సహాయ నిరాకరణోద్యమానికి స్పందించి బందరులో నేషనల్ కాలేజీ, ఏలూరులో జాతీయ విద్యాలయం, తెనాలిలో మల్లాది దేవేంద్రుని సారధ్యంలో గోఖలే జాతీయ పాఠశాల ఏర్పాటయ్యాయి. 1930లో గుంటూరులోని యడవల్లివారి సత్రంలో ఏర్పాటుచేసిన సత్యాగ్రహ శిబిరాన్ని మూసివేయ డానికి ప్రభుత్వం రిజర్వ్ దళాలను పంపగా దళాదిపతిగా ఉన్న నాగళ్ళ కృష్ణయ్య వారిని అడ్డుకున్నారు. లాఠీ దెబ్బలతో నేలకొరిగారు. ఈ దృశ్యాన్ని చూసిన ఆచార్య రంగాభారతీదేవి కలెక్టర్‌ను కలిసి తమ నిరసనను వ్యక్తం చేశారు. అప్పటి నుంచే నాగళ్ళ కృష్ణయ్య గాంధీకృష్ణయ్యగా పేరు పొందారు.

# పట్టుదలే 'తిరుమల' రహస్యం

## ఉత్తమ ప్రమాణాలతో దూసుకుపోతున్న తిరుమలడైరీ

(ఎంఎస్ సుధాకర్, స్టాఫ్ రిపోర్టర్, నరసరావుపేట)



తిరుమల ఎండి బి.బ్రహ్మనాయుడు

ఇంతింతై వటుడింతై అన్న సామెతను రుజువు చేశారు ఆ నలుగురు వ్యక్తులు... తాము స్థాపించిన తిరుమల డెయిరీ రాష్ట్రంలోని ప్రైవేటు డెయిరీలలో అగ్ర స్థానం అలంకరించాలని ఆ నలుగురు పట్టుదలతో ముందుకు సాగుతున్నారు. నాణ్యతలో ప్రమాణాలు, సరఫరాదా రులకు సకాలంలో చెల్లింపులు అనే మూల సూత్రంతో సంస్థకు ప్రగతిబాట వేశారు. వారే బొల్లా బ్రహ్మనాయుడు, బ్రహ్మనందం, నాగేశ్వరరావు, డాక్టర్ వెంకట్రావులు.

వ్యవసాయం చేసే కుటుంబంలో

### తిరుమల ఉత్పత్తులకు ఎఎస్ఓ 909, 2000 గుర్తింపు బంగ్లాదేశ్, శ్రీలంక నుంచి పాలపొడికి ఆర్డర్లు

జన్మించి వ్యవసాయ ఉత్పత్తులపైనే ఆధారపడి కోట్లాది రూపాయల వ్యాపారం చేస్తూ, వేలాదిమందికి ఉపాది కల్పిస్తున్న ఘనత వీరికే దక్కుతుంది. జిల్లాలో పాడిపరిశ్రమ ఉత్పత్తుల తయారీలో పేరెన్నికగన్న సంగం డెయిరీని మించి వ్యాపారాన్ని నిర్వహించటం వారి పట్టుదలకు తార్కాణం. వెల్లలచెరువు గ్రామ సమీపంలో ల క్షలతో స్థాపించిన తిరుమల డెయిరీ కొద్ది కాలంలో అంచెలంచలుగా ఎదిగి రాష్ట్ర స్థాయి నుంచి ఇతర రాష్ట్రాల స్థాయికి విస్తరించింది. ఈనాడు తిరుమల డెయిరీ పాలు దొరకని ప్రాంతమంటూ లేదు.

పది వేల లీటర్ల సామర్థ్యంతో కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాల వ్యాప్తంగా పది లక్షల లీటర్లపై పాలవిక్రయం జరుగుతోంది. అగ్‌మార్క్ ప్రమాణాలతో పాలు, పాల పదార్థాలను తయారు చేస్తున్నారు. తిరుమల ఉత్పత్తులకు ఎఎస్ఓ 909, 2000 గుర్తింపు లభించింది. చిన్న సాంకేతిక ప్రమాణాలతో నెల్లూరు జిల్లా గూడూరులో పాలు, నెయ్యి, పెరుగు, దూద్‌పేడా, పాలపొడి తయారీ జరుగుతోంది. తిరుమల డెయిరీ గురించి ఛైర్మన్ బ్రహ్మనాయుడు మాట్లాడుతూ, తిరుమల అంటే, రాష్ట్రంలో ప్రముఖ డెయిరీలలో అత్యంత స్థానంలో తిరుమల డెయిరీ నిలిచిందన్నారు.

తమ సంస్థలో సుమారు ఎనిమిది వేల మంది ఉద్యోగులు ఉపాది పొందుతున్నారని అన్నారు. గ్రామసీమల్లో పాడిపంటలు బాగున్నప్పుడే దేశం, ప్రజలు సుభిక్షంగా ఉంటారని ఆయన పేర్కొన్నారు. గేదెలకు వచ్చే వ్యాధులకు వ్యాక్సినేషన్ తమ సంస్థ సబ్సిడీపై అందిస్తుందన్నారు. హైదరాబాద్ తిరుమల ఉత్పత్తులకు విశేష ఆదరణ వినియోగదారుల నుంచి లభిస్తుందన్నారు. గూడూరులోని తిరుమల ఫ్యాక్టరీలో ఎక్స్‌పోర్టు క్వాలిటీలో తయారౌతున్న పాలపొడికి మార్కెట్‌లో మంచి డిమాండ్ ఉంది. అలాగే, బంగ్లాదేశ్, శ్రీలంక నుంచి కూడా తిరుమల పాలపొడికి ఆర్డర్లు వస్తున్నాయన్నారు. మరోవైపు పాల ఉత్పత్తిదారులకు వివిధ రకాలుగా సేవలు అందిస్తున్నామన్నారు.

# పేదల డాక్టర్ డా.గోపీనాయక్

(ఎన్.జగన్మోహన్‌రెడ్డి, ఆర్‌సి, నరసరావుపేట)


ఉత్తమ సేవలకుగాను మరో అవార్డునందుకుంటూ..

ముప్పాళ్ళ మండలం ఇరు కుపాలెం గ్రామానికి చెందిన ఓ సామాన్య రైతు కుంటుంబం నుంచి వచ్చిన డాక్టర్ గోపీనాయక్ ప్రజా వైద్యునిగా ప్రశంసలు పొందుతున్నారు. అన్ని వర్గాల వారు మా డాక్టర్ గారు అని ఆప్యాయంగా చెప్పుకునే గోపీనాయక్ సేవలు వారి హృదయాల్లో ఆయనకు పదిలమైన స్థానం కల్పించాయి. 1984వ సంవత్సరంలో గుంటూరు మెడికల్ కళాశాల నుంచి ఎంబిబిఎస్ పట్టాను ఆయన అందుకున్నారు. తొలిసారిగా 1985 నుంచి ప్రకాశం జిల్లా మార్టూరులో ప్రభుత్వ వైద్యునిగా సేవలు అందింటం మొదలుపెట్టారు. 1989-90, 91 ఇలా 2004 వరకూ 11 సార్లు జిల్లాలో ఉత్తమ వైద్యాదికారిగా బెస్ట్ పల్స్‌పోలియో ఇంప్లి మెంటేషన్, ఫ్యామిలీ ప్లానింగ్‌ను సమర్ధవంతంగా నిర్వహించినందుకు ఆనాటి జిల్లా కలెక్టర్లయిన జివిఎస్ రావ్, శశాంక్ గోయల్, సతీష్‌చంద్ర, రామకష్ణారావు తదితరుల చేతుల మీదుగా అవార్డులు అందుకున్నారు. వీటితో పాటు 2000, 2001, 2002, 2003 వరుసగా నాలుగేళ్లు ఆంధ్రప్రదేశ్ వైద్య విధాన పరిషత్ నుంచి రాష్ట్ర స్థాయిలో అప్పటి ముఖ్యమంత్రి


డాక్టర్ గోపీనాయక్‌ను అభినందిస్తున్న కలెక్టర్

(మిగతా20వపేజీలో)

# పేదల డాక్టర్ డా.గోపీనాయక్

(19వ పేజీ తరువాయి)

చంద్రబాబు తదితర ఉద్దండుల నుంచి ప్రశంసా పత్రాలు అందుకున్నారు. 2007వ సంవత్సరంలో స్థానిక ఏరియా వైద్యశాలకు రాష్ట్రంలోనే మూడో ఉత్తమ వైద్యశాలగా అవార్డు రావటం డాక్టర్ గోపీనాయక్ సేవలకు లభించిన మరో పురస్కారం. వైద్యశాలకు వచ్చేవారితో పాటు సామాన్య ప్రజలు, ప్రభుత్వ అధి కారులు, ఇతర అన్ని వర్గాలతో గోపీనాయక్‌కు విస్తృతమైన ప్రజా సంబంధాలు ఉన్నాయి. ప్రతి ఒక్కరినీ గోపీనాయక్ ఆత్మీయంగా పలకరిస్తూ, వైద్య సేవలు అందిస్తుంటారు. వైద్య సేవలతోపాటు ప్రజా సేవా కార్యక్రమాలు నిర్వహించటంలోనూ ఆయన ముందు వరుసలో ఉంటారు. దీనిలో భాగంగానే ఎస్‌కె ఖాశిం అనే పేద కుటుంబానికి చెందిన విద్యార్థిని పదో తరగతి నుంచి ఇంజనీరింగ్ చదువు పూర్తి అయ్యే వరకూ అన్ని ఖర్చులను తానే భరించి తన దాతృత్వాన్ని చాటుకున్నారు. దాంతోపాటు పేద విద్యార్థులకు ఫీజులు చెల్లించటం, పేదలకు దుస్తులు, ఇతర ఆర్థిక సహాయం అందించటం వంటి కార్యక్రమాలను ఆయన నిర్వహిస్తుంటారు. ఆయన సేవలకు ప్రభుత్వం అనేక అవార్డులను, ప్రశంసా పత్రాలు అందిస్తే, రోటరీ, లయన్స్, స్వాతంత్ర్య సమర యోధుల సంఘం, తదితర స్వచ్ఛంద సేవా సంస్థలు ఆయన్ను వివిద సందర్భాలలో ఘనంగా సన్మానించాయి.

### సేవ చేసే అవకాశం రావటం అదృష్టం: గోపీనాయక్

సామాన్య పేద రైతు కుంటుంబంలో జన్మించిన తనకు వైద్య సేవలతో పేదలకు దగ్గర కావటం తన అదృష్టమని డాక్టర్ గోపీనాయక్ మేజర్‌న్యూస్‌తో అన్నారు. సామాన్య రైతు కుటుంబంలో పుట్టిన తాను వైద్యునిగా ఎదిగేందుకు అనేక, అవార్డులను ప్రశంసా పత్రాలను పొందేందుకు తన సహచర వైద్యులు, సిబ్బంది అందించిన సహకారం మరువలేనిన్నారు. వైద్య వృత్తిని అత్యంత పవిత్రమైనదిగా తాను భావిస్తానని ఆయన పేర్కొన్నారు. నిస్వార్థంగా ఈ వత్తిలో ప్రజలకు సేవలు అందిస్తున్నానని, దీంతోపాటు తన పరిధిలో సమాజ సేవలో పాలుపంచుకుంటున్నానని ఆయన పేర్కొన్నారు. ఇటీవల తాను జిల్లా ప్రభుత్వ వైద్యుల సంఘం అసోసియేషన్ అధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్నిక అయ్యేందుకు సహకరించిన జిల్లాలోని ప్రభుత్వ వైద్యులందరికీ ఆయన ఈ సందర్భంగా కృతజ్ఞతలు తెలిపారు. ప్రజలకు వైద్య సేవలు అందించటంతో పాటు ప్రభుత్వ వైద్యులు ఎదుర్కొంటున్న సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకుపోయి, వాటిని పరిష్కరించేందుకు తనకు లబించిన ఈ అవకాశాన్ని సద్వినియోగించుకుంటానని గోపినాయక్ తెలిపారు.

# అక్కడంతా అభివృద్ధే!!

## అభివృద్ధిపథంలో బుచ్చిపాపన్నపాలెం పంచాయతీ



బుచ్చిపాపన్నపాలెం గ్రామం

(పిట్టా జాన్ ప్రసన్న కుమార్, నరసరావుపేట రూరల్)

ముఖ్యమంత్రి చేపడుతున్న సంక్షేమ కార్యక్రమాలను వినియోగించుకోవాలని ప్రభుత్వం పిలుపునిస్తున్న తరుణంలో దాన్ని సద్వినియోగం చేసుకుని జిల్లాలోనే అగ్రగామిగా నిలిచింది రొంపిచర్ల మండ లంలోని బుచ్చిపాపన్నపాలెం గ్రామం. రొంపిచర్ల మండలంలో ఉన్న ఈ గ్రామం ప్రభుత్వం చేపట్టిన ఇందిరమ్మ గహ నిర్మాణాలను పూర్తి స్థాయిలో వినియోగించుకుని పలువురితో శభాష్ అనిపించుకుంటోంది. ఇందుకోసం గ్రామ సర్పంచ్ చీమల శ్రీనివాసరెడ్డి, అహర్నిశలు కష్టపడుతున్నాడు. ఇందిరమ్మ ఫేజ్ 1లో ఈ గ్రామంలో దాదాపు 400 గృహ నిర్మాణాలు చేపట్టటం జరిగింది. ఇందులో ఇప్పటికే 300 పైగా గహాలు పూర్తి చేసి ఆదర్శ గ్రామంగా నిలిచింది. ఈ సందర్భంగా, గ్రామ సర్పంచ్ శ్రీనివాస రెడ్డి మేజర్ న్యూస్‌తో మాట్లాడుతూ, మొదటి విడతలోనే 400 ఇందిరమ్మ గృహాలు చేపట్టి తమ గ్రామం జిల్లాలోనే ఆదర్శంగా నిలిచిందన్నారు. గ్రామంలో కమ్యూనిటీ హాల్ నిర్మాణానికి ఎంపి గ్రాంట్‌క్రింద రెండున్నర లక్షలు, రోడ్ల నిర్మాణం కోసం ఎంఎల్‌ఎ గ్రాంట్ క్రింద రెండున్నర లక్షలు, ఎస్‌టి కాలనీ కోసం రెండున్నర లక్షలు, సిసి రోడ్ల కొరకు రెం డున్నర లక్షలు ఖర్చు చేసి గ్రామంలో అభివద్ధి పనులు చేపట్టినట్లు పేర్కొన్నారు. ఉపాధి హామీ పథకం క్రింద వంద మందికి ఉపాధి కల్పించనున్నట్లు తెలిపారు. బుచ్చిపాపన్న పాలెం గ్రామంలో పది డ్వాక్రా గ్రూపులు ఉన్నాయని, ఇప్పటికే ఐదు గ్రూపులకు ఆరు వేల చొప్పున రుణాలు ఇప్పించినట్లు పేర్కొన్నారు.

అదేవిధంగా మరో ఐదు గ్రూపులకు 60 వేలు చొప్పున రుణాలు అందజేశారన్నారు. ఎస్‌సి, ఎస్‌టి కాలనీలకు ఎఎంజి ఇంటికి నాలుగు వేల రూపాయల చొప్పున ఆర్థిక సహాయం అందించిందన్నారు.

గ్రామంలో పూరిగుడిసె అనేది లేకుండా చేసి పక్కా భవన నిర్మాణాలు, మరుగుదొడ్లు నిర్మిచాలనే లక్ష్యంతో ముందకు పోతున్నట్లు ఆయన తెలిపారు. దీపం పథకం క్రింద గ్రామంలో ఆరుగురు దరఖాస్తులు అందించారని వారికి త్వరలోనే గ్యాస్ కనెక్షన్ మంజూరు చేయిస్తామన్నారు.

# భవితకు బంగారు బాట

## ఎస్ఎస్ఎన్ కళాశాల ఎంసిఎ విభాగం

(ఎన్.జగన్మోహన్‌రెడ్డి, మేజర్‌న్యూస్, నరసరావుపేట)

లక్షలు వ్యయంచేసి డిగ్రీలు పూర్తి చేసినా, ఉపాధి అవకాశాలు కనిపించని ప్రస్తుత రోజుల్లో యువతకు బంగారు భవితను స్థానిక శ్రీ సబ్బరాయ అండ్ నారాయణ కళాశాల ఎంసిఎ విబాగం అందిస్తోంది. ఎంసిఎ కోర్సులో ఉపాది అవకాశాలు కల్పించే విధంగా ప్లేస్‌మెంట్స్‌కు ప్రత్యేక శ్రద్ధతో ఆ విభాగానికి చెందిన అధ్యాపకులు ఎంసి ప్రసాద్, కె.రాజశేఖర్‌లు కృషి చేస్తున్నారు. ఎస్ఎస్ఎన్ కళాశాల 1950వ సంవత్సరంలో నరసరావుపేట కేంద్రంగా స్థాపించారు. పల్నాడు ప్రాంతంలోని విద్యార్థులకు అత్యుత్తమ విద్యా సౌకర్యాలు అందిస్తూ, కళాశాల ఇటీవలనే స్వర్ణోత్సవాలను పూర్తి చేసుకుంది. తమ కళాశాల ద్వారా అత్యుత్తమ కోర్సులను అందించేందుకు ఎప్పటికప్పుడు యాజమాన్యం చర్యలు తీసుకుంటోంది. ప్రస్తుతం విస్తృతమైన ఉపాది అవకాశాలు కల్పిస్తున్న కంప్యూటర్ కోర్సులను, విద్యను అత్యుత్తమ సౌకర్యాలతో అందించేందుకు 2001 సంవత్సరంలో ఎంసిఎ కోర్సును ప్రారంభించి ఉత్తమ సాంకేతిక నైపుణ్యం గల విద్యార్థులను సమాజానికి అందిస్తోంది. ఎస్ఎస్ఎన్ కళాశాలలో ఎంసిఎ విభాగం 2001 సంవత్స రంలో 40 మంది విద్యార్థులతో ప్రారంబించబడింది. అనేక సౌకర్యాలను విద్యార్థులకు అందిస్తూ, ఎంసిఎ విద్యను అత్యుత్తమ విద్యగా అందించే విభాగంగా రూపొందింది. విశిష్టమైన సాంకేతిక నైపుణ్యం గల విద్యార్థులను క్యాంపస్ ఇంటర్వ్యూలలో ప్రముఖ సాఫ్ట్‌వేర్ కంపెనీలకు అందిస్తూ అనేక విజయాలను ఎంసిఎ విభాగం సొంతం చేసుకుంది. ఎంసిఎ విద్యార్థిని కె. పూర్ణిమ 2007 సంవత్సరంలో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం పరిధిలో మూడు బంగారు పతకాలు సాధిం చటం, ఎంసిఎ విభాగం విజ యాలకు నిదర్శనంగా నిలిచింది. 2002 ఏడాదిలో విద్యార్థులకు ఉపాధి అవకా శాలు పెంచేందుకు కెరీర్ గైడెన్స్, ప్లేస్‌మెంట్ సెల్‌ను ఏర్పాటు చేశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే నడపబ డుతున్న జవహర్ నాలెడ్జ్ సెంటర్ (జెకెసి) హోస్టింగ్ కళాశాలగా గుర్తింపు పొందింది.

### విద్యార్థుల భవిష్యత్తుకు పూర్తి భరోసా : కె.రాజశేఖర్, ఎంసి ప్రసాద్

తమ కళాశాలలోని ఎంసిఎ కోర్సును అభ్యసిస్తున్న విద్యార్థుల బవిష్యత్తుకు పూర్తి భరోసాను తాము కల్పిస్తున్నట్లు ఎంసిఎ విబాగం అధిపతులు కె.రాజ శేఖర్, ఎంసి ప్రసాద్‌లు మేజర్‌న్యూస్‌కు తెలిపారు. ఎంసిఎ విభాగంలో వంద కంప్యూటర్లు, రెండు విశాలమైన ల్యాబ్స్‌తోనూ నిరంతర ఇంటర్ నెట్ సౌక ర్యంతో అత్యుత్తమ విద్యను అందిస్తున్నామని వారు పేర్కొన్నారు. ఆరువేల పుస్తకాలతో ఎంసిఎ లైబ్రరీ, సెమినార్ హాల్, ఇ-లెర్నింగ్, ఇ-బుక్స్ వంటి వసతులు తమ కళాశాలలో అదనంగా విద్యార్థులకు కల్పిస్తున్నామని వారు తెలిపారు. విద్యార్థుల్లో కమ్యూనికేషన్ స్కిల్స్‌ను అభివృద్ధి చేయటం, ఉపాధి అవకాశాలపై సెమినార్లు, వర్క్‌షాపులు నిర్వహించటం, పర్సనాలిటీ డెవలప్ మెంట్‌లతో ఉత్తమ కంప్యూటర్ నిపుణులుగా విద్యార్థులను తీర్చి దిద్దుతున్నామని తెలిపారు. తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో మార్చి 6నుంచి 8వ తేదీ వరకూ జరిగిన నేషన్ సెమినార్‌లో తాము డెసిషన్ మేకింగ్ యూజింగ్ డేటా మైనింగ్ అంశంపై సమర్పించిన పరిశోధనా పత్రం ప్రశంసలు పొందినట్లు రాజశేఖర్, ప్రసాద్‌లు వివరించారు.



కె.రాజశేఖర్



ఎంసి ప్రసాద్,





















వై.ఎస్.రాజశేఖర్‌రెడ్డి
ముఖ్యమంత్రి



డాక్టర్ ఎస్.సతీష్‌పాల్‌రాజ్
శాసనసభ్యులు, వేమూరు.



నాదెండ్ల మనోహర్
శాసనసభ్యులు, తెనాలి.







# అందరికీ ఆదర్శం తహశీల్దార్ లలితమ్మ

(పిట్టా జాన్ ప్రసన్న కుమార్, నరసరావుపేట రూరల్)



అధికారులు ఎందరో ఉంటారు, అభివృద్ధి పనులు కొందరే చేస్తుంటారు. వారిలో ఆదర్శంగా ఉండేవారు అతి తక్కువగా ఉంటారు. ముఖ్యంగా మహిళా ఉద్యోతగులు అటు ప్రభుత్వం, ఇటు ప్రజా ప్రతినిధుల ఒత్తిడిల మధ్య సమర్ధవంతంగా విధులు నిర్వహిస్తూ ప్రజల మన్ననలు పొందటం విశేషం. ఆ అతి తక్కువ మందిలో రొంపిచర్ల తహశీల్దార్ కె.లలిత జిల్లాలోనే ముందున్నారని చెప్పటంలో అతిశయోక్తి లేదు. ఎన్నో ఒడిదుడుకులు ఎదురైనప్పటికీ తన పని తాను చేసుకుంటూ, అభివృద్ధిలో ముందుంటూ, ఆదర్శ మహిళా అధికారిణిగా ఇటీవల ఉత్తమ తహశీల్దార్ అవార్డు కూడా అందుకున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే, కష్టించి ఉన్నత స్థాయికి ఎదిగిన వారికి ఎప్పుడూ, పేదలు, అభివృద్ధి మాత్రమే కోరుకుంటారనటానికి ఆమెనే నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

తొలుత ఈమె రిజిస్ట్రార్ కార్యాలయంలో టైపిస్ట్ కం క్లర్క్‌గా ఉద్యోగ బాధ్యతలు చేపట్టారు. ఆ సమయంలో అందరి మన్ననలు పొందారు. అనంతరం నరసరావుపేట రెవెన్యూ డివిజనల్ కార్యాలయంలో డిప్యూటి తహశీల్దార్‌గా రెవిన్యూ శాఖకు వచ్చారు. ఐదున్నర సంవత్సరాల పాటు ఆమె ఇక్కడ ఉద్యోగ బాధ్యతలు నిర్వహించారు. 2004 సంవత్సరంలో ఆమెకు తహశీల్దార్‌గా పదోన్నతి లభించింది. ఎన్నికల సమయం కావటంతో ఆమెను నాదెండ్ల ఎంఆర్‌ఓగా బదిలీ చేశారు. తిరిగి ఆమెను రొంపిచర్ల తహశీల్దార్‌గా బదిలీ చేశారు. ఇప్పటికి దాదాపు మూడున్నరేళ్ళుగా ఇక్కడే ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. నాటి నుంచి నేటి వరకూ అనేక అభివృద్ధి కార్యక్రమాలు విజయవంతంగా నిర్వహించారు. చిన్నస్థాయి నుంచి ఉన్నత స్థాయి ఉద్యోగుల ప్రశంసలు పొందారు. రొంపిచర్ల మండలంలోని సామాన్య, పేద, మధ్య తరగతి ప్రజలతో కలసిపోయి పనిచేస్తూ అందరి మన్ననలు పొందారు. కత్తిమీద సాములాంటి రెవిన్యూ శాఖలో పనిచేయటం కష్టసాధ్యమైనప్పటికీ, కాలికి బలపం కట్టుకుని నిరంతరం పనియే ప్రత్యక్ష దైవంగా భావిస్తూ, ముందకు సాగుతున్నారు. రానున్న కాలంలో ఈమె మరిన్ని పదోన్నతులు పొంది, ప్రజలకు మరింత సేవలు అందించాలని మండల ప్రజానీకం కోరుతుంది.

## జిల్లా సంగతులు

★ మైదవోలులో లభ్యమైన క్రీస్తుశకం మూడవ శతాబ్ది నాటి శాసనం ఆధారంగా ధాన్య కటకం (ధరణికోట) ఆంధ్రాపథంగా స్పష్టం చేస్తుంది.





# అభివృద్ధే ఆయన ధ్యేయం

## అంచెలంచెలుగా ఎదిగిన ఎమ్మెల్యే యర్రం వెంకటేశ్వరరెడ్డి

బుర్ల శ్రీనివాసరావు,
ఆర్‌సి, మేజర్‌న్యూస్, సత్తెనపల్లి



నిజాయితీ ఆయన నైజం...మాటకు కట్టుబడి రాజకీయాల్లో విలువలకు ప్రాధాన్యత నిస్తూ నిరంతరం ప్రజా సంక్షేమం కోసం పరితపిస్తూ నియోజకవర్గాన్ని ఆదర్శవంతమైన, అందరు కొనియాడేలా అభివృద్ధి పనులకు నిధులు తెస్తూ మరోసారి ఎమ్మెల్యేగా ఎన్నికయ్యేందుకు బాటలు వేసుకుంటున్నారు సత్తెన పల్లి ఎమ్మెల్యే యర్రం వెంకటేశ్వరరెడ్డి. మండల అధ్యక్షులు కావాలని రాజకీయాల్లోకి వచ్చి ఏకంగా ఎమ్మెల్యే అయి చరిత్ర సృష్టించారు. ముప్పాళ్ళ మండలం లంకెలకూరపాడు గ్రామంలో జన్మించి అంచెలంచలుగా ఎదిగి పలువురి మన్ననలను అందుకుంటున్నారు. ఆర్భాటాలకు దూరంగా చెప్పింది చేయడం ముక్కుసూటిగా వ్యవహరించడం ఆయన ప్రత్యేకత. కోట్లాదిరూపాయలు నియోజ కవర్గ అభివృద్ధికి నిధులు తెచ్చి నియోజకవర్గంలో ప్రజల కనీస అవసరాలు, అపరిష్కృత సమస్యల పరిష్కారానికి కృషి చేశారు. నిరంతరం ప్రజల అవస రాలు తెలుసుకుని వాటికి నిధులు తీసుకురావడంలో కృతకృతులైయ్యారు.

గత నాలుగేళ్లలో ఎన్నో ప్రజాసంక్షేమ కార్యక్రమాలు చేపట్టి పేద, బడుగు, బలహీన వర్గాలు, మైనార్టీ వర్గాలకు దగ్గరయ్యారు. తాగునీరు, విద్యుత్, రోడ్లు, విద్యా తదితర సమస్య లను శాశ్వత ప్రాతిపదికన పరిష్కారానికి కృషిచే శారు. దశాబ్దాలుగా పరిష్కారానికి నోచని ఎన్నో అపరిష్కృత సమస్యలు పరిష్కరించి బేష్ అనిపిం చుకున్నారు.

ఎన్ని ఒత్తిడులు వచ్చిన వెరవని ధీరత్వంతో ముందుకు పోతున్నారు. కాంగ్రెస్ పార్టీ బలోపేతానికి తన వంతు కృషి చేస్తూ ఎమ్మెల్యేగా సక్సెస్ ఫుల్‌గా కొన సాగుతున్నారు. నియోజకవర్గంలో రూ.50 కోట్లమేర అభివృద్ధి పనులు చేపట్టి జిల్లాలో సత్తెనపల్లికి ఉన్న ప్రత్యేకతను నిలబెట్టారు. మున్సి పాలిటీలో మురికి వాడల అభివృద్ధికి కేంద్రప్రభుత్వం నుండి రూ.15 కోట్లు నిధులు తెచ్చారు. ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డితో పలుమార్లు మాట్లాడి నియోజకవర్గ అభివృద్ధికి దారాళంగా నిధులు తెచ్చారు. ఎన్ని విమర్శలు వస్తున్నా అనుచరులకు పెద్దపీట వేసి నమ్ముకున్న వారికి కూడా నేనున్నాననే భరోసా కల్పించిన వ్యక్తి ఎమ్మెల్యే యర్రం. ఎవరేమి అనుకున్నా తనపని తనుచేసుకుపోతు సిపియం,సిపిఐ, తెలుగుదేశం సత్తెనపల్లిలో చేస్తున్న ప్రజాపోరాటాలను విజయవంత ంగా ఎదుర్కొని నియోజకవర్గంలో తనకంటు ఒక ప్రత్యేకతను నిలుపుకున్నారు.

ఎమ్మెల్యే యర్రం వెంకటేశ్వరరెడ్డి మాట్లాడుతూ ఎన్నికల్లో ఇచ్చిన హామీలను నెరవేర్చానని రానున్న ఏడాది కాలంలో మిగిలిన అన్ని సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానన్నారు. నియోజకవర్గ అభివృద్ధికి కోట్లాది రూపాయల నిధులు తెచ్చానని రోడ్లు, విద్యుత్, తాగునీటి పథకాల నిర్మాణానికి కృషి చేశానన్నారు.సాధించిన ప్రగతిని బేరిజు వేసుకుంటు సాధించాల్సిన ప్రగతిపై ప్రణాళికలు రూపొందిస్తూ ముందుకు పోతున్నానన్నారు. ప్రజాభిమానమే తనకు కొండంత అండ అన్నారు. ముఖ్యమంత్రి వైఎస్ చేస్తున్న అభివృద్ధి పనులే నాకు ఆదర్శం అన్నారు.

# ఐటి ఉద్యోగుల కార్ఖానా నలంద విద్యాసంస్థలు

బుర్ల శ్రీనివాసరావు,
మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

అనతికాలంలోనే అత్యున్నత విద్యా ప్రమాణాలతో క్రమశిక్షణతో రాష్ట్రం లోనే ఇంజనీరింగ్ విద్యలో తనకంటూ ఒక ప్రత్యేకతను చాటుకుంటూ అసాధారణ ప్రతిభకు నిదర్శనంగా నిలుస్తోంది సత్తెనపల్లి పరిధిలోని నలందా విద్యాసంస్థలు. సత్తెనపల్లికి విద్యాపరంగా ఖ్యాతిని తెచ్చిపెట్టిన నలంద విద్యాసంస్థల్లో చేరాలని ప్రతి విద్యార్థి కలలు కంటున్నాడు. విద్యా ప్రమాణాలలో రాజీపడకుండా 2001లో స్థాపించిన ఈ విద్యా సంస్థలు 300 మంది విద్యార్థులతో ప్రారంభమై నేడు 3000 మంది పిద్యార్థులతో పురోభివృద్ధి సాధిస్తోంది. సత్తెనపల్లి పట్టణానికి మూడు కిలో మీటర్ల దూరంలో ఆహ్లాదకరమైన వాతావరణంలో కళాశాలను నిర్వస్తున్నారు. స్థాపించిన అనతికాలంలోనే ఉత్తమ ఫలితాలను సాధించి మంచి పేరుప్రఖ్యాతలు సాధించింది. ఉన్నత ఆశయాలు ఉదాత్తమైన లక్ష్యలతో కళాశాల పేరు ప్రఖ్యాతులు నలుదిశలా వ్యాపిస్తున్నాయి. ప్రముఖ సాఫ్ట్‌వేర్ కంపెనీలతో క్యాంపస్ ఇంటర్వ్యూలను నిర్వహించి అనేక వందల మంది ఇంజనీరింగ్ గ్రాడ్యూయేట్లకు ఉద్యోగులను సమకూర్చిపెట్టింది. ప్రతి ఏటా గేట్ పరీక్షల్లో కళాశాల విద్యార్థులు అత్యుత్తమ ఫలితాలు సాధిస్తున్నారు. అనుభవం కలిగిన అధ్యాపక బృందం కళాశాలలో విద్యార్థులు మంచి ఫలితాలు సాధించేందుకు కృషి చేస్తున్నారు.




సత్తెనపల్లి మండలం కంటెపూడిలో నలంద విద్యాసంస్థల సముదాయం



నలంద విద్యాసంస్థల చైర్మన్ వరప్రసాదరెడ్డి

కళాశాల ఫలితాలు నూటికి నూరు శాతం సాధించాలన్న లక్ష్యంతో ఏఏటికాయేడు పోటీలు పడి విద్యాఫలితాలను సాధిస్తున్నారు. డబ్బే ప్రామాణికంగా నడుస్తున్న నేటి విద్యా వ్యవస్థకు భిన్నంగా సేవాభావంతో విద్యార్థి జీవన గమనాన్ని మార్చే విద్యాసంస్థగా సత్తెనపల్లి మండలంలోని కంటెపూడిలో నెలకొల్పిన నలంద విద్యాసంస్థలు అభివృద్ధి దిశగా అడుగులు వేస్తుంది.

రాష్ట్రంలోని నలంద విద్యా సంస్థల్లో చదివిన ప్రతివిద్యార్థికి ఉపాధివకాశాలు కల్పించే లక్ష్యంతో ఈ విద్యా సంస్థలను స్థాపించినట్లు నలంద విద్యాసంస్థల చైర్మన్ వరప్రసాదరెడ్డి పేర్కొన్నారు. మారుతున్న కాలంలో హైటెక్ హంగులకు ధీటుగా నలంద విద్యాసంస్థల్లో అన్ని కోర్సులను విద్యార్థులకు అందు బాటులోకి తీసుకు వచ్చానన్నారు. నేడు పెరుగుతున్న పోటీని తట్టుకునే విధంగా తమ సంస్థలలో

(మిగతా 24వ పేజీలో)

# రమణీయ రంగస్థలి తెనాలి

టి.ఆర్.కోటిరెడ్డి
స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి

జానపద కళారూపాలకు తేనెపట్టు. జ్ఞానపథలీలాకేళి విలాసాలకు రమణీయ రంగస్థలం తెనాలి పట్టణం. సంగీత, సాహిత్య, నృత్యాభినయ కళాప్రక్రియల్లో ఏదో ఒకటి, ఎక్కడో ఒక చోట రాష్ట్రమంతటా ప్రతి రోజూ తెనాలి కళాకారులచే ప్రదర్శితమయ్యేవని నానుడి. ఇక్కడి కళాకారుల ప్రజ్ఞాపాటవాలను, దీక్షా దక్షతలను చాటడానికి ఇంతకంటే నిదర్శనం ఏమి కావాలి. సుప్రసిద్ధ నటులు, సాహితీవేత్తలు, పాత్రికేయులు, చలనచిత్ర ప్రముఖులు... ఎవరి రంగంలో వారు అఖండులమనిపించుకుని తెనాలి పట్టణానికి అజరామరమైన కీర్తిప్రతిష్టలను ఆర్జించిపెట్టారు. ఆకాశంలో సగం మాదేనని ఓ పక్క మహిళామణులు నినదిస్తుంటే, రాష్ట్రం మొత్తం కళాకారుల్లో సగంమంది తెనాలివారేనని ప్రముఖ కథారచయిత కొడవటిగంటి కుటుంబరావు



తెలుగు రంగస్థల కళావైభవం సదస్సు ప్రారంభ సందర్భంగా జ్యోతి ప్రజ్వలన

సూక్తీకరించారు. కాని ఇదంతా గతం. ఇప్పుడు కళాకారులున్న వారి ప్రజ్ఞాపాటవాలను చాటు కోడానికి అవకాశాలు లేవు. కొంత మందికి ఉపాధి అవకాశాలు అంతకన్నా లేవు. ఇలాంటి దశలో తెనాలి విశిష్టతను కాపాడుతూ రంగస్థల కళాకారులందరినీ ఐక్యం చేస్తూ భవిష్యత్తుకు బాటలు వేస్తుంది పట్టణ రంగస్థల కళాకారుల సంఘం. పట్టణ ప్రముఖులు నన్నపనేని వెంకట్రావు ప్రోత్సాహంతో 1978 సంవత్సరంలో స్థాపించిన ఈ సంఘం నాటి నుంచి కళాకారుల సంక్షేమం కోసం ఎన్నో కార్యక్ర మాలకు శ్రీకారం చుట్టింది. కొంత కాలం కార్యక్రమాలు అంత చురుగ్గా సాగకున్నా మూడేళ్ళ క్రితం సంగం అధ్యక్షులుగా బాధ్య తలు స్వీకరించిన నాగళ్ళ వెంకట దుర్గాప్రసాద్ నేతృత్వంలో ముందుకు సాగుతుంది. వృద్ధ, పేద కళాకారులకు ఉపకార వేతనాలు మంజూరు చేయించడం, అత్యవసర పరిస్థితుల్లో ప్రత్యక్ష సహాయానికి కూడా ముందుకు వస్తుంది. సొంత ఆడిటోరియం కోసం స్థల సేకరణను నాయకుల సహకారంతో పూర్తిచేశారు. తెలుగు సంస్కృతికి ప్రతిబింబంగా నిలిచే కళారూపాలను ప్రోత్సహిస్తూ కార్యక్రమాల నిర్వహణ సాగుతోంది. 2005 డిసెంబర్ 11న తెలుగు రంగస్థల కళావైభవం పేరుతో నిర్వహించిన సదస్సు రాష్ట్రస్థాయిలో ప్రత్యేకతను సంతరించుకుంది. తెలుగు నాటకంలో భాష, జానపద కళారూపాలు, ప్రజాజీవితంలో కళలు, సంప్రదాయ పద్యనాటకంలో వచ్చిన మార్పులు, పరిషత్తులు వాటి నిర్వహణ,



దుర్గాప్రసాద్

తెలుగు నాటక పరిణామం వంటి అంశాలను సమీక్షించి భవిష్యత్తులో రంగస్థల కళాకారుల సంక్షేమం కోసం చేపట్టాల్సిన చర్యల గురించి ఒక దిశానిర్దేశం చేశారు. అంతకు ముందే సంఘం ఆధ్వర్యంలో ఔత్సాహిక యువతీ యువకులకు శిక్షణ శిబిరాలను కూడా నిర్వ హించారు. ఈ ఏడాది ప్రత్యేక నాటికల ప్రదర్శనను ఏర్పాటుచేస్తున్నారు. వల్లూరి వెంకట రామయ్యచౌదరి, మాధవపెద్ది వెంకటరా మయ్య, వేమూరి గగ్గయ్య కాళిదాసు కోటేశ్వర రావు, కాంచనమాల, కళ్యాణం రఘురామ య్య, గోవిందరాజులు వెంకట సుబ్బారావు, స్థానం నరసింహారావు, తెల్లాకుల వెంకటేశ్వర గుప్తా, మోదుకూరి జాన్సన్ వంటి తెనాలి కళావైభవాన్ని నలుదిశలా వ్యాపింపజేసిన మహనీయుల స్ఫూర్తితో ఈ సంఘం మరింత ముందుకు వెళ్ళాలని ఆశిద్దాం.



పట్టణ రంగస్థల కళాకారుల సంఘం సావనీర్ విడుదల చేస్తున్న దృశ్యం

## ఐటి ఉద్యోగుల కార్ఖానా...

(23వ పేజీ తరువాయి)

చదివిన విద్యార్థులకు తర్ఫీదు ఇస్తున్నామన్నారు. ఎన్నో జాబ్ మేళాలు ఏర్పాటుచేసి తమ సంస్థలలో చదివిన విద్యార్థులకు ఉద్యోగాకాశాలు కల్పించానన్నారు. సత్తెనపల్లి పరిధిలోని కంటెపూడి వద్ద స్థాపించిన విద్యా సంస్థ అనతికాలంలోనే ఉత్తమ విద్యా సంస్థగా రూపుదిద్దుకుందన్నారు. జిల్లాలోనే మా విద్యాసంస్థ ఇంజనీరింగ్ విద్యలో ముందుండే విధంగా అధ్యాపకులు అంకిత భావంతో పనిచేసి మంచి గుర్తింపు తీసుకువచ్చారన్నారు.

నేడు జిల్లాలో నలంద విద్యాసంస్థల్లో చేరాలని ప్రతివిద్యార్థి అనుకునేవిధంగా విద్యాసంస్థ పురోభివృద్ధి సాధించిందన్నారు. రానున్న రోజుల్లో విద్యాసంస్థను మరింత అభివృద్ధి చేసే విధంగా ప్రణాళికాలు సిద్ధం చేస్తున్నామన్నారు. ఈ విద్యాసంస్థలో ప్రస్తుతం మూడు వేల మంది విద్యార్థిని, విద్యార్థులు ఇంజనీరింగ్, ఎం.సి.ఏ, ఎం.బి.ఏ, బి.ఇ.డి, బి.ఫార్మసి తదితర కోర్సుల్లో ఉన్నత విద్యను అభ్యసిస్తున్నారన్నారు.





















జిల్లా సంగతులు

1832 సంవత్సరంలో గుంటూరు జిల్లా భయంకరమైన కరవుకాటకాలకు గురైంది. ఆకలిచావులు సంభవించాయి.





# సేవాతత్పరుడు పొత్తూరి

నజిబుల్లా జిలాని, మేజర్‌న్యూస్, క్రోసూరు

'అగాధవు జలపాతంలో ఆణిముత్యం ఉన్నట్లే'-గుంటూరు జిల్లాలో క్రోసూరు మండలంలో మారుమూల ఓ కుగ్రామం గుడిపాడు. 1960వ దశకంలో పొత్తూరి వంశాన అంకురించిన రామకృష్ణారావు ఎన్నో బాలారిష్టాలను ఎదుర్కొని గ్రామంలో ఉపసర్పంచ్‌గా, తన రాజకీయ ప్రస్థానం ప్రారంభించారు. కాంగ్రెస్ పార్టీలో 25 సంవత్సరాలుగా కార్యకర్తగా, నేతగా, సీనియర్ నాయకులుగా క్రమక్రమంగా ఎదుగుతూ వచ్చారు. చెప్పింది చేయడం వీరికృషికి నిదర్శనం. పార్టీనందు క్రమశిక్షణ కలిగిన నమ్మకమైన కార్యకర్తగా పేరుతెచ్చుకున్నారు. పొత్తూరి రామకృష్ణారావుకు పార్టీ పదవి ఏది ఇచ్చినా దానికి న్యాయం చేస్తారన్న నమ్మకం కాంగ్రెస్ సీనియర్ నేతల్లో గల్లీనుండి ఢిల్లీ వరకు ఏర్పడింది.



పొత్తూరి రామకృష్ణ
గుడిపాడు

ఎస్సీలు, ఎస్టీలు, బిసిలు ఎవరైనా సరే, బాధల్లో ఉండి రామకృష్ణారావుని కలిస్తే వాళ్ల బాధల్ని ఆయన విని స్పందించి వారి సమస్యల్ని పరిష్కరించనిదే నిద్రపోరు. అన్నదానం చేయడంలో వీరికి ఎంతో ఇష్టం. రోజూ ఎందరో అన్నార్తులకు అన్నదానం చేయడం వీరికి ఎంతో ఇష్టం. వృద్ధులకు, బీదలకు, దుస్తుల పంపిణీ చేస్తుంటారు. గుడిపాడులో స్కూల్ పిల్లలకు ప్రతి సంవత్సరం యూనిఫాం దుస్తులు పంపిణీ చేస్తుంటారు. గుడిపాడు గ్రామానికి రహదారులు వేయించడంలో వీరి కృషి ఎంతో ఉంది. క్రోసూరు, ఫిరంగిపురం మండలంలోని వివిధ గ్రామాల్లోని ప్రజలు వీరికి బ్రహ్మరథం పడతారు.

అనేక సార్లు ఆయా గ్రామస్తులు సన్మానాలు చేశారు. వీరి మంచితనం వలన వీరి సహాయకార్యక్రమాలు, క్రమశిక్షణ గల రాజకీయ శైలివలన కాంగ్రెస్ పార్టీలో వీరు గ్రామ ఉపసర్పంచ్ పదవి నుండి గుంటూరు రేంజ్ హోంగార్డ్స్ వరకు అక్కడ నుంచి స్టేట్ హోంగార్డ్స్ దాకా పదవిని అలంకరించారు గుడిపాడు ఉపసర్పంచ్‌గా, గుంటూరు జిల్లా డిసిసి మెంబర్‌గా, క్రమశిక్షణ కలిగిన కాంగ్రెస్ కార్యకర్తగా, ఐ.ఎన్.టి.యు.సి ఎ.పి జనరల్ సెక్రటరిగా, మంచి సోషల్ వర్కర్‌గా, గుంటూరు జిల్లా బిసిసి కమిటి మెంబర్‌గా, పిసిసి సెల్ స్టేట్ కన్వీనర్‌గా, ఎస్సీసెల్ కన్వీనర్‌గా, రాహుల్ యూత్ బ్రిగేడ్ ఎ.పికు ప్రెసిడెంట్‌గా, వైఎస్ ఆర్ యువసేన గుంటూరు జిల్లా అధ్యక్షులుగా వివిధ హోదాల్లో ఉండటంలో ఆయనకు ఆయనే సాటి. ఒకేఒక వ్యక్తి పట్టుదల- దీక్షతో ఆయనకు ఈ పదవులు తోడువచ్చాయి. ప్రజాసేవలో ఆయన చేస్తున్న కృషిని గుర్తించి గుడిపాడు గ్రామ ప్రజలు వీరి సతీమణిని ఎంపిటిసిగా ఎన్నుకున్నారు. రామకృష్ణారావు పార్టీకి, ప్రజలకు ఎల్లప్పుడు అందుబాటులో ఉండి మరింతగా రాణించాలని ప్రజలు ఆకాంక్షిస్తున్నారు.

జిల్లా సంగతులు

1788 – 1794 మధ్య కాలంలో గుంటూరు జిల్లా మచిలీపట్నం నుంచి కంపెనీ సలహా సంఘం పాలనలో ఉండేది.

**జిల్లా సంగతులు**

క్రీ.శ. 1325లో అద్దంకి రాజధానిగా ప్రోలయవేమారెడ్డి స్వాతంత్ర్య హిందూ రాజ్యాన్ని స్థాపించి ముస్లింల పాలనను అడ్డుకున్నారు.

# కనుమరుగవుతున్న.. చరిత్ర చిహ్నాలు

సిహెచ్ చంద్రశేఖరరావు,
మేజర్‌న్యూస్-కారంపూడి

అనుపమాన శౌర్యం , అసమాన పరాక్రమం , ధర్మనిష్ట , సత్పరిపాలన , తేజస్సుకు పెట్టింది పేరు పల్నాటి గడ్డ. కులమతాలతో పని లేదు..పౌరుషానికే ప్రాధాన్యత..ఆ చంద్రతారార్కకమైన యశస్సు గల మహనీయుల పద ఘట్టనలతో పునీతమైన చరిత్ర చిహ్నాలు నేడు శిథిలావస్థకు చేరాయి. నాడు రాజ్యాధికారం కోసం పౌరుషాలకు పోతే..నేడు వ్యక్తిగత కక్షలు పల్నాడును రావణ కాష్టంలా మారుస్తున్నాయి. పల్నాడు యుద్ధం ముగిసి దాదాపు 800 ఏళ్లు గడి చింది. చారిత్రక ప్రాధా న్యం సంతరించుకున్న ఆనాటి తీపి గుర్తులు పల్నాటి ప్రజల నిర్లక్ష్యం, అధికారుల ఉదాసీనతతో కాలగర్భంలో కలసి పోతున్నాయి. శిథిలమవుతున్న ఈ చరిత్ర గుర్తులను కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రతి ఒక్కరిపై ఉంది.

చాపకూటి సిద్ధాంతంతో సమతను చాటిన నేల ఇది. సామరస్యం కోసం సర్వస్వం త్యాగం చేసిన చరిత్ర ఈ గడ్డది. ధర్మ రక్షణ కోసం జరిపిన పోరాటం చరిత్ర గతిలో చెరగని ముద్ర వేసింది. ధర్మ విజయం కోసం బ్రహ్మనాయుని ఆరాటం, బాలచంద్రుడి వీరోజిత పోరాటం , మగువ మాంచాల త్యాగ నిరతి ఇలాంటివన్నీ నాటి సామాజిక సంక్షేమం కోసం మాత్రమే జరిగాయి. కానీ స్వార్థం కోసం కాదన్న సత్యం పల్నాడులో విస్తృతంగా ప్రచారం జరగాల్సివుంది. పౌరుషానికి ప్రతీకగా మాత్రమే పల్నాడును ప్రచారం చేసుకుంటూ పగలు , సెగలతో సాధారణ జీవితాలకు దూరంగా మెలుగుతున్నారు పల్నాడు ప్రాంత వాసులు. దేశ చరిత్రలో సమున్నత స్థానం సంపాదించిన ఈ ప్రాంతం ప్రస్తుతం ఫ్యాక్షనిజం ముద్రలో పోలీసుల ఫైళ్లలోకి ఎక్కింది. పల్నాడు చరిత్రలోని దాయాదుల పోరునే ఎవరికి వారు ఆదర్శంగా తీసుకున్నారే కాని శిథిలమవుతున్న ఆనాటి తమ ప్రాంత చరిత్ర గుర్తులను కాపాడుకోలేక పోతున్నారు. పల్నాడు ప్రాంతంలో అత్యంత కీలక ప్రాంతాలైన కారంపూడి, మాచర్ల , గురజాల , దాచేపల్లి ప్రాంతాల పరిధిలోని పలు గ్రామాల్లో ఆనాటి చరిత్ర చిహ్నాలుగా పలు కట్టడాలు నేడు ఎక్కడ చూసిన కనిపిస్తుంటాయి. పల్నాటి యుద్ధంలో ప్రధాన పాత్ర వహించిన బ్రహ్మనాయుడు , నాయకురాలు నాగమ్మ, బాలచంద్రుడు, మగువ మాంచాల లాంటి ఎందరో చరిత్ర మూర్తులు సంచరించిన ప్రాంతాలు ఇక్కడున్నాయి. వారు కట్టించిన కట్టడాలు, శిలాశాసనాలు, ఆలయాలు నేడు శిథిలావస్థకు చేరుకుంటున్నాయి. ఆనాటి చరిత్రకు నిదర్శనంగా నిలిచిన గుర్తులన్నీ చెల్లాచెదురవుతున్నాయి. వందల సంవత్సరాల నాటి కట్టడాలు ఆనాడు యాత్రీకుల కోసం నిర్మించిన కట్టడాలు పడిపోవడానికి సిద్ధంగా వున్నాయి. దీంతో యాత్రీకులు బహిరంగ ప్రదేశాలలో వంటవార్పులు చేసుకొని చెట్ల నీడన వుంటున్నారు. వీర్ల సేవాస్థలంలో ఉన్న శిలాఫలకాలు నేడు నేలకొరుగుతున్నాయి. మండపాలు శిథిలావస్థకు చేరుకున్నాయి. వీర్ల దేవాలయం పక్కనే పారుతున్న పవిత్ర గంగధారిమడుగు నేడు ఆలనా పాలనా లేక కలుషితమైంది. గ్రామంలో ఉన్న చరిత్ర కట్టడాలయిన బ్రహ్మనాయుని మేడ, కోటబురుజు, కన్నమదాసుమేడ , నేడు శిథిలావస్థకు చేరి చరిత్రను వెక్కిరిస్తున్నాయి. ఇప్పటికైనా చరిత్ర చిహ్నాలను పట్టించుకోకపోతే కనుమరుగయ్యే ప్రమాదం వుంది.



శిథిలావస్థకు చేరిన బ్రహ్మనాయుడి నామతీర్థ మండపం



శిథిలావస్థకు వీర్ల దేవాలయం ముఖ మండపం




బోర్డుకే పరిమితమైన పర్యాటక శాఖ

శిథిలావస్థకు చేరిన యాత్రికుల వసతి గృహాలు

**జిల్లా సంగతులు**

క్రీస్తుశకం 1323లో ఢిల్లీ సుల్తాన్‌లు కాకతీయ రాజ్యాన్ని ఆక్రమించడంతో ముస్లింల పాలనలో గుంటూరు జిల్లా వెళ్ళింది.


ఉగాది శుభాకాంక్షలు
ప్రగతిపథంలో మాచర్ల పురపాలక సంఘం, గుంటూరుజిల్లా.
శ్రీడా॥ వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రి
శ్రీ పిన్నెల్లి లక్ష్మారెడ్డి ఎమ్మెల్యే
ఎం. రాజమోహనరెడ్డి ఎం.పి
శ్రీ బత్తుల ఏడుకొండలు చైర్‌పర్సన్
శ్రీ పాలిశెట్టి శ్రీనివాసరావు వైస్ చైర్మన్
శ్రీ బి. అజయ్‌కిషోర్ ఎం.ఏ. కమీషనర్
మాచర్ల పురపాలక సంఘంలో వివిధ గ్రాంట్లు క్రింద చేపట్టే అభివృద్ధి పనులు
1. యు.డి.ఐ., ఎస్.ఎస్.యం.టి. క్రింద పట్టణంలో శాశ్వత మంచినీటి సమస్య పరిష్కారానికి 16కోట్ల వ్యయంతో బుగ్గవాగు రిజర్వాయర్ నుండి మాచర్ల వరకు మంచినీటి సరఫరా పైపులైన్ నిర్మించుట
2. ఐ.హెచ్.ఎస్.జి.పి. పథకం క్రింద 15 కోట్లతో పట్టణంలోని 16 మురికి వాడలను అభివృద్ధి చేయుట
3. ప్రత్యేక గ్రాంటు క్రింద 80 లక్షల వ్యయంతో బొంబాయి కంపెనీ బ్రిడ్జి సాగర్ కుడికాలువ నుండి మున్సిపాలిటీ రిజర్వాయర్ వరకు నీటి సరఫరా పైప్‌లైన్ నిర్మించుట.
4. 80లక్షలు వరదగ్రాంటుతో ఆయా వార్డుల్లో సిమెంట్‌రోడ్లు మురుగు కాలువలు నిర్మాణం చేపట్టడం జరుగుతుంది.
మున్సిపల్ పాలకవర్గం
గనిపల్లి కృష్ణారావు 1వవార్డు కౌన్సిలరు
ఆవుల జనార్ధనరెడ్డి 2వవార్డు కౌన్సిలరు
ఆవుల వెంకట నారాయణ 3వవార్డు కౌన్సిలరు
మద్దిగపూచిన వెంకట్రామిరెడ్డి 4వవార్డు కౌన్సిలరు
పి.వి. సుబ్బయ్య 5వవార్డు కౌన్సిలరు
కొండూరు లెనిన్‌బాబు 6వవార్డు కౌన్సిలరు
బండ్ల ఉదయలక్ష్మి 7వవార్డు కౌన్సిలరు
కె. కాశీనాయక్ 8వవార్డు కౌన్సిలరు
కొప్పుల కృపమ్మ 9వవార్డు కౌన్సిలరు
ఇర్ల అంజమ్మ 11వవార్డు కౌన్సిలరు
గొర్రె మస్తానమ్మ 12వవార్డు కౌన్సిలరు
తుమ్మేనల్లి ఉమాసరిత 13వవార్డు కౌన్సిలరు
గోపవరపు పద్మావతి 14వవార్డు కౌన్సిలరు
కొత్తమాసు అప్పమ్మ 15వవార్డు కౌన్సిలరు
మాచర్ల సుందర లీల 16వవార్డు కౌన్సిలరు
అచ్చా సాంబ శివరావు 17వవార్డు కౌన్సిలరు
మాచర్ల జ్యోతి 18వవార్డు కౌన్సిలరు
మారం చిన రమణారావు
వేముల వెంకట కళ్యాణి 20వవార్డు కౌన్సిలరు
కొమ్మనబోయిన కోటయ్య 21వవార్డు కౌన్సిలరు
జక్కుల కిష్టయ్య 22వవార్డు కౌన్సిలరు
షేక్ రషీదు 23వవార్డు కౌన్సిలరు
షేక్ సమీమున్నీషా 24వవార్డు కౌన్సిలరు
షేక్ కరిముల్లా 25వవార్డు కౌన్సిలరు
పఠాన్ కరీమాన్ 26వవార్డు కౌన్సిలరు
షేక్ ఖాసింబీ 27వవార్డు కౌన్సిలరు
కోట ప్రసాదు 28వవార్డు కౌన్సిలరు
అల్లి జీవన్ కో-ఆప్షన్ సభ్యులు
వడ్డెంగుంట వెంకట నారాయణ కో-కౌన్సిలరుఆప్షన్ సభ్యులు
షేక్ గౌస్‌బీ కో-కౌన్సిలరుఆప్షన్ సభ్యులు

# అనాథలను చేరదీస్తున్న కేర్‌మినిస్ట్రీస్

సుభాని, మేజర్‌న్యూస్, కర్లపాలెం

ఆదరువులేని అనాథ పిల్లలను అక్కున చేర్చుకొని పోషించి ప్రయోజకుల్ని చేయడమే లక్ష్యంగా కర్లపాలెంలోని కేర్ మినిస్ట్రీస్ సంస్థ ముందడుగు వేస్తోంది. ఉన్నత విద్యనభ్యసించి నిరుద్యోగంగా ఉన్న మోపరిజాన్‌కు ఉద్యోగం కన్నా ప్రజా సేవ మిన్న అన్న ఆలోచన మనసులో మెదిలింది. దీంతో 1999లో అనాథపిల్లలను ఆదుకోవాలన్న ఉద్దేశ్యంతో దాతల సహకారంతో మండల కేంద్రం కర్లపాలెం పంచాయితీ రాజీవ్‌నగర్ కాలనీలో అనాదపిల్లల ఆశ్రమాన్ని నెలకొల్పారు. మెలమెల్లగా వసతిగృహాలు, బాలబాలికలకు వేర్వేరుగా నిర్మించారు. ప్రస్తుతం 40మంది పిల్లలు ఆశ్రమంలో లబ్ది పొందుతున్నారు. ఈ పిల్లలకు సర్వంతానై పాలనా పోషణ చేస్తున్నారు. అంతేకాకుండా వృద్ధమహిళలు, వితంతువులకు ఆర్థిక సహాయం చేస్తున్నారు. పేదల గృహనిర్మాణానికి ఆర్థిక సహాయం, అగ్ని ప్రమాద బాధితులకు, తుఫాను, వరదబాధితుల, గ్రామీణ మహిళలకు, హెచ్ఐవి బాధితులకు సహాయకార్యక్రమాలు, యువజనులకు అవగాహన సదస్సులు చేస్తున్నారు. భవిష్యత్తులో కంప్యూటర్ ఎడ్యుకేషన్, కుట్టుశిక్షణ, వినియోగదారులకు అవగాహన సదస్సులు ఏర్పాటు చేయడం వంటి తదితర సేవలు విస్తృతం చేయనున్నట్లు సంస్థ అధినేత మోపర్తి జాన్ 'మేజర్‌న్యూస్'కు వివరించారు.



అనాథలను అక్కున చేర్చుకున్న కేర్‌మినిస్ట్రీస్ అధినేత మోపర్తి జాన్



పేదలకు బియ్యం పంపిణీ చేస్తున్న కేర్‌మినిస్ట్రీస్ సంస్థ యాజమాన్యం

# అభివృద్ధి దిశగా పయనిస్తున్న గంటా సరస్వతి

బుర్ల శ్రీనివాసరావు, మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

జనాభాలో సగభాగం ఉన్న మహిళలు రాజకీయ చైతన్యం వైపు పరుగులు పెడుతున్నారు. సమాజంలో గుర్తింపు కోసం పరితపిస్తున్నారు. సామాజిక న్యాయం కోసం పోరాడుతున్నారు. ఎన్నో అవాంతరాలు, ఒడిదుడుకులు అధిగమించి అభివృద్ధిలో భాగస్వాములౌతున్నారు. ప్రభుత్వ సంక్షేమ ఫలాలను అందరికీ అందించేందుకు అహర్నిశలు శ్రమిస్తున్నారు. గాంధీజీ కలలుకన్న దేశాభ్యుదయంలో కీలకపాత్ర పోషిస్తున్నారు. నిత్యం...అనునిత్యం ప్రజా అవసరాలు తెలుసుకుని పరిష్కారానికి తనవంతు కృషి చేస్తూ పలువురి మన్ననలను అందుకుంటున్నారు సత్తెనపల్లి మున్సిపల్ చైర్‌పర్సన్ గంటా సరస్వతి. బడుగు, బలహీన వర్గాల ఆశాజ్యోతిగా పేదవర్గాలకు అభివృద్ధి పథంలోకి తీసుకురావడానికి ప్రణాళికబద్ధంగా ముందుకు పోతున్నారు. అనుకున్న లక్ష్యాన్ని సాధించే ప్రయత్నంలో నిరంతరం ప్రజలతో మమేకమవుతున్నారు. మహిళలు వంటింటికే పరిమితం కారు...సమస్యల పరిష్కారానికి మేముసైతం ముందడుగులో ఉన్నామంటూ గంటా సరస్వతి ప్రజాసేవలో పునీతులౌతున్నారు. వివాదాలకు దూరంగా అన్ని సామాజిక వర్గాలను కలుపుకుంటూ సత్తెనపల్లి మున్సిపాలిటీని దినదినాభివృద్ధి వైపు నడిపిస్తూ అన్ని వర్గాల ప్రజల ఆదరాభిమానాలు పొందుతున్నారు. మున్సిపల్ సమావేశాల్లో ప్రతిపక్ష పార్టీల కౌన్సిలర్లను దాటిగా ఎదుర్కొంటూ అన్ని వార్డుల అభివృద్ధి కోసం సమన్వయాన్ని పాటిస్తూ మున్సిపాలిటీ అభివృద్ధికి పాటుపడుతున్నారు. స్థానిక ఎమ్మెల్యే యర్రం వెంకటేశ్వరరెడ్డి సహకారంతో కోట్లాది రూపాయలు నిధులు తీసుకువచ్చి మున్సిపాలిటీ అన్ని రంగాల్లో అభివృద్ధి సాధించేవిధంగా కృషి చేస్తున్నారు. నవసమాజ స్థాపనలో తనవంతు పాత్ర పోషిస్తున్న ఆమె నేటి సమాజంలో ఓ ఆణిముత్యం.




సభలో మాట్లాడుతున్న చైర్‌పర్సన్ గంటా, మున్సిపల్ సమావేశాన్ని నిర్వహిస్తున్న చైర్‌పర్సన్ గంటా

### సమిష్టి కృషివల్లే సాధ్యమైంది: గంటా సరస్వతి

సమిష్టి కృషితో మున్సిపాలిటీ అభివృద్ధికి తమ వంతు కృషి చేస్తున్నామని, సరస్వతి వివరించారు. ఎమ్మెల్యే యర్రం వెంకటేశ్వరరెడ్డి కృషి తో రూ. 15 కోట్లు నిధులు మంజూరయ్యాయన్నారు. రానున్న రెండేళ్లలో పట్టణంలోని అన్ని వార్డులకు రక్షిత మంచినీటిని అందించే దిశగా కృషి చేస్తున్నామన్నారు.

# చెడుపై మోగిన రణభేరి

కె.అనిల్‌కుమార్, స్టాఫ్ రిపోర్టర్, గుంటూరు.

కోస్తా ప్రాంతానికే తలమానికంగా నిలిచిన ఎ.సి.కళాశాల ఒక అద్భుత సృష్టి. సువిశాలమైన ప్రాంగణం.. విశాలమైన గదులు.. కేవలల విద్యార్థుల చందాలతోనే నిర్మించిన అలనాటి మధుర స్మృతులను ఇప్పటికీ మోస్తూ సగర్వంగా నిలిచిందీ గుంటూరు నగరంలోని ఆంధ్ర క్రైస్తవ కళాశాల గత వైభవానికీ, ప్రాభవానికీ చెక్కుచెదరని మేరునగధీరత్వం కళాశాలది.

## చెడుపై చక్రవర్తి చేసిన పోరాటం..

ఎ.సి. కళాశాలలోకి ప్రవేశించడంతోనే ఒక అద్భుత శిల్పం కనిపిస్తుంది. 123 ఏళ్ల నాటి ఈ శిల్పం నేటికీ చెక్కు చెదరకుండా నిలిచింది. ఆధ్యాత్మికతను, బాధ్యతలను, మంచితనం పరమార్థాలను అంతరంగంలో రంగరించుకున్న అద్భుత శిల్పమిది.. దీనిపరమార్థమిదే.

కళాశాలలోకి అడుగు పెట్టడంతోనే ఎదురుగా దర్శనమిస్తున్న శిల్పం మంగుళూరులో రీ ఇన్‌ఫోర్స్‌డ్ కాంక్రీట్‌తో నిర్మితమైంది. ఇక్కడ అశ్వంపై కూర్చుని బల్లెంతో యుద్ధం చేస్తున్న యోధుడు 'సెయింట్ జార్జ్' చక్రవర్తి. ఆ అశ్వం కింద కోరలు చాచి బుసలు కొడుతున్న జంతువు 'డ్రాగన్'. డ్రాగన్‌ను హతమార్చే ప్రయత్నమే ఈ శిల్ప సౌందర్యానికి ఆకర్షణను చేకూర్చింది. 'జార్జ్' ఇంగ్లండ్ దేశపు 'పాట్రన్‌సెయింట్' అయన సత్యానికీ, నీతికి ప్రతీక కాగా డ్రాగన్ అసత్యానికి, అవినీతికి చిహ్నం. చెడుపై మంచి చేసిన పోరాటం, అవినీతి, అసత్యం క్రమంగా కూలిపోతున్న దృశ్యమే ఈ డ్రాగన్, సెయింట్ జార్జ్‌ల శిల్పం. శిల్పాన్ని మరపురాని మధుర ఘట్టంగా మలిచిన సౌందర్యా రాధకులు నాటి ప్రముఖ ఆంగ్ల విద్యావేత్త, ఎ.సి.కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ ఎం.జీ. థామస్. శిల్పాన్ని ప్రతిష్టించి, దానికి సొబగులు అద్దింది కాంట్రాక్టర్ పసుపులేటి కోటయ్య. తుది మెరుగులు దిద్దిన ఘనత దివంగత గురిందపల్లి భాస్కర్ ఐజక్‌లకే చెందుతుంది. అజరామరమైన ఈ శిల్పం కళాశాలలో విద్యను అభ్యసించిన ప్రతిఒక్కరికీ మరిచిపోలేని మధుర స్మృతి. ఎవరికైనా కళా శాల జ్ఞప్తికి వచ్చిందంటే దాంతోపాటు ఈ అద్భుత శిల్పాన్నీ మనో వీధిలో ఊహించుకోవాల్సిందే.



డ్రాగన్, జార్జ్‌ల అద్భుత శిల్పం

# అక్కడ మహాత్ముడే ప్రత్యక్ష దైవం

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్ రిపోర్టర్, తెనాలి.



ఆశ్రమంకు విచ్చేసిన సందర్భంగా కలెక్టర్ జయలక్ష్మికి జ్ఞాపికను అందజేస్తున్న రామలింగాచారి,



రామలింగాచారిని సత్కరిస్తున్న స్పీకర్ సురేష్‌రెడ్డి

**సృష్టిలో ప్రతి జీవి సమానమే. అందుకే జీవహింస చేయరాదు. దేనికైనా అహింస విధానమే ఆయుధం కావాలి. ఏ మతం చెప్పినా, దేవుడు చెప్పినా ఇవే మాటలు. దీన్ని ఆచరణలో చూపి కరంచంద్ గాంధీ మహాత్ముడయ్యాడు.**

గాంధీయే ప్రత్యక్ష దైవంగా పూజలు నిర్వహించడం, గాంధేయ మార్గాన్ని బోధించడం, వృద్ధులకు సేవ చేయడం వంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాడు ఓ పెద్దాయన. అలా అని ఆయన సంపన్న కుటుంబం నుంచి వచ్చిన వ్యక్తి కాదు. సాధారణ దస్తావేజు లేఖరి. తెనాలిలోని మహాత్మగాంధీ శాంతిసేవాశ్రమంలో అడుగుపెడితే గాంధీ సహస్రనామావళి వినిపిస్తుంది. అయినవారు లేక, ఉండి ఆదరించక అనాథలుగా మారిన వృద్ధులు ఇక్కడ ఆశ్రయం పొందుతూ కనిపిస్తారు. వారందరికీ వసతి, భోజనం, వైద్యం అన్ని ఉచితంగా కల్పిస్తారు రామలింగాచారి. 1996 సంవత్సరంలో యూనివర్సల్ హ్యూమానిటీ ఎఫినిటీ కల్చరల్ అసోసియేషన్ స్థాపించారు. సాంస్కృతిక కార్యక్రమాలు చేపట్టినా తృప్తి చెందలేదు. మహాత్ముని సత్యం, అహింసను ప్రచారం చేయాలని భావించి శ్రీమహాత్మగాంధీ శాంతి పీఠం స్థాపించారు. అప్పటి నుంచి గాంధీని ప్రత్యక్ష దైవంగా భావించి ఆయన విగ్రహానికి నిత్య ధూపదీపనైవేద్యాలతో కూడిన అర్చన చేసున్నారు. పదో తరగతి చదివే రోజుల్లో వేసిన గాంధీ వేషం తనకు ఆయన పట్ల భక్తి ప్రపత్తులు కలిగించాయని చెప్పే ఆయన కనిపించని దేవుడి కన్నా ప్రత్యక్షంగా ప్రజలకు సేవచేసిన మహాత్ముడే తన ఆరాధ్య దైవమని చెప్తున్నాడు రామ లింగాచారి. అన్నట్లు ప్రతిరోజు చరఖా వాడకం, వత్తులు విక్రయించడం చేస్తూంటారు.

















స్వర్గీయ ఎన్.టి.ఆర్



నారా చంద్రబాబునాయుడు
రాష్ట్ర టి.డి.పి అధ్యక్షులు



శ్రీ చల్లగుండ్ల రామమూర్తి గారు
సీనియర్ నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ నాయకులు



రాష్ట్ర గవర్నర్ గారితో చల్లగుండ్ల శ్రీనివాస్ గారు



# మెగా స్ఫూర్తితో యువసేన ముందడుగు



ఆర్.వి. కిరణ్‌కుమార్, రిపోర్టర్, తెనాలి కల్చరల్

సేవాతత్పరతకు పెట్టింది పేరుగా పిలిచే మదర్‌థెరిస్సా సేవాదృక్పథాన్ని ఆదర్శంగా తీసుకుని ప్రముఖ సినీనటుడు డాక్టర్ చిరంజీవి చేస్తున్న సమాజసేవ కార్యక్రమాలకు ఆకర్షితులై తమవంతుగా పేదలకు సహకారాన్ని అందిస్తున్న తెనాలి పట్టణ చిరంజీవి యువసేన చేస్తున్న సేవా కార్యక్రమాలు పలువురికి ఆదర్శంగా నిలుస్తున్నాయి. సుమారు 15 సంవత్సరాల క్రితం స్థాపించిన పట్టణ చిరంజీవి యువసేన ఆనాటి నుండి చిరంజీవి అడుగు జాడల్లో నడుస్తూ ముందుకు వెళ్తోంది. పేదలకు అన్నదానం, వస్త్రదానం, వితరణలు చేస్తూ ఆపన్నులకు మేమున్నామంటూ అండగా నిలుస్తున్నారు. తెనాలి పరిసర ప్రాంతాల్లో చిరంజీవి ఐబ్యాంక్ ద్వారా నేత్రదానం చేకూర్చడం, గ్రామీణ, పేద,



మహిళలకు వస్త్రదానం చేస్తున్న యువసేన సభ్యులు

స్తోమత లేని విద్యార్థులకు తమవంతు ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నారు. రక్తదాన కార్యక్రమాల్లో ఉత్సాహంగా పాల్గొనడమే కాకుండా రక్తదానంపై ప్రతి ఒక్కరికి అవగాహన కల్పించి ఆపదలో ఉన్నవారికి రక్తాన్ని అందించి ప్రాణాలు కాపాడడం వంటి సేవా కార్యక్రమాలు విజయవంతంగా నిర్వహిస్తున్నారు. చిరంజీవి అభిమానులకు వన్నెతెస్తూ నేటి యువతకు ఆదర్శప్రాయంగా నిలుస్తున్నారు. మెగాస్టార్‌కు దేశవ్యాప్తంగా ఉన్న కోట్లాది అభిమానుల్లో తమకంటూ ఒక ప్రత్యేకతను చాటుకున్నారు. అభిమానుల్లో నూతన .....

(మిగతాది 33వ పేజీలో)

# మెగా స్ఫూర్తితో యువసేన ముందడుగు

(32వ పేజీ తరువాయి)



చదలవాడ వేణుమాధవ్,

ఒరవడిని, ఉత్సాహాన్ని నింపి నేటి యువతను సేవా కార్యక్రమాల వైపు మళ్లి స్తున్న చిరంజీవి ఆశయాల సాధనలో అలు పెరగని కార్యకర్తగా పట్టణ చిరంజీవి యువసేన అధ్యక్షులుగా చదలవాడ వేణు మాధవ్, కార్యదర్శిగా నరహరిశెట్టి సురే ష్‌లు ఎన్నో సేవా కార్యక్రమాలను చేపట్టి పలువురిచే ఎన్నో ప్రశంసలు అం దుకుం టున్నారు. చిరంజీవి ఆశయాలకు అను గుణంగా నిలుస్తున్న రక్తదాన శిబిరాలను ఏర్పాటుచేసి ఆపదలో ఉన్నవారికి రక్తం అందించి ప్రాణదానం చేస్తున్నారు. యువసేన ఆధ్వర్యంలో బీదలకు అన్నదానం, వస్త్రదాన కార్యక్రమాలను చేపట్టి తమ ఉదారతను చాటుకుంటున్నారు. రక్తదానంపై ప్రజలకు అవగాహన కల్పిం చేందుకు తెనాలి పరిసర ప్రాంతాల్లో సదస్సులు నిర్వహించి రక్తదానం మరొ కరికి ప్రాణ దానం అనే నినాదంతో అందర్నీ చైతన్య వంతుల్ని చేస్తున్నారు.



నరహరిశెట్టి సురేష్

చిరంజీవి జన్మ దినాన్ని పురస్కరించుకుని ప్రతి సంవత్స రం ఆగస్టు 22న సభ్యులు, అభిమానులు రక్త దానం చేసి పేదలకు అన్నదానం నిర్వహిస్తున్నారు. శాంతికి చిహ్నంగా పిలవబడే మహాత్మగాంధీ, మదర్ థెరిస్సాల జన్మదినాన్ని పురస్కరించుకుని వైద్యశాలలోని రోగులకు ఉచితంగా పండ్లు, దుప్పట్లు పంపిణీ, పలు ఆశ్రమాలకు వితరణలు అందజేస్తున్నారు.

## అన్నయ్య అడుగుజాడల్లో....

మెగాస్టార్ చిరంజీవి అడుగుజాడల్లోనే ఎల్లప్పుడు పయనిస్తామంటూ చిరంజీవి యువసేన అధ్యక్షులు చదలవాడ వేణుమాధవ్ మేజర్‌న్యూస్‌తో వెల్ల డించారు. యువసేన స్థాపించిన నాటి నుండి అన్నయ్య ఆశయాలకు అను గుణంగా సేవా కార్యక్రమాలు చేపడుతున్నామన్నారు. ఆయన సినీరంగంలో ఉన్నా, రాజకీయరంగంలో ఉన్నా ఆయన చేసే సేవా కార్యక్రమాల్లో పాలుపం చుకుంటామన్నారు. కార్యదర్శి సురేష్ మాట్లాడుతూ అన్నయ్య స్ఫూర్తితో చేస్తున్న సమాజ సేవా కార్యక్రమాలను రానున్న రోజుల్లో మరింత బలోపేతం చేయ నున్నట్లు తెలిపారు.





# మాచర్ల రూపురేఖలు మార్చిన ప్రభుత్వ పథకాలు

పి.పాపారావు, మేజర్‌న్యూస్, మాచర్ల టౌన్

వివిధ ప్రభుత్వ పథకాలతో పురపాలక సంఘంలో అనేక అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టినట్లు మున్సిపల్ ఛైర్‌పర్సన్ బత్తుల ఏడుకొండలు తెలిపారు. మేజర్ న్యూస్‌కి ఇచ్చిన ప్రత్యేక ఇంటర్వ్యూలో ఏడుకొండలు మాట్లాడుతూ శాసన సభ్యులు పిన్నెల్లి లక్ష్మారెడ్డి సహకారంతో కోట్లాది రూపాయలు హెచ్చించి రోడ్లు మంచినీటి సమస్యను పరిష్కరిస్తున్నట్లు చెప్పారు. రెండు సంవత్స రాల 6 నెలల తన పదవీ కాలంలో పురప్రజల మంచి నీటి అవసరాలను తీర్చే రిజర్వాయర్ చుట్టూ వరల్డ్ బ్యాంకు నిధులతో 45 లక్షల వ్యయంగల ప్రహరీ గోడ నిర్మించినట్లు చెప్పారు. సాగరు కుడి కాలువ నుంచి 1 కోటి విలువ గల నీటి సరఫరా పైపులైన్ పనులు యాదవుల బజారు నుంచి దళిత గిరిజన, బలహీన వర్గాల సంక్షేమ వసతిగృహాల మీదుగా సాగర్ రోడ్డు వరకు ఐ.డి.యస్.యం.టి పథకం క్రింద 42 లక్షల సిమెంట్ రోడ్డు నిర్మించటం జరిగిందన్నారు 30 లక్షలు కౌన్సిల్ హాలు, రూ.10 లక్షల వ్యయంతో డివైడర్లు నిర్మించామన్నారు. 16,17 వార్డులను కలిపే 5 లక్షల 45 వేలతో లెవల్ బ్రిడ్జి ఏర్పాటు చేసినట్లు చెప్పారు. 2007 జూన్ 27న చంద్ర వంక నది వరద కారణంగా పట్టణంలో రోడ్డు దెబ్బ తినటంతో అంచనాలు రూపొందించి ఎమ్మెల్యే పిన్నెల్లి లక్ష్మారెడ్డి ముఖ్యమంత్రి వె.ఎస్ రాజశేఖర్ రెడ్డికి అందజేశారు.



మున్సిపల్ ఛైర్మన్ బత్తుల

రోడ్డు, కాలువలు నిర్మాణానికి 81 లక్షల వరద గ్రాంటును ప్రభుత్వం విడుదల చేసిందన్నారు. గత ఏడాది సెప్టెంబరు 14వ తేదీన ఇందిరమ్మ పథకం ఫేజ్-2 క్రింద మండల పరిధిలోని కొత్తపల్లి గ్రామంలో గృహ నిర్మాణ పనులను భూమి పూజ చేసేందుకు వచ్చిన ముఖ్యమంత్రి వె.ఎస్. రాజశేఖర్ రెడ్డి దృష్టికి నిధుల విషయాన్ని తీసుకువెళ్ళగా పట్టణాభివృద్ధికి 1కోటి 30 లక్షలు హామీ ఇచ్చారని ఆ నిధులు త్వరలో మంజూరు కానున్నట్లు ఛైర్మన్ ఏడు కొండలు తెలిపారు. బుగ్గవాగు రిజర్వాయర్ నుండి మాచర్ల పట్టణానికి మంచినీటి సమస్య నివారణకు రూ.16 కోట్లు, మురికివాడల అభివృద్ధికి రూ.15 కోట్లు మంజూరు కానున్నట్లు తెలిపారు. ఇందిరమ్మ గృహ నిర్మాణ పథకం ఫేజ్-1 క్రింద 420 గహాలు, ఫేజ్-2 క్రింద 69 గృహాలు పూర్తికాగా 500 గృహాలు వివిధ దశల్లో ఉన్నట్లు పేర్కొన్నారు శాసన సభ్యులు పిన్నెల్లి లక్ష్మారెడ్డి నిధులతో ఒక్కొక్క బోరుకి రూ.45 వేలు చొప్పున కేటాయించి నీటి కొరత ఉన్న వార్డులో 20 బోర్లు ఏర్పాటు చేశామన్నారు.

నర్సరావుపేట పార్లమెంటు సభ్యులు మేకపాటి రాజమోహన్‌రెడ్డి గ్రాంటుతో పట్టణంలో ఆయా వర్గాల ప్రజలకు కమ్యూనిటి హాల్ నిర్మిస్తున్నట్లు ఛైర్మన్ ఏడుకొండలు చెప్పారు. మున్సిపల్ పాలకవర్గం, అధికారులు, సహకారంతో తన పదవీకాలంలో కోట్లాది రూపాయలు అభివృద్ధి పనులు చేపట్టం అదృష్టంగా భావిస్తున్నట్లు ఛైర్మన్ ఏడుకొండలు వెల్లడించారు.



























# ఉత్తమ విద్యా ఫలితాలు సాధిస్తున్న శ్రీ కృష్ణ చైతన్య విద్యాసంస్థలు

బుర్ల శ్రీనివాసరావు, మేజర్ న్యూస్ సత్తెనపల్లి

సత్శీలునికి సన్మానం...నిరాడంబరునికి నీరాజనం అన్న ఆర్యోక్తిని నిజం చేస్తూ పలువురికి శ్రీ కృష్ణచైతన్య విద్యాసంస్థల డైరెక్టర్ కొల్లిబ్రహ్మయ్య మార్గ దర్శకంగా నిలుస్తున్నారు. కొందరు ధనంకోసం పుట్టామనుకుంటారు. ధనార్జనే ధ్యేయంగా శ్రమిస్తారు. ధనం మినహా మరో ఆలోచన చేయరు. ఎంత సంపాదిం చిన సాటివారిని ఆదుకోవాలనే దయార్ద్రహృదయం కొందరికే ఉంటుంది. సమా జహితం కోరుతూ పలువురి మన్ననలను అందుకుంటున్నారు కొల్లి బ్రహ్మయ్య. అతి సామాన్య కుటుంబంలో పుట్టి అంచెలంచెలుగా ఎదిగి వినయవిధేయతలే ప్రామాణికంగా దైనందిన జీవితాన్ని గడుపుతూ సమాజంలో కొందరిలో ఒకడిగా కీర్తింపబడుతున్నారు. కేవలం సేవా దృక్పథంతో పేదవిద్యార్థులకు



డైరెక్టర్ కొల్లిబ్రహ్మయ్య

ఉత్తమ విద్యనందించాలన్న సంకల్పం తో నర్సరావుపేటలో శ్రీ కృష్ణ చైతన్య విద్యాసంస్థలు స్థాపించి నిత్యం.. అనునిత్యం విద్యాప్రమాణాల మెరు గుదలకు అహర్నిశలు శ్రమిస్తూ అగ్ర గామి విద్యాసంస్థగా పలువురి ప్రశం సలు అందుకునే విధంగా తీర్చిదిద్దా రు. నేడు నడుస్తున్న విద్యా వ్యవస్థకు భిన్నంగా గ్రామీణ ప్రాంత విద్యా ర్థులను ఉన్నతవిద్యను అభ్యసించే విధంగా ప్రణాళికలు రూపొందించి అభివృద్ధి పథంలో ముందుకు తీసుకు వెళ్తున్నారు. గత మూడేళ్ళుగా అసా ధారణ విద్యాఫలితాలు సాధిస్తూ అగ్ర గామి విద్యాసంస్థగా వెలుగొందు తోంది. నేటి పోటీ ప్రపంచంలో తమ విద్యా సంస్థల్లో చదివిన విద్యార్థులు ఎదైన సాధించాలి...ఎంతో ఎత్తుకు ఎదగాలి... అన్న లక్ష్యంతో ప్రతి ఏడాది ఒక ముందడుగు వేస్తూ 700 మంది విద్యార్థిని, విద్యార్థులతో కళా శాల పురోభివృద్ధిలో పయనిస్తుం ది.

ఈ సందర్భంగా శ్రీ కృష్ణ చైతన్య విద్యాసంస్థల డైరెక్టర్ కొల్లి బ్రహ్మయ్య మాట్లాడుతూ గ్రామీణ ప్రాంత విద్యా ర్థులు అన్ని రంగాల్లో ముందుం చాలనే లక్ష్యంతో ఈ విద్యాసంస్థలు స్థాపించానన్నారు. డబ్బే ప్రామాణి కంగాకాకుండా సేవాభావంతో ముం దుకు తీసుకువెళ్తున్నామన్నారు. ఈ ప్రాంత అభివృద్ధికి తనవంతు సేవ చేస్తానన్నారు. పేద విద్యార్థులకు వారి అభివృద్ధికి కృషి చేస్తానన్నారు. ప్రజాసేవ చేయాలనే తలంపుతో కొం త సమయం రాజకీయాలకు కేటాయి స్తున్నానన్నారు. మాజీముఖ్యమంత్రి నారాచంద్రబాబునాయుడు, డా.చదలవాడ అరవిందబాబు తనకు మార్గదర్శ కులన్నారు.

# కలియుగ వైకుంఠపురం

ఆర్.వి.కిరణ్‌కుమార్, రిపోర్టర్, తెనాలి కల్చరల్.

భక్తుల కోర్కెలు తీర్చే మహిమాన్విత క్షేత్రంగా, కలియుగ వైకుంఠంగా వైకుంఠపురం ప్రసిద్ధికెక్కింది. కళలకు కాణాచిగా, ఆధ్యాత్మికతకు మరో పేరుగా, ఆంధ్రాప్యారిస్‌గా ఖ్యాతిగాంచిన తెనాలి పట్టణంలో అంతర్భాగమైన వైకుంఠపురంలోని శ్రీలక్ష్మి పద్మావతి సమేతంగా శ్రీవెంకటేశ్వర స్వామి దేవస్థానం ప్రముఖ దివ్యక్షేత్రాలలో ఒకటిగా ప్రసిద్ధిచెందింది. శాంతికి, ప్రశాంతికి నిలయమైన వాతావరణంలో నిర్మితమైన ఆలయం భక్తుల పాలిట కొంగు బంగారంగా నిలుస్తోంది. నిత్య కళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లే కలియుగ దైవం శ్రీవెంకటేశ్వరుడు భక్తుల కోర్కెలు తీర్చే కల్పవృక్షంలా కొలువై ఉన్నాడు. శ్రీలక్ష్మి పద్మావతి సమేతంగా శ్రీనివాసుడు శోభయామానంగా విరాజిల్లుతున్నాడు.



శ్రీలక్ష్మి పద్మావతి సమేత శ్రీవెంకటేశ్వరస్వామి ఉత్సవమూర్తులు

### ఆలయ విశిష్టత

1958వ సంవత్సరంలో ఆలయ వ్యవస్థాపక ధర్మకర్త తుళ్ళూరు బాల నరసింహారావుగౌడ్‌కు స్వప్నంలో నాగేంద్రుని రూపంలో శ్రీవెంకటేశ్వరుడు కనిపించి ప్రస్తుతం వైకుంఠపురంగా పిలిచే ప్రాంగణంలో ఆలయ నిర్మాణం చేయమని ఆదేశించారు. స్వామి అజ్ఞాపనతో నరసింహారావుగౌడ్ 1960వ సంవత్సరంలో ఆలయ రూపకల్పనకు కార్యరూపం దాల్చి శ్రీవారి విగ్రహాలను తయారుచేయించారు. 1961వ సంవత్సరంలో ఆలయ నిర్మాణానికి శంకుస్థాపన చేసి పలువురు సంఘ సేవకులు, భక్తుల సహకారంతో ఆలయాన్ని నిర్మించారు. 1972వ సంవత్సరం స్వస్తిశ్రీ పరీధావీ సంవత్సరం, నిజ వైశాఖ బహుళ పంచమి శుక్రవారం శ్రీలక్ష్మి పద్మావతి సమేత శ్రీవెంక టేశ్వరస్వామి విగ్రహ ప్రతిష్టను శాస్త్రోక్తంగా, అత్యంత వైభవంగా నిర్వహించారు. ఆనాటి నుంచి ఈ క్షేత్రం దినదినాభివృద్ధి చెందుతూ భక్తుల పాలిట కొంగు బంగారంగా నిలుస్తోంది. 1974వ సంవత్సరంలో ఆలయాన్ని దేవాదాయ శాఖ ఆధీనంలోకి తీసుకుంది. వైఖానస ఆగమ ప్రకారం ఆలయంలో శ్రీవారికి వైదిక కార్యక్రమాలు జరుగుతున్నాయి.

### శ్రీవారికి జరుగు సేవలు :

★ శ్రీవారి నిత్యకళ్యాణోత్సవం, ప్రతి శనివారం ఉయ్యాల సేవ, శుక్రవారం అభిషేకం.

★ వైశాఖమాసంలో శ్రీవారి వార్షిక బ్రహ్మోత్సవాలు.

★ కార్తీక మాసం సామూహిక శ్రీరమా సహిత సత్యనారాయణస్వామి వ్రతాలు.

★ పుష్యమాసంలో ముక్కోటి ఏకాదశిన ఉత్తర ద్వార దర్శనం.

★ ముక్కోటి ఏకాదశి దశావతార ఉత్సవాలు.

★ సంక్రాంతి రోజున శ్రీవారి తెప్పోత్సవం.

★ ఉగాది రోజున విశేష అర్చన, పంచాగ శ్రావణం మొదలగు సేవలతో పాటు నిత్య ధూపదీప నైవేద్య కార్యక్రమాలు వైఖానస ఆగమశాస్త్రరీత్యా నిర్వహించబడుతున్నాయి.

### నిత్య అన్నదానం :

శ్రీనివాసుని దర్శనానికి వచ్చిన భక్తులకు తిరుమలలో మాదిరి నిత్య అన్నదాన కార్యక్రమాన్ని ఏర్పాటుచేయడం జరిగింది. సుమారు రూ. 40 లక్షల ఫిక్స్‌డ్

(మిగతా 37వ పేజీలో)

# కలియుగ వైకుంఠపురం



వైకుంఠపురం దేవస్థానం ఇన్‌సెట్లో వ్యవస్థాపక ధర్మకర్త బాలనరసింహారావుగౌడ్

(38వ పేజీ తరువాయి)

డిపాజిట్ రూపంలో వచ్చే వడ్డీతో రోజుకు సుమారు 80 మందికి అన్నదాన కార్యక్రమం నిర్వహిస్తున్నారు. గత పుష్కర కాలం నుంచి జరుగుతున్న కార్యక్రమంలో భక్తుల నుంచి విశేష స్పందన లభిస్తోంది.

**చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాలు :**

ఆలయం ప్రాంగణం చుట్టూ సుమారు రూ.10 లక్షల వ్యయంతో, భక్తుల సహకారంతో ఫైబర్ షీట్ షెడ్డును నిర్మా ణం చేపట్టినట్లు ఆలయ కార్యనిర్వహణాధికారి జి. డానియేల్‌బాబు, ట్రస్ట్‌బోర్డు ఛైర్మన్ వేమూరి విజయ భాస్కర్ తెలిపారు. శ్రీవిఖనస ఆచార్య స్వామి విగ్రహం, ఆలయ ముఖద్వారం, శ్రీనివాస్‌సదన్ వద్ద అం తర్గత రోడ్ల నిర్మాణం, శ్రీవారి ఆలయం చుట్టూ గ్రానైట్ ఫ్లోరింగ్, అన్నదానం షెడ్డు తదితర అభివృద్ధి కార్యక్రమాలను చేపడుతున్నట్లు వారు పేర్కొన్నారు. భక్తుల సహకారంతో విష్ణుమూర్తికి ప్రీతికరమైన తుల సీవనాన్ని, తిరుమలను తలపించే విధంగా శంకు మిట్టను ఏర్పాటుచేశారు. భక్తుల సౌకర్యార్థం ఆల యంలో శ్రీనివాససదన్, పద్మావతిసదన్‌ల పేరుతో వసతి గదులను నిర్మించారు. ఆలయ ప్రాంగణంలో యజ్ఞశాల, పొంగళి షెడ్డు, కళ్యాణ మండపాలు ఏర్పా టుచేశారు. మొక్కులు తీర్చుకునే భక్తులకు కేశఖండనశాల, తక్కువ ఖర్చుతో వివాహాలు చేసుకునేం దుకు వీలుగా కల్యాణ మండపాలు న్నాయి. క్రేన్ సంస్థల అధినేత గ్రంధి సుబ్బారావు రాజ గోపురాన్ని నిర్మిం చారు. భక్తుల సహకారాలతో వివిధ అభివృద్ధి కార్యక్రమాలు జరుగుతు న్నాయి. ఆలయంలో సుమారు ప్రతి ఏటా రెండు వేల వివాహాలు ఇక్కడ జరు గుతుంటాయి. తెనాలి ప్రాం తంలో కనీవినీ ఎరుగని రీతిలో శ్రీమన్నారాయణ పారమాత్మిక యజ్ఞం గత సంవత్సరం నిర్వహించడం జరిగింది. నూత నంగా ఆలయంలో ఆగమ పాఠశాలను ఏర్పాటు చేయడం జరిగింది. ఆలయ అర్చకులు గంజాం లక్ష్మి నరసింహాచా ర్యులు గత 40 సంవత్సరాల నుంచి శ్రీవారి సేవలో వైదిక కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. అర్చకులుగా అళహరి రవికుమార్, ఆర్.సత్యనారాయణగౌతమ్, టి.అత్రేయ, టి.రంగాచార్యులు, డి. శ్రీనివాసా చార్యులు, జి.శ్రీనివాసా చార్యులు వైఖానస ఆగమ ప్రకారం శ్రీవారి నిత్య ధూప దీపనైవేద్య కార్యక్ర మాలను నిర్వహిస్తున్నారు. ట్రస్ట్ బోర్డు సభ్యులుగా కె.తులసీ విష్ణుప్రసాద్, పి.వెంకటే శ్వరరావు, సి.హెచ్.మమత, ఎం.లక్ష్మి పార్వతి, టి.పానకా లరావు, ఎం. శివారెడ్డి, కె.ధనలక్ష్మి, ఎం. వస్త్రం నాయక్‌లు వ్యవ హరిస్తున్నారు.



ఆలయ ట్రస్ట్‌బోర్డు ఛైర్మన్ వేమూరి విజయభాస్కర్, ఇ.ఓ జి.డానియేల్‌బాబు

# మానవత్వానికి ప్రతిరూపంగా నిలుస్తున్న గణేష్‌యూత్

మేకల సురేష్, మేజర్‌న్యూస్, తెనాలి

పేదవారికి సేవ చేయాలనే ఆలోచన ప్రతి ఒక్కరికీ వస్తుంది. దానిని అతికొద్ది మంది మాత్రమే ఆచరణలో పెట్టి ఆపదలో ఉన్న పేదవారికి మేము న్నా మంటూ చేయూతనందిస్తారు. ఆ కోవకు చెందినవారే అంగలకుదురు గణేష్ యూత్ సభ్యులు. స్వర్గీయ నందమూరి తారక రామారావు ఆశయాలకు అను గుణంగా పేదవారికి సహాయం చేయడమే పరమావధిగా వారి శ్రేయస్సు కోసం నడుంబిగించారు. సమాజంలో ఎటువంటి ఆదరణకు నోచుకోని అనాథలకు, పేదరికంలో మగ్గుతూ కాలాన్ని వెళ్ళదీస్తున్న వృద్ధులకు, అగ్ని ప్రమాదాల్లో సర్వం కోల్పోయిన అభాగ్యులకు, ఎయిడ్స్ వంటి ప్రమాద కరమైన వ్యాధితో సమాజానికి, కుటుంబ సభ్యుల ఆదరాభిమానాలకు దూరమైన బాధితులకు, మెరుగైన వైద్యం చేయిం చుకునే ఆర్థిక స్తోమత లేని నిరుపేదలకు అండగా నిలబడి వారిని అక్కున చేర్చు కుంటున్నారు. వారికి ఉన్నదానిలో లేదు అనకుండా పేదవారికి సహాయ సహకారాలందిస్తున్నారు తెనాలి మండలం అంగలకుదురు గ్రామంలోని గణేష్ యూత్ సభ్యులు.



అంధులకు వస్త్రాలు పంపిణీ చేస్తున్న గణేష్‌యూత్ సభ్యులు,

**చేపట్టిన సేవా కార్యక్రమాలు :**

★ హైదరాబాద్ నందమూరి బసవతారకం, కోడెల సత్యనారాయణ ఛారిట బుల్ ట్రస్ట్ సౌజన్యంతో ఉచిత క్యాన్సర్ నిర్ధారణ పరీక్షలను నిర్వహించారు. వైద్య పరీక్షల్లో 2500 మందికి పైగా పేద ప్రజలు ఈ అవకాశాన్ని సద్వి నియో గం చేసుకున్నారు. వీరికి అవసరమైన సుమారు రూ.లక్ష విలువైన మం దులను ఉచితంగా పంపిణీ చేశారు.

★ తెనాలి హెల్త్ హాస్పటల్‌వారి నేతృత్వంలో ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వ హించి 1000 మందికి పైగా పేదవారికి వైద్యసేవలందించి రూ.50 వేల విలు వైన మందులను ఉచితంగా అందజేశారు.

★ కోస్తా ప్రాంతంలో వరద ముంపుకు గురై సర్వం కోల్పోయిన ప్రజలను పరామర్శించడానికి జిల్లాకు విచ్చేసిన చంద్రబాబునాయుడుకి బాధితుల సహాయార్థం రూ.50 వేలను అందజేశారు.

★ ఆర్టిడ్స్ స్వచ్ఛంద సేవాసంస్థలో ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులకు వందమందికి రూ.30 వేలతో వస్త్రాలు, ఇతర సామాగ్రిని పంపిణీ చేశారు.

★ చంద్రబాబునాయుడు కాలనీలో 50 మంది అంధులు, వికలాంగులకు రూ.25 వేలతో వస్త్రాలను వితరణ చేశారు.

★ కిడ్నీలు చెడిపోయి అనారోగ్యంతో బాధపడుతున్న ఎ.ఎస్.ఎన్ డిగ్రీ కళా శాల విద్యార్థికి శస్త్రచికిత్స నిమిత్తం రూ.15 వేలను, వైద్యులకు అంతుపట్టని వ్యాధితో బాధపడుతున్న అంగలకుదురు గ్రామంలోని దళితవాడకు చెందిన వ్యక్తికి రూ.10 వేల ఆర్థిక సహాయం చేశారు.

★ అంగలకుదురు, దుండిపాలెం గ్రామాల్లో అగ్ని ప్రమాదం సంభవించి నిలువ నీడ కోల్పోయిన బాధితులకు ఆర్థిక సహాయంతో పాటు నిత్యవసరాలైన వస్త్రాలు, వంట సామాగ్రిని వితరణ చేశారు.

★ జె.ఎం.జె కళాశాలలో ఇంటర్, డిగ్రీ మొదటి సంవత్సరం చదువుతున్న నలుగురు వికలాంగులకు ట్రైసైకిళ్ళు పంపిణీ చేసి ఒక్కొక్కరికి రూ.2 వేల నగ దును, అంగలకుదురులోని సద్వార్ ఆశ్రమంలోని అనాథ పిల్లలకు అవసర మయ్యే రూ.30 వేల విలువైన సామాగ్రిని అందజేసి తమ ఔదార్యాన్ని చాటుకు న్నారు.

★ వేసవి దాహార్తిని తీర్చేందుకు మినరల్ వాటర్‌తో చలివేంద్రాలను ఏర్పా టుచేసి ప్రజల అవసరాలను తీరుస్తూ వారి ఉదారతను చాటుకున్నారు.

ఇవి గణేష్‌యూత్ సభ్యులు చేపట్టిన సేవా కార్యక్రమాల్లో కొన్ని మాత్రమే. ఇలా ఎన్నో సేవా కార్యక్రమాలు చేపట్టి పేదల హృదయాల్లో చిరస్థానం సంపాదిం చి నలుగురికి స్ఫూర్తిదాయకంగా నిలిచారు. గణేష్‌యూత్ సభ్యులు భవిష్యత్తు లో మరిన్ని సేవా కార్యక్రమాలు చేపట్టి ప్రజలకు చేరువకావాలని ఆశిద్దాం.

# కరవును జయించిన కర్షకులు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

పచ్చని పంట చేలు, ఎప్పుడూ ప్రవహించే కాల్వలు... కృష్ణా డెల్టా అనగానే గుర్తుకు వచ్చే సన్నివేశమిది. ఒకప్పుడు ఇక్కడ ఆకలి కేకలు, అన్నార్తుల రోదనలు వినిపించేవని చెప్పిన ఎవరూ నమ్మరు. వందలమంది ఆకలి చావుల నేపథ్యమే కృష్ణా డెల్టాకు జీవం పోస్తున్న ప్రకాశం బ్యారేజీ నిర్మాణానికి నేపథ్యమన్నది చాలామందికి తెలియని విషయం. కృష్ణానదికి ఆనకట్ట నిర్మాణానికి ముందు చెరువులు, బావుల కింద కేవలం 20 వేల హెక్టార్లలో మాత్రమే పంట పండించేవారు. మిగిలిన వ్యవసాయ భూమంతా వర్షాధారంగానే పండేది. 1830 సంవత్సరంలో కరవు ఈ ప్రాంతాన్ని అల్లకల్లోలం చేసింది. 40% జనాభా ఆకలి చావులకు గురయ్యారని చెప్తారు. ఫలితం ఈస్టిండియా కంపెనీకి రావాల్సిన ఆదాయం పూర్తిగా తగ్గిపోయింది. కరవును జయించి రైతులు పన్నులు చెల్లించాలంటే ఈ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేయాలని భావించారు. కావేరి నదిపై చోళ రాజులు కట్టిన ఆనకట్ట వల్ల తమిళనాడు రైతులు ఘోర కలిలో కూడా పంటలు పండించడం గమనించి విజయవాడ వద్ద ఆనకట్ట నిర్మాణానికి సంకల్పించారు.



డెల్టాకు జీవం పోసిన కృష్ణవేణి, బ్యారేజీ

సర్ ఆర్థర్ కాటన్ ఆనకట్ట నిర్మాణం అవసరమని చెప్పారు. హెచ్.ఎ లేక్ వివిధ అంశాలు పరిశీలించి కాటన్ అభిప్రాయాన్నే బలపరిచారు. ఫలితంగా 1851వ సంవత్సరంలో ప్రభుత్వం ఆనకట్ట నిర్మాణానికి ఆమోదం తెలిపింది. కెప్టెన్ ఓర్ ఆధ్వర్యంలో 1852లో ఆనకట్ట నిర్మాణ పనులు ప్రారంభమయ్యాయి. ఇసుక పునాదులపై రాళ్ళను పేర్చి సున్నంతో నిర్మించేందుకు నిర్ణయించారు. 1855 డిశంబర్ నాటికి పనులు పూర్తయ్యాయి. రెండు కొండలను ఆధారం చేసుకుని మూడు వేల అడుగుల పొడవునా నిర్మించిన ఈ ఆనకట్ట కోసం అప్పట్లో చేసిన ఖర్చు రూ.7,72,186లు. ఈ ఆనకట్ట నిర్మాణం ద్వారా గుంటూరు, కృష్ణా, ప్రకాశం జిల్లాల్లో 13 లక్షల ఎకరాలకు సాగునీరందింది. ఖచ్చితంగా శతాబ్దకాలం రైతు సౌభాగ్యానికి తోడ్పడింది. 1952 మే నెలలో వచ్చిన వరదల కారణంగా ఆనకట్ట వంద అడుగుల మేర కొట్టుకుపోయింది. దాని సంరక్షణ కోసం నిరంతరం శ్రమించిన ఇంజనీర్లు, కార్మికులు వరద నీటి ఉధృతిలో గల్లంతయ్యారు. ఎస్.ఇ వి.కృష్ణమూర్తి ఆ ప్రమాదంలోనే కన్ను మూశారు. అప్పటి ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం పంతులు కలవరపడ్డ కర్షకున్ని ఓదార్చేందుకు రూ.33 లక్షల ఖర్చుచేసి తాత్కలిక మరమ్మతులు చేస్తూనే రూ.2.85 కోట్ల నిధులతో అధునాతన బ్యారేజీ నిర్మాణానికి అనుమతించారు.



ఈ సిరులు బ్యారేజీ ఇచ్చినవే

**బ్యారేజీ నిర్మాణం ఇలా :**

ప్రకాశం బ్యారేజీ నిర్మాణం కోసం అవసరమైన సామాగ్రిని తయారుచేసేందుకు సీతానగరం వద్ద ప్రత్యేక వర్క్‌షాపును నిర్మించారు. మద్రాసుకు చెందిన గాసన్ సంస్థ నిర్మాణ బాధ్యతలు చేపట్టింది. విజయవాడకు చెందిన డైమండ్ మిషనరిస్, శ్రీ సువర్ణ ఇండస్ట్రీయల్ ఇంజనీరింగ్ సంస్థలు పనుల్లో భాగం పంచుకున్నాయి. కలకత్తా నుంచి తెచ్చిన స్టీలు ఉపయోగించారు. స్థానికులు, తమిళనాడుకు చెందిన కూలీలు సమిష్టిగా నిర్మాణ పనులు చేశారు. రోజుకు 11 వందల వాహనాల ద్వారా 3 వేల 500 టన్నుల బరువును వంతెన పైనుంచి

(మిగతా 40వ పేజీలో)

## కరవును జయించిన కర్షకులు

(39వ పేజీ తరువాయి)

రోజు కు 11 వందల వాహనాల ద్వారా 3 వేల 500 టన్నుల బరువు ను వంతెన పైనుంచి రవాణా చేసేందుకు అనుమతిం చారు.

ఇవీ రూపురేఖలు :

| | |
|---|---|
| బ్యారేజీ పూర్తి ఎత్తు | -99.60 అడు గులు |
| 'టీ' బీమ్‌ల ఎత్తు | -82.10 అడు గులు |
| రోడ్డు మార్గం | -4045 అడుగులు |
| ప్రధాన రెగ్యులేటర్‌లు | -40 అడుగు ల ఎత్తు, 12 అడుగుల వెడల్పు |
| మొత్తం గేట్లు | -70 |
| క్రస్ట్ గేటు ఎత్తు | -45.0 అడుగులు |
| నీటీ నిల్వ సామర్ధ్యం | -3.7 టి.ఎం.సిలు |
| వరద నీటిని విడుదల చేసే సామర్ధ్యం | - 11.09 లక్షల క్యూసెక్కులు |
| పశ్చిమ ప్రధాన కాల్వ కింద ఆయకట్టు | - 5.71 లక్షల ఎకరాలు |
| తూర్పు ప్రధాన కాల్వ కింద ఆయకట్టు | - 7.38 లక్షల ఎకరాలు |

## రైతుల శ్రేయస్సుకు పాటుపడుతున్న సత్తెనపల్లి మార్కెట్ యార్డు

బి,శ్రీనివాసరావు,
మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

అతి సామాన్య రైతు కుటంబం లో జన్మించి అంచెలంచెలుగా ఎదిగి సత్తెనపల్లి మార్కెట్ యార్డు ఛైర్మన్‌గా ఎంపికై పలువురి మన్న నలను అందుకుం టున్నారు కట్టా సాంబయ్య...సత్తెనపల్లి నియోజక వర్గంలో సాంబయ్య అంటే తెలి యని వారు ఉండరు. నిరంతరం ప్రజా సంక్షేమంకోసం శ్రమిస్తూ నిత్యం... అనునిత్యం ప్రజలకు అందుబాటులో ఉంటు వారి యోగక్షేమాల్లో పాలు పంచుకుం టున్నారు. నిజాయితీ, నిబద్ధతే ప్రామాణికంగా అలుపెరగని ప్రజాపో రాటాలు చేస్తూ కరుడుకట్టిన కాంగ్రెస్ వాదిగా నియోజకవర్గంలో పార్టీశ్రే ణులకు నేనున్నాననే భరోసా ఇస్తూ పలువురికి అండగా నిలుస్తున్నారు. ఎన్ని ఓడుదుడుకులు ఎదురైనా మక్కువోని ధైర్యసాహ సాలతో ఎదుర్కొంటూ తనకంటు ఒక స్థానాన్ని నిలబెట్టుకు న్నారు సాంబయ్య.పిలిస్తే పలికే ఆపద్భాంద వుడుగా రైతుల శ్రేయస్సు సంక్షేమం కోసం అహర హం శ్రమిస్తూ పలువురి నీరాజనాలు అందుకుంటున్నారు. తన దగ్గరకు ఎవరొచ్చినాఅప్యాయంగా పలకరిస్తూ ఎదుటి వ్యక్తిని పులకింపచేయడం ఆ యన నైజం. రైతుసేవకు మార్కెట్ యార్డు ఉంది అని తెలియచెప్పి ఎరువుల కొరత ఎదుర్కొంటున్న రైతులకు ఎరువులను అందుబాటు లోకి తెచ్చారు. వర్షాలకు తడుస్తున్న మిర్చిని కాపాడేందుకు సబ్సిడీపై పట్టలు పంపిణీ చేశారు. గ్రామల్లో పాడి పరిశ్రమాభివృద్ధికి పశువైద్య శిబిరాలు నిర్వహించారు. పత్తి ధర తగ్గిందని దిగాలు పడుతున్నరైతాంగా నికి సిసిఐ ద్వారా మార్కెట్ యార్డులో కొనుగోలు చేయించి రైతుల ఆర్ధి కాభివృద్ధికి తోడ్పడ్డారు. కోట్లాది రూపాయలు వెచ్చించి నియోజక వర్గంలో లింకురోడ్ల నిర్మాణం, గోదా ముల నిర్మాణం చేపట్టారు. స్థానిక ఎమ్మెల్యే యర్రం వెంకటేశ్వరరెడ్డి



మార్కెట్ యార్డు ఛైర్మన్ కట్టా సాంబయ్య

సహకారంతో యార్డును అన్ని విధాల అభివృద్ధి పరిచి రైతులకు ప్రయో జనం చేకూర్చారు. రైతులు ఎదుర్కొంటున్న సమస్యలన్నీ స్వత హాగా అనుభవించిన వారవడంతో రైతు సమస్యల పరిష్కారం కోసం ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డిని పలుమార్లు కలిసి సమస్యల పరిష్కా రానికి కృషి చేశారు. మరోసారి ఛైర్మ న్‌గా ఎంపిక య్యేందుకు మార్గాన్ని సుగమం చేసుకున్నారని ప్రజలు పేర్కొంటున్నారు.

సత్తెనపల్లి మార్కెట్ యార్డు ఛైర్మన్ కట్టా సాంబయ్య మాట్లాడుతూ నియో జకవర్గ ప్రజలు చూపిస్తున్న ఆదరా భిమానాలే నన్ను ముందుకు నడిపిస్తు న్నాయన్నారు. రైతుల సంక్షేమం కోసం నిరంతరం కృషి చేస్తానన్నారు. ఎల్లప్పుడు ప్రజలకు అందుబాటులో ఉంటు వారిభివృద్ధిలో భాగస్వామిన వుతానన్నారు. ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి రైతులకోసం రుణా మాఫీ, సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణం చేపట్టి రైతుజన బాంధవుడుగా కీర్తిం పబడుతున్నారన్నారు. ఆయనను ఆదర్శంగా తీసుకుని రైతులకోసం తనవంతు కృషి చేస్తానన్నారు.

## సిరుల పంట నాపరాయి పరిశ్రమ

కోటేశ్వరరావు, మేజర్‌న్యూస్, మాచర్ల

పల్నాడు ప్రాంతంలో మాచర్ల కేంద్రంగా ఉన్న నాపరాయి పరిశ్రమ వ్యాపా రులకు సిరులు పండిస్తూ వందలాది మంది కూలీలకు ఉపాధి కల్పిస్తోంది. బ్రిటీష్ వలస పాలకుల నుండి భారత దేశం విముక్తి చెందక ముందు నుండే ఈ ప్రాంతంలో నాపరాయి పరిశ్రమ మూడు పువ్వులు ఆరుకాయలుగా విరాజి ల్లింది. 1930 వ దశకంలో ఈ ప్రాంతంలోని వారు రెవిన్యూ భూ ముల నుండి నాపరాయి త్రవ్వకాల కు బ్రిటిష్ వారి నుండి అనుమతి పొందిన క్వారీలు అనేకం ఉన్నాయి.

(మిగతా 41వ పేజీలో)



## జిల్లా సంగతులు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

★ 1933 డిసెంబర్ 3న మహాత్మాగాంధీ కావూరులో వినయాశ్రమాన్ని ప్రారంభించారు.
★ 1934 సెప్టెంబర్‌లో గుంటూరు జిల్లా కాంగ్రెస్ కార్యాలయం తెనాలికి మార్చారు.
★మహాత్ముని పిలుపు మేరకు 1934 ఫిబ్రవరి 14న గోవాడలో హరిజనులు దేవాలయ ప్రవేశం జరిగింది.
★ 1964లో కమ్యూనిస్టు పార్టీ ప్లీనరీ సమావేశాలు తెనాలిలో జరిగాయి. ముజఫర్‌అహ్మద్, సూర్జిత్, జ్యోతిబసు, గోపాలన్, సుందరయ్య, బసవపున్నయ్య తదితరులు బహిరంగసభ నిర్వహించారు. అప్పుడే కమ్యూనిస్టుల చీలిక ప్రకటించారు.
★ ఢిల్లీ ఆంధ్రా సంఘానికి ఎంపికైన ప్రధమ మహిళ కొత్త లక్ష్మీరఘురామయ్య
★1902లో తెనాలి గ్రామశివారులో ప్రారంభించిన ప్రాధమిక పాఠశాలను 1903లో తాలుకా హైస్కూల్‌గా మార్చారు. మద్రాసు రాష్ట్రంలో ఇది రెండవదిగా కీర్తి పొందింది.
★ కొల్లూరుకు చెందిన బలిజేపల్లి లక్ష్మీకాంత కవి ప్రసిద్ధ సత్యహరిశ్చంద్ర నాటకాన్ని 1905లో రచించారు.
★ బెజవాడ వద్ద కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణాన్ని 1852లో ప్రారంభించారు. 4 వేల అడుగుల పొడవైన ఈ ఆనకట్ట నిర్మాణ ఖర్చు రూ. 1.80 కోట్లు.

# సిరుల పంట నాపరాయి పరిశ్రమ

(40వ పేజీ తరువాయి)

1950కి ముందు పెద్దగా అభివృద్ధి చెందకపోయి నప్పటికీ 1960వ దశకంలో ఈ పరిశ్రమ బాగా పుంజుకుంది. మాచర్ల కేంద్రంగా సూమారు 30 గ్రామాలలో వేలాది ఎకరాల విస్తీర్ణంలో నాపరాయి నిక్షేపాలు ఉన్నాయి. మాచర్ల నుంచి శ్రీశైలం వెళ్ళే రహదారిలో ఇరువైపులా ఉన్న తేరాల పోలేపల్లి, రచ్చమలపాడు, శ్రీరాంపురం తండా ప్రాంతాలో ఉన్న క్వారీలను ఎడమ, కుడి క్వారీలుగా పిలుస్తుంటారు. వీటితోపాటు రెంటచింతల మండలంలోని జెట్టిపాలెం, గోలి మల్లవరం పశర్లపాడు వంటి గ్రామాలు నాపరాయికి ప్రసిద్ధి గాంచాయి. ఇటీవల తేరాల గ్రామం శివారులో ఉన్న క్వారీలలలో అటవీ అధికారులు రిజర్వు ఫారెస్టు భూమి పేరుతో నాపరాయి తవ్వకాలను నిలిపివేశారు. కేవలం వర్షాధారంపై ఆధారపడి జీవించే పల్నాడులో నాపరాయి పరిశ్రమ వేలాది మందికి జీవనాధారంగా నిలిచింది. ముడినాపరాయిని మిషన్‌లతో అరగదీసి నలుపు, తెలుపు, ఎరుపు, ఆకుపచ్చ రంగురాళ్ళను తయారు చేసి దేశ విదేశాలకు సైతం ఇక్కడ నుండి వ్యాపారులు ఎగుమతి చేస్తున్నారు. దీంతో మాచర్ల పట్టణంలో అనేక పాలిష్ యంత్రాలు వెలిశాయి. నాపరాయి, పాలిష్ రాయి పరిశ్రమలలో సుమారు 10 వేల మంది కార్మికులు జీవనం సాగిస్తున్నారు. సాలీనా ఇక్కడ నుంచి సుమారు 4 కోట్ల చదరపు అడుగుల రాయిని ఉత్పత్తి చేస్తున్నారు. ఈ రాయిని సామాన్య, మధ్య తరగతి ప్రజలు విరివిరిగా గృహనిర్మాణానికి బండపరుపునకు ఉపయోగిస్తున్నారు. ముఖ్యమంత్రి డాక్టర్ వై.ఎస్ రాజశేఖర్ రెడ్డి అధి కారంలోకి వచ్చిన తరువాత పేదవాడికి గూడు కల్పించాలనే లక్ష్యంతో ఇందిరమ్మ గృహనిర్మాణం పథకాన్ని ప్రవేశ పెట్టటంతో నాపరాయికి మంచి డిమాండ్ పెరిగింది. అంతే కాకుండా రోడ్లు, కాలువల నిర్మాణానికి కూడా ఉపయోగిస్తున్నారు. ఆధునిక దేవాలయంగా పిలిచే నాగార్జున సాగర్ కుడి, ఎడమ కాలువల నిర్మాణానికి లక్షలాది చదరపు అడుగులు నాపరాయిని వినియోగించారు. నాపరాయి పరిశ్రమ వలన మైనింగ్, కమర్షియల్, రెవెన్యూ శాఖకు పన్నుల రూపేణా లక్షలాది రూపాయలు ప్రభుత్వ ఖజనాకు జమ పడుతున్నాయి. ఈ పరిశ్రమ వలన పల్నాడుకు కోట్లాది రూపాయలు ఆదాయం వస్తోంది.

### అమలు కాని భీమా పథకం
### కట్టు బానిసలుగా కార్మికులు!!

నవ నాగరిక ప్రపంచానికి నాపరాయిని అందిస్తున్న కార్మికుడు కట్టుబానిసలుగా ప్రమాదపు అంచుల్లో జీవనం సాగిస్తున్నాడు. కార్మికుడు రోజువారి కార్మికు లుగా పనిచేస్తుంటారు. ఇందులో రాయి కొట్టే కార్మికులు నాపరాయి ఉత్పత్తిలో నైపుణ్యం గల వారు వీరురాయి పొరలను లేపి ముక్క చీల్చి కావలసిన సైజులో నాపరాయిని తయారు చేస్తారు. ఈ క్రమంలో వీరు అనేక ప్రమాదాలకు గురవుతుంటారు. గత ఏడాది వెల్దుర్తి మండల రచ్చమలపాడు క్వారీలో బాడు పనిచేస్తున్న మండాది కూలీలు ట్రాక్టర్‌కు పూడికపట్టి తరలిస్తుండగా ప్రమాదవశాత్తు మట్టి పెళ్ళలు విరిగి ఒక పిల్లవాడితో సహా ఇద్దరు కూలీలు మృతి చెందిన విషయం తెలిసిందే. క్వారీలో పని చేసే కార్మికులకు ఎటువంటి భీమా పథకాలు లేకపోవటంతో క్వారీ ప్రమాదంలో మృతి చెందిన కుటుంబాలు వీధిన పడే దుస్థితి ఏర్పడింది. దీనికి తోడు అనేక మంది కార్మికులు యజమానుల వద్ద నుంచి తమకు అవసరాలకు తీసుకొన్న డబ్బును అప్పుగా ఉంచి మరొక వద్దకు పనికి వెళ్ళకుండా కర్ర పెత్తనం చెలాయిస్తున్నారు. 80 శాతం కార్మికులు కట్టు బానిసలుగానే జీవిస్తున్నారు.

### ఆధునిక యంత్రాలతో
### ఉపాధి కోల్పోతున్న బాడు కూలీలు!!

నాపరాయి క్వారీల నుంచి పూర్తిగా మానవ శ్రమ శక్తి పైనే ఆధారపడి ఉత్పత్తి చేస్తారు. 1990వ దశకంలో సాంకేతిక యంత్ర పరిజ్ఞానం నాపరాయి క్వారీలో ప్రవేశించి కార్మికుల ఉపాధిని దెబ్బతీస్తున్నది. దీంతో కార్మికులు ఉపా ధిని కోల్పోతున్నారు. క్వారీలలో రాయిపొరలపై ఉన్న మట్టిని బాడు కూలీల చేత తీయించేవారు. నేడు ఆ పనిని ప్రొక్లెనర్స్ యంత్రం చేత తీయిస్తున్నారు. కార్మికులు రంధ్రాలు వేసి ప్లాస్టింగ్ వేసే ప్రక్రియలో కంప్రెషర్ ద్వారా డ్రిల్లింగ్ చేసి బ్లాస్టింగ్ చేస్తున్నారు. అంతేకాకుండా నాపరాయి పొరలను చీల్చి కావలసిన సైజులలో కటింగ్ చేసేందుకు మిషన్లను వాడుతున్నారు. యంత్రాలను ఉపయోగించి తక్కువ సమయంలో తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభాలు అర్జించ వచ్చేనే భావనతో యజమానులు వీటిని ఉపయోగించి ఉత్పత్తి చేస్తున్నారు. దీంతో బాడు మోసే కార్మికులు ఉపాధి కోల్పోయారు.

నవ నాగరికతకు నాపరాయి అందించి తమ జీవితాలను సమిదలుగా అర్పిస్తున్న ఈ కార్మికులకు విద్య, వైద్య కనీస వేతనాలు ఉపాధి గ్యారంటీతోపాటు కార్మికుల చట్టాలు అమలుపరచే విధంగా ప్రభుత్వం చర్యలు చేపట్టాల్సిన అవస రం ఉంది.

# ప్రగతిపథంలో చిలకలూరిపేట

లీలానంద్, చిలకలూరిపేట - మేజర్‌న్యూస్

నియోజకవర్గంలోని అన్ని గ్రామాలు ప్రగతి పథంలో ఉండాలని ఆ దిశగానే అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నామని స్థానిక శాసనసభ్యులు మర్రి రాజశేఖర్ అన్నారు. విజయం సాధించి నాలుగు సంవత్సరాలు పూర్తి అయిన సందర్భంగా మేజర్‌న్యూస్ ఎమ్మెల్యేతో ముచ్చటించింది. అన్ని గ్రామాలకు తాగునీటిని కల్పించేందుకు రూ. 20 కోట్లు వెచ్చించి, అన్ని గ్రామాలలో మంచినీటి చెరువులు ఏర్పాటు చేయటం జరిగిందన్నారు. 23గ్రామాలలో రక్షిత మంచినీటి పథకాలను అమలు పరుస్తున్నామన్నారు. 10గ్రామాలలో ఉన్న పథకాలను వేగిరంగా అభివృద్ధి పరుస్తున్నామని తెలిపారు. నియోజకవర్గంలో 24 గ్రామాలకు తాను శాసనసభ్యునిగా ఎన్నికయ్యేవరకు మంచినీటి చెరువులు లేవన్నారు. ప్రస్తుతం కొన్ని గ్రామాలకు చెరు వులకు నిధులు మంజూరు చేయించామని, మరికొన్ని గ్రామాలకు చెరువులతో నిమిత్తం లేకుండా తాగునీటిని అందించే ఏర్పాట్లు చేస్తున్నామన్నారు. మంచినీరు ఫిల్టర్ కాని గ్రామాల లో నాంది ఫౌండేషన్ ద్వారా మినరల్ వాటర్ స్కీంలను ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. తాగునీటిని కల్పించిన విధంగానే సాగునీరు అందించే కార్య క్రమాన్ని విస్తృతంగా చేపట్టామన్నారు. నియోజకవర్గంలో అధిక శాతం గ్రామాలలో నాగార్జున సాగర్ కుడికాలువలోని అంతర్భాగమైన పెదనందిపాడు బ్రాంచి కెనాల్ పారుతుందన్నారు. దీని ఆధునీక రణకు 40 కోట్లు కేటాయించి తద్వారా సాగర్ వాటర్‌తో మెట్టపొలాలు సాగు చేస్తున్న వారి భూములను మాగాణిలుగా చూడాలన్నారు. సాగర్ నీటి సదుపాయం లేని గ్రామాలలో లిఫ్ట్ ఇరిగేషన్‌ను ఏర్పాటు చేస్తున్నామని తెలిపారు. అన్ని గ్రామాలలో లిఫ్ట్ సౌకర్యం చేశామని తద్వారా రైతులకు దిగుబడి అధికమై గిట్టుబాటు ధరలు లభ్యమౌతున్నాయన్నారు. లిఫ్ట్ ఇరిగేషన్‌లు సజావుగా సాగేందుకు పేట ప్రాంతంలోని వాగులను 120 కోట్ల రూపాయలతో అభివృద్ధి చేయనున్నట్లు తెలిపారు. ఇందులో భాగంగా కాజ్‌వేలు, సింగల్, డబుల్ లైన్ వంతెనలు నిర్మిస్తున్నట్లు పేర్కొన్నారు. అదేవిధంగా గ్రామాలకు అవసరమైన మౌలిక సదుపాయాలను కల్పిస్తున్నామని దీని ద్వారా వేలాది మంది లబ్ధిపొందుతున్నారన్నారు. అన్ని గ్రామాలకు, పట్టణంలో నాణ్యమైన రోడ్లు వేయటం, అవసరమైన ప్రాంతాలలో రోడ్లు వేయాలని ప్రతిపాదనలు పంపామన్నారు. ఇందిరమ్మ ఆదర్శంలో జిల్లాలోనే తృతీయ స్థానంలో ఉన్నామని అర్హులైన వృద్ధులకు, వితంతువులకు, వికలాంగులకు పెన్షన్‌లు అందిస్తున్నామని తెలిపారు. తెల్లరేషన్ కార్డు ఉన్న మధ్యతరగతి, నిరుపేద ప్రజలకు గృహనిర్మాణాలు చేపట్టి వారిని స్వగృహ యజమానులను చేస్తున్నామన్నారు. నివేశనా స్థలంలేని ప్రజలకు ఇంటి పట్టాలు అందజేస్తున్నామని అందులో భాగంగా పేట పట్టణంలో అవకాశం లేకపోవటంతో 53ఎకరాల భూమిని ప్రభుత్వం సేకరించి వాటిని పంపిణీ చేసేందుకు రంగం సిద్ధం చేసిందన్నారు. పేట పట్టణానికి కంపోస్టు యార్డు, అభివృద్ధి చెందని ప్రాంతాలకు మరిన్ని సదుపాయాలు కల్పించి నంద నవనంగా తీర్చిదిద్దుతున్నామన్నారు. పట్టణంలో గతంలో ఓగేరు వాగు వర్షాకాలంలో నీరు అధికమై నివాస గృహాలలోకి ప్రవేశించేదని దీనిని నిర్మూలిం చేందుకు 16 కోట్ల రూపా యలతో కరకట్టలు నిర్మిస్తున్నామన్నారు.



మర్రి రాజశేఖర్

గ్రామాలలో, పట్టణంలో రాజకీయపార్టీలకు, కులమతాలకు అతీతంగా ప్రభుత్వ కార్యక్రమాలలో అందరినీ లబ్ధిదారులుగా ఎంపిక చేస్తున్నామని తెలిపారు. పేట ప్రాంతానికి 100 కోట్ల రూపాయలతో సుగంధద్రవ్యాల పార్కును కేటాయింప చేసేందుకు కృషి చేశామని తెలిపారు. నియోజకవర్గంలో అనేక వాగులు, వంతెనలు నిర్మించామని పేర్కొన్నారు.

పేట ప్రాంతంలోని ప్రజలకు నిత్యం అందుబాటులో ఉండి అవసరమైన సహాయ సహకారాలు అందిస్తున్నామని తెలిపారు. పేట ప్రజలకు అసౌకర్యం కలిగించకుండా అనేక అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టామని, మరికొన్నింటిని చేసేందుకు శక్తి వంచన లేకుండా కృషి చేస్తున్నామని తెలిపారు.

## జిల్లా సంగతులు



★ గుండు, గుంట, కుంట అనే పదాల నుంచి గుంటూరు అనే పేరు వచ్చిందని అంటారు. తూర్పు చాళుక్య రాజైన మొదటి అమ్మరాజు క్రీ.శ. 922 నుండి వేసిన ఈడేరు శాసనంలో గొంటూరు పేరు తొలిసారిగా కనిపిస్తుంది. పల్లవుల శాసనాలలోనూ గొంటూరు ప్రస్తావన ఉంది.

★ 1866వ సంవత్సరంలో గుంటూరు పురపాలక సంఘంగా ఆవిర్భవించింది.

★ 1842వ సంవత్సరంలో గుంటూరుకు వచ్చిన అమెరికన్ లూథరన్ మిషన్ 1886లో ది అమెరికన్ ఇవాంజెలికల్ లూథరన్ మిషనరీ కళాశాలను స్థాపించారు. అదే ప్రస్తుత ఆంధ్రా క్రైస్తవ కళాశాల.

# తెనాలి ఔన్నత్యానికి ప్రతీక డాక్టర్ యలవర్తి నాయుడమ్మ అవార్డు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి



సి.ఎల్.ఐ.ఆర్‌లో కూర్చుని పరిశీలిస్తున్న తొలి ప్రధాని నెహ్రూ, వివరిస్తున్న నాయుడమ్మ

ప్రపంచ స్థాయి శాస్త్రవేత్తగా గుర్తింపు పొంది, తన దేశంలోని గ్రామాల అభివృద్ధిని గురించి నిరంతరం ఆలోచించి అందుకోసం తన శాస్త్ర పరిజ్ఞానాన్ని వినియోగించిన శాస్త్రవేత్తల్లో అగ్రగణ్యులు డాక్టర్ యలవర్తి నాయుడమ్మ. శాస్త్ర సాంకేతిక రంగాలు మానవాళి అభ్యుదయానికి దోహదపడాలని నిరంతరం కృషిచేసిన దార్శనికుడు ఆయన. అంతర్జాతీయ స్థాయిలో సముచిత గౌరవాన్ని పొందిన మహామనీషి డాక్టర్ నాయుడమ్మ స్మారకార్థం జాతీయ స్థాయిలో శాస్త్ర సాంకేతిక రంగాల్లో విశిష్ట సేవలందించిన ప్రజ్ఞావంతులకు ప్రతి ఏటా నాయుడమ్మ అవార్డు బహుకరిస్తారు. తెనాలి పట్టణానికి విశిష్టతను తెచ్చినవాటిలో నాయుడమ్మ అవార్డు ప్రధానమైంది. దీనికి ప్రత్యేకత తెచ్చిన ఘనత మాత్రం వ్యవస్థాపకులు పి.విష్ణుమూర్తికి దక్కుతుంది.

యలవర్రు గ్రామంలో 1922 సెప్టెంబర్ 10వ తేదీన సామాన్య రైతు కుటుంబంలో నాయుడమ్మ జన్మించారు. తురుమెళ్లలో పాఠశాల విద్య, గుంటూరు ఎ.సి కళాశాలలో ఇంటర్మీడియట్ చదివారు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో చేరిన నాయుడమ్మ కెమికల్ టెక్నాలజీ బిఎస్సీ చదివి మద్రాసులోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లెదర్ టెక్నాలజీలో చేరారు. ఆయన మేధాశక్తిని గమనించిన మద్రాస్ ప్రభుత్వం లెదర్ టెక్నాలజీలో ఉన్నత విద్య, పరిశోధనల కోసం 1946-47లో బ్రిటన్‌కు పంపింది. లెదర్ టెక్నాలజీపై ప్రత్యేక అధ్యయనాలను పూర్తిచేసిన ఆయన అమెరికాలోని లీహై యూనివర్సిటీలో అంతర్జా తీ య చర్మశుద్ధిపై డాక్టర్ ఎడ్విన్ ఆర్.థీస్ నేతృత్వంలో మస్టార్ ఇన్ సైన్స్ డాక్టరేట్ డిగ్రీలు పొందారు. 1951లో మద్రాసులోని లెదర్ ఇన్‌స్టిట్యూట్‌లో శాస్త్రవేత్తగా చేరారు. ఎన్నో నూతన లాభదాయక ప్రణాళికలు రూపొందించి చర్మకారులకు, ఆ పరిశ్రమకు సన్నిహితులయ్యారు. ఆయన కృషితోనే ప్రపంచంలోనే మేటి



నాయుడమ్మ

పరిశోధన సంస్థగా దాన్ని తీర్చిదిద్దారు. 1958లో అతి చిన్న వయస్సులోనే ఆయన డైరెక్టర్‌గా నియమితులయ్యారు. అధ్యయనం కోసం నిర్మాణాత్మక అంశమైన లెదర్ కెమిస్ట్రి, లెదర్ టెక్నాలజీలో నైపుణ్యాన్ని పెంచుకున్న నాయుడమ్మ పరిశోధనలు దేశీయ చర్మ పరిశ్రమకు, చర్మకారులకు వరప్రసాదాలు. తన సారధ్యంలోని సంస్థ జాతీయ స్థాయికి ఎదిగింది. పలు దేశాలు ఆయన సలహాలు స్వీకరించాయి. ఐక్యరాజ్యసమితి సలహాదారునిగా సుడాన్, సోమలియా, నైజీరీయా, టర్కీ, ఇరాన్, కామెరూన్ వంటి దేశాల్లో తోళ్ళ పరిశ్రమల అభివృద్ధికి తోడ్పాటునందించారు. కేంద్ర ప్రభుత్వ శాస్త్రసాంకేతిక విషయాల శాఖ కార్యదర్శిగా భారత విజ్ఞాన శాస్త్ర పరిశోధన మండలి డైరెక్టర్‌జనరల్‌గా ఏకకాలంలో 1971 నుంచి ఆరు సంవత్సరాల పాటు పనిచేశారు. 48 జాతీయ పరిశోధనశాలలు, 30 మందికిపైగా

(మిగతా 44వ పేజీలో)

# తెనాలి ఔన్నత్యానికి ప్రతీక డాక్టర్ యలవర్తి నాయుడమ్మ అవార్డు

(43వ పేజీ తరువాయి)



నాయుడమ్మ దంపతులు

శాస్త్రవేత్తలు పరిశోధన మండలి డైరెక్టర్‌గా ఇతర దేశాల్లో ఉన్న భారతీయ సాంకేతిక నిపుణులను స్వదేశానికి రప్పించి వారి ప్రతిభను దేశాభివృద్ధికి ఉపయోగించారు. నాయుడమ్మ కృషిని గుర్తించి 1971లో కేంద్ర ప్రభుత్వం పద్మశ్రీ బిరుదుతో సత్కరించింది. ఆయన పొందిన గౌరవాలు, సత్కారాలు కోకొల్లలు. కనిష్క విమానం అట్లాంటిక్ మహాసముద్రంలో కూలిపోయిన ప్రమాదంలో డాక్టర్ నాయుడమ్మ 1985 జూన్ 23న మరణించారు. ఆయన లేని లోటు తీర్చలేనిది.

అవార్డులు పొందినవారు :

- ★ కేంద్ర ఎలక్ట్రానిక్ సంస్థ మాజీ మేనేజింగ్ డైరెక్టర్ యు.వి.వర్మ
- ★ హెచ్.ఎం.టి ఛైర్మన్ డాక్టర్ ఎం.ఆర్.నాయుడు
- ★ హరిత విప్లవ పితామహుడు డాక్టర్ ఎం.ఎస్.స్వామినాథన్
- ★ ప్రముఖ భౌతిక శాస్త్రవేత్త ఎం.జి.కె.మీనన్
- ★ సాగరగర్భ పరిశోధన నిపుణులు డాక్టర్ ఎస్.జెడ్.ఖాశిం
- ★ శ్వేత విప్లవ పితామహుడు డాక్టర్ వర్గీస్ కురియన్
- ★ భారత అంతరిక్ష మండలి అధ్యక్షులు కె.కస్తూరిరంగన్
- ★ కేంద్ర ప్రణాళిక సంఘ సభ్యులు జె.ఎస్.బజాజ్
- ★ సి.ఎస్.ఐ.ఆర్ డైరెక్టర్ జనరల్ ఆర్.ఎ.మాషేల్‌కర్
- ★ భారత అణుశక్తి సంఘం ఛైర్మన్ డాక్టర్ ఆర్.చిదంబరం
- ★ భారత రక్షణ పరిశోధన అభివృద్ధి సంస్థ డైరెక్టర్ జనరల్ డాక్టర్ వి.కె.ఆత్రే
- ★ తేలికపాటి యుద్ధ విమానం రూపశిల్పి కోటా హరినారాయణ
- ★ ఇస్రో ఛైర్మన్ జి.మాధవన్‌నాయర్
- ★ భారత నాలెడ్జి కమిషన్ ఛైర్మన్ శామ్‌పిట్రోడా
- ★ అంతర్జాతీయ క్యాన్సర్ నిపుణులు డాక్టర్ నోరి దత్తాత్రేయుడు
- ★ ప్రముఖ రక్షణ, పరిశోధన రంగ శాస్త్రవేత్త పద్మశ్రీ డాక్టర్ వధానుపిళ్లై

## జిల్లా సంగతులు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

★ క్రీస్తు పూర్వం పది వేల సంవత్సరంలో నీగ్రోటో జాతికి చెందిన పాతరాతి యుగపు మానవుడు గుంటూరు జిల్లాలో సంచరించాడనడానికి కారంపూడి, నాగార్జున కొండ ప్రాంతాల్లో లభ్యమైన పాతరాతియుగపు పనిముట్లే ఆధారం.

★ గుంటూరు జిల్లాలో ఏర్పడిన మొట్టమొదటి రాజ్యం ప్రతిపాలపురం రాజ్యం. ప్రతిపాలపురం ప్రస్తుతం భట్టిప్రోలు ప్రాంతంగా చరిత్రకారులు నిర్ధారించారు.

★ పాటలీపుత్ర ఆస్థానానికి రాయబారిగా వచ్చిన మెగస్తనీస్ క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్దిలోనే భట్టిప్రోలు, అమరావతి, తాంబ్రప్రస్థాన (చేబ్రోలు), చినగంజాం వంటి 30 శత్రుదుర్భేధ్యమైన దుర్గాలున్నాయని పేర్కొన్నాడు.

★ పల్లవులు తమ స్వస్థలమైన పలనాడు (పల్లవబొగ్గ) ప్రాంతంలోని తమ పరిపాలన ప్రారంభించారు. నాగార్జునకొండ, మైదవోలు, ఒంగోలులో లభ్యమైన పల్లవుల తొలి శాసనాల్లో ఈ విషయం స్పష్టమైంది.

★ వినుకొండ ప్రాంతానికి చెందిన విష్ణుకుండినులు, ఆనందగోత్రజుల నుంచి రాజ్యాధిపత్యాన్ని పొందారు. వీరు శ్రీపర్వతస్వామి (బుద్ధుడు) ఆరాధకులు.

★ చాళుక్యుల పాలన కాలంలో అనేక చిన్న రాజవంశాలు పాలనలోకి వచ్చాయి. చందవోలులో వెలనాటిచోడులు, ధరణికోటలో కోటరాజులు, నాదెండ్లలో దుర్జయులు, మాచర్ల, గురజాలల్లో హైహేయులు, అద్దంకిలో యాదవులు.

## జిల్లా సంగతులు



★ 1970 సంవత్సరంలో ఒంగోలు తాలుకాను పూర్తిగా బాపట్ల, నరసరావుపేట, వినుకొండ తాలుకాల్లోని కొంత భాగాలతో ప్రకాశం జిల్లా ఏర్పాటుచేశారు.

★ క్రీ.శ. 1795లో చింతపల్లి జమీందార్ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తన రాజధానిని ధరణికోటకు మార్చాడు.

# జిల్లా సంగతులు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

★ 1922 సంవత్సరంలో తెనాలి నుంచి కొమ్మూరి వెంకటరామయ్య వార్త పేరుతో ఒక దినపత్రికను నిర్వహించారు.

★ 1974 డిసెంబర్‌లో కొల్లిపరలో నిర్వహించిన రాజకీయ పాఠశాలలో ప్రజా సంఘాలు, పార్టీ నిర్మాణం అంశంపై పుచ్చలపల్లి సుందరయ్య ఉపన్యసించారు.

★ 1914 ప్రాంతంలో ఇంగ్లండ్‌లో ఎనాటమీలో మెకంజీ స్కాలర్‌షిప్ పొందిన తొలి భారతీయుడు గుంటూరు జిల్లాకు చెందిన మేజర్ డాక్టర్ కాకుమాను వుళ్లక్కి.

★ గుంటూరు జిల్లాకు, తెనాలి పట్టణానికి జాతీయ స్థాయి గుర్తింపు తెచ్చిన డాక్టర్ యలవర్తి నాయుడమ్మ స్మారక అవార్డును 1986లో ఏర్పాటుచేశారు.

★ 1922లో పెదనందిపాడు సత్యాగ్రహం అఖిల భారత జాతీయ కాంగ్రెస్ చరిత్రలో పెద్ద మలుపుగా నిలిచింది. అధికారులు ఎంత హింసించినా ప్రజలు శాంతియుత పంథాను విడిచిపెట్టకపోవడం పన్నుల నిరాకరణ సత్యాగ్రహం ప్రత్యేకత.

★ మోతీలాల్ నెహ్రూ, డాక్టర్ హకీం అజ్మల్‌ఖాన్, డాక్టర్ అన్సారీలు పెదనందిపాడు పన్నుల నిరాకరణ సత్యాగ్రహం సందర్భంగా గుంటూరు వచ్చి తెలుగు నాయకులతో సమాలోచనలు జరిపారు.

★ బెంగాల్ విభజనను నిరసిస్తూ జరిగిన ఉద్యమంలో ఫిరంగిపురం గ్రామానికి చెందిన బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం అనే విద్యార్థి కలకత్తాలో పాల్గొన్నాడు. ఆ తర్వాత రాజమండ్రి సమీపంలోని సీతానగరంలో ఆశ్రమం స్థాపించి పన్నుల నిరాకరణ, సహాయ నిరాకరణోద్యమాల్లో పాల్గొని, 1931లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని పోలీసుల దమనఖాండకు మరణించాడు.

★ మహాకవి తిక్కన జన్మస్థలం గుంటూరు తన తాత మంత్రి భాస్కరుడు, తండ్రి కొమ్మనమాత్యుడు గుంటూరు ప్రభువులుగా ఉన్నారంటూ స్వయంగా తిక్కన మహాభారత విరాటపర్వంలో పేర్కొన్నాడు.

★ క్రీ.శ. 1324 నుంచి వంద సంవత్సరాల పాటు సాగిన రెడ్డిరాజుల ప్రధాన కేంద్రం అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరం.

★ పుల్లరి ఉద్యమ వ్యతిరేక నాయకుడు కన్నెగంటి హనుమంతు ఫొటో లభ్యం కాకపోవడంతో స్వాతంత్ర్య సమరయోధులు తిరునగరి రామాంజనేయులు హనుమంతుని మనుమని పోలికల ఆధారంగా గురజాల వెంకయ్యచే ఊహచిత్రాన్ని గియించారు.

★ క్రీ.శ. 1397 వరకు మాచర్ల పట్టణాన్ని మహాదేవిచర్లగా పిలిచినట్లు ముక్తిరాజ శాసనం స్పష్టం చేస్తుంది.

★ గుంటూరు జిల్లా నుంచి నలుగురు ముఖ్యమంత్రి పీఠాన్ని అధిరోహించారు. రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం, కాసు బ్రహ్మానందరెడ్డి, భవనం వెంకట్రామ్, నాదెండ్ల భాస్కరరావులు ముఖ్యమంత్రులయ్యారు. ఎన్.టి.రామారావు కూడా గుంటూరు విద్యార్థి.

★ ప్రపంచ ఖ్యాతినొందిన కోహినూర్ వజ్రం జిల్లాలోని బెల్లంకొండ మండలం, కోళ్ళూరు గ్రామంలో లభ్యమయ్యింది.

★ 1905 ఏప్రిల్ ఒకటో తేదీన గుంటూరు జిల్లా బోర్డు ఏర్పడింది. అదే కాలక్రమంలో జిల్లా పరిషత్తుగా మారింది.

★ గుంటూరు జిల్లా పరిషత్తు 1959లో ఏర్పడింది. తొలి ఛైర్మన్‌గా మేడూరి నాగేశ్వరరావు వ్యవహరించారు.

★ 1970 ఫిబ్రవరిలో ప్రకాశం జిల్లాను గుంటూరు నుంచి వేరుచేశారు. 1977, 1980, 1981, 1982లలో అనేక మార్పులు జరిగి 19 తాలుకాలతో ఉన్న గుంటూరు జిల్లాను 1985 మేలో 57 మండలాలుగా విభజించారు.

# సమాజానికి సేవలు చేయడమే ధ్యేయం

## సుఖవాసి ప్రసాదరావు

డి.వి.ఎన్.జగదీష్‌బాబు, మేజర్‌న్యూస్, రేపల్లె

సమాజానికి సేవచేయాలనే సంకల్పం అందరికీ ఉంటుంది. కానీ ఆచరణలోకి పెట్టేవారు మాత్రమే చాలా తక్కువమంది ఉంటారు. అందులో ఒకరు సుఖవాసి ప్రసాద్. హైదరాబాద్‌లో వ్యాపారం చేస్తు తన తండ్రి పేరుమీద సుఖవాసి నాగేంద్రంఫౌండేషన్‌ను స్థాపించి సమాజసేవా కార్యక్రమాలు ప్రారంభించారు. తను పుట్టిపెరిగిన ఊరు రేపల్లె మండలం నల్లూరుపాలెం కావడంతో సేవా కార్యక్రమాలు అక్కడనుంచే ప్రారంభించారు. నిరుపేదలైన వృద్ధులకు




ఉచితకంటి వైద్యశిరంలో ప్రసంగిస్తున్న సుఖవాసి ప్రసాదరావు

కంటిచూపు సన్నగిల్లడంతో చాలా ఇబ్బందులు ఎదుర్కొనడం చూసిన ఆయన వారికి ఏమైనా సహాయం చేయాలనే ఆలోచనతో గుంటూరు శంకర్ నేత్రాలయం వారితో కలసి సుమారు 200మందికి కంటి ఆపరేషన్‌లు చేయించి వారికి చూపును ప్రసాదించి వారిమదిలో చెరిగిపోని స్థానం సంపాదించుకున్నారు. శంకర్ కంటి వైద్యశాల వైద్యులు సహకారం అందిస్తే వారు ఎక్కడ క్యాంపు నిర్వహించినా వారికి ఆర్థిక సహకారం అందిస్తు, వారి వెంట నేను ఉంటానని ఉచితంగా 10వేల కంటిఆపరేషన్‌లు చేయిస్తాననడం ఫౌండేషన్ ఛైర్మన్ సుఖవాసి ప్రసాదరావు ఔన్నత్యానికి ఒక మచ్చుతునక. అదేవిధంగా రైతులకు ఉత్సాహం కలిగించడానికి మండల పరిధిలోని పెనుమూడి-పులిగడ్డ వారది దగ్గర లక్షలు ఖర్చుచేసి రాష్ట్ర స్థాయి ఎడ్లపందెములను నిర్వహించి గెలుపొందిన రైతులకు ప్రోత్సా హకంగా నగదుబహుమతులు అందజే శారు. ఈ పోటీలకు ఎవరూ ఊహిం చని విధంగా రాష్ట్ర నలు



పిల్లలకు విటమిన్ ట్యాబిలెట్లు పంపిణీ చేస్తున్న సుఖవాసి ప్రసాదరావు

మూలల నుంచి పందెలలో పాల్గొనడానికి ఎడ్లజతలు, తిలకించ డానికి రైతులు, ప్రజలు హాజరుకావడం చూసిన ఆయన పులకించి పార్టీలకు అతీతంగా ప్రతి సంవత్సరం ఎడ్లెపందెలను నిర్వహిస్తామని తెలిపారు.

అంతే కాకుండా పట్టణ, మండలాలలోని పాఠశాలలకు ప్యాన్లు, బల్లలు, పిల్లల కు యూనిఫారంలు, నోటుపుస్తకాలు, విద్యార్థుల ఆరోగ్యం పై శ్రద్ధ వహించి వారికి విటమన్ ట్యాబిలెట్లును అంద జేయటమే కాకుండా స్థానిక ప్రభుత్వ వైద్యశాలలో ప్రతి సంవత్సరం గర్భిణీలకు, రోగులకు అవస రమైన విలువైన మందులను అందజేస్తున్నారు. మెడికల్ అండ్ కల్చరల్ అసోసియేషన్ వారు స్థానికంగా ఏ కార్యక్రమం చేపట్టినా వారికి ఆర్థికసహాయం అంద జేసి చేయూత నందించడం వారి సహృ దయానికి నిదర్శనం. రేపల్లె, కూచిన పూడి, నిజాంపట్నం, చెరుకుపల్లి తదితర మండలాలలోని వివిధ సేవా కార్యక్రమాలు చేపడుతూ ప్రజల గుండెల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు. మునుముందు కాలంలో తమ ఫౌండేషన్ సభ్యుల సహాయసహకారాలతో మంచి సేవాకార్యక్రమాలు చేపడుతూ ముందుకు సాగాలని ఆశిద్దాం.



# రైతు సేవలో రామగోపాలరావు

పెదకూరపాడు నియో జకవర్గ ఎమ్మెల్యే ,రాష్ట్రమంత్రి కన్నా లక్ష్మీనారాయణ సంకల్పంతో పదేళ్ల క్రితం క్రోసూరులో స్థాపించిన మార్కెట్‌యార్డు రైతుల కు పలుసేవలు చేస్తూ ప్రశంసలు అందుకుంటోంది.. సామాన్య రైతు కుటుంబంలో జన్మిం చిన గోపాలరావు రైతులు ఎదుర్కొంటున్న సమస్యలు తెలిసిన వారవడంతో పరిష్కారం కోసం శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నారు.

ఎస్ కె జిలాని మేజర్‌న్యూస్,క్రోసూరు



రైతులకు ఎటువంటి ఇబ్బంది కలగకుండా క్రోసూరు మార్కెట్ యార్డు రూ.2 కోట్లతో ఆధునీకరించి అన్ని వసతులు సమకూర్చుతున్న మార్కెట్ యార్డు ఛైర్మన్ బెల్లంకొండ రామగోపాలరావును పలువురు రైతులు హర్షం వ్యక్తం చేస్తున్నారు. పెదకూరపాడు నియోజకవర్గ ఎమ్మెల్యే ,రాష్ట్రమంత్రి కన్నా లక్ష్మీనారాయణ సంకల్పంతో పదేళ్ల క్రితం క్రోసూరులో స్థాపించిన మార్కెట్‌యార్డు రైతులకు పలుసేవలు చేస్తూ ప్రశంసలు అందుకుంటోంది. సామాన్య రైతు కుటుంబంలో జన్మిం చిన గోపాలరావు రైతులు ఎదుర్కొంటున్న సమస్యలు తెలిసన వారవడంతో పరిష్కారం కోసం శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నారు. గుంటూరు డివిజన్‌లోనే పశువుల సంతకు పెట్టింది పేరు. యార్డు పరిధిలో నాలుగు ఎకరాల స్థలాన్ని సంతకు కేటాయించి చుట్టూ ప్రహరీ గోడలు నిర్మించారు. ఉచిత పశువైద్యశిబిరాలు ఏర్పాటుచేసి మందుల పంపిణీ కార్యక్రమాన్ని చేపడుతున్నారు. వ్యవసాయదారులకు శాస్త్రవేత్తలచే శిక్షణ ఇప్పించి నూతన వ్యవసాయ విధానాలను రైతులకు అందిస్తున్నారు.

రూ.49.80 లక్షలతో యార్డులో సిమెం టు రోడ్లు నిర్మాణం,రూ.12 లక్షల తో గ్రేడింగ్ సదుపాయం, రూ.8 లక్షలతో వేబిడ్జి నిర్మాణం, రూ.20లక్షలతో పార్కింగ్ స్థలం అబివృద్ధి, రూ.3 లక్షలతో గ్రేడింగ్ సదుపాయం, రూ.8లక్షలతో ఎఫ్ సిఐ పరికరాలు, రూ.24 లక్షలతో సిసి సెగ్మెట్, రూ.10 లక్షలతో ఎఫ్. ఆర్.హెచ్ భవన నిర్మాణం, రూ.6 లక్షలతో ఓవర్ హెడ్ ట్యాంక్ నిర్మాణం, రూ.20 లక్షలతో విద్యుత్ సదుపా యం తదితర అభివృద్ధి పనులు చేపట్టారు. రాష్ట్ర రవాణా శాఖమంత్రి కన్నా లక్ష్మీనారాయణ సహకారంతో జిల్లాలోనే క్రోసూరు మార్కెట్ యార్డును ప్రథమ స్థానంలో రామగోపాలరావు నిలిపారు.

# విద్యార్థి సంపూర్ణ వికాసం కోసం ఆరాటం

## కుగ్లర్ విద్యాసంస్థలలో అత్యాధునిక విధానాలు

కె.అనిల్‌కుమార్, స్టాఫ్ రిపోర్టర్, గుంటూరు

విద్య విలువెంతో.. ప్రస్తుతం దాని ధరెంతో ఎవరికీ తెలియనిది కాదు. ఎల్.కె.జి. నుంచే వేలాది రూపాయలు వసూళ్లు చేసి, విద్యను అందిస్తున్న ప్రస్తుత పరిస్థితుల్లో ప్రతిభకల పేదలను, వికలాంగులను గుర్తించి వారికి ఉచితంగా విద్యను అందించడమే కాకుండా అత్యాధునిక వస తులతో కూడిన అధ్యాపకులతో బోధన నిర్వహించడం సామాన్యమైన విషయమేమీ కాదు. అంతటి సేవా దృక్పథంతో ముందడుగు వేస్తున్న సంస్థల్లో ప్రథమ స్థానం పొం దుతుందీ కుగ్లర్ విద్యాసంస్థలు. కుగ్లర్ స్మారక ఫిజియో థెరపీ కళాశాల, మెడికల్ ల్యాబ్ టెక్నాలజీ, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ తదితర రంగాల్లో ఈ సంస్థలు విద్యను అందజేస్తు న్నాయి. ఇందులో ప్రధానంగా చెప్పుకోవలసింది. కుగ్లర్ ఫిజియోథెరపీ కళాశాల గురించే.

**అత్యాధునిక ప్రమాణాలతో విద్య...**

ఫిజియో థెరపీలో నూతనంగా వస్తున్న మార్పులను సొంతం చేసుకుని, విద్యార్థి దశలోనే అన్ని రకాల పరిక రాలపై శిక్షణ ఇచ్చే సంస్థగా కుగ్లర్ ఫిజియో థెరపీ కళాశాలకు గుర్తింపు ఉంది. ఇక్కడి విద్యార్థులకు అంతర్జాతీయ ప్రమాణాలు కలిగిన ప్రయోగశాలలో శిక్షణ ఇస్తున్నారు. అంతేకాకుండా వివిధ వైద్యశాలలకు విద్యార్థులను పంపించి, ప్రాక్టికల్స్ చేయిస్తుండడం ప్రత్యేకత. గుంటూరు నగరంలో ప్రఖ్యాతి వహించిన ప్రభుత్వ సమగ్ర వైద్యశాల, లలిత సూపర్ స్పెషాలిటీ వైద్యశాల, అమరావతి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్, లైఫ్ హాస్పిటల్స్ తదితర ఆసుపత్రుకు విద్యార్థులను పంపించి, నేరుగా వైద్యంపై అవగాహన కల్పి స్తుండడం గమనార్హం. దీంతో విద్యార్థులు పూర్తిస్థాయి అవ గాహనకు వస్తారని కళాశాల నిర్వాహకులు చెబుతున్నారు.



పల్స్‌పోలియో కార్యక్రమానికి చేయూత



పేదలకు ఉచిత వైద్యం అందిస్తున్న విద్యార్థినులు

**అంతర్జాతీయస్థాయి వర్క్‌షాప్‌లు...**

విద్యార్థులను సంపూర్ణ వికాసం పొందేలా, విదే శాలలో పరిస్థితులు, వైద్య విధానాలు తెలిసేలా కుగ్లర్ ఫిజియోథెరపీ కళాశాలలో అంతర్జాతీయ స్థాయి సదస్సులు నిర్వహిస్తున్నారు. ఇక్కడకు హాలెండ్, అస్ట్రేలియా తదితర దేశాల నుంచి నిపుణులు వచ్చి విద్యార్థులకు సలహాలు, సూచనలు ఇస్తుంటారు. న్యూజిలాండ్‌కు చెందిన బృందాలు ప్రతిఏటా ప్రత్యేక శిక్షణ తరగతులు నిర్వహిస్తుంటాయి. అలాగే అంతర్జాతీయ స్థాయి వర్క్‌షాప్‌లు నిర్వహించడం ఈ విద్యాసంస్థలకే తలమానికం.

**ఆటపాటలతో సంపూర్ణ వికాసం...**

కుగ్లర్ కళాశాలలో విద్యార్థులకు ఆటపాటల్లోనూ ప్రావీణ్యం కలిగేలా చేస్తున్నారు. దీనిద్వారా విద్యార్థి సంపూర్ణ వికాసం సాధిస్తారని కళాశాల కరస్పాండెంట్, కార్యదర్శి ఇమ్మానియేల్ ప్రకాష్ చెబుతున్నారు. (మిగతా48వ పేజీలో)



కళాశాల వార్షికోత్సవంలో విద్యార్థుల ప్రదర్శన

## ఉన్నత విద్య అట్టడుగు స్థాయికి వెళ్లాలి

### కరస్పాండెంట్ ఇమ్మానియేల్ ప్రకాష్

ప్రతి పేదవానికీ, మధ్య తరగతి వర్గాల వారికి ఉన్నత విద్యను అందించడమే తమ సంస్థల ధ్యేయమని కుగ్లర్ ఫిజి యోథెరపీ కళాశాల కార్య దర్శి, కరస్పాండెంట్ ఇమ్మానియేల్ ప్రకాష్ అంటున్నారు. కుగ్లర్ వంటి మహోన్నత వ్యక్తిత్వం గల సేవకురాలి పేరును తమ కళాశాలకు పెట్టుకోవడం గర్వ కారణమన్నారు. ఆమె ఎవరికి సేవలు అందించాలని భావించారో.. సరిగ్గా అదే ఉద్దేశంతో తాము పనిచేస్తున్నామని ఆయన అన్నారు. మావద్ద డబ్బుతో పనిలేకుండా ప్రతిభ ఆధారంగానే ఎంపికలు ఉంటాయని, పేదలకు, వికలాంగులకు ఉచిత విద్యను అందజేస్తున్న ఉద్దేశమిదేనన్నారు. కళాశాలలో కోర్సు పూర్తి చేసుకున్న విద్యార్థులు నెల తిరిగే లోపుగానే జీవితంలో స్థిరపడుతున్నారని, భవిష్య త్తులో వారికోసం మరిన్ని మెరుగైన కార్యక్రమాలు ఏర్పాటు చేయాలనే యోచనలో ఉన్నట్లు ఆయన చెప్పారు.



సాంస్కృతిక కార్యక్రమాల్లో మేముసైతం

47వ పేజీ తరువాయి

వ్యక్తిత్వ వికాసం, తదితర అంశాల్లో శిక్షణ ఇస్తున్నామని చెప్పారు. కళాశాల వార్షికోత్సవ వేడుకల్లో విద్యార్థులు పలు నాటికలు ప్రదర్శిస్తారని, గానాలాపన, క్రీడలు తదితర అంశాల్లో తాము పోటీలు నిర్వహిస్తున్నామని చెప్పారు.

### పేదల కాలనీల్లో ఉచిత సేవలు...

కుగ్లర్ ఫిజియోథెరపీ కళాశాల పేదల కాలనీల్లో ఉచిత వైద్యసేవలు అందిస్తోంది.

తద్వారా విద్యార్థులకు సేవా దృక్పథం అలవడడమే కాకుండా, పేదలకు వైద్యం అందినట్లు అవుతుందని నిర్వాహకుల అభిప్రాయం. ఇందుకు నగరంలో ఏకంగా మూడు మురికి వాడలను దత్తత తీసుకుని సేవా కార్యక్రమాలు నిర్వహిస్తుండడం ఇతర సంస్థలకు ఆదర్శనీయం.

## వాణిజ్య పంటల ఖిల్లా కొల్లిపర

# నోరూరించే కొల్లిపర చక్కెరకేళి

### వింతా పార్థసారధిరెడ్డి, రిపోర్టర్, కొల్లిపర

గుంటూరు గోంగూర, వడ్లమూడి నారింజవలె కొల్లిపర అరటి గెలలకు ప్రసిద్ధి. కొల్లిపర మండలం, కొల్లిపర, తూములూరు, హనుమాన్‌పాలెం, మున్నంగి, వల్లభాపురం గ్రామాల్లో రెండు వేల ఎకరాలకు పైగా నీటి వసతి గల మెట్టభూమిలో వాణిజ్య పంటలైన అరటి, పసుపు, నిమ్మ పంటలు పండించడంలో రైతులు ముందంజలో ఉన్నారు. కొల్లిపర మండల పరిధిలోని గ్రామాల్లో అరటి పంటలో కర్పూర, చక్కెరకేళి రకం మంచి దిగుబడి సాధించడానికి సారవంతమైన నల్లరేగడి భూములతో పాటు రైతుల కృషి ప్రశంసనీయం. ఒక సంవత్సరం చక్కెరకేళి అరటి తోట వేసిన రైతులు పంట మార్పిడి చేస్తూ మధ్యలో రెండు, మూడు సంవత్సరాలు పసుపు, మొక్కజొన్నలాంటి పంటలు వేసి ఆ తర్వాత అరటి తోటలు వేయడం వల్ల గెల పెద్దదిగా వేయడం, కాయ సైజు పెరిగి, మంచి రంగు కలిగి చూపరులను ఇట్టే ఆకర్షిస్తుంది. కొల్లిపర మండల పరిధిలోని గ్రామాల రైతులు పండించిన అరటి గెలలను ఎక్కువ శాతం కొల్లిపర మార్కెట్లకు అమ్ముతారు. కొల్లిపరలో పది మార్కెట్లకు పైగా ఉన్నాయి. కొంతమంది రైతులు గుంటూరు, తెనాలి, కుంచనపల్లి మార్కెట్లకు అమ్ముతారు. మంచి నాణ్యత, పెద్ద గెలల దిగుబడి సాధించాలంటే తగు యాజమాన్య పద్ధతులు పాటించాలి. అరటి తోట వేయడానికి మార్చి నుండి మే నెలాఖరు వరకు భూమిని తడపకుండా బాగా ఎండనిచ్చి ఎకరానికి నాలుగు నుండి పది ట్రక్కుల పశువుల ఎరువును వేసి రెండు నుండి మూడు సార్లు దుక్కి దున్ని మే నెలాఖరులో 1000 నుండి 1100 వరకు మధ్యస్థంగా ఉండే అరటి పిలకలను ఎటు చూసినా 2గజాల దూరంలో నాటి ప్రతి మొక్కకు (మిగతా49వ పేజీలో)



మార్కెట్‌కు చేరిన అరటి గెలలు



తరలింపునకు సిద్ధంగా ఉన్న అరటి గెలలు

48వ పేజీ తరువాయి

## వాణిజ్య పంటల...

నీరు పైపోతగా పోస్తారు. తొలకరి వర్షాలు పడగానే అరటి మొక్కల మధ్య జనుము చల్లి 35 - 40 రోజుల వ్యవధిలో పచ్చిరొట్ట ఎరువుగా తిరగవేసి అరటి మొక్కల మధ్య సాళ్ళుగా బోదెలు వేస్తారు. వర్షాలు కురవకపోతే మోటారు పంపు ద్వారా నీటితడి పెట్టి ఎకరానికి 100 కిలోల డి.ఎ.పి, యూరియా 150 కిలోలు, 200 కిలోల పొటాష్‌తో పాటు 200 కిలోల ఆముదపు చెక్కతో కలిసి మొక్క నాటిన 60, 80, 100, 120 రోజుల్లో నాలుగు దఫాలుగా వేస్తారు. జనవరి మొదటి వారంలో పోటాకు ద్వారా గెలలు బయటకు వచ్చి కాయలు పెద్దవి కావడానికి నాలుగు నెలలు పడుతుంది. గెలలపై మచ్చలు రాకుండా బావిస్టిన్ అనే మందును పిచికారి చేస్తారు. ఎకరానికి రూ.30 వేల నుండి రూ.40 వేల పెట్టుబడి అవుతుంది. ఎకరానికి రూ.60 వేల నుండి రూ.70 వేలు వస్తే మార్కెట్‌లో కమిషన్ ఖర్చుల కింద రూ.15 వేల నుండి రూ.20 వేలు ఖర్చవుతాయి. ప్రభుత్వమే పండ్ల మార్కెట్ ఏర్పాటుచేసి రైతులకు సరకు కమిషన్ లేకుండా అమ్మిపెడితే రైతులకు నిజమైన సేవచేసినవారవుతారు. ఎక్కువ పండ్ల తోటలు అభివృద్ధి చెందుతాయి.

# జిల్లా సంగతులు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

- 1914లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం ఏర్పడింది. తర్వాత సంవత్సరమే గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘం ఏర్పడింది.
- 1945లో అవిభక్త మద్రాసు రాష్ట్ర గ్రంథాలయ చట్టం ప్రకారం జిల్లాలో లోకల్ లైబ్రరీ అథారిటీ ఆధ్వర్యంలో జిల్లా కేంద్ర గ్రంథాలయం, ప్రధాన పట్టణాల్లో గ్రంథాలయాలు ఏర్పడ్డాయి.
- 1936 సంవత్సరంలో పొగాకు పరిశోధన కేంద్రాన్ని గుంటూరులో స్థాపించారు.
- గిట్టుబాటు ధర కోసం రైతులు చేసిన ఎన్నో ఆందోళనల ఫలితంగా 1976లో పొగాకు బోర్డు ఏర్పడింది.
- 1958లో జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా పరిశోధనల ఫలితంగా 1970లో ఈపూరు వద్ద రాగి, బండ్లమోటులో సీసపు ఖనిజ తవ్వకాన్ని హిందుస్థాన్ కాపర్ లిమిటెడ్ చేపట్టింది.
- గుంటూరు జిల్లాను అన్నపూర్ణగా మార్చిన నాగార్జునసాగర్ నిర్మాణానికి 1955 డిసెంబర్ 10న అప్పటి భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ శంకుస్థాపన చేశారు.
- గుంటూరు సమీపంలో ఆచార్య నాగార్జుని పేరుతో నాగార్జున విశ్వవిద్యాలయాన్ని 1976 ఆగస్టులో ప్రారంభించారు.
- గుంటూరు సమీపంలోని లాం గ్రామం వద్ద లాం పరిశోధన స్థానం 1922 సంవత్సరంలో స్థాపించారు. 1926లో పశువులు, వ్యవసాయ పరిశోధనను వేరుచేసి వ్యవసాయ పరిశోధన స్థానం ప్రత్యేకంగా రూపొందించారు.
- రాష్ట్రంలో పేరెన్నికగన్న సంగం డైరీ నిర్మాణానికి 1972లో అనుమతి రాగా 1976లో నిర్మాణం పూర్తి చేశారు. 1977 జూన్‌లో డైరీ ప్రారంభమైంది.
- 16 శతాబ్ద ప్రారంభంలో కారంపూడి, బాపట్లలోనూ ఈస్టిండియా కంపెనీకి చెందిన కోర్టులు పనిచేసినట్లు చారిత్రక ఆధారాలున్నాయి.
- 1873 సంవత్సరంలో ఇండియా చట్టం ప్రకారం ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఏర్పాటైన సివిల్ కోర్టులు మచిలీపట్నం, గుంటూరులో ఉన్నాయి.
- 1905 జూలైలో గుంటూరు, ప్రకాశం జిల్లాలు కలిపి జిల్లా సివిల్ సెషన్స్ కోర్టు ఏర్పాటైంది. 1913లో జిల్లా కోర్టుకు సొంత భవనం నిర్మించారు.
- కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు 1954 జూలై 5 నుంచి 1956 నవంబర్ 1 వరకు హైకోర్టు గుంటూరులో ఉంది.
- అవిభక్త మద్రాసు రాష్ట్రంలో కృష్ణాజిల్లా నుంచి 1942లో గుంటూరు పోలీస్ జిల్లా విడిపోయి ప్రత్యేక విభాగం ఏర్పడింది.
- జిల్లాపరిషత్తు తొలి మహిళా అధ్యక్షురాలు దొడ్డపనేని ఇందిర.
- 1928లో సైమన్ భారతదేశం వచ్చినప్పుడు ఫిబ్రవరి మూడవ తేదీన చేబ్రోలు వద్ద కాంగ్రెస్‌వాదులంతా సైమన్ గోబ్యాక్ అంటూ నల్లజెండాలతో నిరసన వ్యక్తం చేశారు.
- 1929 ఏప్రిల్‌లో మహాత్మాగాంధీ గోవాడ, మోపర్రు, తురుమెళ్ల, పెదరావూరు, జంపని తదితర గ్రామాలను సందర్శించారు.

# రియల్ రంగంలో నూతన అధ్యాయం

## దివ్య ఎస్టేట్స్ వినూత్న ప్రయోగం - ప్రజల ఆకాంక్షలను ప్రతిబింబిస్తాం

అనిల్‌కుమార్, స్టాఫ్‌రిపోర్టర్, గుంటూరు

రియల్ ఎస్టేట్ రంగంలో స్వర్ణ యుగం నడుస్తోంది. ఇళ్లు కట్టి చూడు.. పెళ్లి చేసి చూడు... అనే సామెత అక్షర సత్యమని ప్రజానీకానికి అనుభవ పూర్వకంగానే తెలుసు. ఈ నేపథ్యంలో అన్ని వసతులూ, ప్రశాంత వాతావరణాన్ని కల్పించి, ఆధుని కతను కలబోసి నిర్మిస్తున్న గృహాలను అందుబాటులోకి తీసుకొస్తే ఎవరు మాత్రం కొనుగోలు చేయకుండా ఉంటారు. అందుకే నగరవాసి రియల్ ఎస్టేట్ రంగంవైపు దృష్టి పెట్టారు. దీంతో వ్యాపారుల మధ్య సాధార ణంగానే పోటీ పెరిగింది. ఈ పోటీ తత్వం వినియోగదారులకు కలసి వచ్చే అంశంగా మారింది. వ్యాపారులు క్రమేపీ నాణ్యతను పెంచు కుంటూ, అత్యాధునిక సౌక ర్యాలను కల్పించే దిశగా అడుగులు వేస్తు న్నారు. ఈ నేపథ్యంలో దివ్య ఎస్టేట్ సంస్థ కూడా మరో ముంద డుగు వేసింది. సాధా రణ ప్రక్రియలకు పాతర వేసి, వినూత్న ప్రయోగానికి తెరతీసింది.

గతంలో ప్లాట్లను విక్రయించి, ఆ తర్వాతే మౌలిక సదుపాయాల కల్పన జరిగేది దాదాపు దశాబ్దం పాటు రియల్టర్లు ఇదే ప్రక్రియను కొనసాగించారు. కానీ దివ్య ఎస్టేట్స్ మాత్రమే తొలుత భూమిని అభివృద్ధి చేసి,మౌలిక సదుపాయాలను ఏర్పాటుచేసిం ది. బృందావన కాలనీ పేరుతో సకల సౌకర్యాలను కల్పించిన తర్వాతే ప్రజానీకం వద్దకు వచ్చింది. దీంతో ఎక్కడా లేని డిమాండు బృందావన కాలనీకి వచ్చింది. వెంచర్ వేసిన నాలుగు నెలల వ్యవధిలోనే 80 శాతం ప్లాట్లు విక్రయం అయ్యాయంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. ఈ వినూత్న ప్రక్రియ రియల్ ఎస్టేట్ రంగంలోని సరికొత్త అధ్యాయానికి శ్రీకారం చుట్టినట్లయింది.దివ్య ఎస్టేట్స్‌కు సంబంధించిన బృందావన కాలనీకి వస్తున్న ఆదరణను చూసి రియల్టర్లు అదే దారిలో పయనించాలని ఉద్యుక్తులవుతున్నారు. ఇది ప్రజానీ కానికి కలసివచ్చే అంశం.



బృందావన కాలనీ ప్రత్యేకతలు ఇవీ..

★ రాష్ట్రానికి మణిహారం వంటి జాతీయ రహదారికి ఆనుకుని 124 ఎకరాల సువిశాల స్థలంలో దివ్య ఎస్టేట్స్ వారి కాలనీ ఏర్పాటయింది.

★ కాలనీకి అత్యంత సమీపంలో సుంగధ ద్రవ్యాల పార్కు రానుండడం విశేషం. దీంతో ఈ ప్రాంతంలో అత్యాధునిక సౌకర్యాల కల్పనకు ప్రభుత్వమే ముందుకు రానుంది.

★ కాలనీ అంతటా తారురోడ్లు, ఇనుప ఫెన్సింగ్‌తో రక్షణ వలయం ఏర్పాటు చేశారు. కల్వర్టులు, విద్యుత్, స్థంబాలు, రోడ్లకు ఇరువైపులా మొక్కలు నాటే కార్యక్రమాలు పూర్తయ్యాయి.

★ బృందావన కాలనీకి చేరువలో అనేక పరిశ్రమలు పరిఢవిల్లుతున్నాయి. ఇందులో అంతర్జాతీయ స్థాయి సంస్థలున్నాయి. క్రేన్, బొమ్మిడాల, పెప్సీ, ఆర్.వి.ఆర్. ఇంజినీరింగ్ కళాశాల, వెంకటేశ్వర బాలకుటీర్, ట్రిప్లార్‌స్కూల్ ఆఫ్ లెర్నింగ్, కాటూరి మెడికల్ కళాశాల, చైతన్య జూనియర్ కళాశాల, మిట్టపల్లి ఇంజినీరింగ్ కళాశాల, డైట్ కాలేజీ, మహాత్మా గాంధీ పి.జి.కళాశాల, తదితర విద్యాసంస్థలతో పాటుగా, శ్రీ విఘ్నేశ్వర దేవాలయం, గణపతి సచ్చిదానంద ఆశ్రమం, విశ్వనగర్, సూర్య, ఈనాడు, వార్త, సాక్షి, ఆంధ్రజ్యోతి తదితర పత్రికాకార్యాలయాల మధ్యలో ఏర్పడడమే కాలనీ ప్రత్యేకత.



భూపతిరావు

### స్వప్నాలను సాకారం చేస్తాం: భూపతిరావు

అనూహ్య వేగాన్ని సంతరించుకున్న ఆధునిక సమాజంలో ప్రజల అభీష్టం మేరకు పనిచేయడం మాకెంతో ఆనందాన్ని కలిగిస్తోంది. ఎవ్వరికీ ఇబ్బంది కలగకుండా, వారి ఆకాంక్షలకు అనుగుణంగానే మా సంస్థలకు చెందిన బృందావన కాలనీ రూపుదిద్దుకుంది. అందుకే ముందుగా మౌలిక సదుపాయాలు కల్పించాం. రానున్న రోజుల్లోనూ మరిన్ని వినూత్న ప్రక్రియలకు శ్రీకారం చుట్టనున్నాం. ప్రజల హృదయాలలో చిరస్థాయి స్థానం సంపాదించుకోవాలన్నదే మా తాపత్రయమని దివ్య ఎస్టేట్స్ అధినేత పంచుమర్తి భూపతిరావు అంటున్నారు.

# పరుగులు పెట్టిస్తున్న కలెక్టర్ వెంకటేశం

## దీనజనులకు అండ - ప్రభుత్వ పథకాల అమలుకు ప్రత్యేక కార్యాచరణ ప్రణాళిక

ఎ.వి.డి.శర్మ, సూర్య ప్రతినిధి, గుంటూరు



జిల్లా నూతన కలెక్టర్ బి. వెంకటేశం బాధ్యతలు స్వీకరించిన కొద్ది రోజులకే పాలనా పరంగా అనేక మార్పులు చేపట్టారు. ప్రజల నుంచి ఫిర్యాదులు స్వీకరించిన వెంటనే సంబంధిత అధికారికి ఫోన్ చేసి ఫలానా వారు మీ వద్దకు వస్తారు వీలైనంత వరకు సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించడంటూ నేరుగా చెపుతున్నారు. దీంతో కలెక్టర్ వద్దకు వచ్చినవారు కొంత మేరకైనా సంతప్తిగా వెనుతిరుగుతున్నారు. సమస్య పరిష్కారం అయినా, కాకపోయినా ప్రజలను ఆప్యాయంగా ఆదరించడంలో ఇతర అధికారులకు భిన్నంగా వెంకటేశం వ్యవహరిస్తున్నారు. అలాగే అధికారులలో జవాబుదారీతనం, బాధ్యతను పెంచేలా ఎప్పటికప్పుడు ఆదేశాలు జారీ చేస్తున్నారు. వీటితో పాటు సామాజిక బాధ్యతలను కూడా కొన్నిటిని ఆయన స్వయంగా తన భుజస్కందాలపై వేసుకున్నారు. కన్న వారికి కుటుంబ సభ్యులకు దూరమై మానసికంగా దారితప్పి వీధుల్లో సంచరిస్తున్న వారిని ఒక చోటకు సమీకరించి వారి గతాన్ని తెలుసుకుని సంబంధిత కుటుంబ సభ్యులకు అప్పగించేలా ఒక బృహత్తర కార్యక్రమాన్ని రూపొందించారు.



ఇందుకోసం ప్రత్యేకంగా ఒక కార్యాచరణను కూడా అమలు చేస్తున్నట్లు ప్రకటించారు. వికలాంగులు, నిరుపేదలు, వసతి గృహవిద్యార్థులకు మనోధైర్యాన్ని కల్పించేలా కలెక్టర్ నిర్ణయాలు తీసుకుంటున్నారు. ప్రభుత్వ పథకాల అమలులో అలక్ష్యాన్ని నిరోధించడంతో పాటు జిల్లాను అన్ని రంగాలలోనూ మొదటి స్థానంలో ఉంచాలన్నదే కలెక్టర్ ధ్యేయంగా కనిపిస్తోంది. సమాజంలో నిరాదరణకు గురవుతున్న వికలాంగులు, అంధులు తదితర దీన జనులకు అండగా నిలవడమే తన ప్రధమ కర్తవ్యమని వారిలోనే నిజమైన భగవత్ శక్తి ఉంటుందని కలెక్టర్ బి. వెంకటేశం అంటున్నారు. ఎవరు ఏం చేసినా ప్రభుత్వ పథకాల ఫలాలు చిట్ట చివర ఉన్న వ్యక్తులకు సైతం అందించాలి.

అది నా లక్ష్యం. కలెక్టర్‌గా ప్రజలకు నమ్మ కం కలిగిస్తా. వికలాంగులు, వృద్ధులు, అంధులు, నిరాదరణకు గురైన వారికి నేనున్నాననే భావన కలిగించి వారిలో విశ్వాసాన్ని , నమ్మకాన్ని కల్పిస్తా. ప్రభుత్వ ఫలాలన్నీ బడుగు, బలహీన వర్గాల వారికి అందివ్వాలన్నదే నా లక్ష్యం. సంక్షేమ పథకాల అమలులో గుంటూరు జిల్లాను మొదటి స్థానంలో తీసుకువస్తానని బాధ్యతలు స్వీకరించిన తొలిరోజే ప్రకటించారు. ఉపాధి హామీ పథకం ద్వారా 50 వేల మందికి ఉపాధి కల్పించాల్సిన అవసరం ఉందని అభిప్రాయపడ్డారు. మహిళా సంఘాల స్ఫూర్తితో, వారి అండదండలతో ఇందిరమ్మ ఇళ్ళ పథకాన్ని కూడా వేగవంతం చేస్తానన్నారు.

వికలాంగులను ఆదుకోవడంలో మానవతా విలువలతో తన జీవితాంతం కార్యక్రమాలను చేపడతానని కలెక్టర్ వెంకటేశం హామీ ఇచ్చారు. దేశ సంపదలో అందరికి సమాన వాటా ఉంటుందని ఈ సంపద ప్రతి ఒక్కరికీ అందాలని కలెక్టర్ పదే పదే నొక్కి వక్కాణిస్తున్నారు. బలహీనులైన వారిక వెన్నుదన్నుగా నిలవాలని మాటల్లో కాకుండా చేతల్లో చూపేలా అధికారులను పరుగులు పెట్టిస్తున్నారు. చాలాకాలంగా నిరాధరణకు గురైన అంధులు, వికలాంగులు, మహిళలు, వృద్ధులు కలెక్టర్‌ను కలిసి ప్రభుత్వ పథకాల ద్వారా లబ్ది పొందాలని వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తున్నారు. వీరితో కలెక్టర్ నివాసం, కార్యాలయం నిత్యం కిటకిటలాడుతున్నాయి.



# అభివృద్ధి దిశగా పయనిస్తున్న రాజుపాలెం



మేజర్‌న్యూస్,రాజుపాలెం

మండలంలోని గ్రామాలు పలు అభివృద్ధి కార్యక్రమాల్లో ముందంజ లో ఉన్నాయి.రాష్ట్ర రోడ్డు రవాణాశాఖ మంత్రి కన్నాలక్ష్మీనారాయణకు ప్రతి శాసనసభ ఎన్నికలలో రాజు పాలెం మండలం మెజార్టీ వచ్చే మండలంగా ప్రసిద్ధి కెక్కింది. జాతీయ ఉపాధి హామీపథకం అమలులో జిల్లాలోనే మొదటిస్థానంలో రాజుపాలెం మండల ఉంది. ఇందిరమ్మ గృహాలు నిర్మించడంలో కూడా మిగతా మండలాలతో పోలిస్తే రాజుపాలెం మండలం అగ్రస్థానంలో ఉంది. ఒక్క బ్రాహ్మణపల్లి గ్రామంలోనే 300పైగా గృహాలు నిర్మిస్తుండటం ఒక రికార్డు.మండలంలోని మొక్కపాడు గ్రామం అభివృద్ధి పథంలో పయనిస్తోందని గ్రామసర్పంచ్ పశ్యావుల వెంకాయమ్మ రామస్వామి తెలిపారు. గ్రామంలోరూ.3 లక్షలతో సిమెంటు రోడ్ల నిర్మాణం రూ.8 లక్షలతో మండల పరిషత్ పాఠశాల నిర్మాణం, పశువుల వైద్యశాల చుట్టూ ఫెన్సింగ్ నిర్మాణం, జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం కింద అంతర్గత రోడ్ల నిర్మాణం, బృగుబండ్ల- మొక్కపాడు లింకురోడ్డు నిర్మాణంకోసం రూ.54 లక్షలతో రోడ్డు నిర్మాణపనులు త్వరలో ప్రారంభిస్తున్నట్లు తెలిపారు. గ్రామ ప్రజల సహకారంతోరూ.18లక్షలతో శివాలయం నిర్మాణం చేపట్టినట్లు వివరించారు. చౌటపాపాయపాలెంలో పలు అభివృద్ధి కార్యక్రమాలు చేస్తున్నట్లు సర్పంచ్ కడియం నర్సింహరావు తెలిపారు.గ్రామంలో రూ.1.5 లక్షలతో యుపి పాఠశాల లెవలింగ్ చేసినట్లు,రూ.50వేలతో బిసి కాలనీలోని ఎలిమెంటిరి స్కూల్ లెవలింగ్, కిచెన్ రూమ్ ఏర్పాటు, ఉపాధి హామీ పథకం ద్వారా ఆరు సైడ్ కాల్వల త్రవ్వకం, ఇందిర ప్రభ పథకం కింద72 ఎకరాల్లో కంప క్లియరెన్స్, రాళ్ళు క్లియరెన్స్, రూ.20 లక్షలతో జాతీయ ఉపాధి హామీ పథకం కింద మెటల్ రోడ్లు నిర్మాణం చేస్తున్నట్లు ఆయన తెలిపారు. అనుపాలెం గ్రామంలో ప్రజలకు కావాల్సిన కనీస సౌకర్యాల కల్పనకు శాయశకులా కృషి చేస్తున్నట్లు గ్రామ సర్పంచ్ ఎక్కంటి రమణారెడ్డి తెలిపారు. గ్రామంలో జాతీయ ఉపాధి హామీపథకం, ఇందిరమ్మ గృహాలు, మెటల్ రోడ్ల నిర్మాణం చేపట్టినట్లు ఆయన తెలిపారు. ఇనిమెట్ల గ్రామ సర్పంచ్ షేక్ మోలాన సాహెబ్ మాట్లాడుతూ ప్రజలు గ్రామాభివృద్ధికోసం తనను సర్పంచ్‌గా గెలిపించారన్నారు. గ్రామాన్ని అభివృద్ధిబాటలో నడిపిస్తానన్నారు. రెడ్డిగూడెంసర్పంచ్ సయ్యద్ జోరాబి మాట్లాడుతూ గ్రామంలో పేదలకు ఇంటివసతికోసం ప్రభుత్వం కల్పించిన ఇందిరమ్మ గృహాలను అందరు నిర్మించుకునేటట్లు కృషి చేస్తున్నట్లు తెలిపారు. బలిజేపల్లి సర్పంచ్ కానాల ఝాన్సిలక్ష్మి మాట్లాడుతూ పేదలకు బడుగు,బలహీన వర్గాలకు సేవచేసే భాగ్యం ఈ పదవి ద్వారా కలిగిందని అన్నారు. గ్రామాన్ని ప్రగతిపథంలో నడిపిస్తున్నామని ఆమె తెలిపారు. కోటనెమలిపురి-2 ఎంపిటిసి రాచేటి రాణిజాకబ్ మాట్లాడుతూ బడుగులకు,బలహీన వర్గాలకు కనీస సౌకర్యాల కల్పనలో, తన పరిధిలో అందిరికి సమాన న్యాయం జరిగే విధంగా కృషి చేస్తున్నట్లు తెలిపారు.



ఉగాది శుభాకాంక్షలతో
ప్రగతిపథంలో నరసరావుపేట పురపాలక సంఘం
శ్రీ డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి
శ్రీ కాసు వెంకట కృష్ణారెడ్డి
రాష్ట్ర ఆహారపౌర సరఫరాల శాఖామంత్రి
శ్రీ మేకపాటి రాజమహనరెడ్డి
పార్లమెంట్ సభ్యులు, నర్సరావుపేట
2004 మే నెల నుంచి రూ. 89.43కోట్లతో చేపట్టిన అభివృద్ధి పనులు
1. మంచినీటి సరఫరా - రూ. 3.10కోట్లు
2. మున్సిపల్ హైస్కూల్ - రూ. 1.00కోట్లు
3. ఐ.డి.ఎస్.ఎం.టి. - రూ. 7.25కోట్లు
4. రోడ్లుభవనాల శాఖ - రూ. 6.02కోట్లు
5. రాజీవ్ నగరబాట గ్రాంట్ - రూ. 1.00కోట్లు
6. స్పెషల్ గ్రాంట్ - రూ. 2.00కోట్లు
7. ఎన్.ఎస్.డి.పి. గ్రాంట్ - రూ. 0.53కోట్లు
8. 12వ ఆర్థిక సంఘం నిధులు - రూ. 0.96కోట్లు
9. భూగర్భ డ్రైనేజి పనులు - రూ. 31.00కోట్లు
10. ఐ.హెచ్.ఎస్.డి.పి. - 20.00కోట్లు
11. మంచినీటి అభివృద్ధి పథకం - రూ. 16.57కోట్లు
12. యు.ఐ.డి.ఎస్.ఎస్.ఎం.టి. - రూ. 89.43కోట్లు
శ్రీ కుంచాల రోశమ్మ
చైర్‌పర్సన్, నరసరావుపేట
శ్రీ డి. గోపాలకృష్ణారెడ్డి
కమీషనర్, పురపాలకసంఘం, నరసరావుపేట
శ్రీ కలపవాయి శివప్రసాద్
వైస్‌చైర్మన్, నరసరావుపేట మున్సిపాలిటి
చల్లా పార్వతి
1వవార్డు కౌన్సిలర్
బొమ్మశెట్టి శ్రీనివాసరావు
2వవార్డు కౌన్సిలర్
షేక్ మహబూబ్ సుభాని
3వవార్డు కౌన్సిలర్
షేక్ మంజూర్
4వవార్డు కౌన్సిలర్
మన్నవ ఎలీసమ్మ
5వవార్డు కౌన్సిలర్
అల్లూరి వెంకటేశ్వర్లు
6వవార్డు కౌన్సిలర్
షేక్ జీనతున్
7వవార్డు కౌన్సిలర్
షేక్ మస్తాన్
8వవార్డు కౌన్సిలర్
ఆర్. శ్రీనివాసరావు
9వవార్డు కౌన్సిలర్
పూదోట థోమాసమ్మ
10వవార్డు కౌన్సిలర్
యేటూరి సుబ్బారెడ్డి
11వవార్డు కౌన్సిలర్
నేలటూరి మురళి
12వవార్డు కౌన్సిలర్
ఎస్.జి.ఎస్.పి. నాగేశ్వరరావు
13వవార్డు కౌన్సిలర్
గల్లెపోగు ఏసుదాసు
14వవార్డు కౌన్సిలర్
షేక్ జానీమౌలాలి
15వవార్డు కౌన్సిలర్
పబ్బతి రామకోటేశ్వరరావు
16వవార్డు కౌన్సిలర్
చల్లా శ్రీనివాసరావు
17వవార్డు కౌన్సిలర్
చేకూరి పుష్పలత
18వవార్డు కౌన్సిలర్
శివరాత్రి మస్తాన్‌రావు
19వవార్డు కౌన్సిలర్
కాకుమాను చినపేరిరెడ్డి
21వవార్డు కౌన్సిలర్
ఎం. శ్రీనివాసరావు
22వవార్డు కౌన్సిలర్
మార్కాపురం పేరయ్య
23వవార్డు కౌన్సిలర్
శివరాత్రి ధనలక్ష్మి
24వవార్డు కౌన్సిలర్
ఎం. వెంకటేశ్వర్లు
25వవార్డు కౌన్సిలర్
ఇస్కెపల్లి కోటేశ్వరరావు
26వవార్డు కౌన్సిలర్
మద్ది నాగేశ్వరి
27వవార్డు కౌన్సిలర్
మంచాల వెంకాయమ్మ
28వవార్డు కౌన్సిలర్
షేక్ మహబూబి
30వవార్డు కౌన్సిలర్
కో - ఆప్షన్ సభ్యులు
జడ వసంత కుమారి
ఎస్.కె. సైదా
భాగవతుల లక్ష్మీనారాయణ (దుర్గాబాయి)

# అన్నదమ్ములను తలపిస్తున్న మందిర్-మసీదులు

సయ్యద్ సాబిర్ హుసేన్,
వినుకొండ, మేజర్‌న్యూస్

భిన్నత్వంలో ఏకత్వం మన భారతదేశ ప్రత్యేకత. ఎన్నో కులాలు, మతాలు, జాతులు ఉన్నప్పటకీ పూదండలో దారంలా కలసిమెలసిపోవడం మన భారతీయుల శైలి. అందుకే ప్రపంచపటంలో మన దేశానికి ఎనలేని ప్రాధాన్యం. ఈ ఐకమత్యమే శత్రు దేశాలకు కంటి మీద కునుకు లేకుండా చేస్తుంది. మిత్రదేశాల కళ్ళల్లో మెరుపై మెరుస్తుంది. ఇక్కడి ప్రజల స్నేహ సంబంధాలు ఎంత దృఢంగా ఉంటాయో తెలుసుకోవాలంటే ఒక్క సారి వినుకొండలోని ఈ పవిత్ర ప్రార్ధనా స్థలాలను సందర్శిస్తే చాలు.

గుంటూరు జిల్లా వినుకొండ పట్టణంలోని మార్కాపురం రోడ్డులో రంగనాయకస్వామి దేవాలయం, మోతిమస్‌జీద్‌లు పక్క పక్కనే ఉంటాయి. ఒకే కాంపౌండులో ఉన్నట్లనిపించే ఈ మందిరాలను చూసినవారికి భుజాలపై చేయి వేసు కొని ఫోటోలకు ఫోజు ఇచ్చిన అన్నదమ్ములు గుర్తుకు వస్తారు. చూడముచ్చటగా ఉండే ఈ మందిరాలు భారతదేశ ప్రజల మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తుంటాయి.

ఈ రెండు మందిరాలలో ప్రార్ధనలు జరిగే తీరుకూడా ఆసక్తికరంగా ఉంటుంది. తాము భజనలు చేసుకునేటప్పుడు మసీదులోని ముస్లీం సోదరులకు ఎక్కడ అసౌకర్యంగా ఉంటుందోనని గుడికి చెందిన మైకులను మసీదువైపుకు లేకుండా చేశారు హిందువులు. అలాగే ముస్లీ ములు కూడా తమ నమాజు వేళల్లో అజాన్ శబ్దాలు హిందు సోదరులకు ఇబ్బంది కల్గించకూడదనే ఆలోచనతో అన్నింకాల జాగ్రత్తలు తీసుకున్నారు. ముస్లీములు నమాజుకు ముందు కాళ్ళు, చేతులను మంచి నీటితో శుభ్రం చేసుకునే "వజూ"అనే సంప్ర దాయం ఉంది. ఎప్పుడైన ఈ మసీదులో మోటారు చెడిపోయి నీళ్లు రాకపోవడం జరిగితే వారికి హిందువులు గుడినుంచి మంచినీళ్లను అందేలా ఏర్పాటు చేసిన సందర్భాలు అనేకం.

ఎంతో పురాతన చరిత్ర గల వినుకొండ పట్టణానికి దక్షిణపు దిక్కున ఈ రంగనాయకస్వామి దేవాలయం ఉంది. నిత్యం భక్తులతో కళకళలాడే ఈ గుడిలో ఏర్పాటు చేసిన స్వామి వారి విగ్రహం చేతిలో కలువ పువ్వు దరించి ఉన్నందున భక్తులకు లక్ష్మీ కతాక్షం కలుగుతుందని భక్తుల నమ్మకం. వ్యాపార వర్గాలు ఎక్కువగా నివసించే ఈ ప్రాంతానికి అతి దగ్గరగా ఈ గుడి ఉండడం వలన సహజంగానే భక్తుల రద్దీ ఎక్కువగా ఉంటుంది. ఈ గుడి పక్కనే జండా చెట్టు ఉండేది. దీనినే దర్గా అని కూడా పిలిచేవారు.

అయితే దీనికి దగ్గరలో గల శంగారపు వనం, ముళ్లమూరు డౌన్, అంబేద్కర్ నగర్ కాలనీ తదితర కాలనీలకు చెందిన ముస్లీంలకు నమాజు చేసుకోవడానికి మసీదు లేకపోవడంతో ఈ దర్గాని పడగొట్టి మసీదుగా మార్చాలని కొందరు ముస్లీం పెద్దలు నిర్ణయం తీసుకున్నారు. 1975లో రేకులతో ప్రారంభించిన మసీదును 1976లో కట్టుబడి చేసి చిన్నచిన్న గదులుగా నిర్మించారు. అలా క్రమేపి కొన్ని సంవత్సరాలలోనే పూర్తిగా మసీదు నిర్మాణం జరిగింది.



మందిరం, మసీదులు

## అన్నదమ్ములను తలపిస్తున్న...
(54వేజీతరువాయి)

ప్రసాదు మేజర్‌న్యూస్‌తో మాట్లాడుతూ "ఇప్పటివరకు ముస్లీం సోదరుల వల్ల తమకు ఎలాంటి ఇబ్బందులు లేవని రాష్ట్రంలో ఎక్కడైనా మత కలహాలు జరిగినప్పుడు సహజంగా మసీదుల దగ్గర, దేవాలయాల దగ్గర పోలీసురక్షణ ఏర్పాటు చేస్తారని కానీ వినుకొండలోని ఈమందిర్, మసీదులకు రక్షణ కల్పించాల్సిందిగా తాము ఎప్పుడూ పోలీసులను కోరలేదు"అని చెప్పారు. అలాగే మోతిమసీదు ముతవల్లి షేక్ ఫకీర్ అహ్మద్ మేజర్ న్యూస్‌తో మాట్లాడుతూ "తాము నమాజు చేసుకునేటప్పుడు అసౌకర్యంగా ఉంటుందని గుడిలోని మైకులను సైతం మసీదు వైపునుంచి తీసివేసిన హిందు సోదరులు తమకు ఆప్తమిత్రులని, కొన్ని ప్రత్యేక సందర్భాలలో తాము గర్భగుడినుంచి మసీదుకు కరెంటు తీసుకున్న సందర్భాలు కూడా ఉన్నాయని" చెప్పారు.



# చిలకలూరిపేటకు సమసిపోయిన మచ్చ...!

ఎన్‌వివిఎస్‌వి ప్రసాద్, మేజర్‌న్యూస్, చిలకలూరిపేట టౌన్

శరవేగంగా మార్పుచెందుతున్న చిలకలూరిపేట పట్టణంలో గతం తాలూకు ఆనవాళ్లు మిగలక పోవటం విశేషం. రాష్ట్రంలో చిలకలూరిపేట పేరు విన గానే సెక్స్ వర్కర్ల కేంద్రంగా భావించటం ఆనవాయితి. ప్రస్తుతం నెలకొని ఉన్న పరిస్థితులలో వ్యభిచారం పూర్తిగా నిర్మూలించబడి నేడు మచ్చుకైన కానరాని పరిస్థితి. ఎలా మొదలైందో ఏవిధంగా మొదలైందో తెలియదుకాని గతంలో ఒక వర్గానికి చెందిన వారే సెక్స్‌వర్కర్లుగా ఉండే వారు. తమ నృత్యాన్ని, అభినయాన్ని ప్రదర్శించి పొట్ట గడుపుకునేవారని చారిత్రక ఆధారాలు సూచిస్తున్నాయి.


అలనాటి సెక్స్ వర్కర్ల వీధులు

చిలకలూరిపేట ప్రాంతాన్ని ఎక్కువ సంవత్సరాలు పరిపాలించిన రాజా మానూరు వంశస్తులు స్వతహాగా దైవభక్తులు కావటంతో దేవుని పేరుతో జరిగే ఉత్సవాలలో వీరి నృత్యప్రదర్శన ఒక భాగమై ఉండేదని తెలుస్తోంది. రాజులూ రాజ్యాలు పోయిన తర్వాత ఈ వృత్తిని ఆలంబనగా చేసుకుని బతికే కొంతమంది సెక్స్‌వర్కర్లుగా రూపాంతరం చెందారని పలువురు భావిస్తున్నారు. ఒకటి రెండు ఇళ్లకే పరిమితమైన ఆనాటి వ్యవహారం కొంత కాలం తరువాత ఇతర ప్రాంతాల నుండి వలస వచ్చిన కొంతమంది ఈ వ్యాపారంతో ప్రత్యక్ష సంబంధాలు ఏర్పరచు కోవటంతో పోటీతత్వం పెరిగి విశృంఖలతకు దారితీసింది. గతంలో స్వచ్ఛందంగా ఈ వ్యాపారంలోకి వచ్చిన వారు కొందరు కాంట్రాక్టు పద్ధతిన ఒడంబడికలు చేసుకుని స్థానికంగా నివాసం ఉండటంతో సెక్స్ వర్కర్ల ఆవిర్భావానికి పునాది ఏర్పడింది. హైదరాబాదు, పెద్దాపురం, మంగళగిరి, గుంటూరు, ముంబాయి, గోవా, ప్రాంతాల వారితో సంబంధాలు ఏర్పరచుకుని, వ్యాపారాలు విస్తృత పరిచారు. తదినంతరం ఏర్పడిన పరిస్థితులను బట్టి నిరంతరం కొనసాగిన పోలీసుదాడులతో స్థానికంగా ఉన్న సెక్స్‌వర్కర్లు, నిర్వాహకులు తమ వ్యాపారాన్ని వదిలి వేరేవృత్తులలోకి వెళ్ళిపోయారు. ఇదిలా ఉండగా విస్త రించిన ఎయిడ్స్ వ్యాధి కూడా ఒక కారణమని చెప్పవచ్చు. ఏదిఏమైనప్పటికి గతం

# మానవ నిర్మిత మహా సాగరం

ములకలూరి శ్రీనివాస సుధాకర్, స్టాఫ్‌రిపోర్టర్, నరసరావుపేట.

"జొన్న కలి, జొన్న అంబలి, జొన్న అన్నము తప్ప
సన్నన్నము సున్న సుమీ
అంగడి యూర లేదు వరియన్నము లేదు
శుచిత్వమేమి లేదంగనలింపు లేరు"

పలనాటి సీమను మహాకవి శ్రీనాధుడు అశువుగా చేసిన ఎద్దేవా ఇది. కాని అర్ధశతాబ్ద కాలంగా పరిస్థితి మారింది. అంగన లందరించు దమయంతులుగా వరియన్నమంతయుం బంగారు బువ్వగా బలికి వ్రాయవెనైషథ కావ్యమున్ కవీ!

అని శ్రీనాధునికి జాషువా కవి సమాధానమిచ్చారు. ఇంత ధైర్యంగా మహాకవికి సమాధానమివ్వడానికి, ప్రజల జీవనశైలిలో మహోన్నత మార్పుకు కారణం నాగార్జునసాగర్ నిర్మాణం. లక్షల మంది కార్మికుల శ్రమశక్తికి నిదర్శనం. భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లు అదో ఆధునిక దేవాలయం. ప్రతి భారతీయుడు సగర్వంగా చెప్పుకునే అసమాన రాతి కట్టడం. కృష్ణా నదికి రిజర్వాయర్ నిర్మాణం ద్వారా ప్రజల దాహార్తిని తీర్చవచ్చని 1903 సంవత్సరంలోనే బ్రిటీష్ పాలకులు భావించారు. 1952లో ప్రణాళిక సంఘ సమావేశంలో ఖోస్లా కమిటీ నివేదిక గురించి చర్చ జరిగింది. ఫలితంగా మొదటి పంచవర్ష ప్రణాళికలో భారీ ప్రాజెక్టుల నిర్మాణానికి స్థానం కలిగింది. అప్పటి హైదరాబాద్, మద్రాస్ ప్రభుత్వాలను విజయపురి ప్రాంతంలో ప్రాజెక్టుల నిర్మాణం, కాల్వల తవ్వ కంపై అధ్యయనం చేయాలని కేంద్ర ప్రభుత్వం ఆదేశించింది. ఇది జరిగిన ఏడాదిలోపే ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరిగింది. అయినా రెండు ప్రభుత్వాలు దీనిపై అధ్యయనం కోసం ఎల్.వెంకట కృష్ణయ్యర్, డి.వి.రావుల ఆధ్వర్యంలో ఒక ఉపసంఘాన్ని నియమించాయి. అధ్యయనం అనంతరం 1955 డిసెంబర్ 10న జవహర్‌లాల్ నెహ్రూ శంకుస్థాపన చేశారు. 1956 ఫిబ్రవ రిలో ప్రాజెక్టు పనులు ప్రారంభ మయ్యాయి.

పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో లక్షల మంది కార్మికులు నిరంతరం శ్రమించి ప్రాజెక్ట్ నిర్మాణంలో పాలు పంచుకున్నారు. పెద్ద బండరాళ్ళను కావిళ్ళతో భుజాలపై మోసుకువచ్చిన కూలీల శ్రమశక్తికి మరేది సాటిరాదు. సాగర్‌కు 11 కిలోమీటర్ల దూరంలోని రాయవరం వాగు నుంచి, 29 కిలోమీటర్ల దూరంలో ఉన్న హాలియా నది నుంచి ఇసుకను తెచ్చుకునే వారు. సిమెంటు ధరను భరించలేక కాల్చిన ఇటుకలను మెత్తగా పొడి కొట్టి సుర్కీ తయారుచేసి సిమెంటులో కలిపి వాడేవారు. పదమూడేళ్ళ కృషితో 1969లో ప్రాజెక్ట్ నిర్మాణం పూర్తయింది. 1972 నాటికీ ప్రాజెక్ట్ లో గేట్లు అమర్చారు. ప్రాజెక్ట్ నిర్మాణ సమయంలో ప్రమాదాల బారినపడి 154 మంది కూలీలు, 20 మంది ఇతర సిబ్బంది కన్నుమూశారు. 1956లో కుడి నుంచి ఎడమ వైపుకు వస్తున్న పడవ ప్రమాదానికి గురై మునిగిపోయింది. ఈ ప్రమాదంలో ఏడుగురు



భూములను సస్యశ్యామలం చేస్తున్న సాగర్

మరణించగా, 1964లో తాత్కాలికంగా నిర్మించిన ఆనకట్ట వరద ఉధృతికి కొట్టకుపోయి కొందరు మరణించారు. 1967లో నిర్మాణం కోసం కట్టుకున్న పరంజాలు కూలిపోయి ఎంతోమంది కార్మికులు అసువులుబాశారు. 52 గ్రామాలు నీట మునిగిపోయాయి. 24 వేల మంది ప్రజలు సాగర్‌కు తమ భూములను అప్పగించి నిర్వాసితులుగా మారారు. ఇందరి సహకారంతో 408 (మిగతా 56వ పేజీలో)



నిర్మాణంలో ఉన్న సాగర్

# మానవ నిర్మిత మహాసాగరం

(56వ పేజీ తరువాయి)

టి.ఎం.సిల నీటి నిల్వ సామర్థ్యంతో 124.66 మీటర్ల ఎత్తు, 97.5 మీటర్ల వెడల్పుతో, 26 క్రస్ట్ గేట్లతో ప్రపంచంలోనే అతి పెద్ద రాతి కట్టడం నిర్మాణం జరిగింది. సాగర్ కుడి కాల్వ ప్రపంచంలోనే అతి పెద్ద సేద్యపు నీటి కాల్వ. ఆనకట్ట వెనుక ఉన్న సరస్సు ప్రపంచంలోని మానవ నిర్మిత సరోవరాల్లో మూడో స్థానంలో ఉంది. సమిష్టి కృషితో మానవ శక్తి సాధించిన అపూర్వ విజయమిది.



సాగర్ ప్రాజెక్టు వ్యూహ చిత్రాన్ని పరిశీలిస్తున్న ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ



సాగర్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలు

# మేయర్ పదవికి వన్నెతెచ్చిన నాగరాజు

కె. శ్రీనివాసరావు, మేజర్‌న్యూస్, గుంటూరు కార్పొరేషన్

నగర పరిపాలనలో నూతన ఒరవడిని సృష్టిస్తూ యువతలో సామాజిక సేవా చైతన్యాన్ని కల్గిస్తూ గుంటూరు నగర మేయర్ కన్నా నాగరాజు ముందుకు వెళుతున్నారు. గుంటూరు మున్సిపల్ కార్పొరేషన్‌కు మూడవ మేయర్‌గా ఎన్నికైన కన్నా నాగరాజు అతి చిన్న వయసులోనే (26) మేయర్ పీఠాన్ని అధిష్టించిన వ్యక్తిగా పేరుపొందారు. బి.ఇ. మెకానికల్ కోర్సు పూర్తి చేసిన మేయర్ నాగరాజు







తన తండ్రి రాష్ట్ర రవాణా శాఖామంత్రి కన్నా లక్ష్మీనారాయణ నుండి రాజకీయ పరిజ్ఞానం సంపాదించారు. 2005 సెప్టెంబర్‌లో జరిగిన మున్సిపల్ ఎన్నికల్లో నగరంలోని 23వ డివిజన్ నుండి కార్పొరేటర్‌గా గెలుపొంది, అత్యధిక కార్పొరేటర్ల మద్దతుతో మేయర్ పీఠం అధిష్టించారు. పక్కా ప్రణాళికతో నగర పాలన కొనసాగిస్తూ గత రెండున్నరేళ్ళ కాలంలో నగరాభివృద్ధికి ఎన్నో సాహసోపేత నిర్ణయాలు తీసుకున్నారు. తొలిసారిగా రాజకీయ రంగంలోకి వచ్చిన మేయర్ కన్నా నాగరాజు తొలినాళ్లలో ప్రజాసమస్యల పరిష్కారానికి కొంత కసరత్తు చేశారు. ప్రజలకు అవసరమైన సదుపాయాలపై దృష్టిపెట్టి విశాలవంతంగా విస్తరించిన నగరంలో మారుమూల ప్రాంతాలకు సక్రమంగా మంచినీటి సరఫ రా జరగని విషయాలపై శ్రద్ధ వహించి కాలం చెల్లిన పైపులైన్ల స్థానంలో నూతన పైపులైన్లను అమర్చి అన్ని ప్రాంతాలకు మంచినీటిని సరఫరా చేయడంతో పాటు నీటి వృధాను అరికట్టారు.

### మేయర్‌గా నాగరాజు తీసుకున్న నిర్ణయాలలో ప్రధానమైనవి...

నగరానికి సంవత్సరాల తరబడి మంచినీటిని అందించడంలో ప్రధాన భూమిక వహిస్తున్న సంగం జాగర్లమూడి, తక్కెళ్ళపాడులలోని భారీ తరహా మంచినీటి ట్యాంక్‌లలో గత 60 సంవత్సరాలుగా పేరుకుపోయిన వ్యర్థాలను శుభ్రం చేయించి నగరంలోని ప్రజలు, ప్రముఖుల నుండి ప్రశంసలు పొందారు. నగరానికి మంచినీరు అందించడంలో ప్రధాన పాత్ర వహిస్తున్న ఈ ట్యాంక్‌లను శుభ్రం చేయించాలన్న ఆలోచన గత 60 ఏళ్ళలో ఏ ఒక్క పాలకునికి రాకపోవడం గమనార్హం. దీంతోపాటు నగరపాలకసంస్థకు ఉద్దేశ్య పూర్వకంగా పన్నులు ఎగగొడుతున్న బడాబాబులపై యుద్ధం ప్రకటించి సంవత్సరాలుగా పేరుకుపోయిన మొండి బకాయిలను సైతం మేయర్ వసూలు చేయించారు. పన్నులు వసూలు చేసే విషయంలో కఠినంగా వ్యవహరించిన మేయర్, పేదవారి పట్ల దయతో వ్యవహరించారు. రాజకీయాల గురించి తెలియని కన్నా నాగరాజు రాజకీయంగా చైతన్యవంతమైన గుంటూరు నగరంలో మేయర్‌గా పరిపాలించడం అసాధ్యమని విమర్శించిన వారికి సమాధానంగా నగరపాలనలో అతి కొద్ది కాలంలోనే సమర్థుడైన మేయర్‌గా ప్రజల ప్రశంసలు పొందారు. పాలనతోపాటు ఎంతోమంది విద్యార్థులకు వ్యక్తిగతంగా ఆర్థిక సహాయం అందించారు. పేద కుటుంబాల్లో పుట్టి ఉన్నత చదువులు అభ్యసించాలనే విద్యార్థులకు లేదనకుండా ఆర్థికసాయం అందజేశారు. పరిపాలనలో రాజీపడని మేయర్ నగర పాలక సంస్థ అధికారులలో దాగిఉన్న అవినీతిని రూపుమాపి ప్రజలకు సేవలందించే విధంగా మార్పుతీసుకొచ్చారు. కన్నా యూత్ తరుపున యువకులను ప్రోత్సహిస్తూ వారుచేస్తున్న సామాజిక సేవా కార్యక్రమాలకు అండగా నిలుస్తున్నారు.

### అభివృద్ధి పనులకు నిధులను రాబట్టడంలో ముందంజ..

నగరంలో పెద్ద ఎత్తున అభివృద్ధి పనులను చేపట్టేందుకు నిధులను సమీకరించుకునే విషయాల్లో మేయర్ నాగరాజు ఎంతో చాకచక్యంగా వ్యవహ రించేవారు. నగరపాలకసంస్థలో అందుబాటులో ఉన్న నిధులతో స్థానిక డివిజన్లలో అభివృద్ధి పనులు చేపట్టడంతో పాటు, శాశ్వత ప్రాతిపదికన చేపట్టే అభివృద్ధి పనులకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి గ్రాంట్ల రూపంలో నిధులను రాబట్టడంలో ఎంతో నైపుణ్యతతో వ్యవహరించేవారు. నగరంలోని 20 మురికివాడలకు మహర్దశ కల్పించేందుకు కమిషనర్ సిద్దార్థ జైన్‌తో కలిసి ఢిల్లీ వెళ్ళి కేంద్ర పట్టణాభివృద్ధి సంస్థ ద్వారా 20 కోట్లను మంజూరు చేయించుకొచ్చారు.

### ప్రజాప్రతినిధులు, అధికారులతో వ్యవహరించేతీరు...

నగరాన్ని అభివృద్ధి పరిచే క్రమంలో ప్రజాప్రతినిధులందరినీ కలుపుకుని వెళ్ళడంలో మేయర్ సఫలీకృతమవుతున్నారు. నగరంలో ఏ ఒక్క అభివృద్ధి చేపట్టినా పార్లమెంట్, శాసన సభ్యులతో పాటు కార్పొరేటర్లతో కలిసి కార్యక్రమాలు నిర్వహించేవారు. ప్రభుత్వ శాఖల అధికారులతో నిత్యం సత్సంబంధాలు కొనసాగిస్తూ నగరపాలకసంస్థను అన్ని వర్గాల ప్రజలకు అందుబాటులోకి తీసుకెళ్తున్నారు. నగరంలోని ప్రజలకు ఎప్పుడైనా ఇబ్బందులు ఎదురైన పక్షంలో స్వయంగా పోలీసు, రెవిన్యూ శాఖాధికారులతో సంప్రదించి సమస్యలను పరిష్కరించడంలో కృషి చేస్తున్నారు.

# దళితులు విద్యతో పాటు భారత రాజ్యాంగాన్ని చదవాలి

చిలకా సాంబయ్య, మేజర్‌న్యూస్, గుంటూరు రూరల్

రాజ్యాంగంలో దళితులకు పొందు పరిచిన హక్కులను, బాధ్యతలను, చట్టాలను తెలుసుకునేందుకు ప్రతి ఒక్కరూ భారత రాజ్యాంగాన్ని చదవ వలసిన అవసరం ఎంతైనా ఉందని దళిత నాయకుడు కొర్రపాటి చెన్నకే శవులు అభిప్రాయపడ్డారు. మేజర్ న్యూస్‌తో ఆయన ముచ్చటిస్తూ.. ఎస్.సి, ఎస్.టి.లు అగ్రవర్ణాల దుర హంకారానికి బలైపోతున్నారని దళి తుల మాన, ప్రాణ రక్షణకు ఎటు వంటి భంగం వాటిల్లకుండా భారత రాజ్యాంగంలో లిఖించబడిన చట్టాలు వాటికి సంబంధించిన పలు సెక్షన్లను ప్రభుత్వం సక్రమంగా అమలు జరిపితేనేగాని ఈ సమాజంలో అగ్రవర్ణాల దాటికి దళితులు తట్టుకో గలరన్నారు. కొంతమంది స్వార్ధ పూరిత రాజకీయంతో దళిత హక్కుల పరిరక్షణ చట్టాలను సక్రమంగా అమలు చేయలేకపోతున్నారు. ఇప్ప టి వరకు చట్టసభలలో సముచిత స్థానం పొందలేని దళిత వర్గాల ప్రజలకు విద్య, వైద్య, ఉపాధి రంగా లలో కూడా తీవ్రమైన అన్యాయాలు జరుగుతూనే ఉన్నాయి. దళితులకు చెందవలసిన ప్రభుత్వ సంక్షేమ ఫలాల అమలు అగ్రవర్ణాల కనుసైగ ల్లో అమలు జరుగుతున్నాయి. పీడిత ప్రజలకు న్యాయం చేయవలసిన ప్రభుత్వ ఉన్నతాధికారులు కేవలం చిన్న చితక కారణాలతో వారి అభి వృద్ధికి అవరోధాలు కలిగిస్తున్నారు. దళితుల మాన ప్రాణాలను కాపాడ టానికి ప్రభుత్వం చట్ట సభలలో ప్రవేశపెట్టిన ఎస్.సి., ఎస్.టి. కమి షన్ చట్టాలను సక్రమంగా అమలు జరపటానికి పోలీసు అధికారులు వెనుకంజ వేస్తున్నారన్నారు. దళి తులు రక్షణకోసం 'రక్షక' భటులను ఆశ్రయిస్తుంటే వీరి అమా యక త్వాన్ని అడ్డుపెట్టుకొని 'రక్ష కులు' భక్షకులుగా మారుతున్నారు. దళి తులు ఎంతో ఉన్నతమైన చదువు లు చదివి వివిధ శాఖలలో మంచి ఉద్యోగాలు చేస్తున్నప్పటికీ వీరిపై లైంగిక, కులదూషణ, వర్గ దూషణలు తదితర వేధింపులు నమోదు కాక తప్పటం లేదన్నారు. ప్రతి దళిత విద్యా ర్ధీ వారి చదువు లతోపాటు డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ వ్రాసిన భారత రాజ్యాంగాన్ని చదవ వలసిన అవసరం ఎంతైనా ఉంది. అంటరా నితనం, సాంఘిక బహిష్క రణలు, కులదూ షణ, కార్పొరేట్ సంస్థలలో దళిత విద్యార్థులు గురవుతున్న వేధింపులు, కూలీ, నాలీ చేసుకుంటూ కుటుంబా లను పోషించే దళిత మహిళలు, పెత్తందారీల కామ, క్రోధాలకు బలైపోతూ విగత జీవులుగా మిగిలిపోయే వారిని రక్షించటానికి దళిత ఉద్యమ బాటను చేపట్టడం జరిగింది.

జిల్లాలో ఏ ప్రాంతంలోనైనా ఎస్.సి., ఎస్.టి., ముస్లిం, మైనార్టీ వర్గాల ప్రజలు అన్యాయాలకు గురైతే తక్షణమే ఆ ప్రాంతానికి వెళ్ళి వారికి సరైన న్యాయం చేకూర్చటమే తమ ధ్యేయం అని చెప్పారు.





# క్రియాశీల పాత్రపోషిస్తున్న సయ్యద్ మహబూబ్

బుర్ల శ్రీనివాసరావు, మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

సత్తెనపల్లి పట్టణంలో కాంగ్రెస్ పార్టీ బలోపేతాని పట్టణ యూత్ అధ్యక్షులు సయ్యద్ మహబూబ్ తనవంతు కృషి చేస్తూ పట్టణంలో కాంగ్రెస్ పార్టీ పటిష్ఠంగా ఉండటానికి క్రీయాశీల పాత్ర పోషిస్తున్నాడు. విద్యార్ధిదశ నుండి రాజకీ యాల పట్ల ఆసక్తిని పెంచుకుని ప్రజాసేవలో పరితపిస్తు న్నాడు. యువజన కాంగ్రెస్‌లో కీలకపదవులు నిర్వహించి కాంగ్రెస్ పార్టీ ఎన్నికల్లో విజయానికి శక్తివంచన లేకుండా తనవంతు పాత్ర పోషిస్తున్నారు. స్థానిక ఎమ్మెల్యేకు నమ్మిన బంటుగా ఉంటు అభివృద్ధి కార్యక్రమాల్లో పాలు పంచుకుంటున్నారు. పలు సేవాకార్యక్రమాలు చేస్తూ పేద, బడుగు, బలహీన, మైనార్టీ వర్గాల సంక్షేమం కోసం కృషి చేస్తున్నాడు. ప్రభుత్వం చేపట్టే పధకాలను ప్రజల్లోకి తీసుకువెళ్లి పార్టీ పట్ల ప్రజలకు విశ్వాసం కలిగేలా పాటుపడుతున్నాడు. యువజన కాంగ్రెస్ చేపట్టే కార్యక్రమాలను విజయ వంతం చేస్తూ సభ్యత్వ నమోదులో తనవంతు పాత్ర పోషిస్తున్నాడు. ఎన్నో సంక్షేమ కార్యక్రమాలను ప్రజలకు చేరువ చేసి పలువురి అభినందనలు అందుకుంటున్నాడు.



సయ్యద్ మహబూబ్

# సహకార రంగంలో ఆణిముత్యం సంగం డెయిరీ

తేళ్ళూరి రామకోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

పాల ఉత్పత్తుల సరఫరాలో దక్షిణ భారతదేశంలోనే సంగం డెయిరీ అగ్రగామిగా ఉంది. మూడు దశాబ్దాల కింద ప్రభుత్వ సహాయ సహకారాలతో, స్వల్ప పెట్టుబడితో రైతులు సహకారరంగంలో దీన్ని స్థాపించుకున్నారు. జాతీయ స్థాయిలో పాడి పరిశ్రమను అభివృద్ధి పరచాలన్న ధ్యేయంతో పాల వెల్లువ పథకానికి కేంద్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. పథకం అమలులో భాగంగా



సంగం డెయిరీ

1972వ సంవత్సరంలో దేశంలోని 22 జిల్లాలను ఎంపిక చేశారు. అప్పటి కేంద్ర మంత్రి కొత్త రఘురామయ్య కృషితో రాష్ట్రంలో గుంటూరు జిల్లా ఒక్కటే ఎంపికైంది. ఇందుకోసం వడ్లమూడి గ్రామం వద్ద 90 ఎకరాల స్థలంలో డెయిరీని ఏర్పాటుచేశారు. డెయిరీ ఏర్పాటుకు పాల ఉత్పత్తిదారులు రూ.1.50 లక్షలు, జాతీయ పాడిపరిశ్రమాభివృద్ధి సంస్థ తరపున రూ.2.29 కోట్లు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల తరపున రూ.81 లక్షలను సమకూర్చారు. డెయిరీ అభివృద్ధి సంస్థవారు రూ.1.54 కోట్లు దీని అభివృద్ధి కోసం కేటాయించారు. అన్ని హంగులతో అధునాతన పరికరాలతో 1976లో నిర్మాణం పూర్తయింది. రెండున్నర లక్షల లీటర్ల పాలు ప్రాసెసింగ్, 22 లక్షల టన్నుల పాలపొడి, 20 టన్నుల టేబుల్ బట్టర్, 12 టన్నుల నెయ్యి తయారుచేసే సామర్థ్యంతో దీన్ని నిర్మించారు. అదనంగా సేకరించిన పాలను మద్రాసు, (మిగతా 61వ పేజీలో)

# సహకార రంగంలో ఆణిముత్యం సంగం డెయిరీ

సంగం డెయిరీ లోగో

(60వ పేజీ తరువాయి)

కోల్‌కతా నగరాలకు తరలించి జాతీయ పాలగ్రిడ్‌లో భాగస్వామ్యం సంపాదించాలన్నది లక్ష్యం. పలువురి సహకారంతో నెలకొల్పిన ఈ డెయిరీకి ఏ పేరు పెట్టాలన్న విషయంపై పలు తర్జనభర్జనలు జరిగి సమీపంలో ఉన్న శ్రీసంగ మేశ్వరస్వామి ఆలయంపై దృష్టిసారించారు. ఆలయంలోని మూలవిరాట్ సంగమేశ్వరుడి పేరు డెయిరీకి పెట్టాలని రైతులు ఎక్కువమంది సూచించడంతో సంగం డెయిరీ అని నామకరణం చేశారు. 1977 జూన్‌లో డెయిరీ అన్ని లాంఛ నాలతో ప్రారంభమైంది. 1977 నుంచి 79 వరకు యడ్ల పాటి వెంకట్రావు వ్యవస్థాపక ఛైర్మన్‌గా వ్యవహరించారు. 1979 నుండి 1985 వరకు ధూళిపాళ్ళ వీరయ్యచౌదరి, 1985 నుండి 1986 వరకు కుర్రా వీరయ్యచౌదరి డెయిరీ ఛైర్మన్‌లుగా పనిచేశారు. 1986లో కొద్ది కాలంపాటు కిలారి రాజన్ బాబు ఛైర్మన్‌గా పదవి బాధ్యతలు నిర్వహిం చారు. 1987 నుండి 1989 వరకు కొల్లా వీరయ్య ఛైర్మన్ గా ఉండగా అనంతరం రెండు సంవత్సరాల పాటు ఎన్నికైన పాలక వర్గం లేదు. 1992లో ధూళిపాళ్ళ వీరయ్యచౌదరి మరోసారిఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. 1994 నుండి 1996 వర కు ధూళిపాళ్ళ నరేంద్రకుమార్ ఛైర్మన్‌గా పనిచేశారు. 1995 నుండి డెయిరీ ఛైర్మన్‌గా కిలారి రాజన్‌బాబు పలు కీలక నిర్ణయాలతో అభివృద్ధిపథంలో సాగేందుకు కృషిచేస్తున్నా రు. మేనేజింగ్ డైరెక్టర్‌గా కె.గోపినాధ్ పనిచేస్తు న్నారు.



ఛైర్మన్ కిలారి రాజన్‌బాబు



డెయిరీ పాల ఉత్పత్తులు

# మనసున్న మనిషి మా ఆంజనేయులు

సయ్యద్ సాబిర్ హుసేన్,
మేజర్ న్యూస్, వినుకొండ.

దేవుడు కొందరికి సంపద ఇస్తాడు, స్పందించే హృదయాన్ని ఇవ్వడు. దేవుడు మరి కొందరికి మంచి మనసు ఇస్తాడు. కాని సంపదను ఇవ్వడు. సంపద, దయార్ధ హృదయం కలగలిసిన వారు చాలా అరుదుగా ఉంటారు. ఆ కోవకు చెందిన వారే శివశక్తి ఫౌండేషన్ అధినేత జి.వి. ఆంజనేయులు. ఉదయం సూర్యుడి తో పాటు నిద్రలేచి రాత్రి చంద్రుడితో పాటు నిదురోయే వరకు నిత్యం ప్రజల మధ్య గడపడం ఆంజనేయులుకు నిత్యకృత్యం. వినుకొండ నియోజక వర్గ ప్రజలకు అశేష (మిగతా 62వ పేజీలో)



జివి ఆంజనేయులు, లీలావతి

(61వ పేజీ తరువాయి)

సేవలందిస్తున్న ఆయన ఎవరికి నష్టం వచ్చినా, కష్టం కలిగిన అక్కడ వుంటారు. కేవలం సానుభూతి వచనాలకే పరిమితం కాకుండా సహానుభూతి కూడా కలిగి వున్న మనసున్న మనిషి ఆంజనేయులు. అవసరమైన వారిని ఆర్థికంగా ఆదుకోవడమే గాక హార్ధికంగా తోడు నిలవడం ఆంజనేయులు వ్యక్తిత్వం. ఆయన చేతి లో అధికారం లేదు. ఆయన పార్టీకీ అధికారం లేదు. అయినప్పటికి ప్రజలు ఆంజనేయులుకు తమ సమస్యలను చెప్పుకుంటారు. శివశక్తి పౌండేషన్ ద్వారా సేవా కార్యక్రమాలు చేపట్టడం, తెలుగుదేశం పార్టీ నియోజకవర్గ ఇన్‌చార్జిగా ప్రజా ఉద్యమాలు నిర్మించడమే అందుకు కారణం.

# మనసున్న మనిషి మా ఆంజనేయులు

## వ్యాపార వేత్తగా..

వినుకొండ నియోజకవర్గంలోని ఈపూరు మండలంలోగల ఇనిమెళ్ళ ఆంజనేయుల స్వగ్రామం. గోనుగుంట్ల సత్యన్నారాయణ, వెంకటచలవమ్మ తల్లిదండ్రులు. పుట్టింది 1965 జులై 14. గణితంలో బిఎస్సీ డిగ్రీ పట్టా పుచ్చుకున్న ఆయన ప్రస్తుతం చేస్తున్న వ్యాపారం శివశక్తి బయో ప్లాంటెక్ లిమిటెడ్. దేశవ్యాపితంగా 18రాష్ట్రాలలో 70 బ్రాంచిలు కల్గిన ఈ సంస్థను అహర్నిశలు కష్టపడి దేశంలోనే అగ్ర గ్రామి సంస్థగా తీర్చిదిద్దారు. వ్యాపార వేత్తగా ఎన్నో అవార్డులు సాధించారు.

## సమాజ సేవకునిగా..

జన్మ భూమి రుణం తీర్చుకోవడం కోసం కులమత రాజకీయాలకతీతంగా 1998లో శివశక్తి లీలా అండ్ అంజన్ పౌండేషన్ అనే స్వచ్ఛంద సంస్థను స్థాపించి ఎన్నో ప్రజాహిత కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. ఇప్పటి వరకు రాష్ట్రంలో ఎవరూ చేపట్టని విధంగా ఉచిత నేత్ర శిబిరాలను ఏర్పాటు చేసి అంధత్వ రహిత నియోజకవర్గంగా వినుకొండను తీర్చి దిద్దడానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు. ఇప్పటి వరకు సుమారు 80వేలకు పైగా కంటి పరీక్షలు జరిపి 50వేల మందికి ఉచితంగా మందులను పంపిణీచేశారు. కళ్ళజోళ్ళను అందించారు. పదివేల మందికి పైగా ఉచిత కంటి ఆపరేషన్లు చేయించి ఎందరి జీవితాల్లోనో వెలుగులు నింపారు. ఎన్టీఆర్ ఆరోగ్య రథం ద్వారా సాధారణ వ్యాధులకు సైతం వైద్యసేవలను అందిస్తున్నారు. 2003లో తీవ్ర కరువు వచ్చినప్పుడు 8వేల కుటుంబాలకు 10 కేజీల చొప్పున 860క్వింటాళ్ళ బియ్యాన్ని పంపిణీ చేశారు. అగ్ని ప్రమాదాలు సంభవించినప్పుడు ప్రభుత్వం కంటే ముందుగానే స్పందించారు. ఒక వైపు నిరుపేద బడుగు బలహీ న వర్గాలకు సాయం అందజేస్తునే వారికి ఉపాధి కల్పించడానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నారు. శివశక్తి బయోప్లాంట్స్‌లో వినుకొండ ప్రాంతానికి చెందిన వెయ్యి మందికి ఉద్యోగ అవకాశాలు కల్పించారు. సైకిల్ రిక్షాలు,ఇస్త్రీ పెట్టెలు, కనకతప్పెట్లతో పాటు ఉద్యోగ మేళ ఏర్పాటు చేసి నిరుద్యోగులకు ఉపాధి కల్పిస్తున్నారు. వినుకొండ పట్టణ ప్రజలకు ట్యాంకర్ల ద్వారా మంచినీటిని అందించిన ఆంజనేయులు ప్రజల మన్ననలను అందుకుంటున్నారు.

## రాజకీయ నాయకుడిగా..

విద్యార్థి దశ నుండి చురుకుగా రాజకీయాలలో పాల్గొంటున్న ఆంజనేయులు ప్రస్తుతం తెలుగుదేశం పార్టీ నియోజకవర్గ ఇన్‌చార్జిగా వ్యవహరిస్తున్నారు. పార్టీ క్రియాశీల సభ్యత్వంలో రాష్ట్రంలోనే ప్రధమ స్థానం పొందిన ఆంజనేయులు అధినేత మెప్పు పొందారు.



బెల్టు షాపులకు వ్యతిరేకంగా తలపెట్టిన నారీభేరి కార్యక్రమాన్ని రాష్ట్రంలోనే మొదటిసారిగా వినుకొండ నుండి ప్రారంభించి తన ప్రత్యేకతను చాటుకున్నారు. వరికి మద్దతు ధర కోసం పోరాటం సలిపారు. ఇంటింటికి తెలుగుదేశాన్ని విజయవం తంగా నిర్వహించారు. ఇలా ప్రతి కార్యక్రమాన్ని విజయవంతం చేయడం ఆంజనేయులు చిత్తశుద్ధికి నిదర్శనం.

దేవుడు ఆంజనేయులుకు సంపద ఇచ్చాడు. స్పందించే హృదయాన్ని ఇచ్చాడు. అందుకే ఆంజనేయులు ప్రజా నాయకుడయ్యాడు.

## మంత్రులు


పురంధ్రేశ్వరి
కేంద్ర మానవవనరుల శాఖ


కన్నా లక్ష్మీనారాయణ
రవాణాశాఖ


కాసు కృష్ణారెడ్డి
పౌరసరఫరాల శాఖ


ఎం.హనుమంతరావు
రాజీవ్ విద్యామిషన్


ఎం.వి.రమణారావు
మౌలిక సదుపాయాల అమలు శాఖ

## పార్లమెంటు సభ్యులు


రాయపాటి సాంబశివరావు
గుంటూరు


బాలశౌరి
తెనాలి


ఎం.రాజమోహనరెడ్డి-
నరసరావుపేట


జెడి శీలం
రాజ్యసభ

## ఎమ్మెల్సీలు


మహమ్మద్ జానీ


సింగం బసవపున్నయ్య


లక్ష్మణరావు


టిజివి కృష్ణారెడ్డి


డా.రాయపాటి శ్రీనివాస్


చిగురుపాటి వరప్రసాద్


వెంకటేశం
కలెక్టర్


కాంతీలాల్ దండే
జాయింట్ కలెక్టర్


మహేష్ చంద్ర లడ్హా
ఎస్పి


కన్నా నాగరాజు
మేయర్


తాడిశెట్టి మురళి
డిప్యూటీ మేయర్


సిద్ధార్ధ జైన్
కమిషనర్

## శాసనసభ్యులు


నంబూరి సుభాని
గుంటూరు-1


తాడిశెట్టి వెంకట్రావ్
గుంటూరు-2


రావివెంకటరమణ
ప్రత్తిపాడు


మర్రి రాజశేఖర్
చిలకలూరిపేట


మక్కెన మల్లికార్జునరావు,
వినుకొండ


పిన్నెల్లి లక్ష్మారెడ్డి
మాచర్ల


జంగా కృష్ణమూర్తి
గురజాల


యర్రం వెంకటేశ్వరరెడ్డి
సత్తెనపల్లి


నాదెండ్ల మనోహర్
తెనాలి


గుదిబండి వెంకటరెడ్డి
దుగ్గిరాల


గాదె వెంకటరెడ్డి
బాపట్ల


ధూళిపాళ్ళ నరేంద్రకుమార్
పొన్నూరు


మాణిక్యవరప్రసాద్
తాడికొండ


సతీష్‌పాల్‌రాజ్
వేమూరు


దేవినేని మల్లికార్జునరావు
రేపల్లె

# ఆదర్శనీయుడు

## డాక్టర్ టి.వి.రావు

చిలకా సాంబయ్య, మేజర్‌న్యూస్, గుంటూరు రూరల్

స్వచ్ఛమైన ప్రజా సేవ కోసం, నిశ్చలమైన ప్రభుత్వ ఉద్యోగాన్ని త్యాగం చేసిన ప్రజామనిషి డాక్టర్ టీ.వి.రావు. ఎం.ఎస్.సి. విద్యతోపాటు పిహెచ్.డి. చేసి డాక్టరేట్ పట్టాను పొందిన ఈయన ఎ.పి. పి.ఎస్.సి. ద్వారా గ్రూప్-1 సర్వీస్‌కు ఎన్నికై వాణిజ్య పన్నుల శాఖలో డిప్యూటీ కమిషనర్‌గా, రీజనల్ విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ ఆఫీసర్‌గా విధులను నిర్వహిం చారు. గత 13 సంవత్సరాలుగా గుంటూరు పట్టణ శివారులో దాక్షిణ్య సంస్థను నెలకొల్పి దాని ద్వారా మానసిక వికలాంగుల శిక్షణా తరగతులను నిర్వహి స్తున్నారు. చిరుప్రాయంలో మానసిక అంగవైక ల్యంతో ఆరిపోయే పసి జీవితాలకు తనదైన ఆశయాలతో వెలుగునింపి ఇప్పటివరకు కొన్ని వందల మంది మానసిక రోగులకు ఆరాధ్య దైవంగా కొలవబ డుతున్నాడు.

సాంఘిక సేవలో మ ధర్ థెరిస్సా తనయు డుగా మంచి గుర్తింపును తెచ్చుకున్న డాక్టర్ టి.వి.రావు తెలుగుదేశం పార్టీలో చేరి అనతి కాలంలోనే పార్టీలో ఉన్నత పదవులను పొందగ లిగారు. రాష్ట్రంలోనే కాకుండా వివిద రాష్ట్రాలలో, వివిధ దేశాలలో డాక్టర్ టి.వి.రావు సేవలను తెలుసుకున్న ఆదర్శ భావాలు గలిగిన దాతలు సంతోషంగా వీరు చేపట్టే కార్యక్రమాలకు చేయూత నిస్తున్నారు. ప్రముఖ సినీ నటుడు చిరంజీవి కూడా డాక్టర్ టి.వి.రావు సేవలకు చేయూతనిస్తూ తన మనస్సులో ఉన్న సంఘసేవ కోరికలను టి.వి.రావు ద్వారా తీర్చుకుంటున్నారు. ఉన్నతమైన భావాలు కలిగిన ఈయనకు ప్రతీ మనిషి జేజేలు పలుకు తున్నారు. డాక్టర్ టి.వి.రావు చేసిన సేవలకు గుర్తుగా కేంద్ర ప్రభుత్వం మినిష్టరీ ఆఫ్ సోషల్ జస్టిస్ అవార్డునిచ్చి సత్కరించింది. అదేవిధంగా ఆంధ్రప్రదేశ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ హైదరాబాదు వారు ఉత్తమసేవా అవార్డును ప్రధా నం చేశారు. ఐ.ఎఫ్.సి.ఎ.ఐ. డీమ్డ్ యూనివర్సిటీ న్యూఢిల్లీ వారు విశిష్ట సమాజసేవ అవార్డును, గాడ్‌ఫ్రే పిలి ప్స్ ఫౌండేషన్ అవార్డులను జాతీయ స్థాయిలో ఇచ్చి సత్క రించారు. తెలుగుదేశం పార్టీలో మంచి



చంద్రబాబు నాయుడుతో డాక్టర్ టి.వి.రావ్



గుర్తింపు పొంది 2008వ సంవత్సరంలో జరిగిన రాజ్యసభకు ఏకైక అభ్యర్థి ఎంపికకు ఈయన పేరును పార్టీ అధిష్టానం పరిశీలించిందంటే ప్రత్యేకించి ఈయన పార్టీకి చేసిన సేవలు గురించి చెప్పనవసరంలేదు. అదేవిధంగా ఆటల పోటీల లో మంచి ప్రావీణ్యతను సంపాదించుకుని అనేక జిల్లా, రాష్ట్రస్థాయి బహుమతులను పొందారు. 1997 నుండి ఇప్పటి వరకు దాదాపు పదివేల మంది నర్సరావుపేట, గుంటూరు, పొన్నూరు, తెనాలి, బాపట్ల, సత్తెనపల్లి ప్రజల కు ఉచిత వైద్య సేవలను అందించారు. అదేవిధంగా దాదాపు ఏడువేల మంది చేత రక్తదానం చేయించి ప్రాణా పాయస్థితిలో ఉన్న రోగులకు ప్రాణం పోసిన మానవత్వం కలిగిన మానవతారాధ్యుడు. అదేవిధంగా బడుగు, బల హీనవర్గాల సంక్షేమం కోసం అనేక గ్రామాల్లో వేలకొలది అవగాహన సదస్సులను ఏర్పాటు చేసి వీటి ద్వార పేదవా రికి జీవనోపాధిని కల్పించారు. పోలీసు ఉన్నతాధికా రుల చేత చైతన్య క్యాంపులను వందలకొద్ది ఏర్పాటు చేసి పోలీ సులకు, ప్రజలకు స్నేహభా వాలు నెలకొల్పారు డాక్టర్ టి. వి.రావు. ఇంతటి మహోన్నత వ్యక్తి ఇంకా పార్టీ పరంగా అ నేక పదవులు అందుకుంటారని ప్రజలు కోరుకుంటు న్నారు.

# శ్రీరామ చంద్రుడు ప్రతిష్టించిన సిద్ధి వినాయకుడు

సయ్యద్ సాబిర్ హుసేన్, మేజర్‌న్యూస్, వినుకొండ

అది త్రేతా యుగం. శ్రీరామ చంద్రుడు సీత జాడ తెలుసు కొనేందుకు అన్వేషిస్తున్న తరుణం. కమఠపు రాజైన జఠా యువు శ్రీరామ చంద్రుడికి సీతను రావణాసురుడు అపహరించిన విషయం చెప్పింది ఈ కొండ మీదనే. కనుకనే ఈ కొండకు వినుకొండగా పేరు వచ్చిందని మనం వింటున్నదే కదా.

రావణసంహారం అనంతరం శ్రీరాముడు ఇక్కడి కొండపై రామలింగేశ్వరస్వామిని, కొండ దిగువన మెట్ల వద్ద శ్రీ సిద్ధి వినాయక స్వామిని స్వయంగా ప్రతిష్టించి సేవించినట్లు పురాణ పండితుల ద్వారా తెలుస్తోంది. ప్రపంచంలోని కోట్లాది భక్తులచే పూజింపబడే శ్రీరామ చంద్రుడే సాక్షాత్తు ఈ వినాయక స్వామి విగ్రహాన్ని ప్రతిష్టించడాన్ని ఇక్కడి ప్రజలు ఎంతో అదృష్టంగా భావిస్తారు. అందుకే వినుకొండ చుట్టుప్రక్కల ప్రాంతాల ప్రజలు తమ కోరికలు తీర్చే ఈ స్వామిని 'శుభకరుడు' అని పిలుస్తారు. ఎంతో పురాతనమైన ఈ సిద్ధి వినాయకుడి విగ్రహం కొన్నాళ్ల క్రితం వరకు కొండ దిగువన గల పిచ్చి చెట్ల మధ్య ఎలాంటి ఆదరణ లేకుండా పడి ఉండేది. ఈ విషయాన్ని గుర్తించిన కొందరు భక్తులు ఈ దేవగణాధీశుడిని పునరుద్ధరించి పూర్వ వైభవాన్ని తీసుకువచ్చారు.

వినుకొండలో స్వయంభువుగా వెలిసిన ఈ సిద్ధి వినాయకుడు అశేష ప్రజానికం చేత విశేషంగా పూజలందుకుంటున్నాడు. త్రిశక్తి స్వరూపుడైన ఈ లంబోదరుడు గౌరీ దేవి స్వరూపంగా కొలిచే వేపచెట్టు, లక్ష్మి స్వరూపంగా ఆరాధించే రాగి చెట్టు, విష్ణు రూపంగా పూజించే మర్రిచెట్టు మధ్య వాయుత్వంతో వెలియడంతో స్వామిని వక్ష గణపతిగా భక్తులు కొలుస్తారు. అందుకే ఈ ప్రాంత రైతులు స్వామిని అభిషేకించిన విత్తనాలను పొలాల్లో చల్లితే తమ పొలాల్లో పంటలు బాగా పండుతాయని, ఎలాంటి చీడపీడలు పట్టకుండా నమ్మకంగా చేతికి పంట అంది వస్తుందని గాఢంగా నమ్ముతారు. పడమర వైపున ఏనుగు తొండం ఆకారంలో శిల రూపంలో మధ్యలో



పూజలందుకుంటున్న సిద్ధి వినాయక స్వామి

సహజ సిద్ధంగా ఏర్పడిన దీపం చిమ్మె స్వామికి హారతిస్తున్నట్లు కనిపించడం ఈ విగ్రహం ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. ఏకశిలా విగ్రహమైన అతి పురాతనమైన ఈ విగ్రహం అరుదైనదని పురాతత్వ శాస్త్రవేత్తలు చెబుతున్నారు.

ఈశాన్యంగా ఉన్న పుష్కిరిణి ఒడ్డున దక్షిణానికి అభిముఖంగా దర్శనమిచ్చే ఆరడుగుల స్వామి వారి విగ్రహం శయనాకార శిలపై భక్తులకు దర్శనమిస్తోంది. ఈ విగ్రహానికి అతి సమీపంలోనే వినాయకుడికి ఎంతో ప్రియమైన తెల్ల జిల్లేడు చెట్టు మొలకెత్తడం ఇక్కడి భక్తులను విశేషంగా ఆకరిస్తోంది. ఈ చెట్టుకు కూడా భక్తులు పసుపు, కుంకుమలతో పూజలు నిర్వహిచండం ఇక్కడ నిత్యం కనిపించే దశ్యం. 24 గంటలూ భక్తులు స్వామిని దర్శించే అవకాశం ఉంది. దసరా ఉత్సవాల సందర్భంగా మూల నక్షత్ర రోజైన శనివారం ఆలయ ప్రాంగణంలో సూక్త పారాయణం జరుగుతుండగా నాగుపాము భక్తులకు దర్శనమివ్వడం విశేషంగా చెప్పుకుంటారు. కనుకనే ఈ గణేషునికి సర్పాలే ఆభరణాలుగా ఉండడం మనం గమనించవచ్చు. అంతే కాక భక్తులు ప్రత్యేకంగా కొలిచే నాగుపాము ప్రతి రోజూఏదో ఒక సమయంలో స్వామి వారి చుట్టూ ప్రదక్షిణం చేయ డం జరుగుతుంది.

ప్రతి బుధవారం క్షీరాభిషేకం జరిగే ఈ దేవస్థానంలో ప్రతిరోజూ అభిషేకంతో పూజలు ప్రారంభమవుతాయి. హోమాలు, వినాయక వ్రతాలు, సంక్లిష్ట గణపతి వ్రతాలు, దసరా కార్తీక మాసాలలో విశేష పూజలు జరుగుతాయి. గణపతి నవరాత్రి ఉత్సవాల సందర్భంగా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి విరివిగా భక్తులుపాల్గొంటారు. విదేశాలకు ప్రయా ణాలు చేసేవారు, కొత్తగా వ్యాపారాలు ప్రారంభించేవారు, సంతానహీనులు, విద్యార్థులు, రాజకీయ నాయ కులతో పాటు కుండలినీ యోగ సాధకులు సైతం తరచుగా ఈ సిద్ధి వినాయకుడి నిదర్శించు కుంటారు.

## సిద్ధి వినాయకుడు

(65వ పేజీ తరువాయి)

కాగా ఇక్కడ విశేషమేమిటంటే ఇతర దేవాలయాల్లో ఉన్నట్లుగా ప్రవేశ టిక్కెట్లు లేవు. ఎలాంటి రుసుములు చెల్లించాలనే నిబంధనలు లేవు. హుండీ ఉండదు. దక్షిణం అడిగే అర్చకులు కనిపించరు. ఈ స్వామి వద్ద వున్న ప్రసాదాలను కాని, పూజా సామాగ్రిని కాని ఇక్కడ గుంపులు గుంపులుగా తిరిగే కోతులు అసలు ముట్టుకోక పోవడం మరొక విశేషంగా భక్తులు చెప్పుకుంటారు.



# లాభాల దిశగా ఆరుంబాక చేనేత సొసైటీ

శంకర్, మేజర్‌న్యూస్, చెరుకుపల్లి

మండలంలో ఆరుంబాక చేనేత సహకార సొసైటీ నష్టాల నుంచి గట్టెక్కి లాభాల బాటలో పయనిస్తోంది. 1972 సంవవత్సరంలో ఆరుంబాక చేనేతసహకార సొసైటీ స్థాపించారు. గతంలో నేత పనికి తగిన ప్రాధాన్యత లేకపోవడం ప్రభుత్వం నుంచి ప్రోత్సాహం అంతంత మాత్రంగా ఉండడంతో సంస్థ నష్టాలను చవిచూసింది. అయితే గత పది సంవ త్సరాలలో చేనేత పరిశ్రమలో విప్ల వాత్మకమైన మార్పులు చోటుచేసు కోవడంతో చేనేత సహకార సొసైటీలు ఇప్పుడిప్పుడే వృద్ధి చెందుతూ ఉత్పత్తి సాధిస్తున్నాయి. ముఖ్యంగా 2000 సంవత్సరం వరకు సొసైటీ రూ.5.79 లక్షల నష్టంలో కూరుకుపోయి కేవ లం పదిమంది కార్మికులకు మాత్రమే పని కల్పించి సంవత్సరానికి సుమారు రూ.2 లక్షలు మాత్రమే ఉత్పత్తి సాధించగ లిగింది. 2003 ఫిబ్రవరి ఎన్నికలలో నేటి జిల్లా ఆప్కో కోడైరెక్టర్ దివి రాంబాబు నాడు సొసైటీ అధ్యక్షునిగా ఎన్నికయ్యారు. దీంతో గత ఐదు సంవత్సరాలుగా ఆరుం బాక చేనే త సంస్థ అంచెలంచెలుగా ఎదుగుతూ 2008 మార్చి సంవత్సరానికి రూ.32 లక్షల ఉత్పత్తిని సాధించింది. అంతే కాక ప్రస్తుతం వందమంది నేత కార్మి కులకు ఈ సంస్థ ఉపాధి కల్పిస్తోంది. 2006 సంవత్సరంలో డి.ఆర్.డి.ఎ ట్రైనింగ్ పోగ్రాం ద్వారా రూ.75 వేలతో ఆధునిక పరిజ్ఞానం అందిం చటానికి సొసైటీ ద్వారా 20 మందికి శిక్షణ ఇవ్వడంతో పాటు అదే సంవత్సరం ఐ.హెచ్.డి.పి ద్వారా రూ.4.29 లక్షల వ్యయంతో మరో 20 మందికి మేలైన వస్త్రాల తయారీపై శిక్షణ ఇచ్చారు. శిక్షణా కాలంలో ఒక్కొ క్కరికి రూ.6 వేలు స్టైఫండ్‌తో పాటు శిక్షణ పొందినవారికి రూ.5600 వ్యయంతో కూడిన నేత పరికరాలను అందజేయడం జరిగింది. అంతేకాక డి.ఆర్.డి.ఎ నిధుల నుండి రూ.5 లక్షల వ్యయంతో సొసైటీ నూతన భవనం నిర్మించారు. మరో రూ.1.80 వేలతో సొసైటీ అభివృద్ధికి స్థలం కొనుగోలు చేయడం జరిగింది. ప్రస్తుతం సొసైటీ పరిధిలో 200 మంది నేత కార్మికులకు హెల్త్ ప్యాకేజీ కార్డులు, 50 సంవత్సరాలు దాటిన 150 మంది కార్మికులకు పింఛన్లు అంద జేశారు. మరో 175 మంది కార్మి కులకు మహాత్మగాంధీ బంకర్ జివో పథకాన్ని చేర్చడమే కాక చేనేత కార్మి కుల అభివృద్ధికి చెరుకుపల్లి, గుళ్ళపల్లి గ్రామాలను కస్టర్‌గా ఎంపిక చేస్తూ స్థానిక శాసనసభ్యులు దేవినేని మల్లికార్జున రావు రూ.60 లక్షల ప్యాకే జీని మంజూరు చేశారు. ఈ సందర్భంగా సొసైటీ అధ్యక్షులు దివి రాం బాబు మాట్లాడుతూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అందించే ప్రతీ చేనేత పథకాన్ని కార్మికులు సద్వినియోగం చేసుకోవాలన్నారు. లక్షల రూపాయల నష్టంలో ఉన్న తమ సంస్థ నేడు అభివృద్ధి బాటలో పయనిస్తోందని ఇది మరింత అభివృద్ధి చెందే అవకాశం ఉందని ఆశాభావం వ్యక్తం చేశారు.


ఆప్కోలో డిస్కౌంట్ ప్యాకేజీని ప్రారంభిస్తున్న అప్పటి కలెక్టర్ రఫత్‌తో రాంబాబు.


చీరను నేయడాన్ని పరిశీలిస్తున్న మంత్రి మురుగుడు హనుమంతరావు, ఆప్కో ఛైర్మన్ జగన్నాథం, రాంబాబు

# ఇద్దరూ... ఇద్దరే

సయ్యద్ సాబిర్ హుసేన్, మేజర్ న్యూస్, వినుకొండ.

ఇద్దరూ...ఇద్దరే. ఒకరు కుర్రి శివకోటి రెడ్డి, మరొకరు రెడ్డి నగేష్ బాబు. వీరిద్దరూ ఫర్టిలైజర్స్ అండ్ ఫెస్టిసైడ్స్ అధ్యక్ష కార్యదర్శులు. ఈతరం నాయకులు. మోముపై చెరగని చిరునవ్వు, మనసారా పలకరించే తత్వం వీరి సొంతం. వృత్తి పట్ల నిజాయితీ,నిబద్ధతతో ముందుకు వెళ్తున్న వీరిని కదిలిస్తే ఎన్నో ఆశయాలు.. మరెన్నో లక్ష్యా లు.



రెడ్డి నగేష్ బాబు



కుర్రి శివకోటి రెడ్డి

మూడు సంవత్సరాల క్రితం అసోసియేషన్ పదవీ భాధ్యతలు చేపట్టిన వీరు పట్టుదలగా పట్టణంలోని ఆంధ్రాబ్యాంకు దగ్గరలో మీటింగ్ హాలును నిర్మించాలని నిర్ణయించుకున్నారు. అందుకు సభ్యుల తోడ్పాటు లభించడంతో ఉత్సాహవంతులైన వీరు ఫర్టిలైజర్స్ అసోసియేషన్ మీటింగ్ హాలును సకల సౌకర్యాలతో ఆధునిక పద్ధతులతో నియమించారు. అంతేకాదు ఇటీవల నియోజకవర్గంలోని అన్ని ప్రభుత్వ హాస్టల్స్‌ను సందర్శించిన వీరికి అక్కడి విద్యార్థులు మౌళిక వసతుల లేమితో కొట్టుమిట్టాడడం కన్పించింది. వెంటనే స్పందించి విద్యార్థులకు బక్కెట్లు, మగ్గులను పంపిణీ చేయడం కోటిరెడ్డి, నగేష్‌ల సామాజిక స్పృహకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

ఈ విషయంలో కుర్రికోటిరెడ్డిని మేజర్‌న్యూస్ పలుకరించగా ప్రతిభావంతులైన నిరుపేద విద్యార్థులకు చదువు పూర్తి చేసేంత వరకు స్కాలర్‌షిప్ అందించాలన్నదే తన జీవిత లక్ష్యంగా పేర్కొనారు. అలాగే నగేష్ మాట్లాడుతూ యూనియన్ సభ్యుల సహకారం వల్లే తాను సామాజిక సేవ చేయగల్గుతున్నామని చెప్పారు.

# అందరివాడు మల్లికార్జునుడు

పి.ఫిలిప్స్, మేజర్‌న్యూస్, వినుకొండ టౌన్ రిపోర్టర్

**ఆత్మీయంగా పలకరించడం ఆయనతత్వం... అందరికీ అందుబాటులో ఉండడం ఆయన నైజం. అన్నా అని పిలిస్తే నేనున్నానంటూ ప్రజల సమస్యలను తన సమస్యలుగా భావించి నియోజకవర్గాన్ని అభివృద్ధి పథంలో నడిపిస్తున్నారు వినుకొండ శాసనసభ్యులు మక్కెన మల్లికార్జున రావు.**

సామాన్య రైతు కుటుంబమైన మక్కెన చినరామయ్య, రామకోటమ్మ దంపతులకు వినుకొండ మండలం కోటప్పనగరులో 1965వ సంవత్సరంలో మక్కెన జన్మించారు. తండ్రి చినరామయ్య వద్ద రాజకీయ ఓనమాలు నేర్చుకున్నారు. కేవలం 22 ఏళ్ళ వయసులో గోనుగుంట్ల వారి పాలెం పంచాయితీ సర్పంచ్‌గా ఏకగ్రీంగా ఎన్నిక కావడం ఆయన రాజకీయజీవితానికి తొలిమెట్టు. అదే సమయంలో వినుకొండ మండల వైస్‌ప్రెసిడెంటుగా ఉంటూ, 13నెలల పాటు ఇన్‌చార్జ్ మండల పరిషత్ అధ్యక్షునిగా పని చేశారు. ఆ సమ యంలోనే తన చొరవతో ప్రజల మన్ననలను చూరగొన్నారు. అక్కడి నుండి ఆయన రాజకీయ ప్రస్థానానికి ఎదురు లేకుండా పోయింది. 1995 వినుకొండ సెగ్మెంట్‌లో జడ్‌పిటిసిగా ఏడు వేల ఓట్ల భారీ మెజారిటీతో ఎన్నికయ్యారు. నిత్యం ప్రజలతో మమేకమయ్యే ఆయనకు 1999 శాసనసభ ఎన్ని కలలో వినుకొండ స్థానానికి పోటీ చేసే అవకాశం వచ్చింది.

(మిగతాది 68వ పేజిలో)

# అందరివాడు మల్లికార్జునుడు

(67వ పేజీ తరువాయి)

కానీ అతి స్వ ల్పంగా 841 ఓట్ల తేడాతో ఓడిపోగా, ప్రజల సాను భూతిని మాత్రం మిగు ల్చుకున్నారు. కార్యకర్తలలో నిరాశ ఉన్నా, మక్కెన మాత్రం సడలి పోని ఆత్మ విశ్వాసంతో ఎన్నికలు అయి పోయిన నెలరో జులలోనే పట్ట ణంలో కాంగ్రెస్ పార్టీ కార్యాలయాన్ని ఏర్పాటు చేసి అధికా రం లేకపోయినా ప్రతి నిత్యం ప్రజలను వెన్నంటి ఉన్నారు.



మక్కెన మల్లికార్జురావు

మక్కెనపై ప్రజలకు ఉన్న అభిమా నాన్ని, సానుభూతిని గుర్తిం చిన అధిష్టానం 2004 శాసనసభ ఎన్నిక లలో మరోసారి పోటీ చేసే అవకాశం ఇచ్చింది. ఈ సారి మాత్రం విజయం వరించింది. భారీ మెజారిటీతో వినుకొండ నియోజకవర్గ శాసన సభ్యునిగా ఎన్నికయ్యారు.

అధికారం చేపట్టగానే వెనుకబడ్డ ప్రాంతమైన వినుకొండను అభివృద్ధి చేయడానికినడుంబిగించారు. మక్కెన హయాంలో వినుకొండ పంచాయితీ నుంచి మున్సిపాలిటీగా అప్‌గ్రేడ్ అయింది. దాహార్తితో అల్లాడుతున్న వినుకొండ పట్టణానికి కేంద్రం నుండి నిధులు తేవడంలో సఫలీకృతుల య్యారు. నియోజకవర్గానికి రావల సిన వాటాకోసం కావలసిన పనిని చాకచక్యంగా పూర్తి చేయించుకోవ డం తనకు తానేసాటి. ఇది జిల్లా స్థాయి అధికారుల మాట. ఈ మూడు న్నరేళ్ళ పాలనలో మక్కెన చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలతో గ్రామాలు బాగుపడ్డాయి.

### మక్కెన రాజీవ్ ఫౌండేషన్

ఇదంతా ఒక ఎత్తుకాగా మంచి తనం నిండిన మనిషిగా, మానవ త్వపు కోణంలో ఆలోచించే మక్కెన రాజీవ్ ఫౌండేషన్‌ను స్థాపించి పేదల సేవకు పూనుకున్నారు. ఫౌండేషన్ ద్వారా వైద్య శిబిరాలు నిర్వహించి ఉచితంగా కంటి పరీక్షలు చేయించి వేల మందికి కంటి ఆపరేషన్లు చేయిం చి వెలుగునిచ్చారు. ఆపదలో ఉన్న వారిని ఆదుకోవడంలో రాజీవ్ ఫౌం డేషన్ ముందుంటుందనేది వినుకొం డ ప్రాంత ప్రజలందరికీ తెలిసిందే. పేదలకు అందాల్సిన విద్య, వైద్యం పై ఆయన ప్రత్యేక శ్రద్ధ చూపారు. ఆయన హయాంలో సాంఘిక సం క్షేమ హాస్టళ్ళ పనితీరు మెరుగు పడిం ది. ప్రభుత్వ వైద్యశాల సిబ్బంది పని తీరు ఎలాఉన్నా ఆయన మాత్రం మెరుగైన సేవల అందించడంకోసం ఆసుపత్రికి కాలికి బలపం కట్టుకు తిరుగుతారని ఉవాచ.

గతంలో పాలించిన శాసనసభ్యు లు తమ పదవీకాలంలో ప్రజలకు దూరమయ్యారనేది నిష్ఠురసత్యం. మక్కెన మాత్రం వినుకొండ ప్రాతం లోనే ఉంటూ పిలిస్తే పలికేవాడిగా ప్రజల మనిషిగా ప్రత్యేక గుర్తింపు తెచ్చుకున్నారు. ప్రజా నాయకుడిగా గుర్తింపు పొందిన మక్కెన మల్లికార్జు రావు మరిన్ని సేవలతో, మరింత మంచి రాజకీయభవిష్యత్తు పొందా లని పలువురి ఆకాంక్ష.



# ఆర్యవైశ్యులకు ఆరాధ్యుడు

బుర్ల శ్రీనివాసరావు, మేజర్ న్యూస్, సత్తెనపల్లి.



గుబ్బా చంద్రశేఖర్

రాష్ట్ర ఆర్యవైశ్య ప్రముఖులు, కాం గ్రెస్ పార్టీ నాయకులు, పిసిసి మెం బర్ గుబ్బా చంద్రశేఖర్ పేద, బడు గు, బలహీన వర్గాల అభ్యున్నతి కోసం తనవంతు కృషి చేస్తూ పలు వురి ఆదరాభి మానాలకు పాత్రల వుతున్నారు. సత్తెనపల్లి నియోజకవ ర్గంలో ఆర్యవైశ్యలకు ఆరాధ్యుడుగా పలు సేవాకార్యక్రమాలు చేస్తున్నారు. ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి తో ఆయకున్న సాన్నిహిత్యం సత్తెన పల్లిలోని పేదవర్గాలకు వరంగా మారింది.పేదప్రజలు ఆరోగ్యపరం గా ఎదుర్కొంటున్న సమస్యలను గుర్తించి సిఎం రిలీఫ్‌ఫండ్ నుండి నిధులు ఇప్పిస్తూ పలువురి ఆపరేష న్లు నిర్వహించడానికి దోహ దపడ్డా రు. పరివర్తన మానసిక వికలాంగుల పాఠశాలకు రూ.10వేల సహాయం చేసి ఆయనలో ఉన్న సేవా గుణాన్ని చాటుకున్నారు. ఆర్యవై శ్యులు రాజకీ యంగా ఎదగడానికి తన వంతు కృషి చేస్తున్నారు.

పేదల సంక్షేమం కోసం ప్రభుత్వ పథకాలను ప్రజలకు చేరువకావ డానికి శక్తి వంచన లేకుండా కృషి చేస్తున్నారు. అకాల వర్షాల వల్ల తడ సిన మిర్చిని పరిశీలించి సిఎం దృష్టికి తీసుకువెళ్లి మిర్చిరైతులకు సహాయం చేసేందుకు తనవంతు ప్రయత్నం చేశారు. నిరంతరం ప్రజ లతో మమే కమై ప్రజాసమస్యల పరిష్కారమే పరమావధిగా కృషి చేస్తున్నారు. రాజకీయాల్లో విలువలకు ప్రాధాన్య తనిస్తూ తనపని తాను చేసుకు పోతూ తన వద్దకు సహాయంకోసం వచ్చిన వారికి తనతోడ్పాటును అందిస్తున్నారు.

ఆర్యవైశ్యుల్లో సేవాభావాలను నెలకొల్పి వారికి నేనున్నాననే భరో సాను కల్పిస్తున్నారు.రాష్ట్ర రాజ ధాని హైదరాబాద్ ఎవరువెళ్లినా వసతి సౌకర్యాలు కల్పిస్తూ అవసరమైన పనులను చేయిస్తూ సత్తెనపల్లి ప్రాంత ప్రజల కు దగ్గరవుతున్నారు.



ఉగాది శుభాకాంక్షలు

పొన్నూరు పట్టణ, మండల వినియోగదారులకు
మరియు ప్రజలకు ఉగాది శుభాకాంక్షలతో...

పొన్నూరు తహశీల్దార్ పి.అమరేందర్ గారికి
ప్రత్యేక ఉగాది శుభాకాంక్షలు తెలియజేస్తూ...

ప్రభుత్వం చౌకడిపోల ద్వారా సరఫరా చేస్తున్న నిత్యావసర
సరుకులను సకాలంలో కొనుగోలు చేసి లబ్ధిని పొందండి.

పొన్నూరు పట్టణ చౌకడిపో
డీలర్స్ అసోసియేషన్

పొన్నూరు పట్టణ హాకర్స్
అసోసియేషన్

పొన్నూరు మండల చౌకడిపో
డీలర్స్ అసోసియేషన్

పొన్నూరు మండల హాకర్స్
అసోసియేషన్

# జిల్లా ముఖ్యుల ఫోన్ నెంబర్లు, వివరాలు

కె. అనిల్‌కుమార్, స్టాఫ్ రిపోర్టర్

జిల్లా మంత్రులు, పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులు ఫోన్ నెంబర్లు, నియోజకవర్గం తదితర వివరాలు..

## మంత్రులు

★ కన్నా లక్ష్మీనారాయణ : రాష్ట్ర రవాణా శాఖ మంత్రి, పెద కూరపాడు నియోజకవర్గం.

ఫోన్: 0863 - 2323164, 2355784, సెల్: 9849908506.

హైదరాబాద్ : 040 - 23450813, 23306232

★ మోపిదేవి వెంకటరమణరావు : రాష్ట్ర మౌలిక సదుపాయాలు, విమానయాన, నౌకల శాఖ మంత్రి, కూచినపూడి నియోజకవర్గం.

ఫోన్: 08648 - 257722, 9849122337

హైదరాబాద్: 040 - 23240842

★ కాసు వెంకట కృష్ణారెడ్డి : రాష్ట్ర పౌరసరఫరాల శాఖ మం త్రి, నరసరావుపేట నియోజకవర్గం.

ఫోన్: 08647 - 230014, 230118, 9440732177, 9849960999.

★ మురుగుడు హనుమంతరావు: రాష్ట్ర రాజీవ్ విద్యామిషన్ శాఖ మంత్రి, మంగళగిరి నియోజకవర్గం.

ఫోన్: 08645 - 232996, 231234, 9440261600

★ దగ్గుబాటి పురంధరీశ్వరి : కేంద్ర మానవ వనరుల శాఖ సహాయ మంత్రి, బాపట్ల లోక్‌సభ సభ్యురాలు

ఫోన్: 040 - 23398204, 08594 - 242434

సెల్: 9489034445, 9849501535.

★ వల్లభనేని బాలశౌరి: తెనాలి లోక్‌సభ సభ్యులు

ఫోన్: 0863 - 2351472, 08644 - 238365

సెల్: 9849013456

★ రాయపాటి సాంబశివరావు: గుంటూరు లోక్‌సభ సభ్యులు

ఫోన్: 0863 - 2350500, 2350400, 2350555

సెల్: 9849061777, 9848138555

★ మేకపాటి రాజమోహన్‌రెడ్డి: నరసరావుపేట లోక్ సభ సభ్యులు

ఫోన్:0863-23543541, 23543545, 23541 385.హైదరాబాద్:040-23548485,23548400

## ఎమ్మెల్యేలు

★ నాదెండ్ల మనోహర్: ఎం.ఎల్.ఎ. తెనాలి

ఫోన్: 9849000006, 9849202917

★ దేవినేని మల్లికార్జునరావు: ఎం.ఎల్.ఎ. రేపల్లె

ఫోన్: 08648 - 222826, 0863 - 2256869.

సెల్: 9848132566.

★ సతీష్ పాల్‌రాజ్ : ఎం.ఎల్.ఎ. వేమూరు

ఫోన్: 08644 - 220476

సెల్: 9848539227

★ గుదిబండ వెంకటరెడ్డి: ఎం.ఎల్.ఎ. దుగ్గిరాల

ఫోన్ : 08644 - 223857, 244242

సెల్: 9440054896

★ ధూళిపాళ్ల నరేంద్రకుమార్:ఎం.ఎల్.ఎ. పొన్నూరు

ఫోన్: 08643 - 242113

సెల్: 9440602113

★ గాదె వెంకటరెడ్డి : ఎం.ఎల్.ఎ. బాపట్ల

ఫోన్: 040 - 23233913

సెల్: 9848027091.

★ రావి వెంకటరమణ : ఎం.ఎల్.ఎ. ప్రత్తిపాడు

ఫోన్: 0863 - 2227777, 2235599, 2210742 (రెసిడెన్స్)

సెల్ : 9848135082, 9394159777

★ షేక్ సుభానీ : ఎం.ఎల్.ఎ. గుంటూరు - 1

ఫోన్ : 0863 - 2212786, 6535577, 2222281 (రెసిడెన్స్)

సెల్ : 9848133881

★ తాడిశెట్టి వెంకట్రావు: ఎం.ఎల్.ఎ. గుంటూరు - 2

ఫోన్: 0863 - 6535566, 2235520 (రెసిడెన్స్)

040 - 23236389

సెల్: 9848136616

★ డొక్కా మాణిక్య వరప్రసాద్: ఎం.ఎల్.ఎ. తాడికొండ

ఫోన్ : 0863 - 2225500, 040 - 27004821

సెల్ : 9440878871

★ యర్రం వెంకటేశ్వరరెడ్డి: ఎం.ఎల్.ఎ. సత్తెనపల్లి

ఫోన్: 08641 - 234666, 040 - 23810312

సెల్ : 9440264464, 9440368624

★ జంగా కృష్ణమూర్తి : ఎం.ఎల్.ఎ. గురజాల

ఫోన్ : 08649 - 256000

సెల్ : 9440184256, 9247262100

★ పిన్నెల్లి లక్ష్మారెడ్డి : ఎం.ఎల్.ఎ. మాచర్ల

ఫోన్ : 08642 - 222126, 222205 (రెసిడెన్స్)

సెల్: 9849682767, 9440170737

★ మక్కెన మల్లికార్జునరావు: ఎం.ఎల్.ఎ. వినుకొండ

ఫోన్ : 08646 - 274025, 272364, 274025 (రె)

సెల్ : 9440264025, 9949117494

★ మర్రి రాజశేఖర్ : ఎం.ఎల్.ఎ. చిలకలూరిపేట

ఫోన్: 08647 - 251517, 254583

సెల్: 9440257383

# జిల్లాలో మండలాధ్యక్షుల ఫోన్ నంబర్ల వివరాలు

కె.అనిల్‌కుమార్, స్టాఫ్ రిపోర్టర్.

గుంటూరు జిల్లా మండల పరిషత్తు అధ్యక్షుల పేర్లు, మండలం, ఫోన్ నంబర్ల వివరాలు ఇవీ..



| మండలం | అధ్యక్షులు | ఫోన్ |
|---|---|---|
| అమరావతి | వి.జ్వాలా లక్ష్మీనరసింహారావు | 9440094797 |
| అమృతలూరు | తలశిల కుసుమకుమారి | 08644-255231 |
| అచ్చంపేట | తడవారి నాగేశ్వరరావు | 9949268952 |
| బాపట్ల | దాసరి యోహాను | 9949840821 |
| బెల్లంకొండ | బద్దూరి రంగమ్మ | 9949840821 |
| భట్టిప్రోలు | తూనుగుంట్ల లక్ష్మీపార్వతి | 9849961868 |
| బొల్లాపల్లి | తుమ్మా పాపులమ్మ | 9440259933 |
| చేబ్రోలు | సుద్దపల్లి ఆదెయ్య | 9441692988 |
| చెరుకుపల్లి | చెన్ను కోటేశ్వరరావు | 9949197197 |
| చిలకలూరిపేట | బండి దేవయ్య | 9849399648 |
| దాచేపల్లి | అంబటి శేషగిరిరావు | 9441547932 |
| దుగ్గిరాల | మల్లవరపు మల్లేశ్వరి | 0864-277273 |
| దుర్గి | నాలి ఫకీరయ్య | 08642-256837 |
| యడ్లపాడు | వలేరు రాజారావు | 08647-276667 |
| గుంటూరు | సుదర్శన్ రత్నమేరి | 9391674215 |
| గురజాల | వీరంరెడ్డి అమర్‌రెడ్డి | 9866197585 |
| ఈపూరు | నంబూరు గురువర్ధనకుమారి | 9885866584 |
| కాకుమాను | నూతి శరత్‌బాబు | 9866325179 |
| కారంపూడి | పంగలూరి వెంకటనరసయ్య | 9989158105 |
| కర్లపాలెం | పమిడి చిట్టెమ్మ | 08643-272261 |
| కొల్లిపర | కేశన రజని | 9440757023 |
| కొల్లూరు | మైనేని మురళీకృష్ణ | 9849731532 |
| మాచవరం | కావటి శంకరయ్య | 9949331796 |
| మాచర్ల | కేతావత్ మిరియాలి | 9866499470 |
| మంగళగిరి | దొడ్డక నాగేశ్వరరావు | 9441215123 |
| మేడికొండూరు | గుడిబండ సాంబిరెడ్డి | 9989082232 |
| ముప్పాళ్ల | పచ్చల నాగేశ్వరరావు | 9848989397 |
| నాదెండ్ల | కంజూరు వీరారెడ్డి | 9441127896 |
| నగరం | చింతల తులశమ్మ | 9849022337 |
| నరసరావుపేట | తన్నీరు శ్రీనివాసరావు | 9848967314 |
| నకరికల్లు | ఆవుల ప్రమీల | 9849989956 |
| నిజాంపట్నం | ప్రసాదం వాసుదేవ | 9866034436 |
| నూజెండ్ల | మానిక నాగేశ్వరరావు | 9949523266 |



| మండలం | అధ్యక్షులు | ఫోన్ |
|---|---|---|
| పెదకాకాని | దోసపాటి నాగేశ్వరరావు | 9948198692 |
| పెదకూరపాడు | శాఖమూరి అనురాధ | 9949646892 |
| పెదనందిపాడు | ఎన్.బాలవెంకటరామకృష్ణ | 9440257580 |
| ఫిరంగిపురం | ఆళ్ల రత్తమ్మ | 08641-257221 |
| పిడుగురాళ్ల | గండికోట కోటేశ్వరరావు | 9440383883 |
| పిట్టలవాని పాలెం | గోకరాజు నరసరాజు | 9848819898 |
| పొన్నూరు | లక్కింశెట్టి భారతి | 9866521842 |
| ప్రత్తిపాడు | పాలెపు ఆరోగ్యమ్మ | 0863-2280237 |
| రాజుపాలెం | మర్రి సుందరరామిరెడ్డి | 9397601126 |
| రెంటచింతల | జంగాల కోటేశ్వరరావు | 9866492408 |
| రేపల్లె | గరికపాటి పావని | 9440884399 |
| రొంపిచర్ల | తుర్లకొండ మంగమ్మ | 9866679359 |
| సత్తెనపల్లి | జంగా మాధవి | 9849863393 |
| శావల్యాపురం | అమృతపూడి కోటయ్య | 9849678534 |
| తాడేపల్లి | దొంతిరెడ్డి శంకరరెడ్డి | 9393806180 |
| తాడికొండ | బండ్ల పున్నారావు | 9440876699 |
| తెనాలి | కేశన కోటేశ్వరరావు | 9866073717 |
| తుళ్లూరు | మల్లెల హరీంద్రనాథ్ చౌదరి | 9441944555 |
| చుండూరు | ఉయ్యూరు జయలక్ష్మి | 9441194989 |
| వట్టిచెరుకూరు | భీమినేని ఈశ్వరదేవి | 9949153200 |
| వెల్దుర్తి | తోట వెంకటనరసయ్య | 9949526341 |
| వేమూరు | బొలిశెట్టి ప్రభాకరరావు | 9849487104 |
| వినుకొండ | ములక రామతులశీరెడ్డి | 9440849252 |

# ఆపన్నులకు అభయ హస్తం హార్వేస్ట్ ఇండియా

మేకల సురేష్, ఆర్.సి ఇన్‌ఛార్జి, తెనాలి.

ఆపదలో ఉన్నవారిని అక్కున చేర్చుకుని ఆపన్నులకు అభయ హస్తం అందిస్తున్న సేవాసంస్థ హార్వేస్ట్ ఇండియా. ప్రార్థించే పెదవుల కన్నా సహాయం చేసే చేతులే మిన్న మదర్‌థెరిస్సా పలికిన ఈ మాటలు వారికి స్ఫూర్తినిచ్చాయి. ఆకలితో అలమటించే అన్నార్తులను ఆదుకోవాలన్న నిరంతరం పరితపించిన మాతృమూర్తి లలితకుమారి ఆలోచనలకు ప్రతిరూపమే హార్వేస్ట్ ఇండియా. ఎక్కడ చూసినా అన్నార్తుల రోదనలు, ఆపన్నుల కోసం ఎదురుచూసే అనాథలు, వైద్యసాయం అందక అలమటించే గ్రామీణ ప్రాంత నిరుపేదలు వ్యవస్థీకృతమైన అవినీతితో ప్రభుత్వ సంక్షేమ పథకాలు కూడా దరిచేరని దీనులకు సాయం అందించాలన్నదే ప్రధాన లక్ష్యంగా సంస్థ ఆవిర్భవించింది. లలితకుమారి స్థాపించిన హార్వేస్ట్ ఇండియా సంస్థ ఆమె తనయులు బిషప్ సురేష్‌కుమార్, సుధీర్‌కుమార్‌లు తల్లి చూపిన మార్గంలో ముందుకు తీసుకెళ్తున్నారు. ఇప్పటివరకు చేసిన సేవా కార్యక్రమాలే ఇందుకు నిదర్శనం. రేపల్లె, గుంటూరు, ఖమ్మం, పెద్దాపురం,



బైబిల్ కళాశాల విద్యార్థులకు సైకిళ్ళు పంపిణీచేస్తున్న బిషప్ సురేష్, సుధీర్

లక్ష్మీపురం, విజయవాడ, కల్లూరిగూడెం, మిర్యాలగూడ, గరువుపాలెం ప్రాంతాల్లో అనాథ శరణాలయాలు సంస్థ ఏర్పాటు చేసింది. తద్వారా వందలాది మంది అనాథలకు జీవితాన్ని ప్రసాదిస్తూ, వారి విద్య, వైద్య, ఆహార ఖర్చులన్నింటినీ హార్వేస్ట్ ఇండియానే భరిస్తుంది. రాష్ట్రవ్యాప్తంగా నీటి సమస్యలు ఎదుర్కొంటున్న గ్రామాల్లో మంచినీటి పంపులు వేయించింది. సుమారు మూడు వందల వరకు ఉచిత వైద్యశిబిరాలు ఏర్పాటుచేయడమే కాకుండా నిరుపేద రోగులకు అవసరమైన మందులను కూడా ఉచితంగా అందజేస్తూ సంస్థ లక్ష్యసాధన దిశలో సాగుతోంది. ముదిమి భారమై జీవితానుభవం తప్ప ఆదరించే దిక్కులేని వృద్ధుల కోసం శరణాలయాలు ఏర్పాటుచేసింది. మంగళగిరి, తిప్పలకట్ట, తూములూరు తదితరచోట్ల వృద్ధుల శరణాలయాలు కనిపిస్తాయి. ఇంతే కాకుండా వితంతువులు, వృద్ధుల కోసం పింఛను సౌకర్యం కూడా కల్పించి నిర్వాహకులు తమ ఉదారతను చాటుకున్నారు. రాష్ట్రంలో ఎక్కడ ఏ ప్రమాదం సంభవించినా బాధితులను ఆదుకునేందుకు మేమున్నామంటూ సంస్థ చేయూతనిస్తోంది. అగ్ని ప్రమాదాలు, వరదలు వచ్చినప్పుడు కాకుండా సునామీ



చిన్నారులకు, వృద్ధులకు పౌష్టికాహారం అందిస్తున్న సురేష్

బాధితులను ఆదుకోవడంలో కూడా హార్వేస్ట్ ఇండియా చేసిన కృషి శ్లాఘనీయం. ప్రపంచాన్ని వణికిస్తున్న హెచ్.ఐ.వి ఎయిడ్స్ బాధితులను ఆదుకోవడంలోనూ సంస్థ ముందంజలో ఉంది. అందుకోసం ప్రత్యేక వైద్యశాలల నిర్మాణం కూడా గుంటూరు, నల్లబాడు, పెద్దాపురంలలో చేయడం సంస్థ నిర్వాహకులు సురేష్‌కుమార్, సుధీర్‌కుమార్‌ల ఉదారతకు, తోటివారికి సహాయం అందించాలన్న వారి తపనకు నిదర్శనం. దీనులకు చేయూతనిస్తూ మంటగలుస్తున్న మానవత విలువలకు అగ్రసానం కల్పిస్తూ సేవాతత్పరతతో ముందుకు సాగుతున్న హార్వేస్ట్ ఇండియా భవిష్యత్తులో మరింత వృద్ధినొంది లక్ష్యసాధనలో మరింత ముందుకు వెళ్ళాలని ఆశిద్దాం.

# నిజమవుతున్న స్వప్నం

తేళ్ళూరి రామకోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

శతాబ్ద కాలం పైగా డెల్టా ప్రాంతవాసుల సుందరస్వప్నం పులిచింతల రిజర్వాయరు నిర్మాణం కొనసాగుతోంది. పనుల నాణ్యత గురించి రకరకాల వ్యాఖ్యానాలు వినవస్తున్నా రిజర్వాయరు సత్వరం పూర్తికావాలని డెల్టా రైతులు ఎదురు చూస్తున్నారు. 150 సంవత్సరాలుగా కృష్ణా డెల్టా సాగులో ఉన్నా ఆయకట్టు స్థీరికరణకు పులిచింతల ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇన్ని దశాబ్దాలుగా సాగునీరు అందిస్తున్న ప్రకాశం బ్యారేజి వద్ద నీటి నిల్వ కోసం రిజర్వాయరు సౌకర్యం లేదు. ఆ కారణంగా వర్షాభావ పరిస్థితుల్లో సకాలంలో కర్షకులకు సాగునీరు అందించలేని పరిస్థితి ఉంది. ఈ దశాబ్దంలోనే దాదాపు నాలుగు సంవత్సరాల కాలం రైతులు సాగునీటి కోసం రోడ్డెక్కి ఆందోళన చేయాల్సి వచ్చింది. డెల్టా ప్రాంతం అనగానే కనిపించే సస్యశ్యామలమైన పంటపొలాలు బీడు భూములుగా దర్శనమిచ్చాయి. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత చేపట్టిన జలయజ్ఞంలో భాగంగా పులిచింతల రిజర్వాయరు నిర్మాణానికి ప్రభుత్వం సంకల్పించింది.

### ఇదీ నేపథ్యం

1903 సంవత్సరంలో రెయిడ్ అనే బ్రిటీస్ ఇంజనీర్ విజయవాడకు ఎగువన దైద గ్రామం వద్ద రిజర్వాయరు నిర్మించాలని ప్రతిపాదించారు. అది కార్యరూపం దాల్చలేదు. తిరిగి 1911లో కల్నల్ ఎల్లిస్ అనే మరో బ్రిటీష్ ఇంజనీర్ పులిచింతల వద్ద 163 టి.ఎం.సిల నిల్వ సామర్థ్యంతో 316 చదరపు కిలో మీటర్ల విస్తీర్ణంలో రిజర్వాయరు నిర్మించాలని ప్రతిపాదించారు. అదీ కార్యచరణకు నోచుకోలేదు. చివరకు 1951లో కేంద్ర ప్రణాళికా సంఘం నియమించిన ఖోస్లా కమిటీ కూడా కృష్ణానదిపై మూడు చోట్ల రిజర్వాయర్‌లు నిర్మించాలని సిఫారసు చేసింది. నందికొండ, సిద్ధేశ్వరం, పులిచింతల వద్ద డ్యామ్‌లు నిర్మించాలన్న కమిటీ ప్రతిపాదనల్లో మొదట రెండు చోట్ల రిజర్వాయర్లు నిర్మించారు. పులిచింతలకు మాత్రం మోక్షం రాలేదు. రైతులు భాగస్వామ్యం వహిస్తామని ముందుకు వచ్చినా ఫలితం లేదు. దశాబ్దాలుగా నలుగుతున్న ఈ ప్రతిపాదనకు ఎట్టకేలకు మోక్షం లభించింది. కృష్ణానదిపై 45.75 టి.ఎం.సిల నిల్వ సామర్థ్యంతో నిర్మించే చివరి రిజర్వాయరు వల్ల నాలుగు జిల్లాల పరిధిలోని 13.08 లక్షల ఎకరాలకు సకాలంలో నీరు అందుతుంది.



నిర్మాణంలో ఉన్న పులిచింతల ప్రాజెక్ట్

### కాల్వల ఆధునికీకరణ

కృష్ణా డెల్టా కాల్వలకు 150 సంవత్సరాల చరిత్ర ఉంది. సకాలంలో జరగని



నిర్మాణంలో ఉన్న పులిచింతల ప్రాజెక్ట్

మరమ్మతులు, నిర్వహణాలోపం వంటి సమస్యలతో కాల్వ చివరి భూములకు నీరందిరావడం కష్టమవుతోంది. తుపాను వంటి ప్రకృతి విపత్తులు సంభవిస్తే గండ్లుపడి రైతులను కడగండ్లు పాల్జేస్తున్నాయి. ఓగ్ని తుపాను సమయంలో జరిగిన నష్టం కాల్వల ఆధునికీకరణ అవసరాన్ని తెలియజెప్పింది. పరిస్థితి గమనించిన ప్రభుత్వం డెల్టాల కోసం రూ.4 వేల కోట్లకు పైగా కేటాయించగా పశ్చిమ డెల్టాను వెయ్యి కోట్లతో అభివృద్ధి పరచనున్నారు. ఇప్పటికే టెండర్ల దశ పూర్తయింది. పనులు పూర్తయితే గుంటూరు జిల్లా పరిధిలోని 4,99,231 ఎకరాల ఆయకట్టుకు సమస్యలు దూరమవుతాయి.



# పునాదులు కదులుతున్నాయి.. విద్యావంతులు మేల్కోనాలి

కువ్వారపు అనిల్‌కుమార్,
స్టాఫ్ రిపోర్టర్, గుంటూరు

విద్యావ్యవస్థ పునాదులు కదిలిపోతున్నాయి. పునాది లేకుండానే భారీ అంతస్తుల భవనాలు నిర్మించేందుకు నయా జమానా ప్రయత్నిస్తోంది. ఇది క్రమేపీ సమాజంలో అంతరాలను పెంచుతుంది. ఏదో ఒక దశలో పూర్తిగా దెబ్బతీస్తుంది. ఇప్పటికైనా విద్యావంతులు మేల్కొనకుంటే భవిష్యత్తు అంధకారమవుతుందని



అంటున్నారు ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయం ఉపకులపతి ఆచార్య వి.బాలమోహన్‌దాస్ అంటున్నారు. సర్వధారి నామ ఉగాది సంవత్సరాన విద్య వికాసం రావాలని, నవతరం పరిఢవిల్లాలని ఆకాంక్షిస్తూ 'సూర్య' పాఠకులకు అందిస్తున్న ప్రత్యేక ఇంటర్వ్యూ ఇది.

★ సూర్య: సాంప్రదాయక బి.ఎ., బి.కామ్. కోర్సులకు కాలం చెల్లు తోంది. యువతలో వృత్తి నైపుణ్యం పెరుగుతోంది, పాలనా సామర్థ్యం తగ్గుతోంది. దీనిపై మీరెలా స్పందిస్తారు.?

వి.సి: అవును సమాజంలో అనూహ్య వేగాన్ని సంతరించుకుంది. దీంతోపాటు చదువు పూర్తయిన వెంటనే ఉపాధి కావాలని కోరుకుంటున్నారు. పైగా ఉన్నత విద్య కోసం భారీగా ఖర్చు చేయాల్సి వస్తున్న నేపథ్యంలో వారికి వెంటనే ఆర్థిక ఆసరా కావాల్సి వస్తోంది. దీంతో చదువు పూర్తయిన వెంటనే ఉపాధి కల్పించే కోర్సులవైపే యువతరం దృష్టి సారిస్తోంది. ఇది ప్రమాదకరం. ఉపాధికీ, సామర్థ్యానికీ మధ్య అంతరం క్రమంగా పెరుగుతుంది. దీని దుష్ఫలితాలు సమాజంపై తీవ్ర ప్రభావం చూపనున్నాయి. ఇప్పటికిప్పుడే ప్రమాదం రాకపోయినా దీనిపై దృష్టి సారించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

> విశ్వవిద్యాలయాన్ని మాది అని భావించాలి
> సంపూర్ణ మానసిక వికాసంతోనే అభివృద్ధి
> ఎ.ఎన్.యు. ఉపకులపతి బాలమోహన్ దాస్

★ సూర్య: విద్యావ్యవస్థలో మార్పులు రావాలని మీరు భావిస్తున్నారా..!?

వి.సి: తప్పనిసరిగా రావాల్సిందే. ఉన్నత విద్య అంటేనే భారీ ఖర్చుతో కూడుకున్నదిగా తయారైంది. సమాజంలో అట్టడుగు వర్గాల వారికీ, పేద, మధ్యతరగతి వారికి విద్యను మరింత చేరువ చేయాలి. ప్రభుత్వం విద్య నుంచి పక్కకి తప్పుకోవాలని చూస్తుంది. ఇది ప్రపంచీకరణ ఫలితంగా ఉత్పన్నమవుతున్న సమస్యలే. పారిశ్రామిక వేత్తలు, ప్రభుత్వం సంయుక్తంగా విద్యపై దృష్టి సారించాలి. అప్పుడే ప్రగతి సాధ్య మవుతుంది. పైగా విద్యకు చేస్తున్న ఖర్చు మరింత తగ్గాల్సిన అసవరం ఉంది. ప్రొఫెషనల్స్ తగ్గుముఖం పడు తున్నారు. కళాశాలల్లో సీట్లు భర్తీ కావడం లేదు. ఇవన్నీ అధిగమిస్తేనే నవతరానికి మరింత వికాసాన్ని అందించగలం. పరిశ్రమలు సేవాభావంతో విద్యారంగానికి చేయూతనివ్వాలి. విద్యావ్యవస్థ, ఆర్థిక పరిపుష్టి కలిగిన సంస్థలు మిళితం కావాలి, సామాన్యులకు విద్యను చేరువ చేయాల్సిన అవసరం ఉంది.

★ సూర్య: మీ సర్వీసులో మర్చిపోలేని ఘట్టాలు? విశ్వవిద్యాలయం సాధించిన ఘనతలు.. అత్యాధునిక కోర్సుల వివరాల సంగతిని వివరిస్తారా!?

వి.సి: విశ్వవిద్యాలయంలో ప్రవేశ పెట్టిన కోర్సులకు ఆదరణ ఆశించిన స్థాయిలో ఉంది. అయితే ప్రధానంగా నాలుగు అంశాలు దేశంలోనే ఏ విశ్వవిద్యాలయంలో లేని విధంగా ఉన్నాయి. (మిగతా 74వ పేజీలో)

# పునాదులు కదులుతున్నాయి.. విద్యావంతులు మేల్కొనాలి



(73వ పేజీ తరువాయి)

1) విశ్వవిద్యాలయంలో క్రీడా వసతిగృహం నిర్మించాం. ఇందులో వెయ్యి మందికి ఒకేసారి వసతి కల్పించవచ్చు. దేశంలో ఏ విశ్వవిద్యాలయంలోనూ ఈ సౌకర్యం లేదు. దీని ద్వారా క్రీడల అభివృద్ధికి ప్రయత్నించవచ్చు.

2) అత్యాధునిక 'టెప్' విభాగాన్ని ప్రారంభించాం. ఔత్సాహిక శాస్త్రవేత్తలకు ఈ విభాగం పూర్తి సహాయ సహకారాలు అందజేస్తుంది. దీని ద్వారా నూతన ఆవిష్కరణలు వెలుగులోకి వచ్చే అవకాశాలు ఉన్నాయి. ఏ ప్రాంతం నుంచి వచ్చిన వారికైనా నూతన పరిశోధనల కోసం కనిష్టంగా రూ.75వేల నుంచి గరిష్టంగా రూ.15లక్షల వరకు ఖర్చు చేసే అవకాశం ఉంది. ఇప్పటివరకు ఆరు ప్రయోగాలు విజయవంతం అయ్యాయి. వాటి పూర్తిస్థాయి పరిశీలనలు చేయాల్సి ఉంది.

3) విశ్వవిద్యాలయంలో అందరికీ గ్రూప్ ఇన్సూరెన్సు సౌకర్యాన్ని కల్పించాం. మా విద్యార్థి ఒకరు అకస్మికంగా రోడ్డు ప్రమాదంలో చనిపోయారు. పైగా అతను పేదవాడు కావడంతో మేమంతా ఒక సారి చందాలు వేసుకున్నాం. ఇతరులకు ఇలాంటి పరిస్తితి వస్తే ఎలావుంటుందో నని ఆలోచించి, అందరికీ గ్రూప్ ఇన్సూరెన్సు చేయించాం. నాస్నేహితుని సహకారంతో ప్రీమియంను రూ.75 నుంచి రూ.35వరకు తగ్గించగలిగాను. ఒక సంవత్సరం అందరికీ మేమే బీమా చెల్లించాం. తర్వాతి సంవత్సరం నుంచి వారంతటికి వారే డబ్బు చెల్లిస్తున్నారు.

4) విశ్వవిద్యాలయం విస్తీర్ణం 300 ఎకరాల్లో ఉంది. దీంతో విద్యార్థులు, అధ్యాపకులు రాకపోకలు సాగించాలంటే తీవ్ర వెతలకు గురవుతున్నారు. అందుకోసమే ఎక్కడా లేనివిధంగా ఒక మినీ బస్సును స్టేట్‌బ్యాంకు సహాయంతో ఏర్పాటు చేశాం. దీనిలో స్త్రీలు, వృద్ధులు, విద్యార్థినులు ఉచితంగా విశ్వవిద్యాలయంలో ప్రయాణించవచ్చు. ఇది ఎంతో సౌకర్య వంతంగా ఉంటుంది.

★ సూర్య: కొత్త కోర్సులు ఏమేం ప్రారంభించారు..?

వి.సి: దూరవిద్యా విభాగంలో కోర్సులను 24 నుంచి 110 వరకు పెంచాము. వాటికి ఆదరణ బాగానే ఉంది. ఎం.టి.టి.ఎం. (మాస్టర్ ఇన్ ట్రావెల్ టూరిజం మేనేజమెంట్), ఎం.టెక్., ఎం.ఎ. (హిందీ), ఎం.పి.ఇ.డి., ఎం.ఇ.డి., ఎం.ఎస్సీ (స్టాట్) (ఇన్ఫర్మాటిక్స్), ఎం.బి.ఎ. (హాస్పిటల్ అడ్మినిస్ట్రేషన్), ఎం.బి.ఎ., ఐదేళ్ల ఇంటర్నేషనల్ బిజినెస్ కోర్సు దేశంలోనే తొలిసారిగా విశ్వవిద్యాలయంలో ఏర్పాటయ్యింది.

యువతకు మీరిచ్చే సందేశమని ప్రశ్నించిన సూర్యకు ఆయన తన కవితలతో సమాధానం చెప్పారు. నవ సమాజానికి, ప్రధానంగా యువతకు దిశానిర్ధేశం చేసే ఆయన భావ కవిత సమాధానం ఇదీ..

తరంతరం మారినా మారకండి మంచి
మార్గాన్నుంచి ఏమాతరం మీ యువతరం
వందే మాతరం పాటమీద కూడా సృష్టించ
గలరు రాజకీయం మా పాతతరం
చాలినంత కూడులేదు..
గూడు లేదు.. బడిలేదు..
గుడి గురించి ఎందుకు గొడవలు?
యువజనులారా..
మతమన్న మౌఢ్యం వీడండి
కులమన్న వ్యాకులము వద్దు ...
చదువు నేర్వండి.. చదువు నేర్పండి
నవత.. నవ్యత.. మమత.. మానవత..
పెంచుకోండి.. ఇతరులకుపంచండి

### ఆచార్య బాలమోహన్‌దాస్ ప్రొఫైల్

★ ఆచార్య వి.బాలమోహన్‌దాస్ గుంటూరు జిల్లాలోని సత్తెనపల్లి మండలంలో 1947లో జన్మించారు. ఆయన 31 ఏళ్ల వయసులోనే ప్రొఫెసర్‌గా బాధ్యతలు స్వీకరించారు. అతిచిన్న వయసులో ప్రొఫెసర్ అయన వ్యక్తిగా (యంగెస్ట్ ప్రొఫెసర్ ఆఫ్ ఇండియా) రికార్డు సృష్టించారు. అనంతరం 28 సంవత్సరాల పాటు అధ్యాపక వృత్తిలోనే ఉన్నారు దీంతో 'సీనియర్ మోస్ట్ ప్రొఫెసర్ ఆఫ్ ఇండియాగా రికార్డునూ సొంతం చేసుకున్నారు.

★ బాలమోహన్‌దాస్ చేతుల మీదుగా ఇప్పటివరకు 30 మంది పి.హెచ్.డి లను అందుకున్నారు. 15 మంది ఎం.ఫిల్‌లను అందుకున్నారు.

★ పది పుస్తకాలు ప్రచురించడంతోపాటు, 80 అంశాలపై అధ్యయనం చేసి, నివేదికలు రూపొందించారు. ఇందులో పి.జి.స్థాయి వారికి 'ఇండియన్ ఇండస్ట్రీయల్ ఎకానమీ' పుస్తకాన్ని కె.వి.శివయ్య సహకారం తో రూపొందించారు. అది కూడా కేవలం 25ఏళ్ల వయసులోనే కావడం గమనార్హం.

★ 35 అత్యున్నత స్థాయి సదస్సులను నిర్వహించారు. మరో 225 జాతీయ, అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొ న్నారు.

★ అంతేకాకుండా వివిధ అంశాల్లో ప్రతిభ కనబరి చినందుకు, వినూత్న ప్రయోగాలతో విజయాలు సాధించినందుకు బాలమోహన్ దాస్ జాతీయ, అంతర్జాతీయ, ప్రాంతీయ స్థాయి 23 అవార్డులను, పసిడి పతకాలను కైవశం చేసుకున్నారు. లైఫ్ టైమ్ ఎచీవ్‌మెంట్ అవార్డు, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ అవార్డు, శంకరాచార్య-విశ్వవిద్యాచార్య అవార్డు, విశాలభారతి గౌరవ పురస్కారం, బెస్ట్ సిటిజన్ ఆఫ్ ఇండియా, జెమ్ ఆఫ్ ఇండియా తదితర అవార్డులు ఆయన ప్రతిభకు తార్కాణాలు.

# కాంగ్రెస్‌కు అసమ్మతి ముళ్ళు!!

## తెలుగుదేశానికి కొత్తసవాళ్ళు

ఎ.వి.డి. శర్మ
సూర్య ప్రతినిధి, గుంటూరు

ఎన్నికల సంవత్సరంలో అధికార కాంగ్రెస్ పార్టీకి అసమ్మతిపోటు, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీకి కొత్త సవాళ్ళు పొంచి ఉన్నాయి. గత నాలుగు సంవత్సరాలుగా జిల్లాలో వరుస పరాజయాల నేపథ్యంలో రాబోయే ఎన్నికల్లో పూర్వ వైభవాన్ని పొందేందుకు తెలుగుదేశం పార్టీ తీవ్రంగా ప్రయత్నిస్తోంది. నాలుగేళ్ళుగా అప్రతిహతంగా దూసుకుపోతున్న కాంగ్రెస్ తన పట్టును నిలబెట్టుకోవడానికి ప్రయత్నిస్తుంది. అయితే కాంగ్రెస్ శాసన సభ్యులకు ద్వితీయ శ్రేణి నాయకుల నుంచి ప్రమాదం పొంచి ఉంది. వారికి శాసన సభ్యులతో ఏర్పడ్డ విభేదాలు ఇతరులకు ప్రయోజనం కలిగించే విధంగా వారు నిర్ణయం తీసుకుంటే శాసన సభ్యులకు గెలుపు సమస్యగా మారనుంది.

అలాగే తెలుగుదేశం పార్టీకి అనేక సవాళ్ళు పొంచి ఉన్నాయి. ప్రధానంగా మహిళలు, బి.సి.లకు అత్యధిక స్థానాలు కేటాయించాలని ఆ పార్టీ ఇప్పటికే నిర్ణయించింది. దీంతో తెలుగుదేశంలో చాలాకాలంగా ఆధిపత్యం వహిస్తున్న కొంతమంది సీనియర్ నాయకులకు అవకాశాలు సన్నగిల్లుతున్నాయి. వీరంతా తమ భవిష్యత్తుపై పునరాలోచనలో పడ్డారు. అంతేకాకుండా పునర్విభజనలో రెండు స్థానాలు రద్దు కావడం, మరో రెండు స్థానాలు దళితులకు రిజర్వు కావడంతో తెలుగుదేశం పరిస్థితి మరీ ఇబ్బందికరంగా మారింది. జిల్లా మొత్తం మీద మూడు స్థానాలు దళితులకు రిజర్వు కావడం, మరో నాలుగైదు స్థానాలు బి.సి.లకు, మహిళలకు కేటాయించాల్సి ఉండటంతో ఇతర సామాజిక వర్గాలతో కలిపి మొత్తం 17 స్థానాల్లో 12 స్థానాల వరకు కేటాయించాల్సిన అవసరం ఏర్పడింది. దీంతో ఒకే కులానికి 12 స్థానాలు కేటాయించే పరిస్థితి నుంచి ఐదు స్థానాలకు పరిమితం కావాల్సి ఉంది. ఈ పరిణామం పార్టీలోని కొందరు సీనియర్లకు రుచించడం లేదు. సి.పి.ఎం.తో ఎన్నికల్లో పొత్తు కుదిరితే వారికి రెండు స్థానాలు కేటాయిస్తే సీనియర్లకు అవకాశం ఎంతమందికి ఉంటుందనే విషయం కూడా ప్రశ్నార్థకంగా మారింది. జిల్లా అధ్యక్షుడు ప్రత్తిపాటి పుల్లారావు, సిట్టింగ్ ఎమ్మెల్యే ధూళిపాళ్ళ నరేంద్రకుమార్, కోడెల శివప్రసాదరావులకు మాత్రం డోకా లేదు. మిగిలిన వారి పరిస్థితి గందరగోళంగా మారింది.

2004 ఎన్నికల్లో 18 అసెంబ్లీ, నాలుగు లోక్‌సభ స్థానాలు గెలుచుకున్న కాంగ్రెస్ 2005లో జరిగిన మున్సిపల్ ఎన్నికల్లో జిల్లాలోని 12 మున్సిపాలిటీలలో ఘనవిజయం సాధించింది. ఆ తర్వాత జరిగిన సహకార ఎన్నికలు, మండల, జిల్లా పరిషత్ ఎన్నికల్లో కూడా కాంగ్రెస్ తన విజయపరంపరను కొనసాగించింది. పార్టీ రహితంగా జరిగిన పంచాయితీ ఎన్నికల్లో 70 శాతం పంచాయితీలు కాంగ్రెస్ కైవసం చేసుకోగా, తెలుగుదేశంతో పాటు ఇతరులకు 30 శాతం పంచాయితీలు దక్కాయి. జడ్‌పిటిసి ఎన్నికల్లో తెలుగుదేశం మరింత ఘోరంగా దెబ్బతింది. 57 స్థానాలకు గాను సి.పి.ఐ.తో కలిపి 54 స్థానాలనూ కాంగ్రె స్ గెలుచుకుంది. తెలుగుదేశం మూడింటికే పరిమితమైంది. 57 జడ్.పి.టి.సి. స్థానాల్లో తెలుగుదేశం కేవలం మూడింటితో సరిపెట్టుకుంది. కాంగ్రెస్‌తో కలిసి పోటీ చేసినందున సి.పి.ఐ. రెండు స్థానాలను దక్కించుకోగా, తెలుగుదేశం పార్టీతో జతకలిసిన సి.పి.ఎం.కు శృంగభంగమైంది. అధికారపార్టీ గతంలో ఎన్నడూ లేని విధంగా తిరుగులేని మెజార్టీ సాధించుకుంది. సహకార శాఖ ఎన్నికలు, నీటి సంఘాల ఎన్నికలు కాంగ్రెస్‌కు అనుకూలమయ్యాయి. వరుసగా నాలుగవ ఏడాది కూడా తెలుగుదేశానికి చేదు అనుభవాలు తప్పలేదు. జిల్లాలోని ఏడు నియోజకవర్గాల్లో ఇప్పటికీ తెలుగుదేశం పార్టీకి నాయకత్వ సమస్య తీవ్రంగానే ఉంది. మిగిలిన చోట్ల నాయకులు ఉన్నా (మిగతా 76వ పేజీలో)

# కాంగ్రెస్‌కు అసమ్మతి ముళ్ళు!!..

(75వ పేజీ తరువాయి)

కార్యకర్తల్లో నైరాస్యం రాజ్యమేలుతోంది. సీనియర్ నాయకుల ప్రవర్తన కారణంగా పలు నియోజకవర్గాల్లో కొన్ని సామాజిక వర్గాలు పార్టీకి దూరమయ్యాయి. నాయకుల మధ్య సఖ్యత ఎండమావిలా కనిపిస్తోంది. వెనుకబడిన తరగతుల వారికి సరైన ప్రాతినిధ్యం దక్కడం లేదనే విమర్శ నుంచి బయటపడేందుకు తెలుగు యువత పదవిని ఎట్టకేలకు బి.సిలకు ఇవ్వాలని నిర్ణయించారు. గత 15 ఏళ్ళ కాలంలో తెలుగుదేశం పార్టీకి కొన్ని సామాజిక వర్గాలు శాశ్వతంగా పార్టీకి చేరువకాలేక పోయాయి. అధికార పార్టీలో కూడా క్రమంగా ఆధిపత్య పోరాటం ప్రారంభమైంది. గ్రామాల్లో ద్వితీయశ్రేణి నాయకుల మధ్య ఏర్పడ్డ ఆదిపత్య పోరాటం శాసన సభ్యులకు శాపంగా మారనుంది. శాసన సభ్యుల వైఖరి పట్ల దూరమైన వర్గాలు ప్రతిపక్షాలకు సహకరించే అవకాశాలు లేకపోలేదు. వ్యక్తి గతంగా శాసన సభ్యుల వల్ల నష్టపోయిన ప్రజలు ఎన్నికల్లో తమ ప్రతాపాన్ని చూపిస్తారు. దీంతో అధికార పార్టీ శాసన సభ్యులు కూడా రాబోయే కాలంలో ఇప్పటి వరకు నిర్లక్ష్యం చేసిన వారిని తిరిగి బుజ్జగించక తప్పని పరిస్థితి నెలకొంది. జిల్లాలో వామపక్ష ఉద్యమాలు ఊపందుకుంటున్నాయి.

సి.పి.ఎం. ప్రభుత్వం అవలంభిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలపై పోరాడేందుకు ముందంజలో ఉంది. తెలుగుదేశం పార్టీ చేస్తున్న ఆందోళనా కార్యక్రమాలకన్నా వామపక్షాలు నిర్వహిస్తున్న ఆందోళనా కార్యక్రమాలకు ప్రజలు పెద్ద సంఖ్యలో హాజరుకావడం గమనార్హం. సి.పి.ఎం. బాటలోనే సి.పి.ఐ. కూడా ఉద్యమాల్లోకి వెళుతుంది. సి.పి.ఐ. అధికార పార్టీతో సఖ్యతతో ఉంటూనే ఆందోళనలు కొనసాగిస్తోంది. సి.పి.ఎం. జిల్లా కార్యదర్శిగా డి. రమాదేవి, సి.పి.ఐ. జిల్లా కార్యదర్శిగా ముప్పాళ్ళ నాగేశ్వరరావు, బి.జె.పి. జిల్లా అధ్యక్షునిగా ఆర్. లక్ష్మీపతి, నగర అధ్యక్షునిగా నేరెళ్ళ మాధవరావులు నియమితులయ్యారు.





# స్నేహశీలి 'నిమ్మకాయల రాజనారాయణ'

సాంబయ్య, మేజర్‌న్యూస్, గుంటూరు రూరల్

ఉన్నతమైన భావాలు కలిగిన వ్యక్తి ఏ కులంలో జన్మించినా ప్రతి ఒక్కరూ ఆ వ్యక్తిని దైవంతో సమానంగా ఆరాధిస్తారనటానికి నిదర్శనం నిమ్మకాయల రాజనారాయణ. బి.సి. కులంలో పుట్టి మచ్చలేని మనిషిగా అటు పార్టీ పరంగా ఇటు వ్యాపార పరంగా విధులు నిర్వహిస్తూ తనను నమ్ముకున్న వారి కష్టాలను తన కష్టాలుగా భావించి వారి కష్ట జీవుల అవసరాలను తక్షణమే పరిష్కరించగల సహృదయుడు నిమ్మకాయల రాజనారాయణ. నమ్మకాన్ని ఆయుధంగా ఉపయోగిస్తూ తనదైన శైలితో జనాకర్షణ గల ఏకైక వ్యక్తిగా గొప్ప పేరు పొందారు. 1963 మార్చి 6వ తేదిన సత్యం, ఏసుపాదమ్మలకు గుంటూరు చంద్రమౌళినగర్‌లో జన్మించిన ఈయన చిన్ననాటి నుండి సంఘంపట్ల విధేయతతో మెలుగుతూ వచ్చారు.

ప్రస్తుతం కొల్లి శారద హోల్‌సేల్ కూరగాయల మార్కెట్ నందు వ్యాపారాన్ని నిర్వహిస్తూ శ్రమ జీవులకు ఉపాధిని కల్పించారు. ఇతని దగ్గరకు సరుకు తీసుకువచ్చిన రైతు గుండెమీద చేయివేసుకుని నిర్భయంగా వెళ్ళిపోతారు. వారు తెచ్చిన సరుకు అంగట్లో వారి సమక్షంలో అమ్ముకోకుండానే ఆయనపై ఉన్న నమ్మకంతో వెళ్ళిపోతారు. ఏ క్షణంలోనైనా పిలిస్తే పలికి అవసరాలు తీర్చే ఆపద్బాంధవుడుగా రైతుల చేత కొనియాడబడుచున్నారు. తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం దగ్గర నుండి ఒక సామాన్య కార్యకర్తగా పార్టీలో చేరిన రాజనారాయణ 2004వ సంవత్సరంలో బాపట్ల నియోజకవర్గ అభ్యరిగా ఆనాడు పార్టీ గుర్తించింది.

## ఉన్నతమైన వ్యక్తికి పదవులు కొదువలేదనటానికి ఇవే సాక్ష్యం...

తెలుగుదేశం పార్టీ జిల్లా కో ఆర్డినేటర్ సభ్యుడుగా, తెలుగుదేశం పార్టీ జిల్లా ఉపాధ్యక్షుడుగా, కార్పొరేషన్ ఎన్నికల కమిటి సభ్యుడుగా, కౌన్సిల్ చీప్ విప్‌గా, 36వ డివిజన్ కార్పొరేటర్‌గా, ఉమెన్స్ కాలేజి కమిటి మెంబర్‌గా, గుంటూరు అర్బన్ యాదవ సంఘ అధ్యక్షులుగా, కొల్లి శారద హోల్‌సేల్ కూరగాయల మార్కెట్ సెక్రటరీగా, పాత గుంటూరు కనక దుర్గగుడి అధ్యక్షులుగా ప్రస్తుతం పార్టీ ఇతని సేవలను గుర్తించి తెలుగుదేశం రాష్ట్ర కమిటి సభ్యులుగా బాధ్యతలు అప్పగించింది. చదువుకునే పేద విద్యార్థులకు స్కాలర్ షిప్‌లు ఇవ్వటం, వారికి కావలసిన బుక్స్, దుస్తులు ఉచితంగా పంచిపెట్టడం, అన్నదాన కార్యక్రమాలు విరివిగా ఏర్పాటు చేసి వయోవృద్ధులకు ఆర్థిక సహాయం అందిస్తున్నారు.



*Dr. Anna Sarah Kugler*

## BECOME A DOCTOR + I.T. (COMPUTER) PROFESSIONAL

*Through*

# BACHELOR OF PHYSIOTHERAPY

*at*



*P.Emmanuel Prakash*

Under AELC

## Kugler Memorial Physiotherapy Degree College

ANNEX Buildings.A.C. College Campus, GUNTUR.

## Vikas Institute of Medical Sciences College of Medical Lab Technology

Beside Hanumaiah Company I[st] Lane, L.I.C Colony, Main Road, GUNTUR.

## Kugler Pioneer Renowned Missionary

### College of Nursing

Gorantla Buildings,
Mahendra Nagar, Ongole-1
Prakasam (Dt)
☎: 08592-220104.

### School of Nursing

# 37-1-158(77),
Near Srinivasa Theatre
Ongole-1, Prakasam (Dt)
☎: 08592-220104.

**For Admissions Contact :-** Jessy : 9397873004, Tondon :9397873005, Subrahmanyam: 9985498437

# ప్రగతి పథంలో 'పెదకొదమగుండ్ల'

(సిహెచ్ చంద్ర శేఖరరావు, మేజర్‌న్యూస్-కారంపూడి)

ప్రగతిపథంలో పెదకొదమగుండ్ల పంచాయితీ ముందంజలో వుంది. యువ సర్పంచ్ వలపా బాలస్వామి పదవీ బాధ్యతలు చేపట్టాక వార్డు సభ్యులతో చర్చ లు జరిపి వారి వారి వార్డులలో వున్న సమస్యలను తెలుసుకుని వాటి పరిష్కారానికై కృషి చేస్తున్నారు. ఖాళీ సమయాల్లో ఆయా వార్డుల్లో వార్డు సభ్యులతో కలిసి ప్రజల వద్దకు వెళ్లి సమస్యలు తెలుసుకుని పరిష్కరిస్తు న్నారు. పార్టీలకతీతంగా గ్రామాభివృద్ధికి తన వంతు



సర్పంచ్ వలపా బాలస్వామి

పాటు పడుతున్నారు. గ్రామంలోని అన్ని రోడ్లూ సిమెంటు రోడ్లుగా చేయాలనే తన లక్ష్యం నెరవేర్చుకోవడానికి కృషి చేస్తు న్నారు. గ్రామంలో రెడ్డి పాలెం వెళ్లే రహదారి 10 లక్షలతో సిమెంట్ రోడ్డు నిర్మా ణం, నాలుగు లక్షలతో గ్రామంలో డ్రైనేజి వ్యవస్థ , లక్ష రూపాయలతో వీధి దీపాల విద్యుద్ధీకరణ చేయాలని తన లక్ష్యంగా పేర్కొన్నారు. ఏదిఏమైనప్పటికీ పెదకొదమగుండ్ల గ్రామ పంచాయితీ పరిధిలో అభివృద్ధి కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు.



సమావేశంలో ప్రసంగిస్తున్న పెదకొదమగుండ్ల సర్పంచ్



## సమాచార హక్కు
## వినియోగించుకోండి ఇలా

సయ్యద్ సాబిర్ హుసేన్, మేజర్‌న్యూస్, వినుకొండ

'సమాచార హక్కు 2005' ఇప్పుడు ప్రజల చేతిలో పాశుపతాస్త్రం లాంటిది .దీని ద్వారా ప్రభుత్వ కార్యాలయాల నుండి తమకు కావాల్సిన సమాచారాన్ని సామాన్య పౌరులు సైతం పొందవచ్చు. గతంలో ప్రభుత్వ కార్యాలయాలు గుట్టుగా సాగించే కార్యక్రమాల వివరాలను అనుమానం కల్గిన ప్రతిపౌరుడు తెలుసుకునే అవకాశాన్ని ఈ సమాచార హక్కు చట్టం కల్పించింది. ప్రభుత్వ కార్యాలయాల నుండి పత్రాలు, రికార్డుల యొక్క తనిఖీ మరియు రికార్డుల తాలుకూ నకళ్ళు, సారాంశం, నోట్లు తీసుకునే అధికారం ఇప్పుడు ప్రజల చేతికి అందివచ్చింది.

★ఎలాంటి సమాచారం పొందవచ్చు

1. ప్రతి ప్రభుత్వ కార్యాలయం తమ విభాగమునకు సంబంధించిన పనులను, విధులను గురించిన వివరముల సమాచారం తెలియజేయవచ్చు.
2. అధికారి, సిబ్బంది యొక్క పేర్లు, వారి అధికారాలు, వేతనం గురించిన వివరములు.
3. విభాగం రికార్డులకు సంబంధించిన సూచిక
4. విభాగానికి సంబంధించిన బడ్జెట్ మరియు ఖర్చుల వివరణ
5. లబ్ధిదారుల సూచిక, రాయితీలు, పర్మిట్ తీసుకున్న వారి వివరములు
6. ప్రజా సమాచార అధికారి యొక్క పేరు, చిరునామా (మిగతా 79లో)









జిల్లా కలెక్టర్ చేతులమీదుగా యూత్ అవార్డును అందుకుంటున్న బాబూజీ సేవాసంస్థ అధ్యక్షులు తోటరాంబాబు

# 'కూని'రాగాలు

గోల్కొండ గోడలకు చెవులు!
బాబాల గోదాలలో నల్లధనాలు ఉంటాయ్!

సంధాన కర్తకు సందేహాలు!
విధాన కర్తకు వాత్సల్యాలు ఉండొద్దు!

అయోధ్యలో అవిభాజ్యాలు!
సయోధ్యలో పరిష్వంగాలు ఎక్కువ!

జ్ఞాపకాలు మధురమైనవి!
కోరికలు అనంతమైనవి!

ఆశకు ఆడంబరం!
కోతకు కరుకుదనం సహజం!

నిరాశ నిస్తేజాన్ని ఇస్తుంది!
తపన తలరాతను మార్చేస్తుంది!



- కూనిరెడ్డి శ్రీనివాస

## సమాచార హక్కు వినియోగించుకోండి ఇలా

(78వ పేజీ తరువాయి)

★ఎలాంటి సమాచారం వెల్లడి చేయరు:

1. దేశ ఆర్థిక, వైజ్ఞానిక, సమైక్యత, సమగ్రతలకు, విదేశి సంబం ,దాలకు ముప్పు తెచ్చిపెట్టే సమాచా రాన్ని వెల్లడి చేయరు.

2. నేర పరిశోధన, నేరస్తులను అరెస్టు చేయడానికి, విచారించ డానికి ఆటంకంగా మారే సమా చారం.

3. ఒక వ్యక్తి ప్రాణ హాని కల్గించే అవకాశమున్న ఎలాంటి సమా చారమైన

4. ప్రజా ప్రయోజనం కల్గించని వ్యక్తుల, వ్యక్తిగత సమాచారం

★ సమాచారం ఎలా పొందాలి?

సమాచారం పొందడానికి ప్రభుత్వ కార్యాలయాలలో నియ మించబడిన ప్రజా సమాచార అధికారి వద్ద దరఖాస్తు చేసుకోవ లెను. దరఖాస్తు చేసినట్లు రసీదును తప్పకుండా తీసుకోవలెను.

★దరఖాస్తు ఎలా చేయాలి :

ప్రజా సమాచార అధికారి పేరు, విభాగము/శాఖ పేరు మరియు చిరునామా

దరఖాస్తుదారు పేరు మరియు చిరు నామా, కావాల్సిన సమాచారం యొక్క విషయం, కావాల్సిన సమా చారం యొక్క వ్యవధి, కావాల్సిన సమాచారం యొక్క వివరములు

సమా చారం దేని ద్వార తెలపవ లెను.ప్రతి లిపి , నమూన, చేతి వ్రాత లేదా తనిఖీ

దారిద్ర్య రేఖ దిగువున వున్నవారి రుజువు పత్రం . దరఖాస్తు దారు వివరములు

నగదు / డ్రాఫ్ట్/ చెక్కు/ చెలానా.

దరఖాస్తు దారు సంతకం మరియు తేది.

సకాలంలో సమాచారం అందించ కపోయిన, తప్పుడు సమాచారం ఇచ్చిన, దరఖాస్తు స్వీకరిచకపోయిన అపీలు చేసుకునే అవకాశం ఈ చట్టంలో కల్పించబడింది. ఇందుకు గాను సంబంధిత అధికారికి రోజుకు రూ.250లు చొప్పున రూ.25వేల వరకు జరిమాన విధించవచ్చు. కనుక ప్రభుత్వం పౌరులకు కల్పించిన చట్టబద్ధ సమాచార హక్కును సద్వినియోగం చేసుకుందాం.

# ఉప్పు సత్యాగ్రహంలో ఉద్యమించిన కొండా వెంకటప్పయ్య పంతులు

చిలకా సాంబయ్య
గుంటూరు రూరల్ రిపోర్టర్

గుంటూరు బ్రిటీష్ సామ్రాజ్యవాదుల ఆదేశాలను ధిక్కరించి ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా తన ఇంటి ఆవరణ లోనే వందలాది పొయ్యిలు పెట్టించి సముద్రపు నీరు తెప్పించి, ఉప్పును తయారు చే యించిన మహానుభావుడు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు. వేలాది మంది ఉప్పు పొట్లాలు కట్టుకుని, నల్లజెండాలు పట్టుకుని గుంటూరు నగరం యావత్తు జాతీయ గీతాలలో హోరెత్తేలా ఉద్యమించిన మహానీయుడు వెంకటప్పయ్య పంతులు. కొండా వెంకటప్పయ్య పంతులు 1866 ఫిబవరి 22న గుంటూరులో జన్మించారు. చిరుప్రాయం నుంచే ఆయన దేశభక్తి, కళలపట్ల ఆసక్తిని ప్రదర్శించేవారు. రాజమండ్రి ప్రభుత్వ కళాశాలతో ఎం.ఎ చదివిన అనంతరం ఉన్నత విద్య కొరకు చెన్నై క్రిస్టియన్ కళాశాలలో చేరారు. 1887లో చెన్నైలో జరిగిన మూడవ జాతీయ కాంగ్రెస్ మహాసభలో ఆయన వాలంటీర్‌గా పనిచేశారు.

మహాసభలో ప్రముఖుల ప్రసంగాలు ఆయనపై తీవ్ర ప్రభావాన్ని చూపాయి. బి.ఎల్ పరీక్షను ఆయన ఫస్టు గ్రేడులో పాస్ అయ్యారు. సంఘ సేవకు, ప్రజాహిత కార్యక్రమాలకు కేంద్రంగా వున్న బందరులో 1894లో ఆయన న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. తెలుగు ప్రజానీకంలో దేశభక్తి భావాన్ని ప్రజ్వ లింపచేసిన కృష్ణా పత్రికకు 1902లో ఆయన ముఖ్య సంపాదకులుగా పని చేశారు. అవినీతి, అక్రమాలకు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఆయన రాసిన సంపాదకీయాలు తీవ్ర సంచలనం సృష్టించాయి. స్త్రీ పునర్వివాహ సంస్కరణల కొరకు కృషి చేసి బందరు, గుంటూరు నగరాలలో మంచి పేరు సంపాదించారు. నాడు బందరు లోని నోబుల్ కళాశాలలో ఉపాధ్యాయుడుగా వున్న ప్రముఖ సంఘ సంస్కర్త రఘుపతి వెంకట రత్నం నాయుడు, నోబుల్ కళాశాలకు సర్వస్వం త్యాగం చేసిన కోవల్లె హనుమంతురావు, కృష్ణా పత్రిక ద్వారా సమాజాన్ని జాగృతం చేసిన ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్యలతో ఆయనకు మంచి స్నేహం కుదిరింది. న్యాయవాద వృత్తిలో వెంకటప్పయ్య ధనార్జనకే కాక నైతిక ఉద్ధరణకు ప్రాధాన్యం ఇచ్చారు. అహ్మదాబాద్‌లో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు ఆయన కృష్ణా జిల్లా ప్రతినిధిగా హాజర య్యారు. 1905లో గుంటూరులో జిల్లా ఏర్పడిన తరువాత ఆయన తన మకాంను గుంటూరుకు మార్చారు. 1906 కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యారు. స్త్రీ విద్యావ్యాప్తి కొరకు పూనాలో వున్న మహిళా విద్యాలయం తరహాలో ఒక విద్యాలయాన్ని ఏర్పాటు చేయడానికి ఆయన విశేషకృషి సల్పి కొంత మొత్తంలో విరాళాలను సేకరించారు. తాను సేకరించిన ధనంతో ఆయన వేటపాలెంలో కొన్ని భవనాలను నిర్మించారు. కాని తగినన్ని విరాళాలు వసూలు కాకపోవడంతో ఆ కార్యక్రమం మధ్యలో ముగించ వలసి వచ్చింది. గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు స్థాపించిన శారద నికేతన్‌కు ఆయన పదివేల రూపాయిల ఆస్తిని విరాళంగా అంద జేశారు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కొరకు కృషి చేశారు. ఈ నేపథ్యంలోనే ఆయన ఆంధ్రోద్యమం అనే గ్రంధాన్ని రచించారు. అనిబిసెంట్ ప్రారంభించిన హోమ్ రూల్ లింగ్ ఉద్యమాన్ని బలపరచి విస్తృతంగా ప్రచారం చేశారు. ఆయన న్యాయవాద వృత్తిని విడిచి మద్రాసు శాసనసభకు జరిగిన ఎన్నికలలో ఆయన జస్టిస్ పార్టీ అభ్యర్థిని ఓడించారు. ఆయన శాసనసభ్యుడిగా వున్నప్పుడు పౌర గ్రంధాలయాలకు గ్రాంట్లు ఇప్పించడమేకాక మహిళలు ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షలు రాసేందుకు కృషి చేశారు. అనంతరం ఆయన పన్నుల సహాయ నిరాకరణ ఉద్యమం, చీరాల, పేరాల ఉద్యమం, పుల్లరి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్య మాలలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షునిగా కొండా వెంకటప్పయ్య ప్రధాన కార్యదర్శిగా గొల్లపూడి సీతారమ శాస్త్రీలు ఎన్నికైన తరు వాత రాష్ట్రంలో సహాయ నిరాకరణోద్యమం ఉప్పెనలా ఎగిసింది. అప్పటి నుంచి కొండా వెంకటప్ప య్యకు దేశభక్తి అనే బిరుదు వ్యాప్తిలోకి వచ్చింది. 1921లో విజయవాడలో అఖిల భారత కాంగ్రెస్ మహాసభకు హాజరవ్వ డానికి వచ్చిన మహాత్మగాంధీతో కలిసి ఆయన పలుప్రాంతాల్లో పర్యటించారు. వెంకటప్పయ్య ఆధ్వర్యంలో రాష్ట్రంలో విదేశీ వస్తు బహి ష్కరణ ఉద్యమం ఉధృతంగా సాగింది. గుంటూరులో నాడు ఆయన నేతృత్వంలో స్వరాజ్య రథ ఉత్సవం అత్యంత కన్నుల పండుగగా జరిగింది. వందలాది మంది స్త్రీలు జాతీయగీతాలు పాడుతూ చేనేత వస్త్రాలు ధరించి రథాన్ని లాగిన దృశ్యం చూపరుల చేత కంట తడి పెట్టించింది. గయా కాంగ్రెస్ మహాసభ జరిగిన తరువాత చిత్తరంజన్ దాస్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేయడంతో మధ్యే మార్గంగా వెంకటప్పయ్య ఎన్నికయ్యారు.

1947లో ఆయన వెంకటశ్వర సేవానంద లహరి అనే పద్యకావ్యాన్ని రచించారు. దేశ సేవలో తన తుదిశ్వాస వరకు గడిపిన వెంకటప్పయ్య 1949లో ఆగష్టు 15న కన్నుమూశారు.

# ఆపన్నులకు అండ... అమిరినేని

గొల్లపూడి శ్రీహరి, రిపోర్టర్, తెనాలి రూరల్

నిరుద్యోగులకు చేయూత, పేద ప్రజలకు వైద్యసదుపాయాలే లక్ష్యంగా ముందుకు వెళ్తున్న సంస్థ తెనాలికి చెందిన ఎన్.టి.ఆర్ మెమోరియల్ హెల్త్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్. కులమతాలకతీతంగా పేద, బడుగు, బలహీన వర్గాలకు చెందిన నిరుద్యోగ యువతకు చేయూతనిస్తూ, గ్రామీణ ప్రాంతవాసులకు వైద్యసేవలందించడంలో ముందంజలో ఉండి అమరజీవి ఎన్.టి.ఆర్ ఆశయ స్ఫూర్తితో ముందుకు సాగుతోంది.

ఈ సంస్థకు అధ్యక్షులుగా ప్రముఖ తెలుగుదేశం పార్టీ నాయకులు అమిరినేని రాజా వ్యవహరిసున్నారు. కొత్త మాసు మల్లిబుజ్జి ప్రధాన కార్యదర్శిగా విధులు నిర్వహిస్తున్నారు. సంస్థ పేరిట తెనాలి పరిసరప్రాంతాల్లో ఎన్.టి.ఆర్ పేరిట ఉచిత వైద్య శిబిరాలు ఏర్పాటుచేసి పేదవారికి మెరుగైన వైద్యంతో పాటు ఉచితంగా మందులు పంపిణీ చేయడంతోపాటు వారిని అక్కున చేర్చు కుంటున్నారు. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లోని నిరు ద్యోగ యువతకు ఉపాధిని కల్పించేందుకు మేము అండగా ఉన్నామంటూ అభయ హస్తం ఇస్తూ పలువురు నిరుద్యోగులకు నేటికీ అనేక మందికి సెక్యూరిటీ గార్డులుగా ఉపాధి కల్పించారు. ముత్తెంశెట్టి పాలెంలో వైద్యశిబిరం ఏర్పాటుచేసి ఐదు వందలమందికి, చెంచుపేటలో 533, నందులపేటలో 1083, జగ్గడిగుంట పాలెం 1713, బుర్రిపాలెంలో 1645, రవీంద్రనాథ్ కాలనీలో 379 మంది హాస్టల్ బాలబాలికలకు ఉచిత వైద్యసేవలుఅందించటంతో పాటు, మందులను పంపిణీ చేసి,తమ ఔదార్యాన్ని చాటుకున్నారు. ఇవేకాక వేసవి కాలంలో పదో తరగతి పాసైన నిరుద్యోగ యువతీ, యువకులకు స్వయం ఉపాధి కింద డి.సి.ఎ కంప్యూటర్ కోర్సు, డి.టి.పిలను ఉచితంగా బోధిస్తూ వారికి ఉపాధిని చూపిస్తు న్నారు. పట్టణంలో స్థానిక వి.ఎస్.ఆర్ కళాశాల సమీ పంలో వినాయకుడి నిలువె త్తు భారీ విగ్రహాన్ని ఏర్పాటు చేసిన ఘనత అమిరినేనికే దక్కింది. సంస్థ తలపెట్టిన సేవా కార్యక్రమాలను తెలు సుకున్న మాజీ ముఖ్యమంత్రి నారాచంద్ర బాబునాయుడు ప్రత్యేకంగా అభినందించారు. వీరు చేపట్టిన సేవా కార్యక్రమాల్లో మాజీ మంత్రి కోడెల శివప్రసాదరావు, తెలుగుదేశం నాయకులు ప్రత్తిపాటి పుల్లారావు, మాజీ ఎమ్మెల్యే గోగినేని ఉమ, పలువురు దేశం సీనియర్ నాయకులు పాల్గొని రాజాను వెన్నంటి ప్రోత్సహిస్తున్నారు. మున్ముందు ఎన్.టి.ఆర్ హెల్త్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్ తమ సేవలను విస్తృతపరచి సమజాభివృద్ధికి కృషిచేయాలని ఆశిద్దాం.



ఉద్యోగ నియామకాలకు వచ్చిన నిరుద్యోగులతో రాజా



చంద్రబాబునాయుడితో రాజా



పేదలకు ఉచితంగా మందులు పంపిణీ చేస్తున్న అమిరినేని, మల్లిబుజ్జి

# సామాజిక సేవలో మండవరవి

బాలబోయిన పాపారావు, మాచర్లటౌన్, మేజర్‌న్యూస్



ఎటువంటి స్వార్థం లేకుండా రిలయన్స్ లైఫ్ ఇన్సూరెన్స్ ప్రతినిధిగా తనకు వచ్చిన ఆదాయంలో సగం పేదలకు సామాజికి సేవా కార్యక్రమాలకు ఖర్చు చేస్తూ ప్రజల మన్ననలు పొందుతున్న వ్యక్తి మండవ రవి. బాల్యం దశ నుండే అభ్యుదయ భావాలు, సామాజిక సేవ అలవరచుకొని సమాజానికి తన వంతు సేవా చేయాలనే తపన ఉన్న మహోన్నత వ్యక్తి మండవ రవి. రామకృష్ణా యూత్ అసోసియేషన్ కుట్టు శిక్షణా కేంద్రాలను ఆయా వార్డుల్లో ఏర్పాటు చేసి ఉచితంగా టైలరింగ్ ఎంబ్రాయిడరింగ్‌లో మహిళలకు శిక్షణ ఇప్పిస్తూ వారి జీవనోపాధికి దోహద పడుతున్నారు. అనారోగ్యంతో బాధపడుతున్న పేదలకు వైద్య సేవలు నిమిత్తం ఆర్థిక సహాయం అందజేస్తూ ఆదుకుంటున్నారు. కుల మతాలకు అతీతంగా దేవాలయాలు, చర్చీల నిర్మాణానికి సంగీత, సాహితీ కళాకారులకు సాంస్కృతిక కార్యక్రమాలకు చేయూత నందిస్తున్నారు. ఆకలితో ఉన్న పేద ప్రజలను అదుకున్నప్పుడే మానవ జన్మకు సార్ధకత లబిస్తుందని చెప్పిన మాటలను మండవ రవి పాటిస్తున్నారు. ప్రజలందరినీ సమానంగా గౌరవించే ప్రేమతత్వం రవిలో ఉన్నాయి. ప్రజా సేవ పేరుతో రాజకీయాల్లోకి ప్రవేశించి అధికారం చేతికందిన తరువాత సేవా భావాన్ని గాలికి వదిలి కేవలం ధన సంపాదనే లక్ష్యంగా పనిచేస్తున్న నేటి రోజుల్లో మండవ రవి లాంటి వ్యక్తి ఉండటం అరుదు. పేద విద్యార్థులకు ఫీజులు చెల్లిస్తూ వారి భవితకు రవి సహాయ పడుతున్నారు. ఎన్నో సామాజిక కార్యక్రమాలు చేపడతున్న మండవ రవికి భగవంతుడు ఆయురారోగ్యం, అష్టఐశ్వర్యాలు ఇచ్చి భవిష్యత్‌లో మరిన్ని సేవా కార్యక్రమాలను చేపడతారని ఆశిద్దాం.



# కార్పొరేషన్ పాలనలో సిద్ధార్ధుని సంస్కరణలు

కె. శ్రీనివాసరావు,
మేజర్‌న్యూస్,గుంటూరు కార్పొరేషన్



నగరపాలక సంస్థకు 10వ కమిషనర్‌గా ఐ.ఎ.ఎస్. అధికారి సిద్దార్ధ జైన్ 30-07-2007న పదవీ బాధ్యతలు స్వీకరించారు. నగరంలో దాదాపు నాలుగేళ్ళ తర్వాత మరలా ఐ.ఎ.ఎస్. అధికారి కమిషనర్‌గా రావడంతో ప్రజాప్రతినిధులు, ప్రజలు హర్షం వ్యక్తం చేశారు. కమిషనర్ సిద్దార్ధ జైన్ విధుల్లో చేరిన తర్వాత ముందుగా సంస్థాగతమైన వ్యవహారాలపై దృష్టి సారించారు. ముఖ్యంగా రాజకీయంగా ఎంతో చైతన్యంగల నగరంలోని రాజకీయ నాయకులు, ప్రజా ప్రతినిధులతో సత్సంబంధాలు కొనసాగిస్తూనే మరోవైపు ప్రభుత్వ అధికారిగా తన పరిధుల మేరకు సమతూకం పాటిస్తూ వస్తున్నారు. సిద్దార్ధ జైన్ కమిషనర్‌గా వచ్చిన తొలి రోజుల్లో గతంలో ప్రవీణ్ ప్రకాష్ మాదిరిగా ఉదయం 5 గంటలకే నగరంలోని పారిశుధ్యం, మంచినీటి సరఫరాలపై నగరంలో విస్తృతంగా పర్యటనలు ప్రారంభిం చారు. తెల్లవారు జామునే సాధారణ వ్యక్తిలా మారుమూల ప్రాంతాలలో సైతం పర్యటించి స్థానికుల సమస్యలు, అవసరాలను స్వయంగా అడిగి తెలుసుకుని, కార్యాలయానికి చేరుకోగానే సమస్యల పరిష్కారానికి అధికారులకు ఆదేశాలు జారీ చేసేవారు. సిద్దార్ధ జైన్ కమిషనర్‌గా వచ్చే సరికి నగరపాలకసంస్థ ఖజానా దాదాపు ఖాళీ అయిన పరిస్థితుల్లో రెవిన్యూ వసూళ్ళను పెంచి, బకాయిలను రాబట్టు కునే దిశగా కమిషనర్ ప్రణాళికలు రూపొందించి అందు కనుగుణంగా అధికారులను సిద్ధం చేశారు. ఈ నేపథ్యంలో అభివృద్ధి పనులు కొనసాగకపోతుండటంతో కార్పొరే టర్లు తీవ్రంగా నిరసనలు తెలిపారు. నిధుల కొరత కారణంగా సిబ్బందికి, కార్మికులకు జీతాలతో పాటు, అభివృద్ధి పనులు చేసిన కాంట్రాక్టర్లకు బిల్లులు చెల్లించలేని స్థితిలో ఉన్న నగరపాలక సంస్థను ఆర్థిక ఇబ్బందుల నుండి గట్టె క్కించేందుకు కమిషనర్ చేపట్టిన కార్యక్రమాల వలన కార్పొరేషన్ గట్టెక్కింది. కమిషనర్ వచ్చిన తర్వాత కాంట్రా క్టర్లకు చెల్లించవలసిన బకాయిలను 5 కోట్ల రూపాయల మేరకు చెల్లించారు. అదేవిధంగా సిబ్బందికి, కార్మికులకు సక్రమంగా వేతనాలు చెల్లించేందుకు పద్ధతి ప్రకారం నిధులను వినియోగించడం ప్రారంభించారు. ప్రజలు ఆహ్లాదపరిచే విధంగా మానస సరోవరం, గాంధీ పార్కుల ను సుందరంగా తీర్చిదిద్దడం జరిగింది. క్రీడా కారులను తీర్చి దిద్దేందుకు ఎన్ .టి.ఆర్. స్టేడియం ప్రముఖ పాత్ర పోషిస్తోంది.

## పెద్దఎత్తున అభివృద్ధి పనులు

ప్రసుత్తం నగరంలో 2కోట్ల రూపాయల విలువగల అభివృద్ధి పనులు వివిధ దశల్లో ఉన్నాయి. నగరంలోని 20 మురికి వాడల దశ మార్చి రహదారులు భూగర్భ డ్రైనేజీ, మురుగునీటి కాలువల సౌకర్యాలతో పాటు ప్రజల అవసరాలు తీర్చే ఉద్దేశంతో స్వయంగా మేయర్ కన్నా నాగరాజు, కమిషనర్ సిద్దార్ధజైన్ ఢిల్లీలో జరిగిన కేంద్ర పట్టణాభివృద్ధి సంస్థ సమావేశంలో పాల్గొని ఇక్కడి ప్రజల సమస్యలను సమర్ధవంతంగా వినిపించి ఇంటిగ్రేటెడ్, హౌసింగ్, స్లమ్స్‌డెవలప్ మెంట్ పథకం కింద 20 కోట్ల రూపాయల మంజూరు చేయించుకు రావడం చెప్పుకోదగ్గ విషయం!

## ఎ.పి.యు.ఎస్.పి. నిధుల వినియోగంలో ప్రథమం

ఆంధ్రప్రదేశ్ పేదల సదుపాయాల పథకం ద్వారా 3 విడతలుగా మంజూరైన కోట్లాది రూపాయల నిధులను సక్రమంగా వినియోగించుకుని, గుంటూరు నగరం రాష్ట్ర స్థాయిలో ప్రథమ స్థానంలో నిలిచింది. ఎ.పి.యు.ఎస్.పి. ద్వారా మంజూరైన 1 కోటి 50 లక్షలతో ప్రస్తుతం నగర పాలకసంస్థ కార్యాలయాన్ని పెరుగుతున్న ప్రజల అవసరాల కనుగుణంగా విశాలవంతంగా తీర్చిదిద్దేందుకు, అధునీకరణ పనులు జరుగుతున్నాయి. **(మిగతా 83వ పేజీలో)**



### కార్పొరేషన్ పాలనలో..

82పేజీ తరువాయి

డివిజన్ల ఆకస్మిక తనఖీలలో భాగంగా నూతన అధ్యాయానికి కమిషనర్ శ్రీకారం చుట్టారు. పన్నులు చెల్లించక పోవడం వలన అభివృద్ధి పనులు నిర్వహించ లేక పోవడం జరుగు తోందని, పన్నుబకాయిలు చెల్లించిన ప్రాంతాలలో తక్షణం పనులు ప్రారంభిస్తామని అధికారుల ద్వారా ఇంటింటికీ ప్రచారం నిర్వహిస్తూ ప్రజలకు వాస్తవాలు వివరించే ప్రయత్నాలకు కమిషనర్ శ్రీకారం చుట్టారు.

# భక్తుల కోరికలు తీర్చే మత్స్యరూప వెంకటేశ్వరస్వామి

జె.శ్రీనివాసరావు,
మేజర్‌న్యూస్, రాజుపాలెం

శ్రీ వెంకటేశ్వరస్వామి అవతరమైన మత్స్యరూప వెంకటేశ్వర స్వామి రాజుపాలెం మండలంలోని దేవరం పాడులో ప్రజల కోరికలు తీర్చే భగవంతునిగా కొలువై ఉన్నారు. ఈ స్వామికివిశేషమైనప్రాచీన కథ ఉంది. వంద లాది సంవత్సరాల క్రితం ఒక మున్నీశ్వరుడు తపస్సు చేసుకునుటకై దేవరం పాడు కొండపై ఉన్న వెంకటేశ్వర స్వామి సన్నిధికి చేరుకున్నాడు. ఆలయం లో చరులుగా ఉన్న రాతిని అతను వేరే రాతితో పగల కొట్టగా మత్స్య రూపంలోఉన్న వెంకటేశ్వ రస్వా మి దర్శనం ఇచ్చా డు. ఆనా టి నుంచి దేవరం పాడు కొండపై వెల సిన మత్స్య రూప వెంకటేశ్వ రస్వా మి దినదిన ప్రవర్ధ మానమై భక్తులు కోరిన వెంటనే కోరికలు తీర్చే కొంగు బంగారమై విరాజిల్లు తున్నాడు.

శ్రీ వెంకటేశ్వర స్వామి వారి దేవస్థానము
దేవరంపాడు,



స్వయంభు మత్స్యావతార స్వామి వారు

మహావిష్ణువు తొలి అవతారమైన స్వయంభు మత్స్యావతారంలో వెంకటేశ్వరుడు కొలువై ఉండటంతో కోరిన కోరికలు తీరుతున్నాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం. ప్రతిసంవత్సరం మహాశివరాత్రి తరువాత వచ్చే ఫాల్గుణ మాసంలోని నాలుగు శనివారాలతో పాటు ఉగాది నాడు స్వామివారి ఉత్సావాలు జరుపు తారు.మహిళలు పెద్దసంఖ్యలో తరలి వచ్చి ఉపవాసం ఉండి పొంగళ్ళు చేసి స్వామివారికి వెన్న, నెయ్యి, బెల్లం లతో అభిషేకిస్తుండటంతో ఈ స్వామి కినేతి వెంకటేశ్వరునిగా పేరు వచ్చి ంది. రైతులు పాడిపశువులతో ఆల యం చుట్టూ ప్రధక్షణలు చేస్తే ఆ కుటుంబం పాడిపశువులతో కళకళ లాడుతుందని ప్రసిద్ధి. సంతానంలేని దంపతులు ఈ పుణ్యక్షేత్రంలోని జు వ్విచెట్టుకు పూజలు చేస్తే సంతాన భాగ్యం కలుగుతుందని భక్తుల విశ్వా సం. కొండమోడు జంక్షన్ నుండి బస్సులు, ఆటోలుద్వారా స్వామి వారి కొండకు భక్తులు చేరుకుంటారు.

శ్రీ వెంకటేశ్వర స్వామి వారి దేవస్థానము
దేవరంపాడు,



ప్రతిష్ట స్వామి వారు

## జిల్లా సంగతులు

★క్రీ.శ.1565లో గుంటూరు ప్రాంతం గోల్కొండ కుతుబ్‌షాహీల పాలనలోకి వచ్చింది. ఆసమయంలోనే కొండవీడు పేరును ముర్తుజానగర్‌గా మార్చారు.

★క్రీ.శ.1678లో జౌరంగజేబు గోల్కొండను ఆక్రమించడంతో ముర్తుజానగర్,హైదరాబాద్‌లో అంతర్భాగమైంది.

"ఒక వ్యక్తి తన అంతరంగ మనోభావాలను తన మాతృ భాషలో వ్యక్తం చేసినంతగా మరే ఇతర అరువు భాషలో తెలుపుకోలేడు" - భాషా శాస్త్రవేత్తల అభిప్రాయం.

# రాచరిక పాలనలో జరిగిన తెలుగు అభివృద్ధి నేడెక్కడ..!!

బి నరసింహారావు, మేజర్‌న్యూస్, దాచేపల్లి

తెలుగు భాషా స్థితి గతులపై నేను ప్రారంభించిన వ్యాసం ముగింపు వరకు తెలుగులో వ్రాయగలనా అనే సందేహం, సంశయం నా మనసును తొలుస్తున్నాయి. ఒకింత భయంగా కూడా ఉంది. నేడు తెలుగు నేలపై తెలుగు వారమని చెప్పుకునే మనమందరం మాట్లాడుతున్నది మొత్తం తెలుగేనా...? అంటూ ప్రశ్నిస్తే నిర్ద్వంధంగా కాదని చెప్పవలసిందే...! తెలుగు భాషా స్థితి గతులను నేడు విశ్లేషించినపుడు భాషాభివృద్ధి తిరోగమనంలో ఉందని చెప్పుకోవాలి. యునెస్కో వారు ఇటీవల ప్రాంతీయ భాషలపై చేసిన అధ్యయనంలో వెల్లడైన విషయాలు తెలుగు భాషాప్రియులను అశనిపాతంలా అనిపిస్తాయి. రాబోయే అర్థ శతాబ్దిలో అంతరించే ప్రాంతీయ భాషల్లో తెలుగు భాష కూడా వారి అధ్యయనంలో పైకి తేలడం విచారించ దగ్గ విషయం. వాస్తవానికి రాచరిక పాలనలో జరిగినంత తెలుగు అభివృద్ధి ప్రజాస్వామ్య స్వపరిపాలనలో జరగడంలేదనేది వాస్తవం. తెలుగుకు వెనుకబాటుతనం మొగలాయిల పాలనలో మొదలై బ్రిటీష్ వారి ఏలుబడిలో కూడా కొనసాగింది. అప్పట్లో పాలకుల పాలనను గురించి తెలుగు భాష చిన్న చూపుకు లోనైతే, ఇప్పుడు ఇది బ్రతుకు తెరువుకు సంబంధించిన అంశమైంది. హైదరాబాద్‌లో స్థిరపడిన నా మిత్రుని ఇంటికి ఈ మధ్యన వెళ్లాను. ఆయన పుత్రుడు ఇంజనీర్. పాపం ఆ యువకుడు అతి కష్టం మీద తెలుగు దినపత్రిక శీర్షికలు చదువుతున్నాడు. ఇది విడ్డూరం అనడంకంటే, సాధారణం అంటే బాగుంటుందేమో...? పట్టణాల నుంచి పల్లెల వరకూ ఆంగ్ల మాధ్యమం మీద విపరీతమైన మోజు పెరుగుతుంది. ఆశలన్నీ అమెరికా లాంటి పాశ్చాత్య దేశాలపై నుంచి చదువులు కొనసాగుతున్న కాలం కదా...! చదువిప్పుడు ఉపాధికి ఇంకా చెప్పాలంటే మెరుగైన ఉపాధికి, వాస్తవానికి తెలుగు ఇది పల్లెల్లో నూటికి నూరు శాతం చెందిన అంశం...! పట్టణ, నగర ప్రాంతాల్లో ఎంత శాతం తె లుగు మాట్లాడుతున్నారో చెప్పడం కష్టమే. చదువుకోని వారంతా ఖచ్చితంగా తెలుగు మాట్లాడుతారని అంచనా గట్టవచ్చు. పాఠశాలల్లో అడుగు పెడితే ఆంగ్ల భాషతో నడక సాగుతుంది. ఆంగ్ల మాధ్యమ పాఠశాలల్లో తెలుగులో మాట్లాడితే విద్యార్థులు జరిమానా చెల్లించవలసిన ధౌర్భాగ్య స్థితి ఉంది. నిజానికి మనం మాట్లాడుతున్నామనుకుంటున్న తెలుగులో అనేక ఆంగ్ల పదాలు ఇమిడి వున్నాయంటే ఆశ్చర్యపోవలసిన పని లేదు. "కారు రోడ్డుపై రాకె ట్‌లా పోతుంది" ఈ వాక్యంలోని నాలుగు పదాల్లో 'పోతుంది' అనే పదం మాత్రమే తెలుగు. మిగిలినవి బ్రిటన్, ఫ్రెంచి, రష్యన్ పదాలు. మొదటి నుండి మనం పర భాషాపదాలకు తెలుగు పదాలు ఏర్పాటు చేసుకోకపోవడం వలన ప్రపంచ భాషా పదాలు సరాసరి వచ్చి మన భాషలో ఇమిడి పోయాయి. మరో కోణం నుండి చూస్తే చలన చిత్రాలు, కేబుల్ టివిలు తెలుగు భాషను చిద్రం చేస్తున్నాయి. వారి ఉచ్చరణ, సంభాషణలు తెలుగును ధ్వంసం చేస్తున్నాయి. ఇటీవల వచ్చిన ఎఫ్‌ఎం రేడియోలో మరింత దారుణ వ్యాఖ్యానాలు వినిపిస్తున్నాయి. వేగంగా మాట్లాడాలన్న ఆతృతలో వారు ఆ రేడియోలో ఏ భాష మాట్లాడుతారో అర్థంకాని పరిస్థితి. పట్టీ పట్టనట్లు వ్యవహరిస్తున్న ప్రభుత్వాల పని తీరు తెలుగు భాషా వికాసానికి ఏ మాత్రం ఉపయోగపడకపోగా మరింత చీకటిలోకి నెడుతుంది. యునెస్కో వారి పరిశీలనలో వెల్లడైన అంశం ఒకింత నిస్సంశయంగా తోస్తుంది. 50 సంవత్సరాలంటే కనీసం మూడు తరాలన్నమాట. ఈపాటికే విద్యావంతుల శాతం పెరిగిపోతున్న సందర్భాన్ని పరిగణలోకి తీసుకుంటే గ్రామాల్లోని ప్రభుత్వ పాఠశాలల్లో కూడా ఆంగ్ల మాధ్యమాలు ప్రవేశపెడుతున్నారంటే తెలుగు పరిస్థితి ఏమిటో అంచనాలకు అందదు. ఇదే క్రమంలో తె లుగు భాషాభివృద్ధికి తోడ్పడుతున్న రంగాలు లేకపోలేదు. భాషకు రక్షణగా నిలిచే శాఖలూ వున్నాయి. వీటిలో చెప్పుకోవాలంటే ప్రధానంగా పత్రిక రంగాన్ని చెప్పుకోవాలి. పత్రికలు భాషను శక్తి మేరకు రక్షణ కవచంలా కాపాడుతున్నాయి. ప్రస్తుతం తెలుగు పత్రికల్లో వస్తున్న పదజాలాన్ని ఏ మాత్రం వంక పెట్ట జాలం. చక్కని తెలుగు భాష వినియోగిస్తున్నారు. ఈ మేరకు పత్రికల్ని అభినందించాల్సిందే. ఇంకా చెప్పాలంటే పత్రికల్లో వచ్చే అనేక వ్యాసాలు, ప్రత్యేక అంశాలు కవితాత్మకంగా వ్రాయడం విశేషం. శీర్షికలన్నీ హృద్యంగా వుంటాయి. ప్రతి ఒక్కరికీ పత్రికలు చదవడం అలవాటు చేస్తే క్షీణించి పోతున్న తెలుగు భాషను ఆకాశ మార్గం పట్టించవచ్చు. అదే విధంగా కవిత్వం వైపుకు అభిరుచిని మళ్లిస్తే తె లుగు శాశ్వతంగా తలెత్తుకుని వుంటుంది. ఆంగ్ల మాధ్యమ పాఠశాలల్లో కూడా తెలుగు తప్పనిసరి. పాఠ్యాంశం చేసి విద్యార్థులకు పత్రికాపఠనం, సాహిత్యం, ఆసక్తి కలిగించే విధంగా ప్రభుత్వాలు, పిలల్ల తల్లిదండ్రులు ప్రయత్నించాలి.

## జిల్లా సంగతులు

★ 1859 సంవత్సరంలో పరిపాలన సౌలభ్యం పేరుతో గుంటూరు జిల్లా కృష్ణాజిల్లాలో అంతర్భాగం చేశారు.

★ 1904 అక్టోబర్ 1వ తేదీన ప్రత్యేకంగా గుంటూరు జిల్లా ఏర్పాటైంది. తెనాలి, గుంటూరు, సత్తెనపల్లి, పల్నాడు, బాపట్ల, నరసరావుపేట, వినుకొండ, రేపల్లె, ఒంగోలు తాలుకాలుగా ఉన్నాయి.

★ 1970 సంవత్సరంలో ఒంగోలు తాలుకాను పూర్తిగా బాపట్ల, నరసరావుపేట, వినుకొండ తాలుకాల్లోని కొంత భాగాలతో ప్రకాశం జిల్లా ఏర్పాటుచేశారు.

★ క్రీ.శ. 1795లో చింతపల్లి జమీందార్ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తన రాజధానిని ధరణికోటకు మార్చాడు.

# ఉత్తమ అధికారి రామచంద్రరావు

పి.ఫిలిప్స్, మేజర్ న్యూస్, వినుకొండ టౌన్

ప్రభుత్వ ఉద్యోగులు చాలా మంది తమ పనిమాత్రమే చేసుకొని మిన్నకుండడం మనకు తెలిసిందే. అయితే తాను పనిచేస్తున్న విభాగాన్ని మాత్రమే కాకుండా తన శాఖలోని మిగిలిన అన్ని విభాగాలకు చెందిన పనుల కోసం వచ్చే ప్రజలకు తన కు చాతనైనంత సేవలు చేస్తూ మన్ననలను అందు కొంటున్న ఉత్తమ అధికారి ఆకురాతి రామచంద్రరావు. వినుకొండ మున్సిపాలిటీలో శానిటరీ ఇన్స్పెక్టర్‌గా పనిచేస్తున్న ఆయనంటే ఇక్కడి ప్రజలకు ఎంతో అభిమానం. 1998లో వినుకొండ పంచాయితీలో జననమరణ రిజిస్ట్రార్‌గా ఉద్యోగంలో చేరింది మొదలు ఇప్పటి వరకు ఇక్కడి ప్రజలకు ఆయన విశేష సేవలందిస్తున్నారు. 2001లో శానిటరీ ఇన్స్పెక్టర్ గా పదోన్నతి పొందారు. గతంలో కోటప్పకొండ తిరునాళ్ళ, కృష్ణపుష్కరాలలో ప్రజలకు నిబద్ధతగా సేవలందించి జిల్లా అధికారులచే ప్రశంసా పత్రాలు పొందారు.



ఆకురాతి రామచంద్రరావు

బిన్న సిద్ధాం తాలగల కమ్యూనిస్టు, బి.జె.పి, బిఎస్పీ, పాల కులతో కలిసి పని చేసిన అనుభవం రామ చంద్రరావుది. పల్స్ పోలియోలాంటి ప్రభుత్వ కార్యక్రమాల్లో ముందుంటే రామ చంద్రరావు ప్రజలకు అందుబాటులో ఉండే అధికారిగా పేరుపొందారు. అందుకే ప్రజలకు ఎలాంటి ఇబ్బందులు వచ్చినా రామ చంద్రరావును సంప్రదించడం అలవాటుగా మారింది. చిరాకు.... కోపం....ఎరుగకుండా ఎప్పుడూ చిరు నవ్వుతో మెలిగే రామ చంద్రరావును రాష్ట్ర ప్రభుత్వం ఈ ఏడాది జనవరి 26న "ఉత్తమ సేవా పురస్కారం"అవార్డుతో సత్కరించింది. జిల్లా కలెక్టర్ రఫత్ ఆలి చేతుల మీదుగా ఈ అవార్డును అందుకున్నా రు. ఒక శానిటరీ ఇన్స్పెక్టర్‌కు ఇలాంటి అవార్డు అభించ డం అరుదైనదే అని చెప్పవచ్చు. ప్రస్తుతం రాష్ట్ర శానిటరీ ఇన్స్పెక్టర్స్ అసోసియేషన్ ఎగ్జిక్యూటివ్ మెంబర్‌గా పనిచేసున్నారు. ఈ పదవికూడా జిల్లాలో ఒకరికి మాత్రమే లభిస్తుంది. అటు ప్రజల మనిషిగా, ఇటు ప్రభుత్వ ఉద్యోగిగా మన్ననలను పొందు తున్న రామచంద్రరావు భవిష్యత్తులో మరిన్ని ఉన్నత పదవులు పొందాలని ఆశిద్దాం.

## జిల్లా సంగతులు



టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి

✦ క్రీస్తుశకం 1180లో హైహేయ రాజకుటుంబంలో ప్రారంభమైన ఘర్షణ పలనాటి యుద్ధానికి దారితీసింది.

✦ పల్నాటి యుద్ధంలో ఎన్నో రాజవంశాలు పాలుపంచుకుని పతనమయ్యాయి. ఫలితంగా గుంటూరు జిల్లా కాకతీయుల పాలనలోకి వెళ్ళింది.

✦ ప్రోలయ వేమారెడ్డి వారసుడు అనపోతారెడ్డి క్రీ.శ. 1353లో తన రాజధానిని అద్దంకి నుంచి కొండవీడుకు మార్చారు.

✦ క్రీ.శ. 1424లో కొండవీటి రెడ్డి రాజ్యం పతనమయ్యింది. వివిధ రాజ్యపాలకులు ఆధిపత్యం కిందకు వెళ్ళింది.

# శ్రీ సర్వధారినామ సంవత్సర పంచాంగం

సేకరణ: గుంటూరు డెస్క్

స్వస్తి శ్రీ చాంద్రమానేన శ్రీ సర్వధారినామ సంవత్సరమునకు రాజు- చంద్రుడు. మంత్రి-రవి, సైన్యాధిపతి-రవి, సస్యాధిపతి-బుధుడు, ధాన్యాధిపతి- చంద్రుడు, అర్ఘ్యాధిపతి- రవి, మేఘాధిపతి-రవి, రసాధిపతి-శని, నిరాసాధిపతి-బుధుడు. ఈ నవనాయకులలో నలుగురు శుభులు. ఐదుగురు పాపులు. రాజు చంద్రుడు అవడం వలన ప్రజాపాలకుల విషయంలో స్థిరత్వం ఉండదు. పదవులలో మార్పులు, చేర్పులు ఉండే అవకాశం ఉంది. అలాగే పాలన విషయంలో రాజకీయ నాయకుల మధ్య ఏకాభిప్రాయం ఉండదు.

అమాత్యుడు రవి అవడం వల్ల కేంద్ర రాష్ట ప్రభుత్వాల మధ్య సమన్వయం లోపిస్తుంది. వివిధ రాష్ట్రాల మధ్య ఏర్పడు విభేదాలను పరిష్కరించడంలో కేంద్ర ప్రభుత్వం అనాసక్తతను వ్యక్తపరచే అవకాశం ఉంది. భారతదేశానికి ఇతర దేశాలతో సంబంధ బాంధవ్యాలు వృద్ధి చెందుతాయి. మతతత్వ సంబంధమైన వ్యతిరేక శక్తులు ప్రజాకంటకులుగా మారే అవకాశం ఉంది. ప్రభు త్వం సరియైన సమయంలో సరియైన నిర్ణయాలుతీసుకొనడంద్వారా శాంతి భద్రతల విషయంలో కాస్త ఊరట కలుగుతుంది.

మనదేశంలో తూర్పు, ఉత్తర ఈశాన్య ప్రాంతాలలో మహోత్పాతాలు, రైలు, రోడ్డు, ప్రమాదాలు తీవ్రంగా సంభవించే అవకాశం ఉంది. జన, ధన, నష్టం వాటిల్లుతుంది. అర్ఘ్యాధిపతి, మేఘాధిపతి రవి అవడం వలన వర్షపాతాలు స్వల్పంగా ఉంటాయి. పశ్చిమ, దక్షిణాది రాష్ట్రాలలో అతి వృష్టి ఏర్పడే అవకాశం ఉంది. ఎర్రని ధాన్యాలు ఫలిస్తాయి. వరి పంట దిగుబడి హెచ్చుగా ఉంటుంది. సుగంధద్రవ్యాలు చెరకు, చెరకు ఉత్పత్తుల ధరలు పెరుగుతాయి. నూనెల ధరలు అధికమవుతాయి.

స్వర్ణం, రజితం, నవరత్నాల ధరలు పెరిగే అవకాశంఉంది. ఎలక్ట్రానిక్ వస్తువుల ధరలు స్వల్పంగా తగ్గి నిలకడగా ఉంటాయి. వస్త్రాల ధరలు, స్వల్పంగాక్షీణించినిలకడగా ఉంటాయి.

ప్రభుత్వం పన్నుల విషయంలో ఉదారత చూపే అవకాశం ఉంది. విద్య గరిష్ఠ స్థాయిలో ప్రయివేటు పరమవుతుంది. బయో టెక్నాలజీ, బిజినెస్ మేనేజిమెంటు, ఎలక్ట్రానిక్ ఇంజనీరింగు, మెడికల్ తదితర విద్యలకు పురోభివృద్ధి ఉంటుంది. సాఫ్ట్‌వేర్ రంగం మనదేశంలో వృద్ధి చెందడం జరుగుతుంది. తద్వారా విదేశాలకు వలస పోయే ఉద్యోగుల సంఖ్య తగ్గుముఖం పట్టవచ్చు.

కొన్ని అరాచక, అసాంఘిక శక్తుల నుంచి మన సంస్కృతి, ఆధ్యాత్మికతకు చిహ్నాలయిన కట్టడాలను,



మందిరాలను సంరక్షించుకొనే విషయంలో ప్రభుత్వంతోబాటు ప్రజలు అప్రమత్తంగా వ్యవహరించాల్సి ఉంటుంది. హిందూ ధర్మమును ఉన్నత స్థాయికి తీసుకొని వెళ్లుటలో ప్రతి ఒక్కరూ పాటు పడాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

రాశి ఫలితాలు 87వ పేజీలో

ఈ సంవత్సరం చంద్రుడు రాజగుటవలన 3 కుంచముల వర్షము. అందు 7భాగములు సముద్రంపైన, 9 భాగాలు పర్వత్వాలపైన, 4భాగాలు భూమిపైన వర్షించును. జీవనదులకు వరదలు సంభవించును. జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి బుధవారం వచ్చుట వలన ప్రజలుసుభిక్షంగా, క్షేమంగా ఆరోగ్యాలతో ఉంటారు. వర్షా లవల్లపంటలు బాగా పండుతాయి. పాలకులుధర్మములయందు ఆసక్తి కలవారై ఉంటారు.

ఆషాడ శుద్ధ పంచమి సోమవారం యగుటవలన సుభిక్షం, క్షేమం, ఆరోగ్యం, మంచివర్షాలు కురవడం జరుగు తుంది. ఆషాడ శుద్ధ నవమి చిత్తా నక్షత్రముతో కూడి వచ్చుట వలన అన్ని రకాల సస్యములు బాగుగా పండుతాయి. ప్రజలకు ఆనందం కలుగుతుంది.

ఆషాడ బహుళ ఏకాదశి రోహిణి నక్షత్రముతో కూడి వచ్చుట వలన సర్వ సస్యములు వృద్ధి, చక్కనివర్షాలు కురుస్తాయి. పుష్య బహుళ అమావాస్య సోమవారం వచ్చుటవలన మంచి వర్షాలు కురుస్తాయి.

మేష సంక్రమణం (అశ్వని1మేషే రవి: రా. 8-05) రాత్రి సమయం నందు కలుగుట వలన సస్యవృద్ధి, క్షేమం, ఆరోగ్యం,సుభిక్షం, కలుగుతాయి. ఆదివారమగుట వలన కొన్ని ప్రాంతములందు దుర్భిక్షం ఏర్పడే అవకాశం ఉంది.

# శ్రీ సర్వధారినామ సంవత్సర రాశిఫలాలు

## మేషం ARIES

అశ్వని 1,2,3,4 పాదములు (చూ,చే,చో,లా), భరణి 1,2,3,4 పాదములు(లీ,లూ,లే,లో) కృత్తిక 1 వ పాదము(అ)

ఈరాశివారికి ఈ సంత్సరం చాలా ఆశాజనకంగా వుటుంది. వ్యాపార, వ్యవహారాలలో అనుకూలతతోపాటు ఆదాయం పెరుగుతుంది.నూతన కార్యక్రమాలు ఆరం భించటానికి ఈ సంవత్సరం అనుకాలం.రావాల్సిన బాకీలు సకాలంలో అందుతాయి.రైతులకు లాభదాయక మైన ఫలసాయం అందు తుంది. అవివాహిత స్త్రీలకు వివాహాలు జరుగుతాయి.విద్యార్ధులు పోటీ పరీక్షల్లో ర్యాంకులను సాధిస్తారు. ఆరోగ్య విషయంలో జాగ్రత్తలు పాటించాలి.నరఘోష ఎక్కువగా ఉన్నందున ఈ రాశివారు తమ ఇంటిలో నరఘోష యంత్రం ఉంచుకొనుట మంచిది. దుర్గాదేవి ఆరాధన వీరికి మంచిది.

## వృషభం TAURUS

కృత్తిక 2,3,4పాదములు ( ఈ,ఊ,ఏ పాదములు) , రోహిణి 1,2,3,4 పాదములు (ఓ, వా, వీ, వు పాదములు), మృగశిర 1,2 పాదములు (వే, వో)

ఈరాశివారికి ఈ సంవత్సరం ప్రతికూల గ్రహస్థితివల్ల అనేక కష్టష్టాలను ఎదుర్కొంటారు. ప్రతి వ్యవహారమందు అతి జాగ్రత్తగా వ్యవహరించాల్సి ఉంటుంది. కుటుంబాలలో తగాదాలు, ఆరోగ్య పరంగా చికాకులు ఎదుర్కోవచ్చు. వ్యాపారాల మందగింపు, ఆర్థిక సంక్షోభం, బకాయిల విష యంలో ఆలస్యం జరుగుతుంది. ప్రభుత్వ ప్రైవేటు ఉద్యోగస్తులకు తమ అధికారుల వల్ల ఇబ్బందులుంటాయి. రైతులకు మొదటి పంట నష్టం వచ్చి నా రెండవ పంటలో సరిసమానం అవుతుంది. నిరుద్యోగులకు నిరాశ తప్పదు. ఈ రాశివారు గ్రహదోషాలు తొలగించుకునేందుకు గురు, శని, రాహు కేతువుల జపములు, దానములు చేయించుట మంచిది. రుద్రా భిషేకం, లలిత, విష్ణు సహస్రనామ పారాయణల వల్ల ప్రశాంత జీవనం అలవడుతుంది. (మిగతా 88 వపేజీలో)





## జిల్లా సంగతులు

★ విజయనగర పాలకుడైన శ్రీకృష్ణదేవరాయలు కొండవీ డులోని గజపతుల పాలకుడైన కాశవపుత్రున్ని ఓడించి గుంటూరు ప్రాంతాన్ని విజయనగర సామ్రాజ్యంలో అంతర్భాగం చేశాడు.

★ 1794 సంవత్సరంలో కలెక్టర్ల పాలన ప్రవేశపెట్టారు. దాచేపల్లి, తుమ్మకోట, ప్రత్తిపాడు, మార్టూరు, మంగళగిరి, బాపట్ల, పొన్నూరు, రేపల్లె, తెనాలి, గుంటూరు, పెదకూరపాడు, కొండవీడు, నరసరావుపేట, వినుకొండ తాలుకాలుగా జిల్లా ఏర్పాటైంది.

టి.ఆర్. కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి

# శ్రీ సర్వధారినామ సంవత్సర రాశిఫలాలు

(87వ పేజీ తరువాయి)

## మిధునం GEMINI

మృగశిర 3,4 పాదములు (కా, కి)
ఆరుద్ర 1,2,3,4 పాదములు (ఖూ, ఖః, జ్ఞ, చ్ఛ), పునర్వసు 1,2,3 పాదములు ( హు, హే, హో)

ఈ రాశివారికి అన్ని రంగాలలో బాగా ఉంటుంది. గతంలో చేసిన రుణాలు తీరుస్తారు. రైతులుకు మొదటి పంట బాగా ఉంటుంది. అపరాల సేద్యం చేసే వారికి మంచి రాబడి ఉంటుంది. ఉద్యోగస్తులకు యజమానుల మన్ననలు పొందే అవకాశం ఉంటుంది. నిరుద్యోగులకు ఉద్యోగ అవకాశాలు లభిస్తాయి. రాజకీయ నాయకులకు గౌరవం పెరుగుతుంది. విద్యార్థులకు ర్యాంకులు సాధించే అవకాశాలున్నాయి. బంధుమిత్రులతో కలహం, భూ విషయంలో ధన నష్టం. దుష్టసావాసాల వల్ల ప్రమాదాలుంటాయి. నరఘోష ఎక్కువగా ఉంటుంది. 11 గురువారాలు సాయిబాబాకు పూజలు అవసరం. పంచముఖ రుద్రాక్ష, గాయత్రీ మంత్ర పఠనం మంచిది.

## కర్కాటకం CANCER

పునర్వసు 4వ పాదం (హీ)
పుష్యమి 1,2,3,4 పాదములు (హూ, హే, హో, డా)
ఆశ్లేష, 1,2,3,4 పాదములు (డీడూ,డే, డో)

ఈ రాశివారికి శని సంచారం వల్ల ఆర్థికంగా వెనుకబాటుతనం ఉంటుంది. రుణాలు చేయుట, స్థిరాస్థి విక్రయించడం, అధిక ఖర్చులు వంటి మానసిక చింతలుంటాయి. వ్యాపారస్తులకు స్వల్పంగా ధనలాభం పొందే అవకాశం ఉంది. రైతులకు వాతావరణం వల్ల పంట నష్టం వచ్చే అవకాశం ఉంది. రెండవపంట రైతులకు లభిస్తుంది. ఉద్యోగస్తులకు పని ఒత్తిడి ఎక్కువగా ఉండి ఒత్తిడికి గురౌతారు. విద్యార్థులకు నిరాశాజనకంగా ఉంటుంది. ఈ రాశివారికి గురు, శని, రాహువు, కేతువుల ప్రతికూల స్థానమైనందు వల్ల దోష ప్రభావం ఉంటుంది. దీని నుంచి ఉపశమనం పొందేందుకు ఆయా గ్రహాలకు జపాలు, దానాలు చేసుకో వాల్సి ఉంటుంది. ప్రతిరోజు శ్రీరామరక్షా స్తోత్రం, దుర్గాదేవి కవచం, శ్రీ వెంకటేశ్వర వజ్రకవచములు పఠించడం వల్ల శుభం కలుగుతుంది.

## సింహం LEO

మఖ 1,2,3,4 పాదములు (మా, మీ, మూ, మే), పుబ్బ 1,2,3,4 పాదములు (మో, టా, టీ, టూ )
ఉత్తర 1 (టే)

ఈ రాశివారికి కష్ట సుఖాలు మిశ్రమంగా ఉండే అవకాశం ఉంది. ఉద్యోగస్తులు కష్టనష్టాల పాలవుతారు. రైతులు సామాన్య లాభాలు పొందుతారు. విద్యార్థులు పోటీ పరీక్షలలకు ర్యాంకులు సాధిస్తారు. మానసిక, హృదయసంబంధ వ్యాధులు వచ్చే అవకాశాలున్నాయి. ఈ రాశివారికి గురు శని, రాహుకేతువులకు జపదానాలు చేయాల్సి ఉంటుంది. ప్రతిమాసం వచ్చు సంకట హర చతుర్థి నాడు శ్రీ శుభ గణపతిని ఆరాధించుట, ప్రతిదినము గాయత్రీ కవచం పఠించడం వల్ల శుభాలను పొందుతారు. శ్రీ అభయాంజనేయ యంత్రాన్ని ధరించుట మంచింది.

## కన్య VIRGO

ఉత్తర 2,3,4 పాదములు (టో, పా, పి)
హస్త 1,2,3,4 పాదములు ( పూ, షం, ణా, ఢ), చిత్త 1,2 పాదములు (పే, పో )

ఈ రాశివారికి శుభాశుభ మిశ్రమ ఫలితాలుంటాయి. ఆర్థిక విషయంలో పురోగతి ఉంటుంది. మానసికంగా చికాకులుంటాయి. నూతన గృహ నిర్మాణం, శుభ కార్యాలు చేస్తారు. వ్యాపారస్తులకు ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగస్తులకు పై అధికారుల వల్ల ఇబ్బందులుంటాయి. వ్యవసాయదారులకు ఆదాయం బాగుంటుంది. విద్యార్థులు సామాన్య ర్యాంకులు సాధిస్తారు. నిరుద్యోగులకు ఆశాజనకంగా ఉంటుంది. (మిగతా 93వ పేజీలో)

# మండలాభివృద్ధిలో 'పంగులూరి'

సి.హెచ్. చంద్రశేఖర్ రావు, మేజర్‌న్యూస్,కారంపూడి



పంగులూరి
చిన వెంకట నరసయ్య

మండల అభివృద్ధి కార్యక్రమాల్లో కారంపూడి మండల పరిషత్ అధ్యక్షులు పంగులూరి చిన వెంకట నరసయ్య ముందుండి నడిపించడంలో సఫలీకృతులయ్యారు. పార్టీలకతీతంగా మండలంలోని అన్ని గ్రామాలకు సముచిత స్థానం కల్పించడంలో ఇతనికి ఇతనే సాటి. ఆకలితో వున్న వారికి అన్నం పెట్టడం...ఆపదలో వున్న వారికి అండగా వుండటం ఇతని నైజం. మండల పరిషత్ అధ్యక్షుడిగా పదవీ బాధ్యతలు చేపట్టిన నాటి నుండి రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టె అనేక సంక్షేమ పథకాలు ప్రజల్లోకి తీసుకువెళ్లి వాటిపై అవగాహన కల్పించిన ఘనత ఇతనికే దక్కింది. పేదలకు సొంత ఇంటి కల...నిజం చేయాలనే లక్ష్యంతో రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశ పెట్టిన ఇందిరమ్మ గృహాల పథకంలో మండలంలో పేదలను గుర్తించి వారికి ఈ పథకం మంజూరయ్యేలా కృషి చేశారు. దానిలో భాగంగానే ఇందిరమ్మ ఫేజ్-1,2లలో 3489 మంది పేదలకు సొంత ఇంటి కల నిజం చేశారు. 532 మంది వికలాంగులకు పెన్షన్లు అందచేశారు. ముఖ్యమంత్రి పశుక్రాంతి పథకంలో 75 మంది లబ్ధిదారులకు పశువులను ఇప్పించారు. రాజీవ్ యువశక్తి పథకంలో 30 మంది నిరుద్యోగులకు ఉపాధి కల్పించారు. మండలంలో వేసవికాలంలో నీటి ఎద్దడితో ప్రజలు ఇబ్బంది పడకుండా రూ.3 లక్షల మండల పరిషత్ నిధులతో మంచినీటి ఏర్పాట్లు చేశారు. జాతీయ గ్రామీణ ఉపాధి పథకం కింద 56 లక్షల రూపాయలతో అభివృద్ధి పనులు చేపట్టారు. శాసన సభ్యుల నిధులతో 50 లక్షల రూపాయలతో సిమెంట్ రోడ్లు నిర్మాణాన్ని చేపట్టారు. మహిళా సంక్షేమం కోసం ఆమ్ ఆద్మీ పథకంలో 3900 మంది వ్యవసాయ కూలీలకు ఇన్సూరెన్స్ పథకాన్ని అమలు చేశారు. రూ.33 లక్షల జిల్లా పరిషత్ నిధులతో మండలంలో ఉపాధి హామీ పనులు ప్రారంభించారు. మండల పరిషత్ కార్యాలయంపై రూ.3.50 లక్షలతో గదుల నిర్మాణం గావించారు. అంతేగాక ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీల అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. కారంపూడి, పేటసన్నెగండ్ల మణిదు లకు రూ.1.85 లక్షలతో అభివృద్ధి పనులు చేపట్టారు. కారంపూడి మండలాన్ని అభివృద్ధి పథంలో నడిపించిన ఘనత పంగులూరికే దక్కింది.



# మధర్ థెరిస్సా బాటలో పయనిస్తా

వేముల భారతి

చిలకా సాంబయ్య, మేజర్ న్యూస్‌గుంటూరు రూరల్

బంగారం, వెండి ముత్యాల కంటే అతి పవిత్రమైన మానవసేవ. మనిషి జీవితంలో కోట్లాది రూపాయలను సంపాదించినప్పటికీ సమాజ సేవపై ప్రేమ లేకపోతే అతని జీవితం వ్యర్థం. మనిషి చేసిన మంచి, చెడు కార్యక్రమాలు తరతరాలుగా నిలిచిపోతాయి. ప్రపంచ మాతగా నేడు అందరి హృదయాల్లో కొలవబడుతున్న సంఘ సేవకురాలు మధర్‌థెరిస్సా గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. ఆమె చేసిన సేవలను ఏనాటికీ సమాజం మరచిపోదన్నది వాస్తవం. కుల మతాలకు అతీతంగా ఆ మహాతల్లి అందించిన నిష్కళంకమైన అతి పవిత్ర సేవలను ఆదర్శంగా ప్రపంచ దేశాలలో కోట్లాది మంది సంఘ సేవకులకు ఆదర్శంగా నిలిచిన ఆమె బాటలో పయనిస్తామని చెబుతున్నారు వేముల భారతి.

నిరుపేద కుటుంబంలో జన్మించిన భారతి చేసిన, చేస్తున్న సేవా కార్యకలాపాలు ఆమె మాటల్లోనే.... 'నాకు ఉన్నతమైన చదువును అభ్యసించనప్పటికీ మాతృమూర్తి మధర్ థెరిస్సా చేసిన సేవలను ఆ నోట- ఈ నోట విని సంఘ సేవ చేయాలనే ఉద్దేశంతో నా జీవిత లక్ష్యంగా సంఘ సేవను ఎంచుకున్నాను. తరాలు మారినా, యుగాలు మారినా

(మిగతా 97వ పేజీలో)

జన్మభూమి రుణం తీర్చుకుంటున్న

# డా॥ రామినేని ఫౌండేషన్



డా॥ రామినేని అయ్యన్న చౌదరి
వ్యవస్థాపకులు

భారతీయ సంస్కృతి మరియు హిందూయిజం ఆదర్శాలకు సంబంధించి కట్టడాల వారసత్వాన్ని పరిరక్షించి అభివృద్ధి పరిచే లక్ష్యంతో యుఎస్ఎ లోని ఓహియో రాష్ట్రంలో సిన్ సిన్నాటిలో స్వర్గీయ డా॥రామినేని అయ్యన్న చౌదరి పిల్లలచే 1995తో డా॥ రామినేని ఫౌండేషన్ స్థాపించారు. అంతేకాక కళలు, శాస్త్రం మరియు మానవ విజ్ఞాన శాస్త్రాల మిశ్రమ రంగాల నుండి తీసుకోబడిన ఉన్నత పండితులను సాహసవంతులుగా, దృఢ నిర్మలయులుగా, పరోపకారులుగా వారి ప్రయత్నాలకు వీలు కల్పించడమే ఆ సంస్థ యొక్క ప్రాథమిక లక్ష్యం.

డా॥రామినేని అయ్యన్న చౌదరి (డా॥ ఆర్.ఎ.సి)డా॥ ఆర్.ఎ.సి 1929 అక్టోబరు 12న ఆంధ్రప్రదేశ్ లోని గుంటూరు జిల్లా, బ్రాహ్మణ కోడూరు గ్రామంలో రైతు కుటుంబంలో స్వర్గీయ శ్రీ వీరయ్య చౌదరిమరియు స్వర్గీయ శ్రీమతి కన్యాకుమారికి జన్మించారు. ఆయన సలహా మేరకు వ్యవసాయంతో పాటు లలిత కళలలో చొరవచూపారు.డా॥ ఆర్.ఎ.సి గుంటూరు జిల్లాలో పాఠశాల విద్య పూర్తి చేసి బనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుండి గణితంలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ డిగ్రీ పొందారు. 1955 వరకు ఆయన గుంటూరు జిల్లాలోని పొలపర్రు, కృష్ణాజిల్లాలోని మొవ్వలో ఉపాధ్యాయుడిగా పనిచేశారు. ఉన్నత విద్యాభ్యాసంకై డా॥ ఆర్.ఎ.సి. 1955లో అమెరికా వెళ్ళారు.అక్కడ ఆయన మిన్నీపాలిస్‌లోని మిన్నెసోటా విశ్వవిద్యాలయం నుండి మాస్టర్ ఆఫ్ సైన్స్ ఇన్ ఎకనామిక్స్ అండ్ ఫైనాన్స్‌తో పాటు డాక్టరేట్ కూడా పూర్తి చేశారు. విద్యాభ్యాస కాలంలో ఆయన తల్లిదండ్రులపై ఆధారపడక పార్ట్‌టైం ప్రాతిపదికన పనిచేస్తూ స్వయంగా ఆర్థిక వనరులను సమకూర్చుకునేవారు.తర్వాత 1963-1973 వరకు నార్త్ ల్యాండ్ కాలేజ్ లో ప్రొఫెసర్‌గా ఆష్లాండ్ అండ్ జేవియర్ యూనివర్శిటీ, సిన్‌సినాటిలో పనిచేశారు.1973లో ఆయన తన సేవలను సామాజిక,సాంస్కృతిక రంగాలకు అంకితం చేసేందుకై చాలా ముందుగానే పదవీ విరమణ పొందినారు.



వేదాచార్య
కన్వీనర్



ధర్మప్రచారక్

డా॥ఆర్.ఎ.సి పదవీ విరమణ తర్వాత రియల్ ఎస్టేట్ వ్యాపారంలో ప్రవేశించి ఓహియో రాష్ట్రంలోని సిన్‌సినాటిలో డౌన్‌టౌన్ ప్రాపర్టీ మేనేజ్‌మెంట్ ఐయన్‌సి స్థాపించారు.నేడు ఆసంస్థ ఉన్నత స్థానంలో ఉన్నది. డా॥అర్‌ఎసి 1967లో సుగుణతో వివాహమైంది. ఆయనకు 6గురు పిల్లలు,మన సంస్కృతి నాగరికతలో అపార నమ్మకమున్నందున వారికి ధర్మప్రచారక్, శారదాదేవి, సత్యవాది,బ్రహ్మానంద,వేదా పేర్లు పెట్టుకొన్నారు. ఆయన తన పిల్లలను పాశ్చాత్యా సంస్కృతినుండి తప్పించేందుకు ఇంట్లోనే విద్యాబుద్ధులు నేర్పారు.ఆయనచే ప్రారంభించిన వ్యాపారంలో శిక్షణలో పొందిన వారు జాగ్రత్తగా చూసుకుంటున్నారు. డా॥ఆర్.ఎ.సి1958లో యుఎస్‌లో విద్యాభ్యాస కాలంలో హిందూ సంస్కృతి మరియు నాగరికతను వికసింపజేసేందుకు హిందూ అసోసియేషన్ ఆఫ్ మిన్నెసోటాను స్థాపించిక్రమంగా భారతీయ ఉత్సవాలు మరియు సామాజిక కార్యకాలాపాలను నిర్వహించారు. ఆయన తన జన్మస్థలంలో సంగీత, సాహిత్య, సంస్కృతి, హిందూధర్మనిలయంను స్థాపించి భారతీయ లలిత కళలకు అంకితం చేశారు. డా॥ ఆర్.ఎ.సి వెంపటి చినసత్యం మార్గదర్శకాల మేరకు కూచిపూడి నాట్య పాఠశాల మరియు వేద పాఠశాలను కూడా స్థాపించాలని ప్రణాళిక రూపొందించారు.




ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్యా మండలిచే నిర్వహించబడిన 10వ తరగతిపబ్లిక్ పరీక్షలలో అత్యున్నత మార్కులు సాధించిన బాలబాలికలను మెరిట్ అవార్డులను ఇవ్వాలని 2001 పురస్కారముల సమయంలో నిర్ణయించడమైనది. ఎంపిక చేసిన పాఠశాలలన్నీ గ్రామీణ ప్రాంతాలలోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలకు చెందినవే. దీని మొక్క లక్ష్యం గ్రామీణ ప్రాంత విద్యార్థులను ప్రోత్సహించి జీవితంలో ఉన్నత లక్ష్యాలను సాధింప చేయడం.

# మహిమాన్వితం శ్రీభావన్నారాయణ చరితం

ఎం.శ్రీనివాసరావు, పొన్నూరు

రాష్ట్రంలోనే గుంటూరు జిల్లా పొన్నూరులోని శ్రీ సాక్షి భావన్నారయణస్వామి దేవాలయం ప్రసిద్ధిచెందింది.నిత్యం వందలాది మంది భక్తులు స్వామి వారిని దర్శించుకొని తరిస్తుంటారు. స్థల పురాణాన్ని బట్టి బ్రహ్మ వైవర్త పురాణాలలో దీని ప్రభావం విశిష్టతను వివరించారు. ఒకే ప్రాంగణంలో శివకేశవుల ఆలయాలు ఉండటాన్ని బట్టి ఈ క్షేత్రం మతసామరస్యాన్ని చాటుతోంది. ఆలయ ప్రాంగణంలో ఉన్న బ్రహ్మసరోవరం, గోష్ఠివనాలు దర్శనీయాలు. తొమ్మిదో శతాబ్దంలో రాజా కుళో త్తంగ చోళుడు స్వామిని దర్శించి తరించినట్లు ఆలయం వద్ద ఉన్న శాసనాన్ని బట్టి తెలుస్తోంది. అప్పట్లో ఆయన స్వామివారికి మండపాదులు నిర్మించారు. ఆ తర్వాత 17వ శతాబ్దం వరకు అనేక మంది రాజులు, స్వామివారిని దర్శించి తరించినట్లు దాఖలాలు న్నాయి. చతుర్ముఖ బ్రహ్మ శ్రీమన్నారాయ ణుని గూర్చి తపస్సు చేసినపుడు స్నాన పానీయా లకు వినియోగించిన ఇక్కడి సరోవరం తదనంతరం బ్రహ్మసరోవరంగా పేరుగాంచింది. బ్రహ్మ, విష్ణువు లు ఇరువురు గోష్ఠులు నిర్వహించినందున ఆప్రాం తాన్ని గోష్ఠివనం పేరుతో పిలుస్తుంటారు.

### ఆలయ చరిత్ర..

కృతయుగంలో కేశవశర్మ అనే బ్రాహ్మణుడు సంతానం లేక పోవడంతో భార్య, మేనల్లుడు గూని గోవింద శర్మను వెంట తీసుకొని తీర్ధయాత్రలు చేస్తూ అనేక క్షేత్రములు దర్శించి చివరకు వారణాసి చేరారు. అక్కడ గంగానదిలో స్నానం చేసి దానధర్మాలు చేయు సమయంలో మేనల్లుడు కోరికపై దాన జలమును ధారపోసి తనకు ఆడపిల్ల కలిగితే నీకిచ్చి వివాహం చేస్తానని గూని గోవిందునికి మాట ఇచ్చాడు. ఫలితంగా ఆడపిల్ల జన్మించింది. ఆ పిల్లకు అక్కలక్ష్మి అని పేరు పెట్టారు. అక్కలక్ష్మికి యుక్త వయస్సు రావటంతో మేనమామ కేశవశర్మను ఇచ్చిన మాటను నిలబెట్టుకోమని గోవిందుడు కోరాడు. మేనమామ మాట తప్పాడు. దాంతో తనకు బావదేవుడు సాక్ష్య మున్నాడని చెప్పిన గూని గోవిందుడు కాశీకి వెళ్ళి స్వామిని సాక్ష్యమివ్వడానికి రమ్మని వేడుకున్నాడు. స్వామి గోవిందునిపై అభిమానంతో బయలుదేరి కాశీ విశ్వేశ్వరస్వామిని, పేరులేని పెద్దమాను, పొన్నమాను, తుంగభద్ర, అత్రిమహాముని వంటి మహాపురు షులను వెంట తీసుకొని గోష్ఠివనానికి చేరుకొని వివాహ సాక్ష్యమిచ్చారని ఆలయ చరిత్ర చెబుతోంది. అప్పటి నుంచి సాక్షి భావన్నారయణ స్వామి పేరుతో ఇక్కడ దివ్యక్షేత్రం వెలసి భక్తులతో విరాజిల్లుతోంది. నేటికీ తుంగభద్ర, పేరులేని పెద్దమాను, పొన్నమాను ఈక్షేత్రంలో దర్శనమిస్తూ నాటి క్షేత్ర కథకు బలాన్ని చేకూరుస్తున్నాయి.

### చారిత్రాత్మకం

అవుకు సీమ జమిందారు అందెల నారపరాజు పొన్నూరు రాగా ఆయనకు స్వామి కలలో కనిపించి వల్మీకి (పుట్ట)లో ఉన్నట్లు తెలిపారు. దాంతో వల్మీకాన్ని సందర్శించి నిజంగానే స్వామిని దర్శించారు. స్వామి వద్ద ఉన్న తులసి దళాల ప్రభావంతో జమిందారు వీపున గల రాచపుండు మానిపోయింది. స్వామి దర్శనంతో ఎంతో శాంతిని పొందిన జమిందారు అక్కడ దేవాలయాన్ని నిర్మించినట్లు చరిత్ర చెబుతోంది. 17వ శతాబ్దంలో గుంటూరు జిల్లా రాచూరు జమిందారు మాణిక్యా రాయుని పాలనలో ఈ దేవాలయాన్ని వారి వద్ద నుంచి అమరావతి ప్రభువు రాజావాసిరెడ్డి వేంకటాద్రినాయుడు బహద్దూర్ సుల్తాన్ అనువం శిక ధర్మకర్తృత్వ హక్కులను పొందారు.

### వేలాదిగా భక్తులు

ప్రతి ఏడాది మేనెలల్లో బ్రహోత్సవాలను పురస్కరించుకొని రథోత్సవాన్ని తిలకించటానికి రాష్ట్రం నలుమూలల నుంచి భక్తులు పాల్గొంటారు.



## పొన్నూరు కేంద్రంగా తమలపాకు ఎగుమతులు

ఏడాది పొడవునా సాగులో ఉండి నిత్య కల్యాణం పచ్చ తోరణంలా ఇక్కడి తమలపాకు తోటలు ప్రజలను కనువిందు చేస్తున్నాయి. కృష్ణా పరివాహక ప్రాంతంలోని గుంటూరు జిల్లా తెనాలి డివిజన్‌లో తోటలు విస్తారంగా ఉన్నాయి. పొన్నూరు, తెనాలి, దుగ్గిరాల, మంగళగిరి, కొల్లూరు మండలాలలో ఈతోటలను సాగుచేస్తూ జీవనాధారంగా పెట్టుకున్నారు. తమలపాకుకు దేశవ్యాప్తంగా గుర్తింపుఉంది. ఆకులో ఘాటు, రుచి, ఔషధగుణాలు ఎక్కువగా వున్నాయని శాస్త్రవేత్తలు నిర్ధారించారు. భోజనా నంత రం తాంబూలం, సోపు, వక్కలు, లవంగాలు భారతీయులకు ఒక అలవాటు. జీర్ణశక్తిని పెంపొందించే గుణం ఉండటంతో అనాధిగా దీనిని వినియోగి స్తున్నారు. పెళ్ళి, పేరంటాళ్ళు పూజా పునస్కారాలు తదితర శుభకార్యాలలో తమలపాకు లేకుండా కార్యక్రమాలే ఉండవు. రాష్ట్రం మొత్తం మీద 3,865 హెక్టార్లలో తమలపాకు సాగు చేస్తుండగా తెనాలి డివిజన్‌లోనే అందులో మూడో వంతుకు పైగా 1,565 హెక్టార్లలో తమలపాకు సాగు కొనసాగుతోంది. సంవత్సర వర్షపాతం 750మి.మీ నుంచి 1500మి.మీ ఉన్న ఉష్ణ ప్రాంతంలో నీరు ఇంకే ఎర్ర, నల్లరేగడి నేలలు సాగుకు అనుకూలం. ఈ పాంత తమలపాకుకు దేశవ్యాప్తంగా గిరాకీ ఎక్కువగా వుండటంతో పొన్నూరు కేంద్రంగా ఎగుమతులు జరుగుతున్నాయి. కలకత్తా, నాగపూర్, నాసిక్, భువనేశ్వర్, అకోలా, అమరావతి, చెన్నై తదితర ప్రాంతాలలో గిరాకీ ఉంది. తమలపాకు తోటసాగు ఖర్చుతో కూడుకున్నదైనప్పటికీ రాబడికూడా అధికంగా వుంటుంది. ఒకసారి నాటిన మొక్కతోట, మూడేళ్ళ వరకు దిగుబడినిస్తుంది. తమలపాకు సాగు అటు వ్యవసాయంగాను, ఇటు పరిశ్రమగాను కొనసాగుతూ రైతులకు రైతుకూలీలకూ నిత్యం ఉపాధినిస్తోంది.

# చిరంజీవి సిఎం కావడం తథ్యం

## రిటైర్డ్ ఐ.ఏ.ఎస్ అధికారి దొప్పలపూడి చినరోశయ్య

చిలకా సాంబయ్య, గుంటూరు రూరల్, మేజర్‌న్యూస్

చిరంజీవి సి.ఎం. కావటం తథ్యమని రిటైర్డ్ ఐ.ఎ.ఎస్. అధికారి దొప్పలపూడి చినరోశయ్య అన్నారు. ఆయన 'మేజర్ న్యూస్'కు ఇచ్చిన ఇంటర్వ్యూలో రాజకీయ సమీ కరణపై పలు అంశాలు తెలియ జేశారు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి 60 సంవత్సరాలు కావస్తున్నప్పటికీ రాష్ట్రాన్ని మెజార్టీ ప్రజలను తక్కువ జనాభా కలిగిన కులస్థులు పరిపా లిస్తున్నారని ఆరోపిస్తున్నారు. రాష్ట్ర జనాభాలో సగానికిపైగా ఉన్న బి.సి., ఎస్.సి., ఎస్.టి., మైనార్టీలను రెండు కులాల వారు పరిపాలిస్తున్నారని చెప్పారు. అదేవిధంగా కాపు వర్గంలో వెనుకబడి ఉన్న ప్రజలు, బ్రాహ్మణ కులంలో వెనుకబడి ఉన్న ప్రజలు చట్ట సభలలో సముచిత ప్రాధాన్యం లేక రాజ్యాధికారం కోసం ఎదురు చూస్తున్నారన్నారు. రాష్ట రాజకీయాలను శాసించే తెలుగుదేశం ప్రభుత్వం గాని, కాంగ్రెస్ ప్రభుత్వం కాని, సి.పి.ఐ., సి.పి.ఎం. పార్టీలు జనాభా ప్రాతిపదికన రాజకీయ రిజర్వేష నులను అమలు పరిచిన ట్లయితే రాష్ట్ర జనాభాలో 80 శాతంగా ఉన్న సామాజిక వర్గాలకు చెందిన ఎస్.సి., ఎస్.టి., బి.సి., ముస్లిం, మైనార్టీ, కాపు వర్గాల ప్రజలు ఏనాడో అభివృద్ధి చెంది ఉండే వారని అభిప్రాయం వ్యక్తం చేశారు. వివిధ పార్టీలలో పదవులను పొందిన బలహీన వర్గా లకు చెందిన నాయకుల ద్వారా ప్రజలకు న్యాయం జరుగుతుందనే వాదనకు నిదర్శనాలు కనుచూపు మేరల్లో కనుమరుగైపోయాయి. పార్టీ అధిష్టానం నిర్ణయించిన ఎజెండా ప్రకారమే ఆయా పార్టీలలో కొనసాగు తున్న బడుగు, బలహీన వర్గాల నాయకులు పనిచేయాల్సి ఉంటుందని వెల్లడించారు. అందు వలన వారు సామాజిక అభివృద్ధిని గురించి కాని, సమ సమాజస్థాపన గురించి కాని మాట్లాడే అర్హతను వారు కోల్పో యారని తప్పుబట్టారు. సేవాతత్ప రుడుగా, అందరివాడుగా రాష్ట్ర ప్రజల చేత ఆదరాభిమానాలు పొందిన ఒక సామాజిక వర్గానికి చెందిన మంచి నాయకుడు నాయకత్వం కోసం రాష్ట్ర జనాభాలో 80 శాతంగా ఉన్న ప్రజలు ఎదు రుచూస్తున్నారంటే ఆలోచిం చాల్సిన పనిలేదని చెప్పారు. ఎందు కంటే నేను ఒకదళిత వర్గానికి చెందిన వ్యక్తిని కాబట్టి కష్టపడి చదువుకొని ఒక ఐ.ఎ.ఎస్. అధికారిగా రాష్ట్ర పరిపాలనా భాగంలో పలు కీలక పాత్రలను పోషించిన వ్యక్తిగా నా గురించి మీ కందరికి తెలుసు. నా తపన, పట్టుదల కేవలం బడుగు, బలహీనవర్గాల ప్రజలకు రాజ్యాధికారం సాధించి పెట్టడమే. నా జన్మస్థలమైన గుంటూరు జిల్లా మేడికొండూరు మండలం సిరిపురం గ్రామం నుండి ప్రారంభించిన చైతన్య పాదయాత్రకు రాష్ట్రంలోని అన్ని సామాజిక వర్గాల ప్రజల నుండి అనూహ్య స్పందన లభించింది. బడుగుల ఉద్ధరణ కోసం బడుగుల నాయకులతో కలిసి చర్చించి అనేక అంశాలను నా పాదయాత్రలో ప్రతి గ్రామంలో ప్రజలతో చర్చించటం వలన ఈనాడు వెనుకబడి ఉన్న వర్గాల ప్రజలు రాజ్యాధికారం కోసం ఎదురుచూస్తూ ఉన్నారు. ప్రముఖ సినీ నటుడు చిరంజీవి ఈ వర్గాల ప్రజలకు నాయకుడై రాష్ట్ర ముఖ్య మంత్రి అయితేనే 80 శాతంగా ఉన్న బడుగు జీవులకు సామాజిక న్యాయం, సౌభ్రాతృత్వం కలుగుతుందని నేను చేపట్టిన పాదయాత్ర ద్వారా తెలుసుకున్నాను. రాబోయే రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో చిరంజీవి స్థాపించిన పార్టీ ద్వారా రాష్ట చరిత్రలో కనీవినీ ఎరుగనిరీతిలో బడుగు, బలహీన వర్గాలకు చెందిన మంచి నాయకులు గెలుపొంది రాష్ట్ర రాజకీయ చరిత్రను తిరగరాస్తారనేది వాస్తవం. రాష్ట్రానికి కాబోయే ముఖ్యమంత్రిగా చిరంజీవి ఎన్నిక కావటం తథ్యం.

## సాంఘిక సంక్షేమ శాఖ - గుంటూరు జిల్లా 2007-2008 సంవత్సరములో చేపట్టబడిన వివిధ సంక్షేమ కార్యక్రమములు.

గుంటూరుజిల్లా యందు 2001 జనాభా లెక్కల ప్రకారము 8.18 లక్షల షెడ్యూల్ల్డు కులముల వారు కలరు. వారు జిల్లా మొత్తము జనాభాలో 18.32% కలరు.

**1. వసతి గృహముల నిర్వహణ:**

| | | |
|---|---|---|
| వసతి గృహములు మొత్తము | : | 91 |
| బాలుర వసతి గృహములు | : | 54 |
| బాలికల వసతి గృహములు | : | 37 |

వసతి గృహములలో ప్రవేశము కల్పించబడిన బాలబాలికల సంఖ్య 9,471

**2. కల్పించబడిన వసతులు:** అచ్చు పుస్తకములు, నోటు పుస్తకములు, 2జతల దుస్తులు, కుక్కర్లు, ఫ్యానులు, టి.విలు పంపిణీ చేయబడినవి.
విడుదల కాబడిన నిధులు : రూ. 586.74 ఖర్చు కాబడిన నిధులు : రూ. 509.38

జిల్లా యందు మొత్తము 29 ప్రత్యేక వసతి గృహములు కలవు. పిల్లలలో ఉన్న సామర్థ్యమును బట్టి గ్రేడింగ్ విభజించి తదను గుణముగా శిక్షణను ఇవ్వడము జరుగుతుంది. 10వ తరగతి ఉత్తీర్ణతశాతము పెంచుటకు వీరికి పాఠశాల పుస్తకములు, 100 దినముల ప్రణాళిక మరియు అదనపు స్టడీ మెటీరియల్ సరఫరా చేయబడుచున్నది. ట్యూటర్లను నియమించుటకు జరిగినది.

**3. వసతి గృహములో ఉత్తీర్ణత(మార్చి 2007):-**

| తరగతి | పరీక్షకు హాజరైన విద్యార్థులు | ఉత్తీర్ణులైన విద్యార్థులు | ఉత్తీర్ణత శాతము | జిల్లా సగటు |
|---|---|---|---|---|
| 10 తరగతి | 765 | 689 | 90.07 | 73.92 |
| 7 | 1216 | 1185 | 97.00 | 84.50 |

**4. కార్పొరేట్ కళాశాలలో ప్రవేశం:-** జిల్లా కలెక్టరు గారి ఆదేశానుసారం ఈ సంవత్సరము 10వ తరగతి పరీక్షలలో అత్యుత్తమ మార్కులు సాధించిన 23మంది వసతి గృహ విద్యార్థులకు ఉత్తమ విద్యను అందించుటకు జిల్లాలోని కార్పొరేట్ కళాశాలలో ఇంటర్మీడియట్ కోర్సు నందు ఉచితముగా శిక్షణ ఇప్పించుటకు మరియు భోజన సదుపాయము కల్పించుటకు చర్యలు తీసుకొనబడినవి.

**5. వసతి గృహముల నిర్మాణము :-** జిల్లా యందలి మొత్తం 91 వసతి గృహములకు గాను, 52 వసతి గృహములు ప్రభుత్వ భవనములలో మిగిలిన 39 వసతి గృహములు అద్దెభవనములలో నిర్వహించబడుచున్నవి. పనికి ఆహారము-పథకము క్రింద మంజూరు కాబడిన 20 వసతి గృహములకు గాను 17 భవనముల నిర్మాణము చేపట్టబడినది. అందు 11 వసతి గృహముల నిర్మాణముల నిర్మాణము పూర్తి కాబడి అందు వసతి గృహములు నిర్వహించబడుచున్నవి. మిగిలిన 6 వసతి గృహముల నిర్మాణము వివిధ దశలయందున్నవి.

ఇవికాక సి.యస్.యస్. పథకము క్రింద 11 వసతి గృహముల నిర్మాణము కొరకు 1.29 కోట్ల రూపాయలు మంజూరు కాబడినవి. అందు 8 వసతి గృహముల నిర్మాణము చేపట్టబడి బాలకుల వసతి గృహములు పిడుగురాళ్ళ మరియు నర్సరావుపేట నందు నిర్మాణము పూర్తి కాబడి అందు వసతి గృహములు నిర్వహింపబడుచున్నవి.

**6. కళాశాల స్థాయి ఉపకార వేతనములు :-**

విడుదల కాబడిన నిధులు : రూ. 30.55 కోట్లు, ఖర్చు కాబడిన నిధులు : రూ. 21.65 కోట్లు లబ్ధిపొందిన వారు : 25,213 మంది

పై నుదహరించిన నిధులతో 2006-2007వ సంవత్సరము నందు రెన్యువల్, నూతన ఉపకార వేతనములు మరియు 2007-2008 రెన్యువల్ మరియు నూతన ఉపకార వేతనములు మంజూరు చేయబడినవి. అర్హులైన విద్యార్థులందరి చేత బ్యాంకులో ఖాతాలు తెరిపించి ఎకౌంట్ నెంబర్లు ఉన్నవారికి మాత్రమే ఉపకార వేతనములు మంజూరు చేయబడుచున్నవి. విద్యార్థులందరికీ ఎకౌంట్ పే చెక్కుల ద్వారా వేతనములు పంపిణీ చేయబడుచున్నవి.

**7. కులాంతర వివాహము:-**

విడుదల కాబడిన నిధులు : రూ. 3.90 లక్షలు, ఖర్చు కాబడిన నిధులు : రూ. 3.90 లక్షలు, లబ్ధిపొందిన వారు : 39 మంది.

**కె. రామకృష్ణ**
డిప్యూటి డైరెక్టర్
సోషల్ వెల్‌ఫేర్ డిపార్ట్‌మెంట్

# విద్యకు పుట్టినిల్లు తురుమెళ్ల

బండెల రామారావు, మేజర్‌న్యూస్, అమృతలూరు

19వ శతాబ్ది తుదిపాదంలో రావు బహద్దూర్ గౌరవం పొందిన తెనాలి తాలుకా బోర్డు అధ్యక్షులు కొసరాజు రామయ్యచౌదరి 1911లో ప్రాథమికోన్నత పాఠశాల ప్రారంభించారు. 1913లో బ్రిటీష్ ప్రభువు 5వజార్జి ఈ స్కూలుకు జార్జి కారనేషన్ హైస్కూలుగా మార్చారు. అసాధారణ ప్రజ్ఞావంతులు, క్రమశిక్షణలో ఉద్దండులైనవారు ప్రధానోపాధ్యాయులుగా రావడం జరిగింది. వీరి శిక్షణలో ప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధులు కల్లూరి చంద్రమౌళి, విశ్వవిఖ్యాత శాస్త్రవేత్త డాక్టర్ యలవర్తి నాయుడమ్మ, విద్యకే వన్నెతెచ్చిన విద్యాదాత అత్తోట రామారావు, బాలకవిగా పేరుపొందిన నలుకుర్తి రత్నం కవి వంటివారు తురుమెళ్ళ పాఠశాలలో విద్యను అభ్యసించినవారే.

## విద్యార్థులకే ఆదర్శం అత్తోట రామారావు

అతి సామాన్య రైతు కూలీ కుటుంబంలో జన్మించి, గ్రామీణ వాతావరణంలో పెరిగి అంచెలంచెలుగా విద్య పదవులను అధిష్టించిన అత్తోట రామారావు స్వగ్రామము జిల్లాలోని ఆలపాడు గ్రామం కావడం విశేషం. 1950 సంవత్సరంలో జన్మించి తన విద్యాభ్యాసాన్ని తురుమెళ్ల పాఠశాలలో పూర్తిచేశారు. 1971లో బి.ఎస్సీ డిగ్రీ, 1973లో ఎం.ఎస్సీ డిగ్రీ పొంది కెనడా, మానిటాబా విశ్వ విద్యాలయం నుండి ఇమ్యునాలజీలో పి.హెచ్.డి చేశారు. జాతీయ, అంతర్జాతీయ జనరల్స్‌కు 65కు పైగా వ్యాసాలు రాశారు. ప్రస్తుతం శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాలయం అనంతపురంకు కులపతిగా పనిచేస్తున్నారు.

## కళాకారులకు ఆదర్శం రత్నంకవి

చర్మకార వృత్తి చేసుకుని జీవించే ఒక దళిత కుటుంబంలో జన్మించి



ఎందరో మేథావులను తీర్చిదిద్దిన తురుమెళ్ల పాఠశాల ఇదే..

సాహిత్యరంగంలో జిల్లాకే వన్నెతెచ్చిన మహనీయుడు బాలకవి కీ.శే. నలుకుర్తి రత్నంకవి స్వగ్రామం గోవాడ. గోవాడ నుండి తరుమెళ్ల హైస్కూలుకు కాలినడకన వచ్చి విద్యను అభ్యసించేవారు. 1932లో 3వ ఫారం ఉత్తీర్ణుడైన సందర్భంగా మిత్రులు కల్లూరి చంద్రమౌళి, బి.ఎస్.మూర్తి అండదండలతో బాలకోటేశ్వర తారావళి అనే కావ్యలను రచించారు. గుర్రం జాషువా ప్రియశిష్యులైన రత్నంకవి ఖాదీ ప్రచారం, హరిజనోద్ధరణ వంటి స్వాతంత్ర్య ఉద్యమాల్లో పాల్గొన్నారు.

# జిల్లా సంగతులు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

★ 1842వ సంవత్సరంలో గుంటూరుకు వచ్చిన అమెరికన్ లూథరన్ మిషన్ 1886లో ది అమెరికన్ ఇవాంజెలికల్ లూథరన్ మిషనరీ కళాశాలను స్థాపించారు. అదే ప్రస్తుత ఆంధ్రా క్రైస్తవ కళాశాల.

★ తెలుగు భాష మాట్లాడేవారికి ప్రత్యేక రాష్ట్రం కావాలన్న భావన 1911లోనే మొదలైంది. 1913 సంవత్సరంలో ఆంధ్ర మహాసభ ప్రథమ సమావేశాలు బాపట్లలో జరిగాయి. ఆంధ్ర రాష్ట్రం గురించి అక్కడే ప్రస్తావించారు.

★ పురపాలక సంఘాల చరిత్రలో ఆంగ్లేయుల అధికారాన్ని సవాలుచేసి మున్సిపల్ కార్యాలయంపై జాతీయ పతాకాన్ని ఎగరవేసింది నాటి మున్సిపల్ ఛైర్మన్ నడింపల్లి వెంకటలక్ష్మినరసింహారావు పంతులు మాత్రమే.

*(88వ పేజీ తరువాయి)*

రాజకీయ నాయకులకు ప్రజల తిరస్కారం జరుగుతుంది. ఆరోగ్య విషయంలో జాగ్రత్తలు అవసరం. ఏలిన నాటి శని దోషం నివారణకు శని జపాదులు, దానములు, తైలాభిషేకాలు చేయుట మంచిది. ప్రతిదినము హనుమత్ కవచము పఠించడంతోపాటు పంచముఖ రుద్రాక్ష ధరించడం మంచిది. ప్రతి శనివారం వెంకటేశ్వర స్వామి ఆరాధన వల్ల మేలు జరుగుతుంది.

## తుల LIBRA

**చిత్త 3,4, పాదములు (రా, రి)**
**స్వాతి 1,2,3,4పాదములు (రూ, రే, రో, త)**
**విశాఖ 1,2,3 పాదములు (తీ, తూ, తే)**

ఈ రాశి వారికి ఈ సంవత్సరం అన్ని విధాలా బాగుంటుంది. వ్యాపారస్తులు, ప్రభుత్వ, ప్రైవైటు ఉద్యోగస్తులకు అనుకూలంగా ఉంటుంది. రైతులకు మంచి లాభదాయకమైన కాలం. శ్రమకు మించిన ఫలితం వస్తుంది. విద్యార్థులు మంచి ర్యాంకులు సాధించడంతోపాటు ఉన్నత విద్యాసంస్థల్లో ప్రవేశం పొందుతారు. నిరుద్యోగులకు చక్కని అవకాశాలొస్తాయి. రాజకీయ నాయకులకు పదోన్నతులు కలిగే అవకాశం ఉంది. అయితే ఆందోళనకరమైన మనస్సుతో ఉండే అవకాశం ఉంది. ఈ రాశివారికి ఈ సంవత్సరం నరఘోష ఎక్కువగా ఉంటుంది. నరఘోష యంత్రం పూజా మందిరంలో ఉంచాలి. నృశింహ కవచం పఠించాలి.



# శ్రీ సర్వధారినామ సంవత్సర రాశిఫలాలు

## వృశ్చికం SCORPIO

**విశాఖ 4వ పాదం (తో)**
**అనూరాధ 1,2,3,4 పాదములు (నా, నీ, నూ, నే)**
**జ్యేష్ఠ 1,2,3,4 పాదములు (నో, యా, యి, యు)**

ఈ రాశి వారికి ఈ సంవత్సరం అత్యంత శుభదాయకంగా ఉంటుంది. ఆరోగ్య ఐశ్వర్య విషయాల్లో ప్రగతి దాయకంగా ఉంటుంది. అన్నిరంగాల వారికి అభివృద్ధి బాగా ఉంటుంది. తీర్థ యాత్రలు చేయుట, దానధర్మాది పుణ్యకార్యాలు చేయుట, శుభకార్యాలు నెరవేర్చుట జరుగుతుంది. వ్యాపారస్తులు తమ వ్యాపారాలందు పురోభివృద్ధి ఉంటుంది. ఉద్యోగస్తులకు ప్రమోషన్లు, ఆశించిన స్థానాలకు బదిలీలు, పై అధికారుల ప్రశంసలు పొందుట జరుగుతుంది. రైతులకు పంట దిగుబడి హెచ్చుగా ఉంటుంది. శ్రమకు మించిన ఫలితం పొందుతారు. ఈరాశివారికి నరఘోష ఉంటుంది. పూజామందిరంలో నరఘోష యంత్రం ఉంచి పూజించాలి. శ్రీ దత్తాత్రేయ కవచం పఠించాలి. రుద్రాభిషేకం మంచిది.

## ధనుస్సు SAGITTARIUS

**మూల 1,2,3,4 పాదములు (యే, యో, బా, బి)**
**పూర్వాషాఢ 1,2,3,4 పాదములు (భూ ధా, ఫా, ఢా)**
**ఉత్తరాషాఢ 1 వపాదం (భే)**

ఈ రాశి వారికి అన్నిరంగాల్లోనూ ప్రతిబంధకాలు కలుగుతాయి. రావలసిన సొమ్ము చేతికందక అనేక ఇబ్బందులకు గురవుతారు. వాహనం వల్ల ప్రమాదం జరిగే అవకాశం ఉంది. వ్యాపారస్తులకు వ్యాపారం నిలకడగా ఉండదు. ఆర్థిక ఇబ్బందులుంటాయి. రైతులకు రెండవ పంట దిగుబడి ఇస్తుంది. విద్యార్థులు అతికష్టంతో ఉత్తీర్ణత సాధిస్తారు. రాజకీయ నాయకులకు ప్రజల నుంచి వ్యతిరేకత ఉంటుంది. ఈ రాశి వారు గురు, శని, కేతువుల ప్రతికూల స్థితిని ఉపశమనానికి జప, దానములు చేయుట శ్రేయస్కరం. శ్రీ విశ్వనాథాష్టకం, శ్రీ సుబ్రహ్మణ్యాష్టకం పఠించుటతోపాటు షణ్ముఖ రుద్రాక్ష ధరిస్తే మంచిది.

## మకరం CAPRICORN

**ఉత్తరాషాఢ 2,3,4 పాదములు (భో, జా, జి)**
**శ్రవణం 1,2,3,4 పాదములు (జు, జే, .జో, ఖ)**
**ధనిష్ట 1,2, పాదములు (గా, గీ)**

ఈ రాశి వారికి ప్రతికూల గ్రహస్థితి వల్ల ప్రారంభించిన పనులకు తీవ్రమైన జాప్యం కలుగుతుంది. ఇచ్చిన మాట నిలబెట్టకోకపోవడం వల్ల కీర్తి ప్రతిష్టలకు భంగం వాటిల్లుతుంది. చోరభయం, వాహన ప్రమాదాలు వంటి విపత్తులు ఎదురవుతాయి. కుటుంబాలలో తగాదాలు ఏర్పడతాయి. వ్యాపారం మందకొడిగా సాగడం వల్ల వ్యాపారస్తులు ఆర్థికంగా నష్టపోతారు. దీంతో రుణాలు చేయడం జరుగుతుంది. ప్రభుత్వ ప్రైవేటు ఉద్యోగస్తులకు పై అధికారుల కోపం చవిచూడాల్సి ఉంటుంది. రైతులకు దిగుబడి తక్కువగా ఉంటుంది. విద్యార్థులు శ్రమిస్తేనే ఫలితం. నిరుద్యోగులు నిరాశ తప్పదు. ఈ సంవత్సరం ఈ రాశివారికి గురు, శని, రాహువు కేతువుల జపదానాలు చేయాలి. దుర్గాదేవి ఆరాధన శ్రేయస్కరం. *(మిగతా 94వ పేజీలో...)*

(93వ పేజీ తరువాయి)

## కుంభం AQUARIUS

ధనిష్ట 3,4 పాదములు (గు, గే)
శతభిషం 1,2,3,4 పాదములు (గో, సా, సీ, సూ)
పూర్వాభాద్ర 1,2,3,4 పాదములు (సే, సో, ద)

ఈ రాశి వారికి శుభమైన కాలం. సంవత్స రం పూర్వార్థంలో వ్యాపారం బాగా కొనసాగుతుంది. ఆర్థికాభివృద్ధి బాగా ఉంటుంది. ఉద్యోగస్తులకు ఈ సంవత్సరం మంచి రాణింపు ఉంటుంది. రైతులకు మొదటి పంట పుష్కలంగా చేతికి వస్తుంది. గతంలో చేసిన రుణాలు తీరుస్తారు. సంపాదనకు తగ్గ వ్యయం చేయడం జరుగుతుంది. ప్రజల్లో పలుకుబడి పెరుగుతుంది. శుభకార్యాలు నెరవేరుస్తారు. నరఘోష ఎక్కువగా ఉండటం వల్ల నరఘోష యంత్రం పూజామందిరంలో ఉంచి పూజించాలి. సుందరకాండ పారాయణం ఉత్తమం. సాయినాధుని పూజ మరీమంచిది.

# శ్రీ సర్వధారి నామసంవత్సర రాశిఫలాలు

రాశి ఫలాలలో నక్షత్రం చివర బ్రాకెట్లలో ఉన్నవి ఆయా వ్యక్తుల మొదటి పేర్లలో ఉండే మొదటి అక్షరం. దాని ప్రకారం నక్షత్రాలను చూసుకుని ఆ నక్షత్రాలు ఏఏ రాశులలో ఉన్నాయో గమనించవచ్చు. ఆదాయం, వ్యయం, రాజపూజ్యం, అవమానం విడివిడిగా ఇచ్చి ఉన్నాం ← గమనించగలరు.

## మీనం PISCES

పూర్వాభాద్ర 4వ పాదం (దీ)
ఉత్తరాభాద్ర 1,2,3,4 పాదములు (దూ, శ్యం, ఝా, థా)
రేవతి 1,2,3,4 పాదములు (దే, దో, చా, చి)

ఈ రాశి వారికి అన్నిరంగాల్లో శ్రేయోదాయకంగా ఉంటుంది. చేతిలో సొమ్ము పుష్కలంగా ఉంటుంది. శుభకార్యాల నిర్వహణలో ఖర్చులు చేస్తారు. వ్యాపారస్తులకు వ్యాపారం బాగుంటుంది. ఉద్యోగస్తులకు ప్రమోషన్లతో కూడిన బదిలీలుంటాయి. నిరుద్యోగులకు మంచి కాలం. ఈ రాశివారికి ఈ సంవత్సరం అత్యంత శుభదాయకంగా ఉండడం వల్ల నరఘోష ఎక్కువగా ఉంటుంది. కావున నరఘోష యంత్రాన్ని పూజామందిరంలో ఉంచి పూజించాలి. ఏకముఖి రుద్రాక్ష ధారణ చేయాలి. గాయత్రీ మంత్రాన్ని నిత్యం 108 సార్లుపారాయణం చేయాలి. సాయినాధుని ప్రతి గురువారం దర్శించి పాలకోవా నివేదించాలి. దీనివల్ల శుభం జరుగుతుంది.

**ఆదాయ వ్యయములు- రాజపూజ్య అవమానములు**

| రాశి | ఆదాయం | వ్యయము | రాజపూజ్యం | అవమానము |
|---|---|---|---|---|
| మేషం | 14 | 2 | 4 | 5 |
| వృషభం | 8 | 11 | 7 | 5 |
| మిథునం | 11 | 8 | 3 | 1 |
| కర్కాటకం | 5 | 8 | 6 | 1 |
| సింహం | 8 | 2 | 2 | 4 |
| కన్య | 11 | 8 | 5 | 4 |
| తుల | 8 | 11 | 1 | 7 |
| వృశ్చికం | 14 | 2 | 4 | 7 |
| ధనస్సు | 2 | 11 | 7 | 7 |
| మకరం | 5 | 5 | 3 | 3 |
| కుంభం | 5 | 5 | 6 | 3 |
| మీనం | 2 | 11 | 2 | 6 |

సర్వాదాయం : 93 వ్యయం : 84

# చెరగని ప్రజాదరణ నరేంద్రుని సొంతం

(అన్నం కేశవరావు, మేజర్‌న్యూస్, పొన్నూరు)

ముఖాన చెదరని చిరునవ్వు.. తొనకని ఆత్మస్థైర్యం .. నిండైన విగ్రహం ఆయన సొంతం. వేలాది అభిమానులను కలిగిన ఆయన నిగర్వి, శాంత మూర్తి.. విజయాస్త్రాలు తన అమ్ముల పొదిలో ఉన్నాయి.. వరుస విజయాలను సాధిస్తూ ప్రజా సమస్యలపై ఉద్యమిస్తూ ప్రజలందరి ఆదరాభిమానాలు చూరగొన్న పొన్నూరు నియోజక వర్గ ఎమ్మెల్యే ధూళిపాళ్ళ నరేంద్రకుమార్. రాజకీయ ఆరంగేట్రం, వరుసవిజయాల రహస్యం, సాధించిన, సాధించాలనుకుంటున్న లక్ష్యాలు తదితర అంశాల తెలుసుకుందాం. సివిల్స్ కొట్టడం ఆయన ధ్యేయం. ఊహించని పరిస్థితిల్లో రాజకీయ ఆరంగేట్రం చేసిన నరేంద్రకుమార్ పొన్నూరు నియోజక వర్గంలో గతంలో మరెవ్వరు చేపట్టని రీతిగా అభివృద్ధి పనులు చేపడుతూ, రాజకీయ వ్యతిరేక పవనాలు వీస్తున్న తరుణంలో జిల్లాలో ఒకే ఒక్కడుగా తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్న పొన్నూరు ఎమ్మెల్యే ధూళిపాళ్ళ నరేంద్రకుమార్‌తో మేజర్‌న్యూస్ ప్రత్యేక ఇంటర్వ్యూ...!!



మేజర్‌న్యూస్: విద్యార్థి దశలో మీ లక్ష్యం ఏమిటి?

ఎమ్మెల్యే :చదువుపై ఎంతో ఆసక్తి ఉన్న నాకు సివిల్స్ కొట్టాలనేది లక్ష్యం.

మే : మీ రాజకీయ ఆరంగేట్రం ఎలా జరిగింది?

ఎమ్మెల్యే : నాన్న (ధూళిపాళ్ళ వీరయ్య చౌదరి) ఆకస్మికంగా మృతి చెందటంతో 1994లో సంఘండైరి ఛైర్మన్‌గా ఆ బాధ్యతలు నన్ను చేపట్టమని కార్యకర్తలు వత్తిడి చేయటం తదితర పరిస్థితుల్లో ఛైర్మన్ పదవిని చేపట్టాను. తరువాత పొన్నూరు నియోజక వర్గ ఎమ్మెల్యేగా పోటీ చేశాను.

మే : మీ తొలి విజయం?

ఎమ్మెల్యే : రాజకీయ అనుభవం లేని నాకు నాన్న అభిమానులు, పార్టీ నాయకులు కార్యకర్తలు అండగా ఉండి నన్ను ముందుకు నడిపించారు. వారందరి సహాయ సహకారాలు, అభిమానం, పొన్నూరు నియోజక వర్గంలో నాన్న చేపట్టిన అభివృద్ధి పనులు నా తొలివిజయానికి కారణం.

మే : మీ లక్ష్యం., సాధించిన విజయాలు ?

ఎమ్మెల్యే : పొన్నూరు నియోజక వర్గ ప్రజలందరికి కావాల్సిన మౌళిక సదుపాయాలు కల్పించటమే నా ధ్యేయం. పొన్నూరు పట్టణంలో ఆటోనగర్ ఏర్పాటు చేయాలనేది మరో లక్ష్యం. కనీస మౌళిక వసతులు కల్పించటంలో చాలా వరకు విజయం సాధించాను. ప్రకృతి వైపరిత్యాల సమయంలో కూడా మారు మూల గ్రామాలకు వెళ్ళేందుకు రోడ్లు ఏర్పాటు చేశాను. జిల్లాలోనే తొలి సారిగా నాంది ఫౌండేషన్ సహకారంతో ఫిల్టరేషన్ మంచి నీటి సౌకర్యాన్ని గ్రామాల్లో ఏర్పాటు చేశాను. అప్పాపురం గ్రామంలో రూ. 2.50 కోట్లు ప్రత్యేక నిధులతో భారీ పైలెట్ ప్రాజెక్టు ఏర్పాటు చేశాను. పొన్నూరు పురపాలక సంఘ విషయానికి వస్తే పట్టణంలో సిసి రోడ్ల నిర్మాణం, డ్రైనేజీల నిర్మాణం, రక్షిత మంచినీటి వ్యవస్థను ఏర్పాటు చేయటం జరిగింది. తెలుగు దేశం ప్రభుత్వం హయాంలో పొన్నూరు నియోజక వర్గానికి కోట్లాది రూపాయలు ప్రత్యేక నిధులు తెచ్చి మౌళిక వసతుల కల్పనకు చేసిన కృషిలో సఫలీకృతుడనయ్యాను.

మే : నియోజక వర్గంలో చేయాలనుకుని చేయలేని పనులు ?

ఎమ్మెల్యే : కాకుమానులో ప్రత్యేక పాఠశాల నిర్మించేందుకు తెలుగుదేశం ప్రభుత్వం హయాంలో రూ. 2.50 కోట్లు నిధులు తెచ్చాను. నిర్మాణ పనులు వేగంగా జరుగుతున్న సమయంలో ఎన్నికలు రావటం ఆ తరువాత కాంగ్రెస్ ప్రభుత్వం స్థల విషయంలో కోర్టుకెక్కడంతో నిర్మాణం తాత్కాలికంగా నిలిచి పోయింది.

మే : నియోజక వర్గంలో చేపట్టిన పనుల్లో మీకు బాగా సంతృప్తి నిచ్చినవి ?

ఎమ్మెల్యే : నియోజక వర్గంలో ఉన్న ప్రధానమైన సమస్యలన్నింటిని దాదాపుగా పరిష్కరించాను. పొన్నూరు పట్టణంలో డివిసి, డిఆర్‌కె తదితర కాలనీల ఏర్పాటు ద్వారా సుమారు వెయ్యి మంది నిరాశ్రయులకు ఇళ్ళ స్థలాలిచ్చి ఆశ్రయం కల్పించడం, ఇతర గ్రామాలలో ఇళ్ళ స్థలాలు, ఇళ్ళ నిర్మాణం, వృద్ధులకు, వితంతువులకు, వికలాంగులకు పించన్లు వచ్చేలా చేశాను. ఇలాంటివి ఎన్నో నాకు సంతృప్తినిస్తున్నాయి.

మే : పొన్నూరు నియోజకవర్గ పునఃర్విభజన గురించి?

ఎమ్మెల్యే : పొన్నూరు నియోజక వర్గం నుంచి కాకుమాను, పెదనందిపాడు మండలాలు విడిపోతున్నాయంటే ఎంతో భాధగా ఉంది. మొదటినుంచి ఆయా మండలాల్లోని ప్రజలు నాకు మద్దతునిచ్చారు. పొన్నూరు నియోజక వర్గంలో ఏ మండలాలు విడిపోయినా, జిల్లాలో ప్రజలందరి మద్దతు ఉన్న నాకు ఈ పునఃర్విభజనతో రాజకీయంగా వచ్చే ఇబ్బందేమి లేదు.

మే : ప్రతిపక్ష ఎమ్మెల్యేగా మీ అనుభవం?

ఎమ్మెల్యే : ఎమ్మెల్యేగా నన్ను గెలిపించినందుకు నియోజకవర్గంలోని

(మిగతా 96వపేజీలో)

# చెరగని ప్రజాదరణ నరేంద్రుని సొంతం

(95వపేజి తరువాయి)

అన్ని వర్గాల ప్రజలకు కృతజ్ఞతలు. కాంగ్రెస్ ప్రభుత్వం నాపై కక్ష సాధింపు చర్యలు చేపడుతూ, పొన్నూరుకు రావాల్సిన నిధులను కేటా యించటంలో వివక్ష త చూపుతుంది. ప్రతిపక్ష ఎమ్మెల్యేగా అసెంబ్లీలో నాగళాన్ని వినిపిస్తూ ప్రభుత్వం చేస్తున్న అవినీతి, అక్రమాలను ఎండగడుతు న్నాను.

**మే: నియోజకవర్గ ప్రజలకు, కార్యకర్తలకు, అభిమానులకు మీరి చ్చే సందేశం?**

**ఎమ్మెల్యే :** టిడిపికి 25 సంవత్సరాల పటిష్టమైన క్యాడర్ ఉంది. పేద ప్రజల అభివృద్ధి కోసం ఎన్.టి.ఆర్ పార్టీని ఏర్పాటు చేస్తే ఆయన ఆశయాలు నెరవేర్చేది శగా అధినాయకులు చంద్రబాబు నాయుడు కృషి చేస్తున్నారు. రాజకీయంగా ఎ న్ని మార్పులొచ్చినా తెలుగుదేశంపార్టీకి ఎప్పుడూ ప్రజాధరణ లభిస్తూనే ఉంటుంది.



# సిమెంట్ సిటీ కేరాఫ్ దాచేపల్లి

## మరో ఐదు పరిశ్రమల ఏర్పాటుకు సన్నాహాలు
## పదివేలమందికి ఉపాధి అవకాశాలు

బి.నరసింహారావు , మేజర్‌న్యూస్-దాచేపల్లి



ఆంధ్రా సిమెంట్స్ కర్మాగారం

వామ పక్ష భావాలు,స్ఫూర్తి ప్రదాతలకు పుట్టినిల్లుగా వున్న దాచేపల్లి ప్రముఖ సిమెంటు ఉత్పాదక కేంద్రంగా విరాజిల్లబోతుంది. అపారమైన సున్నపురాయి నిల్వలు గల ఈ ప్రాంతంపై పారిశ్రామికవేత్తలు దశాబ్దాల క్రితమే తమ సిమెంటు వ్యాపారానికి ఈ ప్రాంతాన్ని అనుకూలమైనదిగా నిర్ణయించుకుని పథకాలకు శ్రీకారం చుట్టారు. భూగర్భ వనరుల ఆసరా, అందివచ్చిన రైలు, రోడ్డు సౌకర్యాల మూలంగా దాచేపల్లి మండలం పారిశ్రామికంగా అభివృద్ధి చెందనుంది. సిమెంటు పరిశ్రమలకు కేరాఫ్‌గా కొత్తపుంతలు తొక్కనుంది.

### పదివేల మంది కార్మికులకు ఉపాధి

సున్నపురాయిని ముగ్గుగా చేసి వివిధ ప్రాంతాలకు సరఫరా చేయటం ,దాని ని కోళ్లమేతగాను , పంచదార పరిశ్రమల్లోనూ ,పలు కెమికల్ పరిశ్రమల్లో ముగ్గును వాడతారు. స్థానిక సున్నపురాయి క్వారీలలో సుమారు 5వేల మంది కార్మికులు ఉపాధి పొందుతున్నారు. స్థానికంగా సున్నపురాయి ఆధారితంగా30 పల్వరైజ్డ్ మిల్లులు వున్నాయి. 1950 ప్రాంతంలో విజయవాడలో నెలకొల్పిన ఆంధ్రా సిమెంట్స్ కర్మాగారానికి అవసరమైన సున్నపురాయి కోసం మండంలంలోని నడికూ డిలో సుమారు 400 ఎకరాల భూమిలో మైన్స్‌ను ప్రారంభించింది.

### ఆంధ్రా సిమెంట్స్‌తో ఆరంభం

1983లో గామాలపాడు శివారులో ఆంధ్రాసిమెంట్స్ సంస్థ దుర్గా సిమెంట్స్ పేరుతో నూతనంగా కర్మాగారాన్ని స్థాపించింది. కర్మాగారానికి అవసరమైన లైమ్‌స్టోన్ నిమిత్తం ఫ్యాక్టరీకి అనుకునేఉన్న గామాలపాడులో మైన్స్‌ను ప్రారంభించింది. సాలీనా లక్ష టన్నుల సున్నపురాయి ఉత్పత్తి ఈ మైన్స్‌లో జరుగుతుంది. సుమారు 4వేల మెట్రిక్ టన్నుల సిమెంటును ఈ సంస్థ ఉత్పత్తి చేస్తూ వందలాది కుటుంబాలకు ఉపాధి కల్పిస్తోంది. దీనికి అనుబంధంగా మరికొన్ని కుటుంబాలు జీవనం సాగిస్తున్నాయి.

### మరో ఐదు కర్మాగారాల ఏర్పాటుకు శ్రీకారం

ఇటీవల కాలంలో సిమెంటుకు అనూహ్యంగా డిమాండ్ ఏర్పడటంతో పలువురు పారిశ్రామిక వేత్తలు సిమెంటు రంగంవైపు దృష్టి సారించి కర్మాగారాలు స్థాపించుటకు చేసిన అన్వేషణలో దాచేపల్లి అనువైన ప్రాంతంగా కన్పించింది. ప్రస్తుతం మండల పరిధిలో మరో ఐదు సిమెంటు కర్మాగారాల నిర్మాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి. దాచేపల్లికి చేరువలోనే నడికూడి-బూదవాడల మధ్య అంబుజా సిమెంట్స్ భారీ కర్మాగారం నిర్మాణం నిమిత్తం సుమారు 700 ఎకరాల భూమిని కొనుగోలు చేసింది. ఫ్యాక్టరీ నిర్మాణం త్వరలో చేపడతారని తెలుస్తోంది. అనతికాలంలో మార్కెటింగ్ పరంగా పేరుప్రఖ్యాతలు పొందిన మైహోం సిమెంట్స్ సంస్థ సిమెంటు కర్మాగారం నిర్మాణానికి గామాలపాడు , శ్రీనగర్‌లలో సుమారు ఎనిమిది ఎకరాల భూమిని కొనుగోలు చేసి మరో మూడు నెలలో కర్మాగారం శంకుస్థాపనకు సన్నాహాలు చేస్తోంది. తంగెడ, ముత్యాలంపాడు గ్రామాల పరిధిలో భవ్యా సిమెంట్స్ సంస్థ కర్మాగారం నిర్మాణం నిమిత్తం సుమారు 1105 ఎకరాల భూమిని కొనుగోలు చేసింది. తక్కెళ్లపాడు, పెదగార్లపాడు మధ్య మరో ప్రముఖ సిమెంటు సంస్థ కర్మాగారం నిర్మాణానికి స్థల సేకరణకు సిద్ధమవుతోంది. ఇప్పటికే 450 ఎకరాలను కొనుగోలు చేసింది. ఒక ప్రజాప్రతినిధికి చెందిన కంపెనీ సిమెంటు కర్మాగార నిర్మాణానికి పొందుగుల , శ్రీనగర్ గ్రామాల మధ్య స్థల పరిశీలన జరిపారు. ఈ ఫ్యాక్టరీల నిర్మాణాలు ప్రారంభమైతే సిమెంటు ఉత్పత్తికే దాచేపల్లి కేంద్ర స్థానం కాగలదు. ఒకప్పుడు వెనుకబ డిన ప్రాంతంగా , తొండలు గుడ్లు పెట్టే ప్రాంతం, దేనికి పనికిరాని భూములుగా పరిగణించిన పొలాల నుంచి నేడు సిమెంటు రూపంలో సిరులు కురుస్తుండటంతో మండల ప్రజల్లో హర్షాతిరేకాలు వ్యక్తమవుతున్నాయి. తద్వారా మండలంలో నిరుద్యోగ సమస్య పూర్తిగా తీరిపోతుందని, ఉపాధి అవకాశాలు మెండుగా లభిస్తాయని, మండలం ఆర్థికంగా ఎంతో ప్రగతి సాధిస్తోంది.

# మధర్ థెరిస్సా బాటలో పయనిస్తా

(89వ పేజి తరువాయి)

చేసిన సేవలు ఎప్పటికీ గ్రంధాలలో లిఖించబడి వుంటాయనే ఉద్దేశంతో నోట్ల సంపాదనకు స్వస్తి పలికి కన్నీటి ప్రార్ధనతో దాతల దాతృత్య విరాళాలతో సంఘ సేవను చేస్తున్నాను. నాలో ఊపిరి పోసుకున్న దళిత పోరాటంతో బడుగు, బలహీన వర్గాలకు నివేశ స్థలాలను సంపాదించిపెట్టాను. సమాజంలో ప్రతి మహిళ అన్ని రంగాలలో అభివృద్ధి చెందాలనే ఉద్దేశంతో మహిళ చైతన్య సదస్సులను వేలకొలది నెలకొల్పి ఆ దిశగా మహిళలను చైతన్య పర్చాను. ఆడది అబల కాదు సబల అని ఛాలెంజ్ చేసి పోరాటాల ద్వారా నిరూపించుకుని మనిషి సమాజంలో ఉన్నత స్థితికి చేరాలంటే ఉన్నతమైన చదువులు అవసరం లేదని ఆత్మధైర్యంతో డాక్టర్ బి.ఆర్ అంబేద్కర్ సిద్ధాంతాలను పుణికి పుచ్చుకుని కష్ట, నష్టాలతో అలుపెరగని దళిత ఉద్యమాలను ఎన్నో చేశాను. ఈనాడు నాకంటూ ఏమిలేకపోయిన దీన, హీన, స్థితిలో కొట మిట్టాడే వయో వృద్ధులను చేర దీసి స్వర్ణభారతి నగరంలోని స్మితకాలనీ నందు అస్మితా వయోవృద్ధుల ఆశ్ర మాన్ని నెలకొల్పి దాదాపు 50 మంది వృద్ధులకు ఉచిత సేవలతో పాటు భోజన వసతులను అమలు పరు స్తున్నాను. గుంటూరు, ప్రకాశం జిల్లాలో ఉచిత వైద్య సేవ లను అందిస్తూ ఉచిత గ్రంధాలయాలను నెలకొల్పాను. ప్రస్తుతం స్వర్ణభారతి నగర్‌లో వృద్ధుల ఆశ్రమానికి భవన నిర్మాణం కోసం దాతల సహాయార్థం వేచివున్నాము. దాతలు, ప్రభుత్వ అధికారులు సహకరిస్తే సమాజ సేవకు ఎన లేని కృషిని చేస్తాన' ని ఆమె ముగించారు. ఆమె మహిళ అయిన సమాజ సేవ పట్ల అంకిత భావంతో పనిచేస్తున్న భారతికి మన వంతు సహాయ సహకారాలు అందిద్దాం.

# జిల్లా సంగతులు

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి.

★ క్రీ.శ. 1615లో శ్రీకృష్ణదేవరాయలు అమరా వతిలోని అమరేశ్వరున్ని దర్శించినట్లు శాసనా ధారాల ద్వారా తెలుస్తుంది.

★ భారత ప్రధమ స్వాతంత్ర్య పోరాటానికి ముందే గుంటూరు జిల్లా నాదెండ్ల సమితిలో స్వాతంత్ర్య సమరం సాగింది. బ్రిటీష్ రికార్డుల ప్రకారం నాగలి సమ్మెగా దీన్ని పిలుస్తారు.

★ 1909 సంవత్సరంలో కోటప్పకొండ తిరునాళ్ళలో బ్రిటీష్ పోలీసులకు ఎదురొడ్డి గాదె చిన్నపరెడ్డి అనే పోరాట వీరుడు పోరాటం చేశాడు.

★ దనందిపాడు కేంద్రంగా దేశభక్త కొండ వెంకటప్పయ్య, పర్వతనేని వీరయ్యచౌదరిల నాయకత్వంలో పన్నుల నిరాకరణోద్యమం సాగింది.

★ అస్పృశ్యత నిర్మూలన కార్యక్రమంలో భాగంగా గురజాలలో కావూరి వెంకయ్య, ఒంగోలులో కాట్రగడ్డ పాపయ్య, మంగళగిరిలో పరవస్తు దాసు, రెంటపాళ్ళలో అళ్ళ చలమదాసు హరిజన వసతిగృహాలు స్థాపించారు. తెనాలిలో కొల్లా కనకవల్లి తాయారమ్మ, సత్తెనపల్లిలో త్రిపురనేని సాధువమ్మ స్త్రీ విద్యార్థినుల కోసం వసతి గృహాలు ఏర్పాటుచేశారు.

★ పుల్లరి ఉద్యమానికి నాయకత్వం వహించిన కన్నెగంటి హనుమంతు సైనిక కాల్పుల్లో 1922 ఫిబ్రవరి 22న మరణించాడు.

★ గుండు, గుంట, కుంట అనే పదాల నుంచి గుంటూరు అనే పేరు వచ్చిందని అంటారు. తూర్పు చాళుక్య రాజైన మొదటి అమ్మరాజు క్రీ.శ. 922 నుండి వేసిన ఈడేరు శాసనంలో గొంటూరు పేరు తొలిసారిగా కనిపిస్తుంది. పల్లవుల శాసనాలలోనూ గొంటూరు ప్రస్తావన ఉంది.

★ 1866వ సంవత్సరంలో గుంటూరు పురపాలక సంఘంగా ఆవిర్భవించింది.

★ గుంటూరు, కృష్ణా జిల్లాల సాంఘిక మహాసభ 1908లో తెనాలిలో జరిగింది.



































# అందరి మన్ననలు పొందుతున్న సుచరిత

బూర్ల శ్రీనివాసరావు,
మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

ప్రజాసేవే పరమార్ధంగా రాజకీయాల్లో ప్రవేశించి పిన్నవయస్సులోనే ప్రజల మన్ననలను పొందుతూ నిత్యం.. అనునిత్యం ప్రజాస మస్యల పరిష్కారంలో జిల్లాలోనే ఫిరంగిపురం మండలాన్ని అభివృద్ధి పథంలో ముందుండేందుకు ఫిరంగిపురం జెడ్పీటిసి మేకతోటి సుచరిత కృషి చేస్తున్నారు. ఉన్నత విద్యను అభ్యసించినా, పేద, బడుగు, బలహీన వర్గాల ప్రతినిధిగా ఎన్నికై రాజకీయల్లో అంచలంచెలుగా ఎదుగుతున్నారు. పేదలతో మమేకమ వుతూ ప్రజాప్రతినిధిగా ప్రజలకు సేవలందిచడంలో ముందుంటున్నారు. అభివృద్ధి పనుల్లో అందరిని కలుపుకునిపోతు ప్రజలు ఆమెపై పెట్టుకున్న నమ్మకాన్ని నిలుపుకుంటున్నారు. జిల్లా పరిషత్ ఛైర్ పర్సన్‌గా ఎన్నికయ్యే అవకాశం కోల్పోయినా నిరుత్సాహ పడకుండా అత్యుత్సాహంతో భవిష్యత్‌పై నమ్మకాన్ని ఉంచి పార్టీ అభివృద్ధికి కృషి చేస్తున్నారు. రానున్న ఎన్నికల్లో జిల్లాలో మూడు స్ధానాలు (తాడికొండ, వేమూరు,పత్తిపాడు) ఎస్సీలకు రిజర్వు కావడంతో ఈసారి ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ తరుపున ఆమెకు



ఫిరంగిపురం జెడ్పీటిసి
మేకతోటి సుచరిత

ఏదో ఒక స్ధానం నుంచి శాసనసభకు పోటి చేసే అవకాశం దక్కవచ్చని పలువురు పేర్కొంటున్నారు. అధిష్ఠానంతో సంబందాలను మెరుగుపరుచుకుంటూ పార్టీ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటున్నారు. చిన్న వయస్సులోనే రాజకీయాల పట్ల అవగాహన పెంపొందించుకుని ప్రజలు, అధికారులతో సమన్వయం పాటిస్తూ ప్రజా సమస్యల పరిష్కారం కోసం నిరంతరం శ్రమిస్తున్నారు. రాజకీయంగా పరిణితి సాధిస్తూ ఒడిదుడుగులను ఎదుర్కొంటు ఉజ్వల భవిష్యత్‌కు బాటలు వేసుకుంటున్నారు. సంపన్న కుటుంబం కావడం, రిజర్వేషన్ కలిగిఉండటం రానున్న ఎన్నికల్లో తప్పనిసరిగా శాసనసభకు పోటీ చేసే అవకాశాలు ఉన్నాయి.

ఫిరంగిపురం జెడ్పీటిసి సుచరిత 'మేజర్‌న్యూస్'తో మాట్లాడు తూ అధిష్టానం అవకాశం ఇస్తే రాను న్న ఎన్నికల్లో ఏదో ఒక రిజర్వుడు స్ధానం నుండి పోటిచేస్తానన్నారు. ప్రజల ఆదరాభిమానాలే తనకు శ్రీరా మ రక్ష అన్నారు. జెడ్పీటిసిగా ఏదో చేయలనుకున్నా... ఎమి చేయలేకపో యానని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రత్యేకంగా జెడ్పీటిసిలకు ప్రభుత్వం కల్పించిన నిధులు ఆశించినమేర లేకపోవడంతో గొప్పగా చెప్పుకునేంతగ చేయలేక పోయానన్నారు. పేద, బడుగు, బలహీన వర్గాలకు ప్రభుత్వ పరంగా సహాయం చేయలేని వారికి వ్యక్తిగతంగా కొంతమేర అదుకుని ఊరట కల్పించానన్నారు. మేరికపూడి, మునగపాడు గ్రామాల మధ్య ఆర్‌ఆర్‌ఎం స్కీమ్ కింద రూ. 8లక్షలు వెచ్చించి రోడ్డు నిర్మాణానికి కృషి చేశానన్నారు. కార్యకర్తలు, నాయకులను కలుపుకుని కాంగ్రెస్ పార్టీ అభి వృద్ధికి కృషి చేస్తున్నానని రానున్న ఎన్నికల్లో తనకు పోటి చేసే అవకాశం కల్పిస్తారని ఆశిస్తున్నానన్నారు.

## 'కూని'రాగాలు

విద్య విజ్ఞానం కోసమూ -
వికాసం ప్రశాంతత కోసమూ -
ఉదయం కాంతితో వికసిస్తుంది!
హృదయం భ్రాంతితో మోసపోతుంది!
విరోధానికి శాశ్వతరూపం లేదు!
విపరీతానికి విధి కారణం అవ్వదు!
చరణం పల్లవితో ఒదిగిపోతుంది!
భరణం అంతస్తుతో తూకమేస్తుంది!
బానిసత్వము... రాక్షసత్వమూ...
రెండూ వారసత్వ సంపదలే!

- కూనిరెడ్డి శ్రీనివాస్

# కుట్టులేకుండా శుక్లం ఆపరేషన్‌లో దిట్ట 'దస్తగిరి'

సయ్యద్ సాబీర్ హుస్సేన్, వినుకొండ, మేజర్‌న్యూస్

గుంటూరు జిల్లాలోనే వెనుకబడిన ప్రాంతంగా గుర్తింపు పొందిన వినుకొండలో జిల్లాలోనే మొట్టమొదటిసారిగా కుట్టు లేకుండా శుక్లం ఆపరేషన్ (ఎస్.ఐ.సి.ఎస్.) చేసి రికార్డు సృష్టించారు డాక్టర్ షేక్.దస్తగిరి. 2000వ సంవత్సరంలో పట్టణంలో వెన్నెల నేత్రాలయం అనే పేరుతో వైద్యశాలనే ప్రారంభించిన ఆయన వైద్యశాల పెట్టిన మొదట్లోనే ఎస్.ఐ. సి.ఎస్. ఆపరేషన్ చేసి అటు జిల్లా ఇటు వినుకొండ ప్రాంత ప్రజల దృష్టిని ఆకర్షించారు. వినుకొండలో నేత్ర సమస్యలకు చికిత్స చేయించుకునే సౌకర్యం లేదు. కంటికి సంబంధించి చిన్న సమస్య వచ్చినా సరే నరసరావుపేటకు వెళ్ళాల్సి వచ్చేది. గ్రామీణ ప్రాంత ప్రజలు ఎదుర్కొంటున్న ఈ సమస్యను డాక్టర్ దస్తగిరి తీర్చినట్లే చెప్పవచ్చు. అత్యంత ఆధునిక పరికరాలతో


వైద్యులు షేక్ దస్తగిరి

వైద్యశాల ఏర్పాటు ఈ ప్రాంత ప్రజలకు వరమైంది. డాక్టర్ దస్తగిరి వెన్నెల నేత్రాలయంలో రోగులకు కంప్యూటర్ తో కంటి పరీక్ష, జపాన్ టకాగి ఆపరేటివ్ మైక్రోస్కోప్‌తో కంటి ఆపరేషన్, కుట్టు లేకుండా శుక్లం ఆపరేషన్, కంటిలో అద్దం (ఐ.ఒ. ఎల్) అమర్చే సౌకర్యాలున్నాయి. ఇంకా కంటికిస్కానింగ్, రేడియో స్లిట్ ల్యాంప్, కెరటోమీటర్, గ్లకోమాశస్త్రచికిత్స, 90డి లెన్స్‌తో రెటీనా పరీక్షల సౌలభ్యం ఉంది. భవిష్యత్తులో అత్యంత ఆధునికమైన కంటి లేజర్ చికిత్సను ప్రవేశపెట్టే యోచనలో ఉన్నట్లు ఆయన 'మేజర్‌న్యూస్'కు తెలిపారు. గ్రామీణ మారుమూల ప్రాంత నిరుపేద ప్రజలకు ఆధునిక కంటి వైద్య పరికరాలతో నాణ్యతా ప్రమాణాలతో కూడిన వైద్యసేవలందించడమే లక్ష్యంగా పేర్కొన్నారు.



# తెనాలిలో జాతీయ నాయకుల విగ్రహాల ముస్తాబు

మేకల సురేష్,
మేజర్‌న్యూస్, తెనాలిటౌన్

స్వాతంత్ర్య, గణతంత్ర దినోత్సవం వంటి జాతీయ పండుగలకు మాత్రమే మన వైపు చూసే ప్రజానీకం నేడు తెలుగు సంవత్సరాదిని పురస్కరించుకుని మనకు హంగులు దిద్దడం ఆశ్చర్యంగా ఉందని పట్టణ ప్రధాన కూడలిలో ఉన్న జాతీయ నాయకుల విగ్రహాలు సంభాషించుకుంటున్న తీరిది. ఈ నేపథ్యంలో వారి కళ్ళ వెంట ఆనంద భాష్పాలు జాలువారాయి. ఇందుకు కారణం ఆదివారం మహాత్మ సేవా శాంతి ఆశ్రమం వ్యవస్థాపకులు గాంధీహృదయధారి వజ్రాల రామలింగాచారి ఆధ్వర్యంలో విగ్రహాలకు రంగుల్ని అద్ది మహాత్మా గాంధీ, సుభాష్‌చంద్ర బోస్, జవహర్‌లాల్ నెహ్రూ, పొట్టి శ్రీరాములు


ముస్తాబవుతోన్న జాతీయ నాయకుల విగ్రహాల పక్కన రామలింగాచారి

వంటి మహనీయులను ఉగాది పండుగకు సిద్ధం చేశారు. ఈ సందర్భంగా రామలింగాచారి మాట్లాడుతూ మానవత్వానికి ప్రతిరూపాలైన జాతీయ నాయకులను ప్రతి ఒక్కరూ ముందు కొలవాలన్నారు. వారి త్యాగ ఫలితమే నేటి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలన్నారు. దేశం నలుమూలలా ఉన్న జాతీయ నాయకుల విగ్రహాలను పరిశుభ్రం చేసి రంగులు వేయాలని విజ్ఞప్తి చేశారు. కార్యక్రమంలో పావులూరి శివరామకృష్ణయ్య, కన్నెగంటి వెంకట్రావు, తాళ్ళూరి కృష్ణమూర్తి, మురళీకృష్ణ, లక్కోజు రవి తదితరులు పాల్గొన్నారు.



# కులవివక్షత సమసిపోవాలి

ఎ.ఎన్.పి.ఎస్ అధ్యక్షులు జి.చార్వాక

సాంబయ్య, గుంటూరు రూరల్, మేజర్‌న్యూస్

దళితరత్న, దళితుల ఆశాజీవి డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ సిద్ధాంతాల ప్రకారం సమాజంలో దళితుల పట్ల అగ్రవర్ణాలు చూపుతున్న కులవివక్షత నిర్మూలన జరిగినప్పుడే దళితుల జీవితాలకు బంగారుబాట ఏర్పడుతుంది. ప్రతి ఒక్కరూ అంబేద్కర్ సిద్ధాంతాలను సమాజంలోని విలువలతో కూడిన విద్యను అవలంబించిన నాడే దళితుల అభివృద్ధి జరుగుతుంది. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ రాజ్యాంగంలో పొందుపరిచిన ఆటంబాంబుల కన్నా శక్తివంతమైన చట్టాలను ప్రభుత్వాలు అమలు జరిపితేనే తప్ప దళితులపై వివక్షత తగ్గదు. దళితులు రాజ్యాధికారం కోసం ఎవరిదగ్గరా యాచించవలసిన అవసరంలేదు. ఓటు విలువను కాపాడుకుని దానిని సద్వినియోగం చేసుకుంటే దళితులకు రాజ్యాధికారం సునాయాసంగా వస్తుంది.



ఎంతో వేగవంతంగా అభివృద్ధి చెందుతున్నా మన రాష్ట్రం దళితులకు పరిరక్షణకు కావలసిన చట్టాలను సక్రమంగా అమలు జరుపడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలం చెందింది. దళితులను తాగుడుకు బానిసలుగా చేసి వారి చేత వెట్టిచాకిరి చేయిస్తున్న భూస్వాములకు కుటిలబుద్ధులకు స్వస్తి చెప్పడానికి ఉద్యమించిన అంటరానితన నిర్మూల పోరాట సమితి ఇప్పటి వరకు అనేక దళిత పోరాటాలను చేసి విజయాలను సాధించటం జరిగింది. ప్రతి దళితుడు అంబేద్కర్ ఆశయసాధనకు నడుంకట్టి పోరాడితేనే తప్ప సమ సమాజంరాదు. ఏ ఒక్కడూ దళిత ఉద్యమాల ద్వారా కరడుకట్టిన అగ్రవర్ణాల ఆధిపత్య పోరును రూపుమాపలేం. ప్రతి దళితుడు మారుతున్న కాలాన్ని దృష్టిలో పెట్టుకొని పూర్తిగా తాగుడు మాని, ఓటు విలువను నోట్ల కట్టలకు అప్పగించకుండా సమా జంలో తనకంటూ భారత రాజ్యాంగం కల్పించిన దేశపాలనలో ఏకం కావాలన్నదే నాతపన... రాబోవు కాలంలో రాష్ట్రానికి దళిత ముఖ్యమంత్రిని అందిస్తానని తెలియజేస్తున్నారు. సహాయ సహకారాలను అందించగలరని ఆశిస్తూ... సదా మీ సేవలో... దళిత ఉద్యమ కారుడు.... జి.చార్వాక.

# బ్రిటీషుల గుండెల్లో గుబులురేపిన 'గాంధీ విజయం'

వెంకుబాబు, మేజర్‌న్యూస్, గుంటూరు ఎడ్యుకేషన్

తాను రచించిన గాంధీ నాటక ప్రదర్శన ద్వారా తెల్లదొరల గుండెల్లో గుబులు పుట్టించిన స్వరాజ్య ఉద్యమ కవిరాజు దామరాజు. గుంటూరు నగరానికి చెందిన దామరాజు పుండరీకాక్షుడు స్వాతంత్ర్యోద్యమ కాలంలో మొట్ట మొదటి నాటక రచయితగా పేరు పొందారు. జాతీయోద్యమ కాలంలో కవులు చైతన్య స్వరూపులై నిద్రాణమైన వున్న భారతీయులను తమ రచనల ద్వారా మేల్కొల్పారు. దేశం కోసం తహతహలాడిన ఉత్తమ జాతీయ కవిత్వాన్ని ప్రబోధాత్మకంగా వెలువరించిన జాతీయ కవి దామరాజు పుండరీకాక్షుడు. 1920 సంవత్సరానికి ముందు తెలుగు సాహిత్యంలో ఉద్యమ ప్రచార సాహిత్యం అంతగా కనిపించకపోవటంతో ఆయన తనదైన శైలిలో ఒక నాయకపరమైన నాటకాన్ని రచించారు. మహాత్మా గాంధీ రాజకీయరంగ ప్రవేశం దేశంలో ఒక పెను మార్పును తెచ్చింది. ఆంగ్లేయుల నిరంకుశాధికారాన్ని ధిక్కరిస్తూ, గాంధీని స్తుతిస్తూ పుండరీకాక్షుడు ఈ నాటకాన్ని రచించారు. ఆ రోజుల్లో తెల్లదొరలు గాంధీ టోపీ పెట్టుకున్న వారిని దేశద్రోహులుగా పరిగణించేవారు. గాంధీ మీద పద్యం పాడినా కూడా దేశద్రోహం కిందకే వచ్చేది. భారతీయుల దాస్య శృంఖలాలను ఛేదించడానికి దామరాజు కలం నుండి జాలువారిన సాహిత్యం తోడ్పడింది. గాంధీజీ ఆవేశాన్ని గంభీర రణశంఖారావంలా పూరించి తన రచనల్లో ప్రజలను ఉత్తేజపరిచారు. తన చదువులకు స్వస్తి చెప్పి గుంటూరులో నేడు అరండల్‌పేటగా పిలువబడుతున్న నాటి గాంధీపేటలో స్వరాజ్య సోపాన నిలయం ఏర్పాటు చేసుకున్నారు. ఆ నిలయం నుండి ప్రతి నెలా గాంధీ ప్రబోధం, కాంగ్రెస్ ఉద్యమ చరిత్ర, ఖిలావత్ ఉద్యమం, సత్యాగ్రహ పాలన, మద్యపాన నిర్మూలన, హరిజనాభ్యుదయం తదితర గ్రంధాలు వెలువడుతూ సంఘ సంస్కరణకు సహకరించాయి. ఇవే కాకుండా ఆ నిలయం నుండి పలు నాటకాలు, పద్యాలు, గేయాలను ప్రచురించి నాటి బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించారు దామరాజు. ఆయన రాసిన 'గాంధీ విజయం' నాటకం నాటి ప్రభుత్వాన్ని భయభ్రాంతుల్ని చేసింది.

పంజాబ్ దురంతాలను చాటిచెబుతూ దామరాజు రచించిన పాంచాల పరాభవం నాటకంలో గవర్నర్ జనరల్ 'డయ్యర్'ను దైరాసురుడు అని సంబోధించారు. ఇది బ్రిటిష్ పార్లమెంటులో పెద్ద చర్చనీయాంశమైంది. ఈ నాటకాన్ని పాలకులు నిషేధించారు. స్వరాజ్య సోపాన నిలయం నుంచి ప్రచురించిన ఏ నాటకాన్ని ప్రదర్శించినా, నటులకు లాఠీదెబ్బలు, కారాగారవాసం తప్పేవి కావు. అంతటి రాజకీయ చైతన్యాన్ని, స్వాతంత్ర్య కాంక్షను, స్వరాజ్య సంపాదన దీక్షను సామాజికులలో రేకెత్తించిన దామరాజు పుండరీకాక్షుడి సాహిత్యం చిరస్మరణీయంగా నిలిచింది. ఆ రోజుల్లో ఏ కాంగ్రెస్ సభ జరిగినా ప్రార్థనా గీతాలుగా దామరాజు రచించిన దేశభక్తి గేయాలనే ఆలపించేవారు. స్వరాజ్య మహాసభ ఓట్ల ప్రహసనం, కలమ్‌పాషా జీవితం, భగవాన్ నారద, తారాశశాంకం, శ్రీనాధ, పోతన, రణభేరి, సంస్కారిణి, స్వరాజ్యసౌధం, క్విట్ ఇండియా, నిలవీత, విజయాంధ్ర రచనల్లో నాటకీయత ఎక్కువగా కనిపించేంది. మధ్యమధ్యలో మేలైన హాస్యం కూడా ఆయన చొప్పించారు. నాటక ప్రదర్శన కోసం జట్టును తయారు చేసి తర్ఫీదివ్వడానికి దామరాజు ఎంతో శ్రమ పడేవారు. తన రచనలను తానే ముద్రించుకునే దామరాజు తెలుగులో మొట్టమొదటి రాజకీయ నాటకాలకు నాంది పలికిన ఘనత దక్కించుకున్నారు. నవయుగారంభం అనే (గాంధీ మహోదయం) ఆయన రచించిన ప్రధమ రాజకీయ నాటకం. కేవలం రాజకీయాలే కాకుండా ఆనాడు సమాజంలో ఉన్న పలు సమస్యలను ప్రతిబింబించే నాటకాలను కూడా ఆయన రాశారు. వాటిల్లో సమస్యల పరిష్కారం కూడా చూపించేవారాయన. ఇవే కాకుండా ప్రచార కళారూపాలైన బుర్రకథ, హరికథ రచనల ద్వారా కూడా ఆయన ఆంధ్ర దేశంలో స్వరాజ్య కాంక్షను, చైతన్యాన్ని ప్రజల్లో ఉద్దీపింపచేశారు.

దామరాజు పుండరీకాక్షుణ్ణి నిర్భంధించడానికి బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ప్రయత్నాలను తిప్పికొడుతూ, వారికి దొరకకుండా, ఎప్పటికప్పుడు కొత్త తరహా నాటకాలను రచించారు. ఉద్యమాల గురించి నాటకాలు రాయటం, వాటిని ప్రదర్శించటం వల్ల సులభంగా బ్రిటిష్ వారికి దొరికిపో తామని భావించిన ఆయన సత్యహరిశ్చంద్ర, రాయబారం, చింతామణి వంటి నాటకాలను ప్రదర్శిస్తున్నట్లు ప్రచారం చేసి, ఉద్యమ నాటకాలనే ప్రదర్శిం నాటకాలను ఆచార్య రంగా ఇంగ్లండ్‌లో ప్రదర్శించి అరెస్టయ్యారు. దామరాజు నాటక సాహిత్య ధోరణికి తల్లడిల్లిన ప్రభుత్వం కొంత దిగివచ్చి, నాటకాలలో

(మిగతా103వ పేజీలో...)

# అత్యాధునిక వైద్యం అందరికీ అందుబాటులో..

## వైద్యరంగంలో నూతన శకానికి ఆవిష్కరణ

## డాక్టర్ అందె వెంకటేశ్వరరావు

కువ్వారపు అనిల్‌కుమార్, స్టాఫ్‌రిపోర్టర్, గుంటూరు

గుంటూరు నగరం వైద్య నిపుణుల ఖిల్లాగా అవతరించిన విషయం విదితమే. సమాజ సేవతో పాటు అతితక్కువ ఖర్చుతో వైద్యం అందించేందుకు ఎందరో ప్రముఖ వైద్య నిపుణులు సేవలు అందిస్తున్నారు. వారిలో డాక్టర్ అందె వెంకటేశ్వరరావుది 'అందె' వేసిన చెయ్యి. క్షణం తీరక లేకుండా పనిచేయడం ఆయన ప్రత్యేకత. గుంటూరు నగరంలో అత్యాధునిక పరికరాలను సమకూర్చి, ప్రధానంగా పేద, మధ్య తరగతి వర్గాల వారికి అందుబాటులో ఉంచుతున్నారు. సాధారణ రుసుముతో సూపర్ స్పెషాలిటీ వైద్యాన్నీ అందిస్తున్నారు. డాక్టర్ అందె వెంకటేశ్వరరావు 2002లో వైద్య వృత్తిలోకి ప్రవేశించి, అతితక్కువ కాలంలోనే ప్రజలకు సుపరిచితులయ్యారు. 'పొగతాగడం మానండి.. జీవించడం ప్రారంభించండి' అంటూ ప్రజానీకానికి నూతన సందేశం అందిస్తున్న డాక్టర్ అందె తనకంటూ ప్రత్యేకతలను సొంతం చేసుకున్నారు. ఢిల్లీలోని సర్దార్ వల్లభాయిపటేల్ చెస్ట్ ఇన్‌స్టిట్యూట్‌లో ఎలర్జీపై ప్రత్యేక శిక్షణ పొందారు. అనంతరం హైదరాబాద్‌లోని అపోలో ఆసుపత్రిలో వైద్యం అందించిన అనుభవం ఆయనకు ఉంది.



బ్రాడీపేట ఎస్.హెచ్.ఒ.లో రోగులను పరిశీలిస్తున్న డాక్టర్ అందె. జోసిల్‌లో ఉచిత వైద్యం అందిస్తున్న డాక్టర్ అందె వెంకటేశ్వరరావు

### ప్రత్యేకతలు ఇవే..

★ క్రిటికల్ కేర్ యూనిట్‌కు 24గంటలపాటు అందుబాటులో ఉండి, వ్యక్తిగత శ్రద్ధచూపడం ఎ.వి.ఆర్. ఆసుపత్రి ప్రత్యేకత.

★ పొగతాగేవారికి ఊపిరితిత్తులపై ఎంత ప్రభావం చూపుతుందో, ఊపిరితిత్తుల్లో కార్మన్ మొనాక్సైడ్ శాతాన్ని తెలియజేసే పరికరం స్మోక్ (సి.ఒ.) చెక్ పరికరాన్ని జిల్లాలోని అందరికీ అందుబాటులోకి తెచ్చిన ఘనత ఎ.వి.ఆర్.కే చెందుతుంది.

★ అత్యాధునిక నాన్ ఇన్వేసివ్ వెంటిలేటర్లను నగరంలో ప్రప్రమథంగా ఏర్పాటు చేయడం ద్వారా ప్రజలకు మరింత మెరుగైన వైద్య సేవలు అందించేందుకు వెంకటేశ్వరరావు కృషి అభినందనీయం.

★ సామాజిక సేవల్లోనూ డాక్టర్ అందె వెంకటేశ్వరరావు తనదైన శైలిలో ప్రత్యేక సేవలను అందిస్తూ సమాజానికి తనవంతు కర్తవ్యం నిర్వర్తిస్తున్నారు. నగరంలోని వివిధ సామాజిక, ప్రజా సంఘాలు నిర్వహించే ఉచిత వైద్య శిబిరాలకు డాక్టర్ అందె అనేక సార్లు హాజరయ్యారు. ఇందులో ప్రధానమైన ఈ ఏడాది ప్రారంభంలో జోసిల్ కంపెనీలో ఏర్పాటు చేసిన వైద్య శిబిరం, అలాగే ఇండియన్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ ఆధ్వర్యంలో నిర్వహించిన వైద్య శిబిరాల్లో డాక్టర్ అందె ముఖ్య పాత్ర పోషించారు.

★ గుంటూరు నగరంలోని ఓల్డ్ క్లబ్ రోడ్డులోని ఎ.వి.ఆర్. ఆసుపత్రిలో అందిస్తున్న ప్రత్యేక వైద్యసేవలు ఇవే.

**సూపర్ స్పెషాలిటీస్:** క్రిటికల్ కేర్, బ్రాంకోస్కోపీ, స్లీప్ ల్యాబ్, ఎలర్జీస్కిన్ టెస్టింగ్, ఇమ్యునోథెరపీ, లంగ్ ఫంక్షన్ టెస్ట్, స్మోక్‌చెక్, సి.పి.ఎ.పి., బై పి.ఎ.పి., నాన్ ఇన్వెసివ్ వెంటిలర్.

**స్పెషాలిటీస్:** ఎలర్జీ, ఆస్తమా, క్షయ, నెమ్ము, గుండె, ఇన్‌ఫెక్షన్స్, జ్వరాలు, విష జ్వరాలు, ఛాతి, ఊపిరితిత్తులు.



# బాస్.. అర్థం మారుతోంది..!

## నాయకత్వం... ఒక ఆధునిక అవసరం

కువ్వారపు అనిల్‌కుమార్,
స్టాఫ్‌రిపోర్టర్, గుంటూరు

బాస్.. గతంలో ఈ పేరు వింటే గుండె దడదడలాడేది. బాస్ ఒక అజమాయిషీ చేసే వ్యక్తి.. బాస్ ఆదేశాలు మాత్రమే జారీ చేస్తాడు.. బాస్ ఆదేశాలు తప్పనిసరిగా అమలు జరగాల్సిందే.. పనిలో తేడా వస్తే శివాలెత్తిపోతాడు.. నానా మాటలూ అంటాడు.. అందుకే బాస్ పేరు చెబితేనే గతంలో ఉద్యోగులు, కిందిస్థాయి సిబ్బందికి కాళ్ల గడగడ వణికేవి.

ఆధునిక సమాజం బాస్ అనే పేరుకు అర్థం మారిస్తోంది. బాస్ కేవలం అజమాయిషీ చేసేవాడు మాత్రమే కాదని ఒక నిర్దిష్టమైన పనిలో ఆశించిన ఫలితాలు తీసుకురావాలంటే కిందిస్థాయి సిబ్బందికి చుక్కానిలా నిలిచే వాడని నవసమాజం సుద్దులు చెప్పింది. దానికి అనుగుణంగా మానసిక శాస్త్రవేత్తలు, ఆర్థ, గణాంక శాస్త్ర నిపుణులు బాస్ పేరుకు నిర్వచనాలు మార్చారు. తద్వారా పరిశ్రమల్లో, సంస్థల్లో గణనీయమైన ప్రగతిని తీసుకురావచ్చని వివరించారు. ఈనేపథ్యంలోనే నాయకత్వ లక్షణాలు అంశం తెరపైకి వచ్చింది. సమాజానికి దిశానిర్దేశం చేస్తుంది. పాఠశాల స్థాయి నుంచి నాయకత్వ లక్షణాలను అలవాటు చేసేలా విద్యా సంస్థలూ ముందడుగు వేస్తున్నాయి. అసలు నాయకత్వ లక్షణాలు ఎలావుండాలి, వాటిని అలవర్చుకోవడం ఎలా అనే అంశాలపై నిపుణుల సూచనలు, అనుభవం కల వ్యక్తుల నుంచి సేకరించిన సమాచారం.. సర్వధారి నామ ఉగాది వత్సరం నాడు 'సూర్య' పాఠకులకు మాత్రమే ప్రత్యేకం.

### నాయకుడంటే..

ఒక నిర్దిష్టమైన పనిలో తాను విజయ సాధన దిశగా నడుస్తూ, తన తోటి వారికి దిశానిర్దేశం చేస్తూ సమష్టికృషితో విజయాన్ని సాధించేలా చూసేవాడే నాయకుడు. ఏ రంగంలోనైనా ఈ అంశాలనే ప్రాథమిక సూత్రంగా తీసుకోవాలని అనుభవజ్ఞుల సూచిస్తున్నారు. క్రమబద్ధమైన మానసిక కసరత్తు ద్వారానే నాయకత్వ లక్షణాలు అలవడతాయని పేర్కొంటున్నారు.

### ప్రధాన లక్షణాలు..

మానవ వనరులను సమీకరించి, సామాజిక న్యాయం, మానవత్వం, సేవా దృక్పథం, సంస్థపై అంకితభావంతో కూడిన జవాబుదారీతనం, నిర్మాణాత్మకతతో కూడిన నిర్వహణ అంశాలను నాయకుని లక్షణాలుగా నిపుణులు సూత్రీకరించారు.

### లక్షణాలు.. గుణాలు.. నైపుణ్యాలు

★ ప్రజాస్వామ్య పద్ధతిలో నాయకుడు వ్యవహరించాలి. ★ సంఘసేవ చేయాలనే దృక్పథాన్ని వ్యక్తీకరిస్తూ ఉండాలి. ★ సంఘం, సంస్థ, పరిశ్రమల ఉద్దేశ సాధనకై తన చుట్టూ ఉన్న వారితో కలసి పనిచేయాలి. ★ అనుభవజ్ఞులు, నిపుణుల సలహాలను తీసుకుంటూ, వాస్తవిక దృక్పథంలో ఆలోచించాలి. ఫలితాలను కూడా ముందుగానే ఊహించాలి. ★ కుల, మత, భాష, ప్రాంత, వర్గ, జాతి వంటి సంకుచిత భావాలను అధిగమించి సంఘ (సంస్థ) అభివృద్ధికి కృషి చేయాలి. ★ స్వార్థ రహిత ఆలోచనలు, మాటలు, చేతలు నాయకుని విలువను రెండింతలు చేస్తాయి. ★ గెలుపునైనా, ఓటమినైనా సమానంగా స్వీకరించే స్థైర్యం నాయకుని ప్రథమ లక్షణాల్లో ఒకటి. ★ నిర్మాణాత్మకమైన విమర్శలను ఆస్వాదించాల్సిన బాధ్యత ఉంది. ★ తన కిందిస్థాయి వ్యక్తుల హక్కులను గుర్తించాలి, మానవత్వం కూడిన పాలన ఉండాలి. ★ అన్ని వేళల్లో మర్యాదగా వ్యవహరించాలి. కిందిస్థాయి సిబ్బందితో సరదాగా ఉండాలి కొన్ని సమయాల్లో సరదాగా ఉండాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

# బ్రిటీషుల గుండెల్లో గుబులు రేపింది 'గాంధీ నాటకం'

(101వ పేజీ తరువాయి)

గాంధీ పాత్ర లేకుండా నాటకాలు రాయమని, అలా చేస్తే యాభై వేల రూపాయలు కూడా ఇస్తామని ఆశ చూపారు. అయినా దామరాజు డబ్బు ఆశకు ప్రలోభపడకుండా, "గాంధీ లేకుండా నా కలం సాగదు... నాటకం ఆగదు..." అంటూ తన పని తాను చేసుకుపోయారు. భరతమాత దాస్య విముక్తికి దామరాజు నిస్వార్ధంగా చేసిన కృషి, దీక్ష, పట్టుదల, ప్రదర్శించిన ధైర్యసాహసాలు అద్వితీయం... అమోఘం... అంటూ నాడు అనేక మంది నాయకులు కీర్తించారు. స్వరాజ్య సాధన కోసం మహాత్ములు దృఢ ప్రయత్నం ప్రారంభించిన రోజుల్లో ఆ నూతనోద్యమం రహస్యాలను ఆంధ్రదేశంలో వెదజల్లడానికి దామరాజు రచించిన నాటకమే యుగారంభంగా చెప్పుకునేవారు.

నాటకాన్ని చూసిన అయ్యదేవర కాళేశ్వరరావు దామరాజును ప్రత్యేకంగా ప్రశంశించారు. దాదాపు దామరాజు పుండరీకాక్షుడు రచించిన నాటకాలన్నింటిలోనూ గాంధీజీ దైవాంశ వున్నదని ప్రతి ఒక్కరూ ఒప్పుకునేవారు.

# ప్రాచీన ఆలయాలకు నిలయం పెదకొండూరు

నల్లబాటి మధుబాబు,
మేజర్‌న్యూస్, దుగ్గిరాల

దుగ్గిరాల మండలంలో కృష్ణా నదీతీరాన ఉన్న పెదకొండూరు గ్రామంలో అతి ప్రాచీనమైన విశిష్ట దేవాలయా లు న్నాయి. ఇక్కడ 11వ శతాబ్ద కాలం నాటి జనార్ధనస్వామి ఆలయం ఉండగా 13వ శతాబ్దం నాటి ఆనందేశ్వరస్వామి ఆలయాలతో పాటు రెండు దేవాలయాల మధ్య జనార్ధన స్వామి ఆలయం ఉన్నాయి. రెండు శివాలయాల మధ్య ఒక వైష్ణవ ఆలయం ఉండడమే ఈ గ్రామం ప్రత్యేకత. బౌద్ధ శిల్పులు తెల్లరాతితో చేసిన విలక్షణమైె ప్రసిద్ధి చెందిన అర్ధనారీశ్వర రూపం కలిగిన శివలింగం ఉంది. మహా శివరాత్రి నాడు శివుడు లింగోద్భవ మూర్తిగా ఆవిర్భావించెనని పురాణాలు చెప్తున్నాయి.

విజయవాడకు 15 కిలో మీటర్ల దూరంలో కృష్ణానదీ తీరాన ఉన్న గ్రామంలో శివాలయం సుమారు 12, 13 శతాబ్దాల నాటిదని తెలుస్తుంది. గ్రామంలో మరొక ప్రసిద్ధి చెందిన ఆలయంగా శ్రీరాజరాజేశ్వరి ఆలయం పేరు గడించింది. క్రీస్తుశకం 1135వ సంవత్సరంలో జరిగిన గోదావరి యుద్ధంలో వేంగి దేశాన్ని చాణక్యుల నుంచి విడిపించిన విజయసూచికంగా ఆలయ ప్రతిష్ట జరిగిందని స్థల పురాణం వల్ల తెలియవస్తోంది. ఈ ఆలయం గ్రామ స్మశానవాటికకు పక్కనే ఉంది. స్మశానంలోనిపొగ స్వామికి పారుటయే ఇక్కడ మరొక విశిష్టత. గ్రామం మధ్యలో ఆలయం ఉండడం వల్ల గ్రామస్తులు నడిమి దేవుడని పిలుస్తుంటారు.



పెదకొండూరులోని రాజరాజేశ్వరి ఆలయం

స్వామికి ధనుర్మాసంలోనూ, ముక్కోటి ఏకాదశినాడు ఇతర పర్వదినాల్లోనూ విశేష అర్చనలు జరిగేవి. వీటితో పాటే శ్రీఆంజనేయస్వామి ఆలయం ఉంది. స్వామి వారి రెండు విగ్రహాలు కృష్ణానదిలో లభించాయని ఆ రెండింటిలో ఒక విగ్రహం ప్రతి సంవత్సరం కొంచెం, కొంచెంగా పెరుగుతుందని అక్కడి అర్చకులు తెలిపారు.



అన్నాబత్తుని డిగ్రీ అండ్ పిజీ కళాశాల

# ఉన్నత విలువలతో విద్యాబోధన అన్నాబత్తుని సొంతం

మేకల సురేష్, మేజర్‌న్యూస్, తెనాలి

అత్యున్నత విలువలు, ఆధునిక వసతులు, సంప్రదాయ విలువలకు చిరునామా అన్నాబత్తుని సత్యనారాయణ విద్యా సంస్థలు. తెనాలి డివిజన్‌లో చిరకాలంలోనే విద్యారంగంలో గణనీయమైన ప్రగతి సాధించాయి ఈ విద్యా సంస్థలు. సామాన్య రైతు కుటుంబంలో జన్మించి అంచెలంచెలుగా ఎదిగి ప్రజా సేవలో ఒదిగి, ప్రజా సేవకే తన జీవితాన్ని అంకితం చేసిన మహోన్నత వ్యక్తి స్వర్గీయ అన్నాబత్తుని సత్యనారాయణ. ఆయన పేరుమీదగా వారి తనయుడు అన్నాబత్తుని శివకుమార్ కరస్పాండెంట్ అండ్ సెక్రటరీగా వ్యవహరిస్తూ 1988 -89 విద్యా సంవత్సరంలో కళాశాలను స్థాపించారు. గ్రామీణ ప్రాంత విద్యార్థులకు అందని ద్రాక్షలా ఉన్న సాంకేతిక విద్య కొందరికే పరిమితం కాకుడదన్న సత్సంకల్పంతో కళాశాలను స్థాపించి అందరి మన్ననలను పొందుతున్నారు శివకుమార్. అధునాతన కోర్సులతో, ఉన్నత ప్రమాణాలతో విద్యనందిస్తూ అన్నాబత్తుని సత్యనారాయణ డిగ్రీ కళాశాల తెనాలి ప్రాంతంలో ఒక ప్రత్యేక గుర్తింపు పొందింది. ప్రారంభ దశలో డిగ్రీస్థాయి అయినప్పటికీ అంచెలంచెలుగా ఎదుగుతూ 1997-98లో ఈ కళాశాలలో ఎం.సి.ఎ కోర్సును ప్రారంభించారు. యూనివర్సిటీ స్థాయిలో ప్రముఖ స్థానం పొందడమే కాక ఎం.సి.ఎనందు పలుమార్లు నూటికి నూరుశాతం ఉత్తీర్ణత సాధించారు.



కరస్పాండెంట్ శివకుమార్

2001-02 సంవత్సరంలో రెండు గోల్డ్ మెడల్స్‌ను కళాశాలకు చెందిన విద్యార్థులు సాధించారు. 2003-04 సంవత్సరంలో ఎం.ఎస్.సి (ఐ.ఎస్)నందు యూనివర్సిటీ రెండవ ర్యాంకు సాధించిన ఘనత కళాశాల విద్యార్థులకే దక్కింది. ఈ విజయాల పరంపర స్ఫూర్తితో 2004 విద్యా సంవత్సరంలో ఎ.ఎస్.ఎన్ ఫార్మశీ కళాశాలను స్థాపించారు. చదువులోనే కాక క్రీడలు, సాంస్కృతిక విభాగాల్లోనూ కళాశాల విద్యార్థులు ఉత్తమ ప్రతిభ కనబరుస్తున్నారు.

అంతర కళాశాలల స్థాయిలో నిర్వహించే వెయిట్ లిఫ్టింగ్ 9సార్లు, హ్యాండ్‌బాల్, ఖోఖో, వాలీబాల్ వంటి క్రీడల్లో పలుసార్లు ప్రధమ స్థానం కైవసం చేసుకున్నారు కళాశాల విద్యార్థులు. సమాజహిత కార్యక్రమాలు, ఎన్.ఎస్.ఎస్ సేవా కార్యక్రమాలు, యూనివర్సిటీ స్థాయిలో ప్రత్యేక గుర్తింపు సాధించారు. దేశ భవిష్యత్తు విద్యావంతులైన యువత నడవడి, మేధస్సుపై ఆధారపడి ఉంటుందని అలాంటి మేధావులను తయారుచేయడమే తమ కళాశాల ప్రధాన ధ్యేయమని శివకుమార్ పేర్కొన్నారు.



# అభివృద్ధి పథంలో స్వర్ణపురి

ఎ.కేశవరావు, మేజర్‌న్యూస్ పొన్నూరు

పొన్నూరు పట్టణం అభివృద్ధి చెందుతోంది. ఓ చిన్న పంచాయితీ స్థాయి నుంచి మున్సిపల్ స్థాయికి ఎదిగిన పొన్నూరు కాలక్రమంగా పెరుగుతున్న జనాభాతో పాటూ అభివృద్ధి కూడా అదేమేర జరుగుతుండటం, పాలకులు, అధికారులు అంకిత భావంతో, చిత్తశుద్ధితో పనిచేస్తుండటం పొన్నూరు అభివృద్ధికి ఓ కారణం కాగా అన్ని రకాల వనరులు సంవృద్ధిగా ఉండటం మరో కారణం. సుమారు లక్షమంది జనాభా ఉన్న పొన్నూరు పురపాలక సంఘంలో ప్రజలకు మంచినీటి సమస్య ఉండకూడదనే ఉద్దేశ్యంతో రూ.16 కోట్లతో మంచి నీటి సమ్మర్ స్టోరేజ్ ట్యాంక్ నిర్మాణం జరిగింది. పట్టణంలో ఉన్న 31 వార్డుల్లో అంతర్గత సిసి రోడ్లు, డ్రైన్ల నిర్మాణం వేగవంతంగా జరిగింది. పురపాల సంఘానికి ఉన్న దుకాణ సముదాయాలతో పాటు వ్యాపార సంస్థలు,ఇంటి పన్ను, ఖాళి స్థలాల పన్నులు, నీటి కుళాయిల పన్నులు తదితర పన్నుల ద్వారా పురపాలక సంఘం ఆదాయం ఆశాజనకంగానే ఉంది. ఈ ప్రభుత్వ హయాంలో పురపాలక సంఘానికి వచ్చిన నిధుల వివరాలను గురించి చైర్‌పర్సన్ డాక్టర్ ఎన్. రూత్‌రాణి వివరించారు. వి.ఐ.డి. ఎస్.ఎస్.ఎం.టి రూ.18.79 కోట్లు, ఎన్.ఎస్.డి.పి రూ.60లక్షలు, ఓగ్ని రూ.10 లక్షలు, ఎసిడిపి రూ.60లక్షలు, జనరల్ ఫండ్ రూ.30లక్షలు, 12వ ఆర్దిక సంఘం నిధులు రూ.60లక్షలు, హడ్కో నిధులు రూ.45 లక్షలు, ఐ.డి.ఎస్.ఎం.టి రూ.60లక్షలు, ప్రత్యేక గ్రాంట్ రూ.2 కోట్లతో పాటు రూ.4.30 లక్షలతో ఐలెండ్ సెంటర్‌లో ఐమ్యాక్స్ లైట్ ఏర్పాటు, కార్యాలయ భవన నిర్మాణ నిధుల



వందెకరాల్లో నిర్మించిన సమ్మర్ స్టోరేజి ట్యాంక్



ఐలెండ్ సెంటర్‌లో ఏర్పాటు చేసిన ఐమ్యాక్స్ లైట్

నుంచి పొన్నూరు మున్సిపల్ కార్యాలయం నూతన భవన నిర్మాణ పనులు చేపట్టడం, రూ.18లక్షలతో నిర్మించిన చేపలు, మాంసం మార్కెట్ వినియోగంలోకి తేవడం జరిగిందన్నారు. కమిషనర్ ఎం. సుభాషిణి ట్రాఫిక్ సమస్యను పరిష్కరించేందుకు రోడ్లపై ఆక్రమణల తొలగింపు, పురపాలక సంఘ ఆదాయాన్ని పెంచేందుకు సాధారణ బకాయిలతో పాటు మొండి బకాలకోసం ప్రత్యేక డ్రైవ్‌లు నిర్వహిస్తూ పురపాలక సంఘ ఆదాయాన్ని పెంచుతున్నారు.

# ఆదర్శప్రాయుడు కళ్ళం విజయభాస్కరరెడ్డి

బుర్ల శ్రీనివాసరావు, మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

సమాజసేవే పారమాత్మకంగా పలువురు మన్ననలను పొందుతూ ఆదర్శప్రాయంగా నిలిచారు ముప్పాళ్ళ మండలం బొల్లవరంగ్రామానికి చెందిన ప్రముఖ న్యాయవాది కళ్ళం వీరభాస్కరరెడ్డి...సమాజసేవలో పునీతమవుతూ ఎంతో మంది ఎన్నో రకాల సేవలు చేస్తున్న వారందరికి భిన్నంగా ఉన్నతమైన లక్ష్యాన్ని ఎంచుకొని జన్మనిచ్చిన ఊరికి ఏదైన చేయాలనే సంకల్పంతో ముందుకు నడిచారు. చెట్ల పెంపకాన్ని ఉద్యమంగా చేపట్టి నాలుగో మైలునుంచి బొల్లవరం వరకు రహదారికి ఇరువైపుల పదిహేనేళ్ళ క్రితం మొక్కలు నాటారు. అవి పెరిగి నేడ వృక్షాలుగా మారాయి. మొక్కలు నాటడంతో మూడు కిలో మీటర్ల మేర పెరిగి వృక్షాలు నీడనిచ్చి నడిచివెళ్ళేవారికి ఇబ్బంది లేకుండా చేస్తున్నాయి. అప్పుడు నాటిన మొక్కలు రోడ్డుకిరువైపుల ఇప్పుడు వృక్షాలై చూసేవారికి చూడముచ్చట గొలుపుతున్నాయి. పొలాలు వెళ్ళేవారికి పాదచారులకు సేద తీర్చుకునేందుకు ఈ చెట్లు నీడనిస్తున్నాయి. బొల్లవరం, దమ్మాలపాడు గ్రామాలకు బస్సుకోసం ఎదురు చూసే ప్రయాణికులకు ఈ చెట్లు ఎంతో నీడనిస్తున్నాయి. మొక్కలు నాటే బాధ్యతను ఆయనలాగా ప్రతి ఒక్కరూ తీసుకుంటే వాతావరణ కాలుష్యాన్ని నివారించవచ్చు. మానవ మనుగడకు మొక్కల పెంపకం అత్యంతం అవసరమని శాస్త్రవేత్తలు సూచిస్తున్నారు. పరిశుభ్రమైన వాతావరణంలో జీవించాలంటే పచ్చదనం మరింత అభివృద్ధి చెందేలా చూడాలి.



న్యాయవాది కళ్ళం వీరభాస్కరరెడి

వందల సంవత్సరాల క్రితమే భారతదేశ చక్రవర్తులు ఆశోకుడు, హర్షవర్ధనుడు మొక్కల పెంపకాన్ని ఆచరణలోపెట్టారు. నేటి పాలకులు పర్యవరణాన్ని నిర్లక్ష్యం చేశారు. పచ్చని చెట్లు - ప్రగతికి మెట్లు అన్న నినాదాన్ని ప్రతిఒక్కరిలో నింపి చైతన్యవంతులను చేయాల్సిన బాధ్యత మనందరిపై ఉంది. మొక్కల పెంపకం మహోన్నత లక్ష్యంగా ప్రతి ఒక్కరూ అందిపుచ్చుకోవాల్సి ఉంది. పచ్చని చెట్లతో అలరారుతు ప్రయా ణీకులకు ఎంతో సౌకర్యాన్ని ఆహ్లాదాన్ని కలిగిస్తున్న బొల్లవరం రోడ్డులోని చెట్లు నాటిన భాస్కరరెడ్డి పలువురు అభినందనలు అందుకుంటున్నారు.

ఈ సందర్భంగా మొక్కల పెంపకాన్ని చెపట్టిన న్యాయవాది కళ్ళం వీరభాస్కరరెడ్డి మాట్లాడుతూ నాడు సరదాగా చేసిన ఈ పని నేడు వృక్షాలై నీడనిస్తూ ఆరోడ్డు వెంట వెళుతుంటే మనస్సుకు ఎంతో ఆహ్లాదాన్ని నింపుతుందన్నారు. యువత మొక్కల పెంపకాన్ని ఉద్యమంగా చేపట్టి వాతావరణ కాలుష్యాన్ని కాపాడాల్సిన బాధ్యత ఉందన్నారు. అధికారులు ప్రజాప్రతినిధులు పచ్చదనం పరిశుభ్రత కార్యక్రమంలో మొక్కల పెంపకం చేపట్టలన్నారు.



న్యాయవాది సంకల్పంతో నీడనిస్తున్న వృక్షాలు

## 'కూని' రాగాలు

అనైతికం ఆవహిస్తే అరాచకం!
ఆక్రందన విషమిస్తే ఆక్రోశం!
పెత్తనం పెచ్చరిల్లితే తిలోదకం!
పైత్యం తలకెక్కితే పచ్చరోగం!
స్వర్గం ఊహల్లో సుందరం!
స్వప్నం మెలకువలో మధురం!

పదాల కనికట్టు కవితామృతం!
పెదాల కలిసికట్టు అధరామృతం!
స్థాయికి మించి శాసించడం..
హద్దులు దాటి వ్యవహరించడం అనారోగ్యం!
మరువలేని జ్ఞాపకం ఓ నరకం!
పరువులేని జీవితం ఓ శాపం!

→ కూనిరెడ్డి శ్రీనివాస్ ←

# శాస్త్రీయ సంగీతాన్ని ప్రోత్సహిస్తున్న సుబ్బలక్ష్మి

ఆర్.వి.కిరణ్‌కుమార్, రిపోర్టర్, తెనాలి కల్చరల్.

వృత్తిరీత్యా కళాశాల అధ్యాపకురాలైనా ప్రవృత్తిరీత్యా సంగీత ఉపాధ్యాయురాలిగా తనకున్న మక్కువతో సంగీతం నేర్చుకుని తాను నేర్చుకున్న విద్యను ఉచితంగా పలువురికి అందించడంలో ఆమెకు ఆమేసాటి. బాల్యం నుంచి సంగీత సాధన చేస్తూ తాను అభ్యసించిన సంగీతాన్ని పలువురికి అందించడంలో వ్యాకరణం సుబ్బలక్ష్మి చేస్తున్న సేవలు ప్రశంసనీయం. 1946వ సంవత్సరం మార్చి 2న తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో జన్మించిన సుబ్బలక్ష్మి నేటికీ సంగీత సాధనతో పాటు పలువురు ఔత్సాహికులకు శిక్షణ ఇస్తున్నారు. వారిని సంగీతంలో నిష్ణాతులను చేయడమే కాకుండా కనుమరుగవుతున్న శాస్త్రీయ సంగీతానికి జవసత్వాలు ఇవ్వడంలో విశేష కృషి చేస్తున్నారు. వేదుల శ్రీరామ చంద్రకీర్తి, మీనాక్షిదేవిలకు కలిగిన సంతానము సుబ్బలక్ష్మి. ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకునిగా తండ్రి శ్రీరామచంద్రకీర్తి వ్యవహరించేవారు. తల్లి మీనాక్షిదేవి ప్రముఖ రచయిత్రి. సుబ్బలక్ష్మికి సంగీతంపై ఉన్న అభిలాషను గమనించిన తల్లిదండ్రులు తన 9వ ఏట రాజమండ్రిలోని సంగీత విద్వాంసులు అల్లు పోతయ్య దగ్గర సంగీత శిక్షణలో చేర్పించారు. సంగీత సాధనచేస్తూ వయోలిన్‌పై పట్టు సాధించింది. తన 17వ ఏట ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో క్యాజువల్ ఆర్టిస్ట్‌గా ఎంపికైంది. ఎ.ఐ.ఆర్‌లో ఉద్యోగం నిర్వహిస్తూ సంగీత విద్వాంసులు ఎ.కె.సి నటరాజన్, చల్లా సిస్టర్స్ గాత్రసభలో వాయొలిన్ విద్వాంసురాలిగా సుబ్బలక్ష్మి వ్యవహరించేంది. ఆంధ్రా విశ్వవిద్యాలయం నుంచి పిజి చేసిన ఆమెకు 1972వ సంవత్సరంలో తెనాలికి చెందిన డాక్టర్ వ్యాకరణం వెంకట్రావుతో వివాహమైంది. తెనాలి జె.ఎం.జె మహిళా కళాశాలలో లెక్చరర్‌గా అప్పటికే ఆమె పనిచేస్తున్నారు.

వృత్తిరీత్యా అధ్యాపకురాలైన ప్రవృత్తిగా ఎంచుకున్న సంగీతాన్ని మాత్రం ఆమె విడవలేదు. సాధన చేస్తూనే అవకాశమున్న ప్రతిసారి ప్రదర్శనలు ఇస్తూ ఎన్నో గౌరవాలు పొందారు. రాష్ట్రంలోనూ, రాష్ట్రేతర ప్రాంతాల్లో కూడా విమర్శకుల ప్రశంసలు సైతం ఆమె సొంతమయ్యాయి. సంగీతం పట్ల అభిరుచి ఉండి, పట్టుదలతో కృషిచేస్తే ఉన్నతికి చేరుకోవడం సాధ్యమేనని సుబ్బలక్ష్మి విశ్వాసం వ్యక్తం చేస్తారు. తాను నేర్చుకున్న విద్యను పలువురికి పంచడం ద్వారా మరింత పరిణతి పొందవచ్చనేది ఆమె నమ్మకం. ఎంతో మంది ఔత్సాహికులకు సంగీతంలో శిక్షణ ఇస్తున్నారు. అంతటితో ఆగకుండా సరిగమల సాధన చేసిన వారిని ప్రభుత్వ పరీక్షలకు కూడా హాజరుపరుస్తారు. రసజగత్తులో ఒలలాడే శ్రోతలను ఆ తదాత్మ్యం భావనలోనే ఉంచగలిగితే నేర్చుకున్న విద్యకు సార్థకత అని చెప్పే సుబ్బలక్ష్మి ఇప్పటివరకు ఎన్నో పురస్కారాలు అందుకున్నారు.

★ ఆంధ్రాప్రదేశ్ మ్యూజిక్ అకాడమీ నుంచి 1982వ సంవత్సరంలో ప్రతిభావంతురాలైన వయొలినిస్ట్‌గా గుర్తింపు.

★ జె.ఎం.జె మహిళా కళాశాల నుంచి గాన కోకిల బిరుదు.

★ త్యాగరాజ సంగీత ఉత్సవాల్లో ఎన్నో పురస్కారాలు.

★ తెనాలిలో 2004లో గాంధీజయంతి సందర్భంగా శాస్త్రీయ సంగీత కళాకారిణి పురస్కారం.

★ సాహితీ సాంస్కృతిక సమితి నుంచి ఉత్తమ శాస్త్రీయ సంగీత కళాకారిణిగా ఉగాది పురస్కారం.



సుబ్బలక్ష్మి దంపతులు



సంగీత శిక్షణ ఇస్తున్న సుబ్బలక్ష్మి



# పల్నాడులో కమ్యూనిస్టుల ప్రాభవం



పల్నాడు భౌగోళిక చిత్ర పటం

(బి.నరసింహారావు , మేజర్‌న్యూస్ , పిడుగురాళ్ల)

భూమికోసం...భుక్తికోసం...శ్రామిక ప్రజల విముక్తి కోసం...నిరంతరం ఉద్యమాలు చేసే వామపక్షాలు పల్నాడులో తమ ఉనికిని చాటుకు న్నారు. పోరాటాల పురిటిగడ్డ పల్నాడు. నమ్మిన సిద్ధాంతాల కోసం, ప్రజా చైతన్యం కోసం అహరహం శ్రమించి పల్నాటి ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ ఉద్యమానికి ఊపి రి పోయడం ద్వారా కోలా సుబ్బారెడ్డి ,మందపాటి నాగిరెడ్డి ప్రజా పోరా టాల వీరులుగా పేరు పొందారు. స్వాతంత్రం వచ్చిన తొలిరోజుల్లో పల్నాట వీరి పట్ల మంచి క్రేజ్ వుం డేది.దీనితోనే సుబ్బారెడ్డి ఒకసారి, నాగిరెడ్డి రెండ మార్లు శాసనసభకు ఎన్నికయ్యారు. కమ్యూనిస్ట్ పార్టీకి, ఉద్యమాలకు జవజీవాలు కల్పించారు. 1943 సంవత్సరంలో పల్నాడు ప్రాంతంలోకి భారత కమ్యూనిస్టు పార్టీ ప్రవేశించింది. 1944 సంవత్సరంలో దాచేపల్లి మండలం రామాపురం గ్రామంలో పల్నాడు ఏరియా కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహాసభ జరిగింది. ఈ మహాసభలో కోలా సుబ్బారెడ్డిని కార్యదర్శిగా ఎన్నుకున్నారు. పల్నాడు ప్రాంతంలో కమ్యూ నిస్టు పార్టీ నిర్మాణంలో కాత్రపాడు గ్రామానికి చెందిన కనుమూరి పర బ్రహ్మ రాజు , ఇరికేపల్లి గ్రామా నికి చెందిన మందపాటి నాగిరెడ్డి, దాచేపల్లి గ్రామానికి చెందిన కోలా సుబ్బా రెడ్డి ముఖ్యులు. 1945 సంవ త్సరంలో 'మాభూమి' నాటకం గ్రామగ్రామాలలో ప్రదర్శించారు. మా భూమి నాటకం నాటి భూస్వామ్య, కులపెత్తందారులకు వ్యతిరేకంగా వుండి, మానవులందరూ ఒక్కటేనని చెప్తుంది....

మిగతా 108వపేజీలో

# పాల సపోటాలు.. కేరాఫ్ చిలువూరు

నల్లబాటి మధుబాబు, మేజర్‌న్యూస్, దుగ్గిరాల.

నోరూరించే సపోటాలకు దుగ్గిరాల మండలంలో చిలువూరు గ్రామం పెట్టింది పేరు. జిల్లాలోనే కాకుండా రాష్ట్రంలోనే ప్రసిద్ధిగాంచింది. చిలువూరు పరిసర గ్రామాల్లో సుమారు 30 వేల ఎకరాలు సపోటా తోటలు ఉన్నాయి. మెట్ట పంటలైన సపోటా సాగులాభసాటిగా ఉండడంతో ఇటీవల కాలంలో సక్రమంగా అందే మాగాళ్లలో సాగుచేస్తున్నారు. మొక్క దశ నుంచి 8 ఏళ్ళ కాలంలో సపోటాలు కోతకు వస్తాయి. ఈ గ్రామంలోనే కాకుండా చుట్టూ ఉండే పరిసర గ్రామాల్లో కూడా సపోటా సాగుచేస్తున్నారు. ఎకరానికి రూ.3 వేలు ఖర్చుపెట్టినా రూ.15 నుంచి రూ.20 వేల వరకు తోటలు కౌలు ధర పలుకుతుంది. ఇక్కడ నుండి రాష్ట్రంలో హైదరాబాద్, విజయవాడ, సూర్యాపేట పట్టణాలకు సపోటా సాగుచేస్తున్నారు. ఒక్క చిలువూరులోనే 1500 మందికి పైగా కూలీ రైతులు సపోటా తోటలపై ఆధారపడి జీవిస్తున్నారు. ఈ సపోటాలను రెండు విడతలుగా కోస్తుంటారు. మొదటి విడత ఫిబ్రవరి నెలాఖరు నుంచి జూన్ వరకు, రెండవ విడత డిసెంబర్ నుంచి జనవరి వరకు కోస్తారు. ఈ విధంగా ఆరు పర్యాయాలు సపోటాలను కోసి ఎగుమతి చేస్తారు. సీజన్ బట్టి ప్రతిరోజు ఎకరానికి 50 నుంచి 150 బస్తాల వరకు కోత కోస్తూంటారు. రైతులకు ఎగుమతికి సరైన సదుపాయాలు లేకపోవడంతో దళారుల పైనే ఆధారపడాల్సి వస్తుంది. పట్టణాల్లో భారీగా ధర పలికే సపోటాలను అతి తక్కువ ధరకు రైతు అమ్ముకోవాల్సి వస్తుంది. గ్రామంలో సపోటా విస్తీర్ణం ఉన్నప్పటికీ రైతులు అమ్ముకునేందుకు మార్కెట్‌లు లేకపోవడం పెద్ద లోటుగా కనిపిస్తుంది.



సపోటా తోట

# పల్నాడులో కమ్యూనిస్టుల ప్రాభవం

(107వ పేజీ తరువాయి)

ఈ నాటకంలో పాత్రదారులందరూ అగ్రకులాలకు చెందినవారే. 1940 దశకంలో బి.సి, ఎస్.సి, ఎస్.టి కులాలవారిని అంటరానివారిగా చూసేవారు. మాభూమి నాటకంలో ప్రధాన కథానాయిక, నాయకుని పాత్రల్లో కనుమూరి కమలమ్మ, మందపాటి నాగిరెడి, మిగిలిన పాత్రలు దాచేపల్లికి చెందిన బొడ్డ నాగమల్లయ్య, గామాలపాడుకు చెందిన గుమ్మా రాయకోటయ్య పోషించేవారు. ఆకాలంలో కమ్యూనిస్టుపార్టీ కిష్టయ్య, లక్షణాచారి, సన్నెగండ్ల మస్తాన్‌లతో 'బుర్రకథ' దళం ఏర్పాటు చేసి కార్మిక, కర్షక రాజ్యం కావాలని, అంటరానితనాన్ని రూపుమాపాలని, కులపీడన నశించాలని, పేద ప్రజలకు జరిగే శ్రమదోపిడీ అరికట్టాలని గ్రామగ్రామాన బుర్రకథల ద్వారా ప్రచారం చేసేవారు. భూస్వాములు, వ్యాపారులు వాలంటీర్లకు శిక్షణ' ఇచ్చారు. తెలంగాణా ఉద్యమానికి అండగా పల్నాడు కమ్యూనిస్టుపార్టీ, ఆర్థికంగాను, కార్యకర్తలను పంపి వారికి తోడ్పాటునిచ్చింది. పల్నాడు ప్రాంతంలో కరువు ఏర్పడితే కమ్యూనిస్టుపార్టీ గురజాల, దాచేపల్లిలలో గంజికేంద్రాలు ఏర్పాటు చేసి పేద, బడుగు ప్రజలను కరువు బారి నుండి కాపాడింది.

1948-50 సంవత్సరాలలో కమ్యూనిస్టుపార్టీలు కార్యకర్తలు మందపాటి నాగిరెడి, కోలా సుబ్బారెడ్డి, మందపాటి అప్పిరెడ్డి, కోలా రామకృష్ణారెడ్డి, ఎలియా స్రాము, చల్లాగుర్వారెడ్డి, బండ్ల ఆదాం, బత్తుల ఏసు, అజాద్‌ఖాన్ , అసన్‌ఖాన్, దామరడచర్ల అప్పయ్య, నల్లబోయి భద్రయ్య, బత్తుల కోటయ్య, ఏకాంబరం, సన్నెగండ్ల మస్తాన్, సన్నెగండ్ల మాదిగ ఎల్లమంద, గుమ్మారామకోటయ్య, చింతల శ్రీరాములు, రెంటపాళ్ల మస్తానరావు, మస్తాన్ రెడ్డి, సత్తెనపల్లి లక్ష్మయ్య, రెంటపాళ్ల రామకోటయ్య, దాచేపల్లి షేక్‌రసూలు, వినుకొండకు చెందిన నడిగడ్డ వెంకటప్పయ్య, నడిగడ్డ ఆంజనేయులు తదితరులు కారంపూడి, వినుకొండ మధ్యగల అడవులలో అజ్ఞాతజీవితం గడిపి దళాలుగా ఏర్పడి సాయుదపోరాటాలు నిర్వహించారు.

ఈ దళాలకు రేమిడిచర్లకు చెందిన ఆరికట్ల సుబ్బారెడ్డి నాయకుడుగా, చెరుకుల నర్సిరెడ్డి ఉపనాయకుడుగా ఉన్నారు. నాడు గ్రామంలో సాయుధ దళాలకు గ్రామాలలోని యువకులు అండగా ఉండి వారికి కావలసిన వసతులు సమకూర్చుతూ, గ్రామాలలో జరిగే హింసలకు, అరాచకాలకు వ్యతిరేకంగా రైతాంగ ఉద్యమాలలో ప్రముఖమైన పాత్రను వహించారు.

1950వ సంవత్సరంలో సాయుధపోరాటంలో పాల్గొన్న మందపాటి నాగిరెడ్డి, కనుమూరి పర బ్రహ్మరాజులను అరెస్టు చేసి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని కడలూరు జైలులో పెట్టారు. జైలులో ఖైదీలను హింసించే విధానానికి వ్యతిరేకంగా జైలులో మందపాటి నాగిరెడ్డి 29 రోజులు సత్యాగ్రహం చేశారు.

పల్నాడు ప్రాంతంలో గ్రామాలలో ఉండి సాయుధదళాలకు సమాచారం, భోజనాలు అందజేస్తున్నారని ఆకూరి కిచ్చారెడ్డి, తంగెడ జానకమ్మ, దాసరి కోటయ్య, గడ్డం హుస్సేన్, మారాసు నాసరయ్య, షేక్ అబ్దుల్ రసూలీ, గోళ్ల మూడి నారాయణ, గుర్రం నాగయ్య, గుర్రం కోటయ్య, ఉప్పు రాజిరెడ్డి, భీమనాధుల వీరారెడ్డిలను నల్గొండ జిల్లాలో కృష్ణానది ఒడ్డున ఇరుక్కు గూడెం ప్రాంతంలో తుపాకులతో కాల్చి చంపారు ( ఈ అమర వీరుల పేరుతో నారాయణపురంలో మృతవీరుల స్థూపం ఉన్నది). వీరితో పాటు కర్నాటి కోటిరెడ్డిని హింసించి వదిలిపెట్టారు. తుమృకోట పారెస్టు బంజరు ఆక్రమణ జరిగింది.

ఈ కేసులో దాదాపు 90 మందిని నెల్లూరు జైలుకు పంపారు. రుక్మిణిపురం, సీతారామపురం క్వారీల మధ్య ఫారెస్టు బంజరు ఆక్రమణ జరిగింది.

ఈ బంజరు ఆక్రమణలో వందలమందిని రెండుసార్లు అరెస్టులు చేశారు. అదనపు భూమిశిస్తు రద్దుకోరుతూ వేలాదిమంది గురజాల తాలూకా కార్యాలయం వద్ద నెల రోజులుపాటు పికెటింగ్‌లు చేయగా వందలాది మందిని అరెస్టు చేశారు. భారతదేశానికి స్వాతంత్రం వచ్చిన తరువాత 1952లో అసెంబ్లీ ఎన్నికలు జరుగగా పల్నాడు అసెంబ్లీ నియోజకవర్గం నుండి కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థిగా కోలా సుబ్బారెడ్డి గెలు పొందారు.

1955లో మాచర్ల నియోజకవర్గం నుండి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా మందపాటి నాగిరెడ్డి గెలుపొందారు. పల్నాడు ప్రాంతంలో మొట్టమొదటిసారిగా చారు మజుందార్ నాయకత్వంలో గుత్తికొండ బిలం వద్ద కమ్యూనిస్టుల రహస్య సమావేశం జరిగింది.



# విశ్వవిఖ్యాతమైన నాగార్జునకొండ



బి.రామూర్తి
మేజర్‌న్యూస్, వి.పి. సౌత్

ప్రపంచంలోనే రెండవ ఐలాండ్ మ్యూజియం అయిన నాగార్జున కొండ మ్యూజియంకు ఎంతో విశిష్టత ఉంది. కృష్ణానది మధ్యలోనే ఒక చిన్న పర్వతంపై నిర్మించిన ఈ మ్యూజియం చేరుకోవాలంటే విజయపురిసౌత్ లాంచీ స్టేషన్ నుంచి లాంచీలపై ప్రయాణం చేసి వెళ్ళాలి. సరిగా 12 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఈ మ్యూజియంకు ప్రయాణం చేయటం ఒక మధురానుభూతి. హోరుమనే శబ్ధాలతో మంగళ గీతాలు ఆలపిస్తున్నట్లు ఉండే సాగర్ జలాశయపు అలలు చుట్టూ నీలికొండలు వాటి అంచున వేలాడుతున్నట్లు ఉండే వినీలాకాశం.. మనస్సును ఆహ్లాదపరుస్తాయి. నాగార్జున కొండ మ్యూజియం వాతావరణం బౌద్ధమత వ్యాప్తిలో ఉందంటే దానికి ప్రధాన కారకుడు ఆచార్య నాగార్జునుడే బౌద్ధమతానికి జీవం పోసిన మేధావి. ఆయన క్రీస్తు పూర్వం 2 శతాబ్ధంలో బౌద్ధ సంస్కృతి పరివ్యాప్తం అయింది. ఇక్ష్వాక రాజుల ఆదరణతో వెలుగులోకి వచ్చిన ఆచార్య నాగార్జునుడు మహాయాన సిద్ధాంత ప్రవక్తగా కీర్తి గడించారు. నాగార్జున కొండకు పూర్వం శ్రీ పర్వతం అనే పేరు ఉండేది. ఇక్ష్వాకులు శత్రు దేశాలతో యుద్ధాలు చేస్తూ ఎప్పుడు విజయంతో తిరిగి వచ్చేవారు. విజయాలకు విజేతలకు నిలయం కనుక శ్రీ పర్వతాన్ని విజయపురి అని పిలిచేవారు. ఆనాడు ఇక్కడ మహాస్థూపం బౌద్ధారామాలు వెలిశాయి. 1926లో ఆర్కియాలజిస్ట్ ఎ.ఆర్. సరస్వతి నాగార్జున కొండపై త్రవ్వకాలు జరిపించాడు. 1931 వరకు జరిపిన తవ్వకాల్లో స్థూపాలు, విహారాలు శిలఫలాకాలు బయటపడ్డాయి. 1954-60 మధ్యకాలంలో విస్తారంగా సాగిన తవ్వకాల్లో వైదిక మత నిర్మాణాలు, నివాస గృహాలు, మానవుల అవశేషాలు బయటపడ్డాయి. ఇవేకాక అప్పటి మానవులు వాడే లోహపు పాత్రలు, మట్టి పాత్రలు రాతి ఆయుధాలు బయట పడగా శిధిలావశేషాలలో కొన్నింటిని యధాతదంగా మూల ద్రవ్యాలతో ఈ కొండపై పునర్ నిర్మించే ప్రయత్నం జరిగాయి. త్రవ్వకాల నుంచి ఇతరత్రా లభ్యమైన అవశేషాలను ఈ మ్యూజియంలో భద్రపరిచారు. మొత్తం నాలుగు భాగాలుగా మ్యూజియంలో ప్రదర్శనా వస్తులుంటాయి. మొదటి భాగంలో విశిష్ట వస్తువులు అంటే బంగారు అభరాణాలు, నాణేలు, రేతు కరకండిలు, పూసలు, గాజులు, చలువరాతి శిల్పాలు బుద్ధదేవుని నిలువెత్తు విగ్రహం శిల్ప ఫలకాలు రాతియుగం నాటి సాధనాలు ఉంటాయి. రెండవభాగంలో పూర్వ స్థూపాలంకారంలో వినియోగించిన బుద్ధదేవుని జీవన సన్నివేశాలు జాతక కథలు చలువరాతి శిలా ఫలకాలు, ఇక్ష్వాకుల కాలం నాటి ప్రత్యేక చిహ్నాలు ఏర్పాటు చేశారు. మూడవ భాగంలో భూమి పై జలాంతర్గమైన లోయ ప్రతిరూపం మధ్య పేటికలలో సూక్ష్మంగా తయారు చేసిన ఖనిజ సాధనముల ప్రతి రూపాలు ఉన్నాయి. ఇవన్నీ సాగర్ జలాశయంలో మునిగిపోకుండా ఉండేందుకు పురాతత్వ శాఖ తవ్వకాలు జరిపి 23 చదరపు మీటర్ల వైశాల్యంలో కొండపై మ్యూజియం నిర్మించి వస్తువులను గాజు పెట్టెలలో భద్రపర్చారు. ఇన్ని నాగరికతలు ఒకే స్థలంలో వర్ధిల్లడం అరుదు. అదే ఇక్కడ ప్రత్యేకత. ఈ మ్యూజియానికి ప్రతిరోజు వందల మంది యాత్రీకులు వస్తుంటారు. చైనా, జపాన్, టిబెట్, బూటాన్ తదితర దేశాలనుండి వచ్చే భక్తులు ఈ మ్యూజియంను తిలకించేందుకు ఎంతో ఆసక్తిని కనబరుస్తారు. 1982లో బూటాన్ రాజు జిగ్మే సింగ్‌మే వాంగ్‌చుక్ భారత ప్రభుత్వం ఆహ్వానం మేరకు విచ్చేయగా 2006లో టిబెట్ మత గురువు 12వ దలైలామా మ్యూజియంను సందర్శించి ప్రత్యేక ప్రార్ధనలు జరిపారు. ఆయన రాగానే ఇక్కడ నేలను ముద్దాడి బోధ వక్షాన్ని నాటి వెళ్ళారు. కొంత మట్టిని తనతో పాటు తీసుకొని వెళ్ళారు. అనుపు ప్రాంతంలో ఎంతో మంది ప్రముఖులు, మంత్రులు, గవర్నర్లు, హైకోర్టు న్యాయమూర్తులు వివిధ మత గురువులు దేశ విదేశాల నుండి నాగార్జున కొండ మ్యూజియంను సందర్శిస్తారు. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన రెండవ ఐలాండ్ మ్యూజియం అయిన నాగార్జున కొండ మ్యూజియానికి దేశ, విదేశాల్లో మంచి పేరు ప్రతిష్టలు ఉన్నాయి. గత ఏడాది పురావస్తు పరిశోధనలో భాగంగా ప్రస్తుత భారత ప్రధాని మన్మోహన్‌సింగ్ నాగార్జునకొండ మ్యూజియం సందర్శించి వాటి వివరాలను తెలుసుకునేందుకు రెండు రోజుల పాటు ఉన్నారు. ఆర్కియాలజి చదివే విద్యార్థిని, విద్యార్థులకు ఈ మ్యూజియంలోని వస్తు సంపద వివరాలు బాగా తోడ్పతాయి. 1966 ఏప్రియల్ 23న అప్పటి కేంద్రమంత్రి యం.సి చాగ్లీ చేతులమీదుగా ప్రారంభమైన నాగార్జున కొండ మ్యూజియంలో గడపడం మధురానుభూతి.

# జాతీయోద్యమంలో జిల్లా మహిళలు

కె.[illegible], మేజర్ న్యూస్, గుంటూరు ఎడ్యుకేషన్.

దేశ స్వాతంత్ర్యోద్యమంలో పురుషులతో తాము ఏవిధంగానూ తీసిపోమని భారత మహిళలు రుజువు చేస్తే, గుంటూరు జిల్లా మహిళలు స్వరాజ్య సమరంలో అగ్రగామిగా నిలిచి బ్రిటిష్ వారిని గడగడలాడించి గుంటూరు జిల్లా కీర్తి ప్రతిష్టలను ఇనుమడింపచేశారు.

సహాయ నిరాకరణ చేపట్టినా, సత్యాగ్రహం తలపెట్టినా, హరిజనోద్ధరణ సాగించినా, కల్లుపాకల ముందు పికెటింగ్ చేసినా, విదేశీ వస్తువులను బహిష్కరించినా, ఖాదీని ఒక ఉద్యమంగా నడిపినా... అన్నింట్లో తాము కూడా భాగస్వాములై...జైలుకు వెళ్ళడమంటే తమ పుట్టింటికి వెళ్ళినంత సంబరంగా బయలుదేరి వెళ్ళిన మహిళల్లో ఉన్నవ లక్ష్మీబాయమ్మ, గోళ్ళమూడి రత్నమ్మ, తుమ్మల దుర్గాంబ, పాదర్తి సుందరమ్మ, కొండా అలివేలుమంగ సత్యవతమ్మ, భారతీదేవి రంగా, కొల్లా కనకవల్లీ తాయారు, కాట్రగడ్డ రామసీతమ్మ, కట్టా వెంకట నరసమ్మ, మైనేని బసవపూర్ణమ్మదేవి వంటి వారు జిల్లాకే గర్వకారణంగా నిలిచారు. వారి వివరాలను పరిశీలిస్తే...

## ఉన్నవ లక్ష్మీ బాయమ్మ

అది 1921, జులై 22వ తేదీ. భారత స్వాతంత్ర్యోద్యమం ఉధృతంగా సాగుతున్న రోజులవి. ఆనాడు గుంటూరు రైల్వేస్టేషన్ ఇసుక వేస్తే రాలనంత జనసందోహంతో కిక్కిరిసి వుంది. ఆ జనసందోహం మధ్య ఖద్దరు వస్త్రాలతో ప్రత్యేకంగా కని పిస్తున్న దొక వీరనారి. ఒక చేతిలో త్రివర్ణపతాకం, మరోచేతిలో పూల మాల ధరించి ప్లాట్‌ఫారంపై నిలిచి వుంది. ఇంతలో రైలు వచ్చింది... రాయవెల్లూరు సెంట్రల్ జైలుకు పోలీసు కస్టడీలో తరలి వెళ్తున్న మహా నాయకులు తలుపు దక్కరకు వచ్చారు. ఆకాశం దద్దరిల్లేటట్లు జయజయ ధ్వానాలు మిన్నుముట్టాయి. పోలీసుల పహరీలోనే ప్లాట్‌ఫారంపై అడుగు పెట్టిన ఆ నాయకుడి మెడలో పూల మాల వేసి వీరతిలకం దిద్దిందా వీర నారి.

"మీ శరీరంలో సగభాగానికే ఆంగ్లేయులు కారాగారవాస శిక్ష విధించారు. మీరు నడిపిన ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళడానికి మీ భార్యగా నాకు అనుమతివ్వండి" అంటూ ముందుకురికిన వీరపత్నే శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ. అడవి పుల్లరి సత్యాగ్రహ నేతగా, మాలపల్లి వంటి ఉత్తమ నవలా రచయితగా, వితంతు వివాహాలను, హరిజనోద్ధరణను చేపట్టిన సంఘసంస్కర్తగా ప్రఖ్యాతుడైన ఉన్నవ లక్ష్మీనారాయణ ధర్మపత్ని ఆమె. ఒక వ్యక్తిగా కాకుండా ఒక శక్తిగా వెలుగొందింది. తాము స్థాపించిన శ్రీ శారదానికేతనం విద్యార్థినిలే సమరసైనికులై వెంటరాగా, జాతీయోద్యమంలో అడుగుపెట్టిన సంగం లక్ష్మీబాయమ్మ, నడింపల్లి సుందరమ్మ, మజుందారు సావిత్రి, దురాభవాని వంటి వారు తోడు రాగా రణరంగంలోకి ఉరికిన అపర ఝాన్సీ రాణి ఆమె. అలా రైల్వే స్టేషన్లో హూంకరించిన ఆమె త్రివర్ణ పతాకం చేతబూని గ్రామగ్రామాలు తిరిగి జాతీయోద్యమ ప్రచారం సాగించారు.

కల్లు దుకాణాల ముందు, విదేశీ వస్త్ర విక్రయ కేంద్రాల ముందు పికెటింగ్‌లు నిర్వహించారు. ఉప్పు వండి ఆ వండిన ఉప్పును అమ్మించి శాసన ధిక్కారం చేశారు. 1930, జూన్ 9వ తేదీన దేవరంపాడులో ఆమెను పోలీసులు అరెస్టు చేసి ఆరు నెలలు శిక్ష విధించి రాయవెల్లూరు జైలుకు తరలించారు. అనేక మంది మహిళలను, విద్యార్థినులను ప్రభావితం చేసి ఉద్యమ బాటలో నడిపించిన ధీశాలి. స్త్రీలకు విద్య అవసరమని, దాని వల్లనే సమాజంలో మూఢాచారాలు రూపమాసి పోగల వని ఎలుగెత్తి చాటారామె. ఈ దిశ లోనే గుంటూరు బ్రాడిపేటలో శ్రీ శారదానికేతనం నెలకొల్పి స్త్రీ విద్యకు ఓంకారం పలికారు. తన నేతత్వంలో ఎన్నో ఉద్యమాలు నడపటమే కాకుండా సంగం లక్ష్మీబాయమ్మ, బసవ రాజు రాజ్యలక్ష్మమ్మ, భారతీదేవిరంగా వంటి నాయకురాళ్ళను తీర్చిదిద్దిన మహిళామణి ఉన్నవ లక్ష్మీబాయ మ్మ. 1952 ఫిబ్రవరి 29వ తేదీన తాను బిడ్డలుగా పెంచుకున్న విద్యార్థినుల మధ్య కన్ను మూశారు.

## గోళ్ళమూడి రత్నమ్మ

స్వాతంత్ర్యోద్యమంలో కీలకపాత్ర పోషించడమే కాకుండా స్త్రీవిద్యావ్యాప్తికి విశేషంగా కషి చేసిన మరో మహిళామణి గోళ్ళమూడి రత్నమ్మ. ఉన్నవ లక్ష్మీబాయమ్మ ఉపన్యాసాలకు ప్రభావితమైన ఆమె ఖాదీ ధరించి తమ గ్రామమైన చేబ్రోలులోని స్త్రీలందరిని సమాయత్తపరిచి దుకాణాల వద్ద పికెటింగ్ చేయిస్తూ అనేక సార్లు అరెస్టయ్యారు. భారతీదేవి రంగాతో కలిసి పొన్నూరు, బాపట్ల, చీరాల,

(మిగతాది 110వ పేజిలో)

# జాతీయోద్యమంలో జిల్లా మహిళలు

(109వ పేజీ తరువాయి)

తెనాలి మొదలైన అనేక ప్రాంతాలలో విస్తతంగా ప్రచారం చేశారు. రెండు సార్లు జిల్లా బోర్డు సభ్యురాలిగా ఎన్నికై జిల్లాకు సేవలందించారు. స్త్రీ విద్యావ్యాప్తి కోసం చేబ్రోలులో గ్రంధాలయం, హిందీ విద్యాలయం స్థాపించారు. ఆ తరువాత రోజుల్లో ఆధ్యాత్మిక విషయాలతో కాలం గడుపుతూ 1972 జులై 5న స్వర్గస్థురాలయ్యారు రత్నమ్మ.ఎన్నికై జిల్లాకు సేవలందించారు. స్త్రీ విద్యావ్యాప్తి కోసం చేబ్రోలులో గ్రంధాలయం, హిందీ విద్యాలయం స్థాపించారు. ఆ తరువాత రోజుల్లో ఆధ్యాత్మిక విషయాలతో కాలం గడుపుతూ 1972 జులై 5న రత్నమ్మను బిడ్డలుగా పెంచుకున్న విద్యార్థినుల మధ్యనే ప్రశాంతంగా కన్ను మూశారు.










## తుమ్మల దుర్గాంబ

తెనాలి తాలూకా తురుమెళ్ళ గ్రామంలో 1907లో జన్మించిన తుమ్మల దుర్గాంబకు గాంధీజీ సాక్షాత్తూ భగవదాంశ సంభూతుడే. అందుకే గాంధీజీ సబర్మతీ ఆశ్రమాన్ని పోలిన ఆశ్రమాన్ని భర్త బసవయ్య సహకారంతో 1933 డిసెంబరు 12న కావూరులో 'వినయాశ్రమం' పేరుతో ఆశ్రమాన్ని స్థాపించారు. దానిని బాపూజీ స్వయంగా ప్రారంభించటం విశేషం. ఉప్పు సత్యాగ్రహంలో ఆమె 1930, 1932 లో రెండుసార్లు జైలు శిక్ష అనుభవించారు. ఆమె ప్రధానంగా హరిజనోద్ధరణకు విశేషంగా పాటుబడ్డారు. అఖిలభారత హరిజన సేవాసంఘ సమావేశం వినయాశ్రమంలో నిర్వహించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా ఆమె 1942లో అరెస్టై 16 నెలలు జైలు శిక్ష అనుభవించారు. ఆమె కావూరులో 1923లో నెలకొల్పిన శ్రీతిలక్ జాతీయ పాఠశాల నేటికీ బాలబాలికలు విద్యనందిస్తోంది.

## పాదర్తి సుందరమ్మ

శాసనధిక్కారం సాగిస్తూ, తన వెంట నీడలా వచ్చే రహస్య పోలీసుల కన్ను కప్పి ఎలాంటి ప్రదేశంలోకైనా నిర్భయంగా ప్రవేశించే నైపుణ్యం సుందరమ్మ సొంతం. 1920లోనే గాంధీజీ ఉపన్యాసాలకు ప్రభావితమైన ఆమె ఖాదీ ఉద్యమం, విదేశీ వస్తు బహిష్కరణ వంటి కార్యక్రమాలలో పాల్గొన్నారు. కాలేజీ విద్యార్థులందరినీ ఉద్యమబాటలోకి నడిపించిన ధైర్యశాలి ఆమె. ఎప్పుడు... ఎక్కడ...ఏ వేషంలో తిరుగుతుందో తెలీకుండా పోలీసులను తికమకపెట్టేవారామె. 1932లో శాసనలోల్లంఘన చేస్తూ అరెస్టై కారాగారవాసం గడిపారు. 1934లో విజయవాడ పురపాలక సంఘ సభ్యురాలిగా ఏకగ్రీవంగా ఎన్నికై దాదాపు 18 సంవత్సరాలు ఆ పదవిలో కొనసాగి ఆడపిల్లల విద్యావ్యాప్తి కోసం శ్రమించారు.

## కొండా అలివేలుమంగ సత్యవతమ్మ

తన 12వ ఏటనే భర్తను, 14వ ఏట తలిదండ్రులను కోల్పోయి బంధువుల పంచన చేరి స్వాతంత్ర్యోద్యమంలో చేరి మహిళాభివృద్ధికి కృషి చేసిన ధీర యువతి సత్యవతమ్మ. ఉప్పు సత్యాగ్రహంలో 18వ ఏటనే అరెస్టై జైలు పాలైంది. తరువాత పికెంటింగ్ చేస్తూ తిరిగి జైలు శిక్ష అనుభవించింది. నర్సరావుపేట తాలూకా రూపెనగుంట్లలో జన్మించిన సత్యవతమ్మ 1932వ సంవత్సరంలో గాంధీ- ఇర్విన్ ఒడంబడిక రద్దు కాగానే జరిగిన శాసనోల్లంఘన కార్యక్రమంలో చురుగ్గా పాల్గొన్నారు. పోలీసుల కళ్ళు కప్పి పగలంతా భజనలతో గడిపి, తెల్లవారుఝామున పోలీసుల కనుమరుగు కాగానే అంత వరకూ భక్తుల రూపంలో వున్న దేశభక్తులతో బహిరంగ సభ, చర్చలు జరిపి, తరువాత ఊరేగింపు నిర్వహించిన ధీశాలిగా ఆనాడే ఆమె పేరు పొందింది. ఈ కారణంగానే తిరిగి ఆమెకు జైలు శిక్ష తప్పలేదు. మహిళాభివృద్ధికి ఎనలేని సేవలందించారు సత్య వతమ్మ.

## భారతీదేవి రంగా

బాపట్ల తాలూకా మాచవరంలో జన్మించిన ఆమె నిడుబ్రోలులోని గోగినేని రంగా (ఆచార్య రంగా)తో వివాహం కాగానే భర్తతో కలిసి రైతు ఉద్యమాలలో చురుగ్గా పాల్గొన్నారు. దేశ విదేశాల్లో విద్యనభ్యసించి అశేష అనుభవం గడించిన ఆమె మహిళాభ్యుదయం కోసం తెనాలిలో మహిళా విభాగం ప్రారంభించారు. తరువాత అనేక ఉద్యమ కార్యక్రమాలకు నాయకత్వం వహించి జైలు శిక్ష కూడా అనుభవించారు. రైతుల కుటుంబాల్లో స్త్రీల సంక్షేమం కోసం ఉద్యమా లను నిర్వహించారు.

మహిళలకు రాజకీయ పాఠశాలలు నిర్వహించి చైతన్యవంతులను చేశారు. బహుముఖ సేవాపరాయణకు చిరునామాగా వున్న భారతీదేవి రంగా 1972 సెప్టెంబరు 64వ ఏట మరణించారు.

# బడుగు బలహీన వర్గాల అభివృద్ధికి కృషి

## మోపిదేవి శ్రీనివాసరావు



క్రీడాకారులకు బహుమతి ప్రధానం చేస్తున్న మోపిదేవి శ్రీనివాసరావు

డి.వి.ఎన్.జగదీష్‌బాబు,
మేజర్ న్యూస్, రేపల్లె

నేటి సమాజ సేవా కార్యక్రమాలు చేపడుతూ యువతకు ఆదర్శంగా నిలుస్తున్న వ్యక్తి ప్రముఖ వ్యాపారవేత్త సీనియర్‌టిడిపి నాయకులు మోపిదేవి శ్రీనివాసరావు. ఆయన పార్టీపై అభిమానంతో పార్టీలోకి ప్రవేశించి ఎంతో కాలంగా టిడిపి అధ్వర్యంలో జరిగే ప్రతి కార్యక్రమంలో పాల్గొంటూ తనవంతు సహకారమందిస్తూ పార్టీ ప్రతిష్టకు కృషిచేస్తున్నారు. స్థానికంగా జరిగే కార్యక్రమాలకు హాజరై తనవంతు సహాయంచేస్తూ క్రీడలపై ఆసక్తి కనబరుస్తున్న విద్యార్థుల ప్రతిభను గుర్తించి వారిని ప్రోత్సహిస్తూ, ఆర్థిక సహాయాన్ని అందచేస్తూ వారి ఎదుగుదలకు మార్గదర్శకం కావటం విశేషం. ఎవరైనా తన కుటుంబానికి గాని, రక్తసంబంధీకులకుగాని గుర్తింపుగా కార్యక్రమాలు నిర్వహిస్తారు. కానీ శ్రీనివాసరావు తన స్నేహితుడు దండమూడిసతీష్‌బాబు, తండ్రి మోపిదేవి వీరరాఘవయ్య జ్ఞాపకార్థం పార్టీలకతీతంగా భారీ కార్యక్ర మం ఏర్పాటు చేసి మహోన్నతులు, పెద్దలు, సీనియర్‌నాయకులచేతుల మీదుగా పేద ప్రజలకు లక్షలాది రూపాయలు వెచ్చించి సుమారు మూడువేల మందికి చీరల పంపిణీ చేసి తన ఔనత్యాన్ని చాటుకున్నారు. ఈకార్యక్రమ నిర్వహణకు తనకు చేదోడు వాదోడుగా వుండి పాలుపంచుకున్న తన సోదరులైనటువంటి మోపిదేవి శ్రీరామమూర్తి, మోపిదేవి చంద్రం, మోపిదేవి కోటేశ్వరరావులు పలువురికి ఆదర్శంగా నిలిచారు.

ఇలాంటి వ్యక్తి పదవులు చేపడితే ప్రజలకు సేవచేస్తారన్న భావం ప్రజలలో కలిగి, సమాజసేవకు ఒకమంచి నాయకుడు వస్తున్నాడన్న ఆలోచనలో వున్నారు. బడుగు, బలహీన, ఎస్‌సి, ఎస్టీ, బిసి, మైనార్టీలందరు ఇలాంటి వారికోసమే కదా ఎదురుచూస్తున్నది. వస్తే మంచి జరుగుతుందనే వారి నమ్మకాన్ని మనం విశ్వసిద్దాం.



చీరల పంపిణీ కార్యక్రమానికి హాజరైన పలువురు నాయకులు.




## కూనిరాగాలు

ప్రజాస్వామ్యం
ధనికస్వాముల చేతుల్లో!
స్వేచ్ఛాభారతం ఖద్దరు,
ఖాకీ చేతుల్లో!

మనిషైనా... నీడైనా
ఒకటే నమ్మకంలో!
నిజమైనా... స్వప్నమైనా
సమానమే అనుమానంతో!

మానవ సంబంధాలు
అనుసరణీయం!
ఆర్థిక సంబంధాలు
అవాంఛనీయం!

నల్లని రాళ్లను మలిస్తే కొనడానికే!
రేగడిబిళ్లను పండిస్తే తినడానికే!

- కూనిరెడ్డి శ్రీనివాస్

# మహిమాన్విత శ్రీ భీమలింగేశ్వరాలయం

ఎంఎస్ సుధాకర్, మేజర్ న్యూస్, నరసరావుపేట

నరసరావుపేట చరిత్రకు పాతూరులోని శ్రీ భీమలింగేశ్వరుని ఆలయం భక్తులు కోరిన కోర్కెలు తీర్చే మహిమాన్వితంగా నిలుస్తుంది. భీమలింగేశ్వర స్వామి చాలా శక్తివంతమైన దైవంగా ఈ ప్రాంత ప్రజలు భావిస్తారు. ఆలయ చరిత్ర పరిశీలిస్తే...

ఈ ఆలయానికి వెయ్యేళ్ళ చరిత్ర ఉంది. ఆలయ ప్రదేశంలో ఒక పూరి పాక ఉండేదని, శివలింగం ఉన్న చోట ఒక పుట్ట ఉండేదని చెబుతారు. పుట్ట ఉన్న ప్రాంతంలో ఒక మహా సర్పం సంచరించటంతో భీతిచెందిన పాక యజమాని పుట్టను తవ్వించగా, అందులోనుంచి శివలింగం బయట పడటంతో ఇక్కడ భీమలింగేశ్వర ఆలయం నిర్మించినట్లు ఆలయ చరిత్ర చెప్తుంది. ఈ ఆలయం అభివృద్ధి చెందటంలో అప్పట్లో ప్రముఖ న్యాయవాదులు కోటంరాజు వెంకన్న పంతులు, చిలకలపూడి రామస్వామి జీర్ణావస్థలో ఉన్న ఆలయాన్ని పునరుద్ధరించారు. గర్భాలయం అభిషేకాలకు ఇబ్బందిగా ఉన్నందున అక్కడ మట్టిని తవ్వించగా, దాని క్రింద మరో పానపట్టం కనిపించటం, మరికొంతలోతు తవ్వగా నీటిజల బయటపడింది. ఈ వింత చూసిన ప్రజలు తవ్వకాలు మానివేసి అగాధాన్ని పూడ్చివేశారు. ఆలయంలో మండపాన్ని కట్టించి ముఖ మండపాలను ఏర్పాటు చేశారు. ఈ ఆలయంలో అయ్యవారు మేళచెరువు రామయ్య విఘ్నేశ్వర ప్రతిష్ట చేశారు. భక్తులు, ఆర్య వైశ్యులు ఇచ్చిన విరాళాలతో, ప్రహరీ గోడ, సింహద్వారం తదితర కట్టడాలను నిర్మించారు. 1932 వరకూ దేవాలయ అభివృద్ధిని ఎవరూ పట్టించుకోలేదు. పంచాంగకర్త చింతలపాటి సుందరరామ సిద్ధాంతి నిత్య శివదర్శనం ఏర్పాటు చేశారు. 1933 లో దేవాలయ చట్టం క్రింద చేరింది. 1802 ఈనామ్ స్టేట్‌మెంట్ ప్రకారం అట్లూరి కోటంరాజు ధర్మకర్తగా ఉండేవారు. ఈ ఆలయాన్ని దేవాదాయ శాఖ ప్రజా దేవాలయంగా మార్చింది. అట్లూరి కుటుంబం నుంచి ఒక ట్రస్టీని ఎన్నుకున్నారు. 1980 నుంచి ఆలయ అభివృద్ధికి ఎందరో తమ సహాయ సహకారాలు అందిస్తున్నారు. పండుగ సమయంలో వేలాది మంది భక్తులు భీమలింగేశ్వర స్వామిని దర్శించుకుని శని దోషాలు పరిహారంచేయించుకుంటున్నారు. భీమలింగేశ్వరుని మూల విరాట్ పక్కనే రాజరాజేశ్వరి అమ్మవారు కొలిచిన వారి కొంగు బంగారమై భక్తులను అలరిస్తున్నారు. శరన్నవరాత్రులు 9 రోజులు అమ్మవారిని అలంకరిస్తారు. పట్టణ ప్రజలు అమ్మవారి వివిధ రూపాలను కొలిచి పూజిస్తారు.



భీమలింగేశ్వరునికి అర్చనలు నిర్వహిస్తున్న అర్చకస్వాములు

# ప్రజా పోలీసుగానే కొనసాగుతా

ఎన్. జగన్మోహన్‌రెడ్డి, మేజర్‌న్యూస్ నరసరావుపేట

పోలీస్ స్టేషన్‌కు వచ్చే ప్రతి బాధితుడు తనకు న్యాయం జరిగిందనే సంతృప్తితో వెళ్ళడం.. తనను ప్రజా పోలీస్‌గా చూడటం.. ఇవే తనకు అవార్డులు- రివార్డులు కంటే ఎక్కువ ఇష్టమని నరసరావుపేట పట్టణ పోలీస్ స్టేషన్‌లో సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా విధులు నిర్వహిస్తున్న దేవరకొండ ప్రసాద్ అంటున్నారు. చీరాలకు చెందిన పేద రైతు కుటుంబంలో పుట్టిన తాను సిఐగా ఎదిగేందుకు సామాన్య ప్రజలు అందించిన దీవెనలు, ప్రజా ప్రతినిధులు, అధికారుల ప్రోత్సాహం వల్ల సాధ్యం అయిందని ఆయన మేజర్ న్యూస్‌కు తెలిపారు. సమాజంలో పోలీసు వ్యవస్థపై ఉండే అపోహలన్నీ నిజాలు కావని, ఎక్కువగా, వాటిల్లో నిజాలు ఉండవని ఆయన చెప్తున్నారు. నిత్యం రాజకీయ ఉద్రిక్తతలకు, ఆందోళన కార్య క్రమాలకు, పలు అవాంఛనీయ సంఘటనలకు నిలయమైన నరసరావుపేటలో రెండున్నరేళ్ళకు పైగా వివాదాలకు అతీతంగా విధులు నిర్వహించటం ఏ పోలీసు అధికారికైనా కత్తిమీద సాము లాంటిదైనా, సిఐ ప్రసాద్ అత్యంత సమర్థవంతంగా తన విధులు నిర్వహించి పలవురి ప్రశంసలు పొందారు. ఆయన సిఐగా బాధ్యతలు స్వీకరించిన రెండు నెలల సమయంలోనే పురపాలక సంఘం ఎన్ని కలు, నీటి సంఘాల ఎన్నికలు వంటి క్లిష్టమైన సమయాలలో భద్రతా విధులు విజయవంతంగా నిర్వహించారు. మండలంలోని యల్లమంద గ్రామంలో తరతరాలుగా ఏనాడూ ఓటు హక్కు వినియోగించుకోని బలహీనవర్గాల ప్రజలు సిఐ ప్రసాద్ హయాంలో మొట్టమొదటిసారిగా నిర్భయంగా తమ ఓట్లు హక్కు వినియోగించుకోవటం, ఆ సందర్భంగా ఆయనకు బలహీనవర్గాల ప్రజలు కృతజ్ఞతలు తెలపటం పోలీసు అధికారిగా విధి నిర్వహణలో తనకు సంతప్తినిచ్చే అంశంగా చెప్తుంటారు. 2005 నవంబరు నెలలో జరిగిన అంజిబాబు హత్య కేసును అత్యంత వేగంగా రాజకీయ వివాదాలకు అతీతంగా సిఐ ప్రసాద్ ఛేదించగలిగారు.



రోటరీ క్లబ్ వారి ఘన సత్కారం పొందుతూ...



జిల్లా ఎస్‌పి నుంచి అవార్డు అందుకుంటూ...

(మిగిలింది 112వ పేజీలో)

# ప్రజా పోలీసుగానే కొనసాగుతా



దొంగనోట్ల ముఠా సభ్యులను అదుపులోకి తీసుకున్న సందర్భంలో...

(111వ పేజీ తరువాయి)

2007లో మండలంలోని పెట్లూరి వారిపాలెం గ్రామం వద్ద జరిగిన 30 లక్షల రూపాయల దోపిడీ కేసును ఛేదించి 24 లక్షల రూపాయలను ఆయన రికవరీ చేయగలిగారు. పట్టణంలో కృష్ణమూర్తి అనే వ్యక్తి ఇంట్లో జరిగిన దోపిడీలో పాల్గొన్న ముఠా సభ్యులను అదుపులోకి తీసుకోవటం ద్వారా రాష్ట్రంలో ఎటువంటి ఆధారాలు లేకుండా పోయిన 19 కేసుల గుట్టును విప్పగలిగారు. ఈ ఏడాది ఫిబ్రవరి నెలలో దొంగ నోట్ల ముఠాను అదుపులోకి తీసుకుని 30 లక్షల రూపాయల దొంగనోట్లను స్వాధీనం చేసుకున్నారు. 2004లో పట్టణ పరిధిలో 426 నేరాలు నమోదు కాగా, సిఐగా ప్రసాద్ బాధ్యతలు తీసుకున్న నాటి నుంచి 2007కు నేరాల సంఖ్య 278 కేసులకు పడిపోయింది.

### అవార్డులు, రివార్డులు

అత్యంత క్లిష్టమైన పలు కేసుల్లో నిందితులను సకాలంలో గుర్తించి, బాధితులకు న్యాయం చేయటం ద్వారా అటు పోలీసు ఉన్నతాధికారుల నుంచి ఇటు సామాన్య ప్రజల నుంచి అనేక అవార్డులు, రివార్డులు పొందారు. ఉత్తమ సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా 2006లో మంత్రి కన్నా లక్ష్మీనారాయణ, ఐజి సత్యన్నారాయణ్ నుంచి ఆయన అవార్డు అందుకున్నారు. 2001లో బాపట్ల ఎస్ఐగా, 1995లో మాచర్ల ఎస్ఐగా, 2004లో పిడుగురాళ్ళ ఎస్ఐగా ఉత్తమ సేవా అవార్డులను ఆయన పొందారు. నర సరావుపేటలో వివిధ కేసుల్లో రికవరి శాతం 15 నుంచి 72 శాతానికి ప్రసాద్ ఆధ్వర్యంలో పెరిగింది. దొంగ నోట్ల కేసులో ఎస్‌పి లడ్హా నుంచి ప్రత్యేక ప్రశంసలను ఆందుకోవటంతోపాటు ప్రజా పోలీసుగా స్వచ్ఛంద సేవా సంస్థలు, సామాన్య ప్రజలు అనేక సందర్భాలలో ఆయన్ను కొనియాడారు. సామాన్య రైతుకుటుంబంలో పుట్టిన తనకు పోలీసు అధికారిగా వచ్చిన అవకాశం ద్వారా బాధితులకు, సామాన్య ప్రజకు న్యాయం చేసి వారి మనస్సుల్లో స్థానం పొందటమే తనకు అన్నింటి కంటే పెద్ద అవార్డు అని సిఐ డి.ప్రసాద్ ఈ సందర్భంగా పేర్కొన్నారు.



# అరగుండు గిన్నిస్‌లో! 'బ్రహ్మానందం' ప్రజల మనస్సుల్లో

బుర్రా శ్రీనివాసరావు,
మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

వెండితెరపై ఆయన కనిపిస్తేచాలు ప్రేక్షకులకు ఆనందమే. మాట్లాడకుండానే నవ్వించే కళ ఆయన స్వంతమే. ఆయనే సత్తెనపల్లి ముద్దు బిడ్డడు. రెండు దశాబ్దాల కాలంలో తెలుగుభాషలో 754 చిత్రాలలో నటించి 'గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్' రికార్డులో స్థానం సంపాదించి పలువురి మన్ననలను పొందుతూ సత్తెనపల్లి ప్రాంతంలో నిరాజనాలు అందుకుంటున్నారు. కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు మహాపురుషులవుతారు అన్న ఆర్యోక్తిని అక్షరాల నిజం చేస్తూ నిరంతరం సినీ జగత్తులో పరిశ్రమించి అందనంత ఎత్తుకు ఎదిగిన హాస్య నటులు డాక్టర్ కన్నెగంటి బ్రహ్మానందం. ఎదిగిన కొద్దీ ఒదిగి ఉండే ఆయన అంటే సత్తెనపల్లిలో ఉండే ఆదరణ అంతా ఇంతా కాదు. గిన్నిస్ బుక్‌లో స్థానం సంపాదించారన్న వార్తతో ఈ ప్రాంతంలో ఆనందోత్సవాలు వెల్లివిరిసాయి. కళల కాణాచి సత్తెనపల్లిలో కళాకారులంతా మురిసిపోతున్నారు.

చలనచిత్ర చరిత్ర సిగలో విరిసిన జాజిమల్లి, సత్తెనపల్లికి ఆణిముత్యం కె. బ్రహ్మానందం గిన్నిస్ రికార్డ్ సృష్టించిన సందర్భంగా 'సూర్య' అందిస్తున్న ప్రత్యేక కథనం...



ఎంత ఎదిగిన ఒదిగి ఉంటే హాస్యనటులు బ్రహ్మానందం బహ్మానందం



సత్తెనపల్లిలో వివిధ కార్యక్రమాలకు వచ్చిన బ్రహ్మానందం

### బాల్యం

1950, ఫిబ్రవరి-1న గుంటూరు జిల్లా సత్తెనపల్లి పట్టణంలో కన్నెగంటి నాగబ్రహ్మాచారి- లక్ష్మి నరసమ్మ దంపతుల ఐదవ సంతానం బ్రహ్మానందం.

### విద్యాభ్యాసం

స్థానిక శరభయ్య హైస్కూల్లో ఎస్.ఎస్.ఎల్.సి, భీమవరం బి.ఎన్. ఆర్ కాలేజీలో డిగ్రీ వరకు పూర్తి చేసి గుంటూరు జిల్లా నల్లపాడులో ఎమ్.ఎ. (తెలుగు) విద్యాభ్యాసం పూర్తిచేశారు.

### ఉద్యోగం

1975లో పశ్చిమగోదావరి జిల్లా ఎస్.వి.ఎస్.ఎస్.ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేశారు.

### నాటకరంగ ప్రవేశం

ప్రముఖ రంగ స్థల నటులు వాసిరెడ్డి సుబ్బారావు, పత్రి జగన్నాద్‌రావుల పర్యవేక్షణలో శ్రీకారం చుట్టి 1975 నుండి మిమిక్రి ఆర్టిస్టుగా సుమారు 1000 ప్రదర్శనలిచ్చి హాస్యాభిమానులలో గుర్తింపు పొందారు.

### చలనచిత్రరంగ ప్రవేశం

1985లో ప్రముఖ దర్శకులు జంధ్యాల దర్శకత్వంలో 'అహనా పెళ్ళంట' చిత్రంతో చిత్రపరిశ్రమలో రంగ ప్రవేశం చేసి ఇప్పటి వరకు 754 చిత్రాలలో నటించారు.

### అవార్డులు

1996లో రాష్ట్రపతి చేతుల మీదుగా 'రాజీవ్ రత్న' అవార్డు అందుకున్నారు. ఫిలింఫేర్ అవార్డు, నాగార్జున యూనివర్శిటీ నుండి అరుదైన గౌరవ డాక్టరేట్, అల్లురామలింగయ్య స్మారక అవార్డు, హస్యబ్రహ్మ, రాష్ట్ర ప్రభుత్వంచే 5సార్లు నంది అవార్డులు, 5 కళాసాగర్ అవార్డులు, 9 భరతముణి, 6 వంశీబర్కి, 6 రేలంగి ఆర్ట్స్ అకాడమి, 5 యువకళావాహిని, 3 ఫిలిం ఫ్యాన్స్, సినీ గోయర్ వంటి పలు అవార్డులు సాధించి ప్రశంసలకు పాత్రుడయ్యారు.

విజయవాడలో స్వర్ణకార సంఘం వారిచే స్వర్ణ గండపెండేరంతో సత్కరించగా, 1998, 2004లో సత్తెనపల్లిలో ఫ్రెండ్స్ కల్చరల్ అసోసియేషన్ అధ్యక్షులు మారూరి పుల్లారెడ్డి ఆధ్వర్యంలో ఘనంగా సత్కరించారు. హైదరాబాద్ రవీంద్రభారతీలో 500 చిత్రాలు నటించిన సందర్భంగా డాక్టర్ అక్కినేని, జమున వంటి ప్రముఖుల

(మిగతాది 113వ పేజీలో)

# జిల్లాకే గర్వకారణం తెనాలి మున్సిపాలిటీ

తేళ్ళూరి రామకోటిరెడ్డి,మేజర్‌న్యూస్, తెనాలి.

రాజకీయ, వాణిజ్య వ్యవసాయ రంగాల్లోనే కాక సంగీత, నాటక, వైజ్ఞానిక, శాస్త్ర సాంకేతిక, సినీ, కళా, సాహితీ, సాంస్కృతిక రంగాల్లో పేరెన్నికగన్న తెనాలి పట్టణం ఆంధ్రాప్యారిస్‌గా రాష్ట్రంలోనే ప్రత్యేకత సంతరించుకుంది. వివిధ రంగాల్లో ఎందరో ఉద్దండుల్ని తీర్చిదిద్దింది. స్వాతంత్రోద్యమంలో కీలకపాత్ర వహించింది. వివిధ రంగాల్లో నేటికీ తెనాలి తన సంప్రదాయాన్ని, ప్రత్యేకతను, విలక్షణ సంస్కారం సంస్కృతిని నిలబెట్టుకుంటూనే ఉందనడం వాస్తవం. ప్రస్తుతం జిల్లాలో అతి పెద్ద మున్సిపాలిటీగా ఉన్న తెనాలి ఒకనాడు మైనర్ పంచాయతీగా ఉండి ఆ తర్వాత మేజర్ పంచాయతీ స్థాయికి ఎదిగి 1909లో మున్సిపాలిటీగా మారింది. 1965 నుంచి దీనికి స్పెషల్ గ్రేడ్ మున్సిపాలిటీ స్థాయి వచ్చింది. 15 చదరపు కిలోమీటర్లకు విస్తరించి ఉంది. ఈ మున్సిపాలిటీకి తొలి ఛైర్మన్‌గా డిప్యూటీ కలెక్టర్ పి.నాగేశ్వరరావు పంతులు నామినేషన్‌పై 1910 నుంచి 1912 వరకు పనిచేశారు. ఆ తర్వాత పి.కామరాజు పంతులు (1912), సి.భక్తవత్సలం నాయర్ (1913-16) నియమితులు కాగా, ఆ తర్వాత సి.వి.సుబ్రహ్మణ్యశాస్త్రి ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. (1920-21) పిల్లలమర్రి ఆంజనేయులు పంతులు, (1921-25) సాహితీ వేత్త, సంస్కర్త త్రిపురనేని రామస్వామి 1934లో ఎన్నికై 1938 వరకు ఛైర్మన్‌గా పనిచేశారు. స్వాతంత్ర్య సమరయోధుడు రావి సత్యనారాయణ 1938లో ఎన్నికై 1943 వరకు మళ్ళీ 1948లో ఎన్నికై 1949 వరకు పనిచేయగా, 1943 నుంచి 1944 వరకు షేక్ అబ్దుల్‌వహబ్‌సాహెబ్, 1944-1945 వరకు కన్నెగంటి వీరయ్య, 1946 నుంచి 1947 వరకు న్యాయవాది వేదాంతం లక్ష్మినారాయణ ఛైర్మన్‌గా ఉండేవారు. 1949- 1952 వరకు,



తెనాలి పురపాలక సంఘ కార్యాలయం

1952-1955 వరకు తిరిగి 1956 నుంచి 1958 వరకు సామ్యవాది నన్నపనేని వెంకట్రావు మూడు పర్యాయాలు ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. హేతువాది, హ్యూమనిస్ట్, ఉద్యమ ప్రముఖుడు, న్యాయవాది ఆవుల గోపాలకృష్ణమూర్తి 1955-56 వరకు ఛైర్మన్‌గా ఉన్నారు. ఎమ్మెల్యే ఆలపాటి వెంకట్రామయ్య 1959లో ఛైర్మన్‌గా ఎన్నికై 1962లో మున్సిపాలిటీల శాఖ మంత్రిగా నియమితుడు కావడంతో ఈ పదవికి రాజీనామా చేశారు. ఆ తర్వాత తవ్వా శ్రీరాములు 1962-64 వరకు ఛైర్మన్‌గా పనిచేశారు. 1967-72 వరకు బండ్ల పుల్లయ్య, 1981-82 వరకు అన్నాబత్తుని సత్యనారాయణ, 1982-86 వరకు మరల 1987-92 వరకు డాక్టర్ రావి రవీంద్రనాథ్, 1995-2000 వరకు ఆలమూరి విజయలక్ష్మి కుమారి ఈ పదవిని అధిష్టించారు.

2000 నుండి 2005 మార్చి వరకు యడ్ల గంగాధరరావు కొనసాగారు. ఆ తర్వాత జరిగిన మున్సిపల్ ఎన్నికల్లో డాక్టర్ తాడిబోయిన మస్తానమ్మ గెలుపొంది ఛైర్‌పర్సన్‌గా ప్రస్తుతం కొనసాగుతున్నారు. గతంలో ఆలపాటి వెంకట్రామయ్య, నన్నపనేని వెంకట్రావు, అన్నాబత్తుని సత్యనారాయణల హయాంలో మున్సి పాలిటీలో గణనీయమైన అభివృద్ధి జరిగిందనే చెప్పాలి.

ఆలపాటి హయాంలో ఓవర్‌బ్రిడ్జి నిర్మాణం, మున్సిపల్ కార్యాలయ భవన నిర్మాణానికి నిధుల మంజూరు, భూగర్భ మురుగు పారుదల పథకానికి ఆమోదం అదేవిధంగా రక్షిత మంచినీటి పథకానికి నిధుల విడుదల, 1942 క్విట్ ఇండియా ఉద్యమ అమరవీరుల స్తూపాల నిర్మాణం, జె.ఎం.జె మహిళా కళాశాల, ప్రభుత్వ ఐ.టి.ఐ ఏర్పాటు జరిగాయి.

## ఉగాది రాగాలు

సాగర మథనం అమృతమిస్తే
మేథోమథనం అజరామరమిస్తుంది!
సమస్యను పరిష్కరించడం
సృష్టించడమంత తేలిక కాదు!
నిర్భయానికి అభయం
నిజాయితీకి నియమం అక్కర్లేదు!
స్వప్నాలలో కాలం గడుపుతూంటే
వాస్తవం భారంగా పయనిస్తుంది!
వేదాంతము - వైరాగ్యమూ
తొండ - ఊసరవెల్లి లాంటివి!
గమ్యం నిర్ణయించుకున్నపుడే
తొలి అడుగు ప్రారంభించాలి!



## 'బ్రహ్మానందం' ప్రజల మనస్సుల్లో

(113వ పేజీ తరువాయి)

సమక్షంలో సన్మానం జరిగింది.

### విదేశాల్లో సత్కారాలు

అమెరికా, ఆస్ట్రేలియా, సింగపూర్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌లోని తెలుగు సంఘాలతోపాటు లండన్‌లోని తెలుగు డాక్టర్ అసోసియేషన్ వారి సత్కారాలు పొందారు.

### సత్తెనపల్లిలో సామాజిక సేవలు

తల్లిదండ్రుల జ్ఞాపకార్థం రంగస్థల కళావేదికను నిర్మించటంతో పాటు, పరివర్తన అనే సేవా సంస్థకు రూ.2 లక్షల విరాళం అందించటంతో పాటు పలు సేవా కార్యక్రమాలు చేసి తన సేవా నిరతినిచాటుకున్నారు.

### హర్షం

గిన్నిస్ బుక్‌లో స్థానం సంపాదించిన సత్తెనపల్లిలోని బాల్యమిత్రులు మారూరి పుల్లారెడ్డి, టి.పి. కల్యాణ రావు, గంగారపు వెంకట్రావు, జింకా రామారావు, నందా సాంబశివరావు, పులహరి గోవిందరావు, అజీమ్, యర్రా ఆదినారాయణ, ఇ.ఎల్లారెడ్డి, అమరనాథ్, బిట్రా వేదాద్రి, అందోని, శీలం ఏడుకొండలు, హోటల్ మనో హర్, సీతారామయ్య తోపాటు పలు కళా సంస్థల ప్రతినిదులు హర్షం వెలిబుచ్చారు.

# శిథిలావస్థకు చేరిన దేవాలయం...స్పందించని అధికారులు

మేజర్ న్యూస్, చిలకలూరిపేట, లీలానంద్

రాష్ట్రంలో కొండవీటి సామ్రాజ్యానికి విశిష్ట ప్రాధాన్యత ఉంది. అంతే ప్రాధాన్యం కొండవీడు సమీపంలోని వెన్నముద్ద బాలకృష్ణ దేవాలయంకూ ఉంది. ఇటువంటి దేవాలయం ప్రపంచంలో మరెక్కడా లేదు ఇంతటి ప్రాశస్త్యం ఉన్న దేవాలయం నేడు శిధిలావస్థకు చేరింది. ఈ సామ్రాజ్యాన్ని విజయ నగర పాలకులైన శ్రీకృష్ణదేవరాయలు జయించి విజయం సాధించారు. దీనికి చిహ్నంగా విజయ ధ్వజం, వెన్నముద్ద బాలకృష్ణ స్వామి దేవాలయం నిర్మించారు. దేవాలయ అభివృద్ధి కోసం అగ్రహారాలు సైతం సమర్పించారు. ఈ దేవాలయంకు 449 ఎకరాల విస్తీర్ణంతో ఉన్న వ్యవ సాయ భూమి కలదు. పురాతన దేవాలయం నేడు ఏక్షణం లోనైనా కూలిపోయే పరిస్థితి ఏర్పడింది. వర్షం కురిస్తే ఆలయ గర్భగుడిలోకి సైతం వర్షపు నీరు రావటం విశేషం. విజయనగర సామ్రాజ్యం బలహీనపడిన సమయంలో రెడ్డిరాజుల పాలన సాగింది. వారు స్వతంత్రులైనా దైవ భక్తిచే ఆలయాన్ని ఆదరణతో చూశారు. గోల్కొండ నవాబులు కొండవీటి దుర్గాన్ని ముట్టడించిన సమయంలో రెడ్డిరాజులు పరాజయం పాలవుతారని గ్రహించి భక్తులు మూలవిరాట్టు విగ్రహమైన బాల మురళీ కృష్ణ స్వామి, ఉత్సవ మూర్తుల విగ్రహలను ఓ పాడు పడిన బావిలో భూస్థాపితం చేశారు. అనంతరం బ్రిటీషు పాలన సాగిన సమయంలో జమిందారీ పాలన ద్వారా పౌరపాలన సాగింది. ఆ సమయంలో కొండవీటి ప్రాంతంలో కొందరు భూమిని త్రవ్వుతుండగా భూనిక్షిప్తమై ఉన్న గోపినాధ స్వామి విగ్రహలు వెలికి చూశాయి. విషయం తెలుసుకున్న నాటి జమిందారు రాజామానూరు వెంకట క్రిష్ణరాయణం విగ్రహలను అక్కడే ప్రతిష్టింపచేశారు. నాటి నుండి సింగిస్కాన్ పేటలో వెన్నముద్దల బాలకృష్ణ స్వామి దేవాలయంను దర్శించేందుకు నిత్యం వేలాది మంది భక్తులు విచ్చేసి దైవ దర్శనం చేసుకునేవారు. ప్రతిసంవత్సరం శ్రీకృష్ణ జన్మాష్టమి రోజు విశేషమైన పూజలు చేస్తారు. కుడి చేతిలో వెన్నముద్ద ఎడమ చేయిలో వెండి మొలత్రాడుతో స్వామి దర్శనమిచ్చి భక్తులచే జోలపాటలు పాడించుకొంటారని ప్రతీతి. ఫాల్గుణ మాసంలో కల్యాణ మహోత్సవాలు నిర్వహిస్తారు. గతమెంత ఘనకీర్తి ఉన్నా నేడు అందుకు విరుద్ధంగా ఆలయం శిధిలమైంది. దేవాదాయ శాఖ అధికారులకు ప్రజలు, ప్రజాప్రతినిధులు పదేపదే విజ్ఞప్తులు చేసినా నేటవరకు ఆలయ అభివృద్ధికి నోచుకోలేదు. అంతేకాక ఆలయానికి చెందిన ఉత్సవవిగ్రహాలను కొందరు చోరీ చేయగా పోలీసులు దొంగలను అదుపులోకి తీసుకుని విగ్రహలను కోర్టులో అందచేశారు.



శిధిలావస్థకు చేరుకున్న వెన్నముద్ద బాలకృష్ణ దేవాలయం

భారత దేశంలో చేతిలో వెన్నముద్దతో ఉన్న దేవాలయం నేటికీ ఎక్కడా లేదు. ఇంతటి శిల్పకళా నైపుణ్యం ఉన్న ఈదేవాలయం జీర్ణావస్థలో ఉండటంతో భక్తులు అసం తృప్తిని వ్యక్తం చేస్తున్నారు. వందలాది ఎకరాల విస్తీర్ణాలు ఉన్న దేవాలయాలే ఈ విధంగా ఉంటే సాధారణ దేవాలయాల పరిస్థితి ఏమిటని ప్రజలు చర్చించుకుంటున్నారు. ఇప్పటికైనా అధి కారులు ప్రజా ప్రతి నిధులు స్పందించి ఆలయాభివృద్ధికి సహకరించాలని భక్తులు కోరుతున్నారు.



ఆలయ జమా ఖర్చులు, పొలం వివరాలతో ఉన్న బోర్డు





# వజ్రాలు, బంగారు వ్యాపారాలకు జాతీయస్థాయిలో తెనాలికి గుర్తింపు

రొంపిచర్ల వెంకట కిరణ్ కుమార్, మేజర్‌న్యూస్, తెనాలి కల్చరల్.

మహిళలు ఎంతో మక్కువ చూపే పసిడికి వన్నెలద్దే ప్రత్యేక నిలయంగా తెనాలి పట్టణం ఖ్యాతి గడించింది. ఆంధ్రాప్యారిస్‌గా పిలిచే తెనాలి పట్టణం బంగారు ఆభరణాల రూపకల్పనలో రాష్ట్ర స్థాయిలో ఒక ప్రత్యేకత కలిగి ఉంది.

## బంగారం, వెండి వ్యాపార కూడలి తెనాలి

తెనాలి పట్టణం అన్ని రంగాల్లోనూ ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకుంది. ముఖ్యంగా వాణిజ్య, వ్యాపార రంగాల్లో బంగారం, వెండి వ్యాపారులకు పెట్టిందిపేరుగా విరాజిల్లుతుంది. 1922లో కొల్లూరు రామయ్య, లింగయ్య అనే ఇద్దరు సోదరులు మొట్టమొదటిసారిగా ముడి



బంగారు ఆభరణం

బంగారాన్ని మేలిమి బంగారంగా మార్చే ప్రక్రియ వీరి సారధ్యంలోనే జరిగింది. ఆనాడు ప్రారంభమైన ప్రస్థానం నేడు వేలాదిమందికి జీవనోపాధిగా నిలుస్తుంది. మారుతున్న కాలానుగుణంగా బంగారు వ్యాపాంస్తులు, పసిడికి వన్నెలద్దే స్వర్ణకారులు, వ్యాపార సంస్థల్లోని సిబ్బంది కలిపి పదివేలమంది పైచిలుకు దీనిపై ఆధారపడి జీవిస్తున్నారు. తెనాలి ప్రాంతం నుండే కాక రాష్ట్ర నలుమూలల నుండి, రాష్ట్ర రాజధాని భాగ్యనగరం నుండి బంగారు ఆభరణాలు, వెండి వస్తువుల కోసం నిత్యం వర్తకులు, వినియోగదారులు పట్టణంలోని బంగారు దుకాణాల్లో వ్యాపార లావాదేవీలు జరుపుతుంటారు. నైపుణ్యం కలిగినటువంటి స్వర్ణకారులు, నమ్మకంతో కూడినటువంటి వ్యాపారస్తులు ఉండడంవల్ల వ్యాపారాభివృద్ధికి ముఖ్య కారణంగా చెప్పవచ్చు. భారతదేశంలో 97% నాణ్యత కలిగిన వెండి వస్తువులు తయారుచేయించి విక్రయించడం పట్టణంలోనే జరుగుతుంది. పొరుగు రాష్ట్రాలైన కర్ణాటక, తమిళనాడు, ఒరిస్సా మొదలగు రాష్ట్రాలకు కూడా బంగారు, వెండి వస్తువులు ఇక్కడి నుంచి ఎగుమతి చేస్తున్నారు. విజయ వాడలో కనక దుర్గమ్మ అమ్మవారికి స్వర్ణకిరీటం, ఆభరణాలు ఇక్కడ తయారుచేసి ఇవ్వడం పట్టణంలోని స్వర్ణకారుల నైపుణ్యానికి నిదర్శనం.

## వజ్రాల వ్యాపారానికి పేరెన్నికగన్న తెనాలి

వజ్రాల వ్యాపారంలో సైతం తెనాలి పట్టణం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. రెండో ప్రపంచ యుద్ధానికి ముందే ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ప్రప్రధమంగా తెనాలిలో వజ్రాల వ్యాపారం ప్రారంభించారు. పట్టణానికి చెందిన కాకుమాను రామస్వామి స్థానిక షరాఫ్ బజారు సెంటర్‌లో డైమండ్ హాల్ పేరుతో వ్యాపారాన్ని ఆరంభించారు. రంగూన్ నుండి వజ్రాలను నేరుగా దిగుమతి చేసుకుని రాష్ట్రవ్యాప్తంగా ఇక్కడి నుండే వ్యాపార లావాదేవీలు నిర్వహించేవారు. రాష్ట్రం నలుమూలల నుండి వ్యాపారులు వజ్రాల కోసం తెనాలి వచ్చేవారు.



బంగారు ఆభరణాలు

# సంచలనాలకు మారుపేరు అంజిరెడ్డి

సయ్యద్ సాబీర్ హుసేన్
మేజర్‌న్యూస్, వినుకొండ

స్పష్టమైన స్వరం, అంతే స్పష్టమైన విధానం. సంచలనాలకు మారుపేరు, సంయమనమైన తీరు. పేరు అమ్మిరెడ్డి అంజిరెడ్డి. గ్రామీణప్రాంతమైన నూజండ్ల నుంచి ఎదిగిన నాయకుడు.



అమ్మిరెడ్డి అంజిరెడ్డి స్వతహాగా కాంగ్రెస్‌వాది. విద్యార్థి దశనుంచి నేటి వరకూ ఎన్ని కష్టనష్టాలు వచ్చినా దారి తప్పని బహుదూరపు బాటసారి. గతంలో కళాశాలలో ఎన్నికలు జరగడం మనకు తెలిసిందే. వినుకొండ డిగ్రీ కళాశాలలో అప్పట్లో పట్టణానికి చెందిన విద్యార్థులకే పట్టు ఉండేది. గ్రామీణ విద్యార్థులు ఓట్లేయడానికి మాత్రమే అన్నట్లుగా ఉండేవారు. ఈ తీరు నచ్చని అంజిరెడ్డి గ్రామీణ ప్రాంత విద్యార్థుల తరపున ఎన్నికలలో నిలబడి విజయం సాధించారు. అది ఆయన రాజకీయ జీవితంలో తొలి సంచలనం. అలాంటిదే మరో సంఘటన.. నూజండ్ల మండలం ఆదినుండి తెలుగుదేశం పార్టీకి పెట్టని కోటలాంటిది. ఇక్కడ కాంగ్రెస్ తరపున పోటీ చేయడానికి అభ్యర్థులు ముందుకురాని పరిస్థితులు ఉండేవి. అలాంటి ప్రతికూల పరిస్థితులలో మహిళలకు రిజర్వు కాబడిన మండలాధ్యక్ష స్థానానికి తన భార్య శ్రీమతి లక్ష్మి నరసమ్మను కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీకి పెట్టి పసుపు కోటను బద్దలు కొడుదూ విజయాన్ని సొంతం చేసుకున్నారు. ఇది ఆయనను జిల్లా నేతల దృష్టిలో పడేటట్లు చేసింది. ఇక ఆయన రాజకీయ జీవితానికి ఎదురే లేకుండా పోయింది. 992-95 లలో వ్యవసాయ మార్కెట్ కమిటీ చైర్మన్‌గా పని చేసిన అంజిరెడ్డి దానికి రాష్ట్రస్థాయిలో గుర్తింపు తెచ్చిపెట్టారు. అపరాల మార్కెట్ నిర్వహణలో వినుకొండ మార్కెట్ కమిటీకి రాష్ట్ర స్థాయి అవార్డు రావడం ఆయన విశేష కృషి ఫలితమే. అప్పట్లో రాష్ట్ర వ్యవసాయ మార్కెట్ కమిటీ చైర్మన్‌ల ఛాంబర్‌కి రాష్ట్ర కార్యదర్శిగా వ్యవహరించారు. దీంతో రాష్ట్ర స్థాయిలో కాంగ్రెస్ నేతల దృష్టిలో పడిన అమ్మిరెడ్డికి ఎలాంటి ప్రయత్నం చేయకుండానే రాష్ట్ర పంచాయతీరాజ్ ఛాంబర్ డైరెక్టరుగా అప్పటి ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి నియమించడం విశేషం. జిల్లా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా ఎనిమిది సంవత్సరాల పాటు పని చేసిన అంజిరెడ్డి ప్రత్యేకమైన వ్యవహారశైలితో 'దటీజ్ అంజిరెడ్డి స్టైల్'గా పత్రికా ప్రతినిధులతో ప్రశంసించబడ్డారు. మొదటి నుంచి చిరంజీవి అభిమాని అయిన అంజిరెడ్డి కాంగ్రెస్‌పార్టీకి రాజీనామా చేసి మెగా పార్టీలో చేరుతున్నట్లు ప్రకటించి సంచలనం సృష్టించారు. నియోజకవర్గంలోని అన్ని రకాల సామాజిక వర్గాలతో సన్నిహిత పరిచయాలున్న అంజిరెడ్డి ఇప్పుడు మెగా పార్టీకి 'చిరు' నామాగా మారారు. వినుకొండ నియోజకవర్గంలో చిరు పార్టీకి గట్టి పునాదులు వేసే ఆలోచనతో పావులు కదుపుతున్నారు. ఎక్కడ ఉన్నా.. ఏ పదవిలో ఉన్నా దానికి వన్నె తీసుకువచ్చే అంజిరెడ్డికి ఆల్‌ది బెస్ట్ చెబుదాం...

# కాపుల హక్కులకోసం పోరాటం

బుర్ల శ్రీనివాస్,మేజర్‌న్యూస్, రాజుపాలెం



జిల్లాలో కాపులను సమైఖ్యపరచి కాపులకు రావాల్సిన హక్కులకోసం పోరాటం చేస్తున్నారు జిల్లా కాపునాడు అధ్య క్షులు బత్తుల ఆదినారాయణ. కాపు విద్యార్థులకు స్కాలర్‌షిప్‌ల కోసం రాష్ట్ర అసెంబ్లీ నందు రాష్ట్రకాపు సంఘం అధ్యక్షులు పిళ్లా వెంకటేశ్వరావు ఆధ్వర్యంలో విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు సాధించిన ఘనత బత్తులదే దక్కింది. రాష్ట్రం లో కాపులను బిసిలలో చేర్చాలని కేంద్ర రక్షణశాఖమంత్రి పళ్ళం రాజు,రాష్ట్ర అధ్యక్షులు పిళ్లా వెంకటేశ్వరరావు, చిత్తూరు ఎంపి ఆదికేశవులనాయుడు, నర్సాపురం ఎంపి హరిరామ జోగయ్య ఆధ్వర్యంలో బత్తుల ఆదినారాయణ, కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీని కలిసి బిసిలలో కాపులను చేర్చాలని విజ్ఞాపన పత్రం అందజేశారు. సత్తెనపల్లి నియోజక వర్గంలో రాజుపాలెం,నకరికల్లు మండలాలు మిగతా 116వపేజీలో









శ్రీ నారాచంద్రబాబు నాయుడు



ప్రత్తిపాటి పుల్లారావు



ఎన్.టి.ఆర్



115వపేజీ తరువాయి

కలవడంతో కాపుల్లో బలమైన నాయకునిగా గుర్తింపు పొందిన బత్తులకు రాజకీయంగా అనుకూల పరిణామాలు ఏర్పడ్డాయి. జిల్లా ఎన్ఎస్‌యుఐ నాయకునిగా, ఏఐటియుసి జనరల్ సెక్రటరిగా జిల్లా కాంగ్రెస్ పార్టీలో అనేక పదవులు నిర్వహించారు.రానున్న శాసనసభ ఎన్నికల్లో రాజకీయంగా గుర్తింపు కోసం ఎదురుచూస్తున్నారు.

'కూని'రాగాలు

జననంలో జ్ఞాపకం
మరణానికి ముహూర్తం
ఉండవు!

ఆయుధాల అవసరం
బరిలో ప్రవేశించడానికి మునుపే!

కాలాన్ని వృథా చేయాలనుకుంటే
కర్మసిద్ధాంతాన్ని నమ్మవచ్చు!



కూనిరెడ్డి శ్రీనివాస్



# సినీరంగంలో జిల్లా ప్రముఖ కళాకారులు

కస్తూరి వెంకటబాబు, మేజర్‌న్యూస్, గుంటూరు ఎడ్యుకేషన్.

ఆనాడు నాటకరంగం తెలుగునాట ప్రభవిల్లి సినీ రంగానికి ఎగబాకింది. సినీ ప్రముఖులకు గుంటూరు జిల్లా ఒక ఖిల్లాగా చెప్పుకోవచ్చు. ఎందరో నటీనటులు, సాంకేతిక రంగ కళాకారులు పుట్టిన జిల్లా గుంటూరు. జిల్లాకు సంబంధించిన వారే ఎక్కువ మంది ఆ నాడు సినీ రంగంలో వెలుగొందారు. టి.రామకృష్ణశాస్త్రి, పులిపాటి వెంకటేశ్వర్లు, వేమూరి గగ్గయ్య, రామతిలకం, కన్నాంబ, లక్ష్మి రాజ్యంలను ఆనాటి మేటి నటీనటులుగా చెప్పుకోవచ్చు. ఎందరో ప్రతిభావంతులైన నటులను తెలుగు సినీ రంగానికి అందించిన ఘనత గుంటూరు జిల్లాకుంది. సంభాషణలు పలకటం, నటనలో వైవిధ్యం కనపరచటం, ప్రత్యేకమైన తరహాలో ప్రతినాయకుడుగా ముందుగా సి.ఎస్.ఆర్.నే చెప్పుకోవాలి. శకుని పాత్రకు సరిగ్గా సరిపోయి తెలుగు వారిని అలరించిన ఆయన పేరు చిలకలపూడి సీతారామాంజనేయులు పొన్నూరు వాస్తవ్యులే. ఆయన భీష్మ చిత్రంలో కృష్ణుడుగా, భక్త తుకారాం పాత్రలను పోషించి సినీరంగంలో అడుగుపెట్టారు. తరువాత తనదైన శైలిలో నటనాప్రతిభతో అనేక విభిన్న పాత్రల్లో నటించి తెలుగు ప్రేక్షకుల హృదయాలలో విలన్‌గానే ముద్ర వేసుకున్నారు. ఇక తెనాలి వాడైన వేమూరు గగ్గయ్య యముడు, కంసుడు, జలంధరుడు వంటి పాత్రలు వేసి గంభీర గగ్గయ్యగా ముద్ర వేసుకున్నాడు. రాక్షస పాత్రలు, మాంత్రికుడుగా గగ్గయ్యే సరిపోతాడు అనేట్లుగా ఒరవడిని సృష్టించారు. బ్రాహ్మణకోడూరు వాసి మాధవపెద్ది వెంకట్రామయ్య నటుడుగా చిత్రనళీయంలో నలుడు, తులసీ జలంధరలో శివుడు మొదలైన పాత్రలు ధరించినా నేపథ్య గాయకుడుగానే పేరు పొందారు. మాయాబజార్‌లో భళి భళీ దేవా అంటూ పాడిన ఆనాటి పాట నేటికీ వినిపిస్తూనే ఉంటుంది. అలాగే చాలా పద్యాలు.. కూడా. తనదైన స్థానాన్ని సంపాదించారు. ఎస్వీఆర్‌కు పద్యాలు పాడాలంటే మాధవపెద్దికే సాధ్యం అనే రీతిలో పేరు పొందారు. తెనాలి కాంచనమాల తన ప్రారంభ దశలోనే మంచి నటిగా పేరు సంపాదించుకుంది. నాటి యువతరానికి ఆమె స్వప్నసుందరి. శివుడి పాత్రల్లో కనిపించే సదాశివరావు గుంటూరు వాడే. ముక్కామల కృష్ణమూర్తి అంటే ఒక విలన్...సాంఘిక, పౌరాణిక, జానపద చిత్రాలు...అవి ఇవి అని లేదు... అన్ని పాత్రలకు విభిన్నమైన ఉచ్ఛారణతో డైలాగులు చెప్పే తీరు ఇప్పటికీ వినిపిస్తూనే ఉంటాయి.

తరువాత రోజుల్లో రంగస్థలంపై అభినవ దుర్యోధనుడుగా పేరు పొందిన ధూళిపాళ సీతారామశాస్త్రి ధూళిపాళగా విభిన్న పాత్రలకు జీవం పోశారు. ఎస్వీ ఆర్, ఎన్టీఆర్‌లు దుర్యోధనులుగా రాణించినా...ధూళిపాళ మరో కోణంలో భీష్మ చిత్రంలో సుయోధనుడుగా సినీరంగ ప్రవేశం చేశారు. కొద్ది కాలంలోనే అనేక సినిమాలకు ఛాన్సు కొట్టేశారు. కె.వి.ఎస్.శర్మ, సిఎస్ఆర్‌లు ఆ రోజుల్లో ఇద్దరు ప్రత్యేక రీతిలో శకుని పాత్రలు పోషించారు. ఆనాడు శకుని అంటే ఈ ఇద్దరే అనుకునే వారు. అయితే తరువాత వచ్చిన ధూళిపాళ శకునిగా మరో భిన్నమైన శైలిలో తెలుగు వారి గుండెల్లో చెరగని ముద్ర వేసుకున్నారు. గుమ్మడి వెంకటేశ్వరరావు తెనాలి నుండి చిత్రరంగానికి విలక్షణమైన నటుడుగా పేరు పొందారు. బరువైన పాత్రలకు పెట్టింది పేరు గుమ్మడి. అటు సాంఘిక, ఇటు పౌరాణికాలలో కూడా ఆయనకు ఆయనే సాటి. విలన్ నుంచి చారిత్రాత్మకం, సాత్వికత, పౌరాణిక పాత్రలకు చిరునామా గుమ్మడిదే. ధర్మరాజు అంటే గుమ్మడిలా ఉంటాడు అనిపించేది.

గుంటూరు వాస్తవ్యులు ఏ పాత్ర వేసినా ఒక ప్రత్యేకత కనపరచాల్సిందే అనుకునేట్లుగా జి.వరలక్ష్మి నాటక రంగం కంటే సినిమా రంగంలోనే బాగా రాణించారు. ఒక ప్రత్యేక తరహాలో కనిపించటం ఆమె ప్రతిభకు తార్కాణం. రేపల్లె తాలూకాలో పుట్టిన కళాభినేత్రి సావిత్రి ఇప్పటికీ తెలుగు వారి కళ్ళల్లో మెదులుతూనే ఉంటుంది. వడ్డేవారి పాలెంలో ఆమె పేరిట ఉన్నతపాఠశాల కూడా ఉంది. ఆమె నటన గురించి చెప్పాలంటే మాటలు చాలవు. తెలుగు ప్రేక్షకులను గిలిగింతలు పెట్టిన దగ్గరనుంచి కన్నీళ్ళు కూడా పెట్టించగల మేటి నటి సావిత్రి. అందుకే ఆమె మహానటి అయింది. ఆమె పక్కన నటించే నటులకు ఆమె వల్లనే పేరు వచ్చిందని చెప్పేవారు. గుంటూరు నటి కళ్ళతోనే నటించే అసమాన భావప్రకటనలో ప్రతిభావంతురాలు షావుకారు జానకి. తొలి చిత్రం...షావుకారుతో పేరు పొందిన ఆమె ఇంటిపేరు షావుకారుగానే ప్రసిద్ధమైంది. ఇక ఆమె సోదరి కృష్ణకుమారి యువకుల గుండెల్లో గుబులు రేపింది. సాంఘిక, పౌరాణిక చిత్రాలలో అనేక పాత్రలకు జీవం పోసిన నటి కృష్ణకుమారి. తెనాలి తాలూకా దుగ్గిరాలలో పెరిగిన జమున సత్యభామకు ప్రతిరూపంగా నిలిచింది. మీరజాల గలడా నా ఆనతి అంటూ జడ వెన్నుకు వేసుకుంటే కృష్ణుడికే కాదు...తెలుగు ప్రేక్షకులకు కూడా గుండె ఝల్లుమనేది. అనేకమైన వైవిధ్య పాత్రల పోషణలో ఆమె దిట్ట అనే ముద్ర వేసుకుంది. కంచుకంఠం జగ్గయ్యను గుంటూరు జిల్లాది మరిచిపోలేని అనుబంధం. వార్తలు చదవటం నుంచి సినీ నటుడుగా ఎదిగాడు. శివాజీ గణేశన్ నటన, జగ్గయ్య డబ్బింగ్ ఒక వీరపాండ్య కట్టబ్రహ్మన విడుదలైనప్పుడు సంచలనం కలిగించింది. అనేక సాత్విక, క్లాస్ విలన్ పాత్రల్లో నటన జగ్గయ్యకు అలవోకగా సాగేది. కళా వాచస్పతిగా పేరు పొందిన జగ్గయ్య అనేక విభిన్న పాత్రలు పోషించి ఘనత వహించారు. బురిపాలెం బుల్లోడు ఒక సంచలనాత్మక నిర్మాత. తెలుగులో భారీ రంగుల చిత్రం, 70 ఎం.ఎం. చిత్రం నిర్మించిన సాహసవంతుడు ఘట్టమనేని కృష్ణ అదుర్తి సుబ్బారావు తేనెమనసుల ద్వారా వెండితెరకు పరిచయమైన కృష్ణను బాపు సాక్షికి సరైన పాత్రధారుడిగా ఎంచుకున్నారు. అటు బాపు, ఇటు కృష్ణ కూడా విజయం సాధించారు. కౌబాయ్ చిత్రాలను తెలుగువారికి పరిచయం చేసిన నిర్మాత, నటుడు మొనగాళ్ళకు మొనగాడైన కృష్ణే జేమ్స్ బాండ్ తరహా సినిమాల నటుడుగా పేరు పొందారు. పద్మాలయ స్టూడియో స్థాపించి అనేక మేజర్ చిత్రాలు, భారీ చిత్రాలు తెలుగు వారికి చూపించారు. గుంటూరు విలన్లు జయప్రకాష్‌రెడ్డి, జీవా (దయారత్నం)లు గుంటూరుకే కీర్తి ప్రతిష్టలు తెచ్చారు. వారు కనిపిస్తే చాలు రాయలసీమ ఫ్యాక్షన్ స్టైల్ కనిపిస్తారు. డైలాగుల చెప్పే విధంలో కూడా వారు విభిన్న శైలిని కనిపించేట్లు చేయటం ఒక సాహసమే. అయితే ఆ సాహసంతోనే వారు రాణిస్తున్నారు. గుంటూరు ప్రజలను ఆనందపరవశులను చేస్తున్నారు.

ఇక హాస్యంలో నవ్వులు పండించిన వారు బ్రహ్మానందం. గిన్నిస్ బుక్‌లో ఎక్కి అతిగా నవ్వించే నటుడుగా పేరు పొందిన బ్రహ్మానందంది సత్తెనపల్లే. మనిషి కనిపిస్తే చాలు నవ్వులే నవ్వులు. డైలాగ్ అక్కర్లేకుండా నవ్వించే తెలుగు హాస్య నటుడు. ఆయనలో ఒక లారెల్, ఒక హార్డీ, ఒక ఛార్లీ ఛాప్లిన్ కనిపిస్తారు. ఆయనకు జోడీ ఏ.వి.ఎస్.(ఆమంచి వెంకట సుబ్రహ్మణ్యం) మన తెనాలి వాడు... తుత్తితో పరిచయం.... విభిన్న పాత్రలు ధరించి నవ్వుల పువ్వులను పండించటం ఆయన హాబీ. అసలు ఆయనవి ముద్దుమాటలేనా...మామూలుగా మాట్లాడగలడా అనే అనుమానం అందరికీ కలుగుతుంది. యువ సినీ గాయని సునీత(ఉపద్రష్ట)ది కూడా గుంటూరే. చిన్నతనంలో అంటే ఏడేళ్ళ వయసులోనే స్టేజి ఎక్కి సంగీతం పాడేది. తరువాత అనేక పోటీలలో బహుమతులందుకుంది. బుల్లితెర యాంకర్‌గా, సినీ గాయనిగా బంగారు నందులు అందుకున్న సునీత గాత్రం యమునా తీరంలో... సంధ్యాసమయంలో కృష్ణుడు రాధ కోసం వాయించే వేణువులా వినిపిస్తుంది.

# మహనీయుడు వావిలాల

బుర్రా శ్రీనివాస్,మేజర్‌న్యూస్, సత్తెనపల్లి

"సత్తెపల్లునికి సన్మానం నిరాడంబరునికి నిరాజనం" అన్న ఆర్యోక్తిని అక్షరాల నిజం చేసి పలువురికి మార్గదర్శునిగా నిలిచి పేద, బడుగు, బలహీన వర్గాల నీరాజనాలు అందుకున్న ఆ జన్మ బ్రహ్మచారి సత్తెనపల్లి ముద్దుబిడ్డడు స్వర్గీయ వావిలాల గోపాల కృష్ణయ్య, నాడు స్వాతంత్ర కోసం, ఆతర్వాత ప్రజాసమస్యల పరిష్కారం కోసం అవిశ్రాంతం పోరాటం చేసిన పోరాట యోధుడు వావిలాల. నేడు మన మధ్య లేనప్పటికి సత్తెనపల్లి వాసుల మనస్సులలో చెరగని ముద్ర వేశారు. నిస్వార్ధ రాజకీయ నాయకుడిగా, నిజాయితీ నిబద్ధతలే ఆయనసైజంగా జీవితాంతం ప్రజాసేవకోసమే పరితపించారు. రాష్ట్రంలో సత్తెనపల్లి కి ప్రత్యేకతను తీసుకొచ్చి ఈ ప్రాంత అభివృద్ధికి ఎనలేని సేవలు చేశారు. 1906 సంవత్సరం సత్తెనపల్లిలో జన్మించిన వావిలాల నాటి సమాజంలోని రుగ్మతలను దూరం చేయాలనే సదుద్దేశంతో ఎన్నో పోరటాలు నడిపారు. సాధారణ వ్యక్తిత్వం కలిగి అసమాన్యంగా జీవించారు. కుళ్ళు రాజకీయాలకు వ్యతిరేకంగా గాంధీ సంచితో ఎక్కడికైనా కాలి నడకన పోవడం అయన నైజం. బ్రిటీష్ పాలకులు ఎన్ని నిర్బంధాలు విధించిన లెక్క చేయకుండా మొక్కవని ధైర్యంతో స్వాతంత్ర ఉద్యమంలో పాల్గొన్నారు. స్వరాజ్యం కోసం సర్వ సుఖాలను వదులుకొన్న దేశ భక్తుడు వావిలాల. ప్రజా జీవితంలో క్షణం తీరక లేకుండా ఉన్న వావిలాల పెళ్ళి గురించి ఆలోచన చేయలేదు. 1952 లో ఏర్పడిన సత్తెనపల్లి శాసనసభ నియోజక వర్గానికి వరుసగా నాలుగుసార్లు స్వతంత్ర అభ్యర్థిగా ఎన్నికై చరిత్ర సృష్టించారు. 1952 ,1955, 1962, 1967లో జరిగిన నాలుగు దఫాల ఎన్నికల్లో ఆయన ఘన విజయం సాధించారు. ఎమ్మెల్యేగా ఉన్న విలాసవంతమైన జీవితానికి అలవాటు పడక నేటి రాజకీయ రంగానికి తలమానకంగా నిలిచారనటంలో సందేహం లేదు. మధ్యపాన నిషేధ ఉద్యమంలో అలుపెరుగని పోరాటం సాగించి ఉద్యమాన్ని విజయవంతం చేశారు. స్వాతంత్ర పోరాటానికి సంబంధించిన కమిటీలకు సలహాదారునిగా, రథసారధునిగా వ్యవహరించారు. 1952లో అప్పటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూతో మాట్లాడి నాగార్జున సాగర్ ప్రాజెక్టు సాధనలో కీలక పాత్ర వహించారు. వావిలాల తన జీవితంలో ఎన్నో పదవులను అధిరోహించారు. 1951లో శాంతి సంఘం రాష్ట్ర అధ్యక్షునిగా బేసిక్ ఆంధ్రా, వెంకటేశ్వర, ఉస్మానియా, నాగార్జున విశ్వవిద్యాలయాల సెనేట్ సభ్యునిగా, ప్రాథమిక విద్యా కమిటీలో సభ్యునిగా పనిచేశారు. సోవియట్ యూనియన్‌లో జరిగిన శాంతి మహసభలకు భారత ప్రతినిధిగా, అధికార భాష కమిషన్‌కు ప్రథమ అధ్యక్షునిగా, ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహకునిగా వావిలాల పనిచేశారు. ముంబై పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయంలో నిర్వహించిన అఖిల భారత తెలుగు మహాసభలకు ప్రతినిధిగా పాల్గొన్నారు. ప్రముఖుల ప్రశంసలతో పాటు పలు పురస్కారాలు అందుకొన్నారు. కాకల తీరిన పార్లమెంటేరియన్లు స్వర్గీయ పుచ్చలపల్లి సుందరయ్య, ఆచార్య ఎన్. జి. రంగా వంటి నాయకులతో ప్రజా ప్రతినిధిగా పనిచేసిన వావిలాల అందరికి ఆదర్శప్రాయునిగా నిలిచారు. స్వలాభాపేక్ష లేకుండా నిస్వార్ధంగా చేసిన సేవలను గుర్తించిన భారత ప్రభుత్వం పద్మ భూషణ్ పురస్కారాన్ని అందించి ఘనంగా సత్కరించింది. శాసనసభ్యునిగా సత్తెనపల్లి ప్రాంత అభివృద్ధికి ఎనలేని కృషి చేశారు. గుంటూరు -మాచర్ల రైల్వే లైనను బ్రాడ్ గేజ్‌గా మార్చడం, జూనియర్ కళాశాలకు సొంత భవనాల నిర్మాణానికి నిధులు సమకూర్చడం, సత్తెనపల్లి ప్రాంత యువతకు ఉపాధి కల్పించేందుకి శాతవాహన స్పిన్నింగ్ మిల్లును ఏర్పాటు చేయడం, సాగర్ కాల్వల ప్రధాన కార్యాలయాల ఏర్పాటు చేయడం, ఆయన చేసిన పనుల్లో ముఖ్యమైనవి. 2003 ఏప్రిల్ 29న పరమపదించారు.

## కొండపై నెలకొన్న కోనేటి రాయుడు

(షేక్ దస్తగిరి, మేజర్‌న్యూస్, పిడుగురాళ్లరూరల్)

రాజుపాలెం మండలం దేవరంపాడు కొండపై మత్స్యావతారంలో 'స్వయంభువు'గా వెలిసిన శ్రీ వెంకటేశ్వరుడు భక్తుల కోర్కెలు తీర్చే కల్పతరువుగా ప్రసిద్ధి చెందారు. శ్రీవారు శ్రీ మహా విష్ణువు యొక్క దశావతారాలలో తొలి అవతారమైన మత్స్యావతారంతో ఇక్కడ వెలిసి, భక్తుల ఆరాధ్య దైవమై సుమారు 2 వందల సంవత్సరాల నుండి ఆరాధింపబడుతున్నారు. పల్నాటి తిరుమలగా పేరు గాంచిన దేవరంపాడు వెంకటేశ్వరుని కళ్యాణ మహోత్సవం ఏటా ఐదు శనివారాల పాటు ఘనంగా జరుగుతుంది. భక్తులు తమ పశువులు ఈనిన తరువాత కవ్వం పెట్టగానే వచ్చిన వెన్న తెచ్చి స్వామి వారికి పొంగళ్ళు పొంగించి ఆ తరువాత దేవాలయం చుట్టూ పశువులను ప్రదక్షిణ చేయిస్తారు. నెయ్యి, బియ్యం, పప్పు, బెల్లం తదితర వస్తువులు స్వామివారికి సమర్పించుకోవటం ఇక్కడ వారి ఆచారం. ప్రతి ఉగాది పండుగ రోజున భక్తులు వచ్చి మొక్కులు తీర్చుకుంటారు. శ్రీవారి పాదాల వద్ద నెయ్యి పోసి చూసినట్లయితే మత్స్యావతారం నేతిలో లీలగా కన్పిస్తుంది. శ్రీవారు ఎండకు ఎండుతూ.. వానకుతడుస్తూ వుండటం ఇక్కడ విశిష్టత. అందువల్లనే శ్రీవారి విగ్రహం పైన కప్పు వేయకుండా ఉండటం విశేషం. 2001 జూన్ 24న స్వామి వారి వెనుకభాగంలో ఆలయంను నిర్మించి సిజిఎఫ్ నిధులతో తిరుపతి నుండి తీసుకువచ్చిన స్వామి విగ్రహాన్ని ప్రతిష్టించారు. ఈ ఆలయానికి సుమారు 11ఎకరాల పొలం దేవరంపాడు, నెమలిపురి గ్రామాల్లో ఉంది. దీనిపైన ప్రతి ఏడాది 7,630 రూపాయల ఆదాయంవస్తుంది. అయితే ప్రస్తుతం ఈ భూమంతా ఆక్రమణలో ఉంది.



స్వామివారి ఉత్సవాలకు జిల్లా నలుమూలల నుండే కాకుండా నల్గొండ, కృష్ణా, ప్రకాశం, కర్నూలు జిల్లాల నుండి వేలాది మంది భక్తులు విచ్చేస్తుంటారు. శ్రీవారికి పూజా కార్యక్రమాలు 12 ఏళ్ల కిందటి వరకు ప్రతి శనివారం మాత్రమే జరిగేవి. ఈ ఆలయ జీర్ణోధరణ పనులు మొదలు పెట్టిన నాటి నుండి నిత్య ధూప, దీప నైవేద్య ఆరాధనలు నిరాటంకంగా జరుగుతున్నాయి. అంతే కాకుండా ప్రతి శనివారం ప్రత్యేక పూజలు నిర్వహించబడతాయి.



ఇప్పటి వరకు రూ. 2 లక్షలతో మండప పునః నిర్మాణం, రూ.99 వేలతో మండప పిట్టగోడల నిర్మాణం, దాతలచే ఫ్లోరింగ్, నాప రాయి వేయించడం వంటి కార్యక్రమాలు పూర్తి చేసినట్లు ఆలయ మేనేజర్ రంగిశెట్టి సూర్య నారాయణ తెలిపారు.

స్త్రీలకు స్నాన పుగదులు, పొంగలి షెడ్డు, అర్చక సిబ్బంది క్వార్టర్స్, తారు రోడ్డు నిర్మాణం, నాలుగు కాటేజీల నిర్మాణం, టిటిడి కళ్యాణ మండ పం నిర్మాణానికి ప్రతిపాదనలు తయారుచేసి ప్రభుత్వానికి నివేదించినట్లు చెప్పారు. వీటికి నిధులు మంజూరు కావాల్సి ఉందని పేర్కొన్నారు.



పిల్లల కోసం ముడుపులు కట్టే వృక్షం



భక్తులు వెళ్లేందుకు ఏర్పాటు చేసిన మెట్లు

## స్వర్ణపురికి స్వర్ణాభరణం ఈ దేవాలయాలు

### దేశంలోనే మరెక్కడా లేని ప్రత్యేకతలు

అన్నం కేశవరావు, మేజర్‌న్యూస్, పొన్నూరు.

చారిత్రాత్మక ప్రసిద్ధి చెందిన స్థానిక శ్రీసహస్రలింగేశ్వర స్వామి దేవాలయం ఆవరణలోని ఉప దేవాలయాల్లో దేశంలోనే మరెక్కడా లేని విధంగా ఉన్న మూలవిరాట్‌లు భక్తులకు, పర్యాటకులను ఆద్యాంతం ఆకర్షిస్తున్నాయి. చిన కాశీగా పేరుఘడించిన ఈ దేవాలయాల గూర్చి కూలంకుషంగా తెలుసు కోవాలని ఉందికదు ఇంకెందుకు ఆలస్యం తెలుసుకుందా మా మరి...



గుంటూరు జిల్లా పొన్నూరులో బస్టాండ్ ఎదురు ఉన్న ఆహ్లాదకర ప్రాంతంలో 1961వ సంవత్సరం పిబ్రవరిలో శ్రీసహస్రలింగేశ్వర స్వామి దేవాలయాన్ని నిర్మించారు. 1110 శివలింగాలు ఏర్పాటు చేయడంతో ఈ ఆలయానికి సహస్రలింగేశ్వర దేవస్థానం అనే పేరు వచ్చింది. ఇక ఈ ఆలయంలో ప్రత్యేకతలు ఏంటో చూద్దాం. దేశంలోని ఏ శివాలయంలో చూసిన శివుని ఆకృతి లింగాకారంలో ఉంటుంది కాని నిజరూపం ఎక్కడా కనిపించదు. కాని ఇక్కడ శివుని పాలరాతి నిజరూప విగ్రహం ఉండడం ఒక ప్రత్యేకత కాగా శివ లింగంకు సంవత్సరం పాటు గంధాభిషేకం నిర్వహించి మాస శివరాత్రి రోజు దానిని తొలిచి భక్తులకు ప్రసాదంలా పంచుతారు. ప్రసాదాన్ని తీసుకోవడం వల్ల సర్వ రోగాలు నయమవడంతో పాటు సుఖ శాంతులు వర్ధిల్లుతాయని భక్తుల నమ్మకం. మరో విశిష్టత ఏమిటంటే మరెక్కడాలేని పెద్ద నంది కూడా ఇక్కడే ఉంది. ఈ దేవాలయ ఆవరణలో మరికొన్ని విశిష్టతలను పరిశీలిస్తే... ప్రపంచంలోని మరెక్కడా లేని విధంగా 24 అడుగుల ఎత్తు, 12 అడుగుల వెడల్పు ఉన్న ఏకశిల (మిగతా 118వపేజీలో)




పాలరాతి శివుడు

(117వపేజీ తరువాయి)

ఆంజనేయస్వామి విగ్రహం ఉంది. 30 అడుగుల ఎత్తు, 15 అడుగుల వెడల్పు కలిగిన గరుత్మంతుని విగ్రహం కలిగి ఉండడం ఇక్కడ మరో ప్రత్యేకత. 1969లో ఈ రెండు విగ్రహాలను, వాటికి దేవాలయాలను నిర్మించారు. సహస్రలింగేశ్వర దేవస్థానం ఆవరణలో దశావతారాల ఆలయం కూడా ఉండడం ఇక్కడి మరో ప్రత్యేకత. దక్షిణ భారత దేశంలో చిన్న కాశిగా ప్రసిద్ధిచెందిన శ్రీసహస్ర లింగేశ్వర దేవస్థానంను, ఆవరణలో ఉన్న ఉప దేవాల యాలను దర్శించుకునేందుకు దేశ విదేశాల నుండి వేలాదిమంది భక్తులు,పర్యాటకులు సందర్శిస్తూ తమ మొక్కులు తీర్చుకుంటారు.

ఈ ఆలయాలకు సంవత్సర ఆదాయం రూ.40 లక్షలకు పైమాటే. ఇన్ని ప్రత్యేకతలు కలిగిన ఆ దేవాలయాలను వెంటనే చూడాలనిపిస్తుంది కదూ ఇకెందుకు ఆలస్యం గుంటూరు జిల్లా పొన్నూరు వస్తే మీ కోరిక నెరవేరుతుంది.

# ఉద్యమాలకు ఊపిరి వెంకటపతి

బుర్లా శ్రీనివాస్, మేజర్‌న్యూస్,సత్తెనపల్లి

సాధరణ రైతు కుటుంబంలో పుట్టి రైతాంగ సమస్యలను అధ్యయనం చేసి 'కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు, మహా పురుషులవుతారు' అన్న ఆర్యోక్తిని అక్షరాలనిజం చేస్తూ సత్తెనపల్లి ప్రాంతం ఉద్యమ నాయకుడిగా, రైతు జన బంధవుడిగా ఎదిగిన నాయకుడు స్వర్గీయ పుతుంబాక వెంకటపతి. చిన్నతనంలోనే కమ్యూనిస్టు భావాలను పుణికి పుచుకున్న వెంకటపతి తుది శ్వాస విడిచే వరకు నమ్మిన సిద్ధాంతంకోసం కార్యదీక్ష, పట్టుదలతో అలుపెరుగని పోరాటం చేశారు. ఉద్యమాలకు ఊపిరి పోసి, సహచరులకు స్ఫూర్తిని నింపి రైతు కూలీలకు పోరాట పటిమను అలవర్చిన నాయకుడాయన. సిపిఎం పార్టీని అలుపెరుగని పోరాటలతో, ప్రజాసమస్యల కోసం పోరాడి పార్టీని బలపరిచి ప్రజల మనస్సులో చిరస్థాయిగా నిలిచారు. పుతుంబాక పయనించిన ఉద్యమాల బాటను పునరావలోకనం చేస్తే సత్తెనపల్లి ప్రాంతం తాలూకా పరిధిలోని బంజారు భూములను పేదలకు పంచటం కోసం జరిగిన ఉద్యమంలో పది నెలలపాటు జైలు శిక్షణ అనుభ వించారు. 1964లో అధిక శిస్తులకు వ్యతిరేకంగా ప్రజాపయోగ్యమైన ఉద్యమాలను నడిపి మారో మూడు నెలల జైలు జీవితాన్ని గడిపారు. నాగార్జున సాగర్ నిర్మాణం కోసం వేలాదిమంది రైతులతో భారీ బహిరంగ సభను ఏర్పాటు చేశారు . సాగర్‌నిర్మాణం జరగడానికి కుడి కాల్వ మరమ్మత్తులు, టైలండ్ భూములకు నీటి సౌకర్యం, పత్తి, మిర్చి పంటలకు గిట్టుబాటు ధరల కోసం చేసిన పోరాటం కోసం అన్ని ఇన్నీ కావు. ఎటువంటి సమస్యలనైన లోతుగా అధ్యయనం చేసి పని చేయని అధికారుల సైతం కదిలించి పరిష్కారంకోసం వెంకటపతి కృషి చేశారని పలువురు పేర్కొంటున్నారు.

## పదవులకు వన్నె తెచ్చిన పుతుంబాక

కమ్యూనిష్టు నాయకుడిగా పుతుంబాక వెంకటపతి రాజకీయరంగంలో ఎన్నో ఆటుపోటులను ఎదుర్కోన్నప్పటికీ చేపట్టిన ప్రతి పదవికి ఈయన వన్నె తెచ్చారు. 1953లో క్రోసూరు మండలం ఊటుకూరులో గ్రామ సర్పంచ్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1981లో ఫిరంగిపురం సమితి అధ్యక్షునిగా ఎన్నికయి రాష్ట్ర స్థాయిలో ఉత్తమ సమితి అధ్యక్షుడిగా ప్రసంశలందుకున్నారు. 1985లో సత్తెనపల్లి నియోజకవర్గంనుంచి శాసనసభ్యునిగా ఎన్నికై సత్తెనపల్లి ప్రాంత సమస్యలతో పాటు రాష్ట్ర రైతాంగ సమస్యలను ప్రస్తావించి తన సమర్ధతను నిరూపించుకొన్నారు. పోరటాల గడ్డగా సత్తెనపల్లికి పేరు ప్రఖ్యాతలు వెంకటపతి తీసుకొచ్చారు.

## 'కూని'రాగాలు

ఆరాటంలో వచ్చే పోరాటపటిమ
అపజయాలకు మూలం కావచ్చు!

భారం ఎంతైనా భరించేంతవరకే!
గానం ఏదైనా వినేంతవరకే!

గెలుపు బాటలో అలుపునూ
నిజం కోసం నిష్ఠూరాన్ని భరించాలి!
అపనిందల భారం దించుకుంటే
అపహాస్యం పాలుకాకుంటే మంచిది!

మిత్రభేదం కలుగకూడదు!
కలహ భోజనం తినకూడదు!

గతం మరువలేని జ్ఞాపకం!
వాస్తవం నిదురరాని మౌనం!

తలపండిన అనుభవం ఒకవైపు!
తలపులెండిన ఎదురుచూపు మరోవైపు!

ఉసురు తీయడానికి ఉరకలేసే వెర్రితనం!
జీవితకాలం సృష్టించగలదా ఉసిరినైనా!

ధాత్రి అంతా యాత్రకు పనికిరాదు!
చరిత్ర ఎన్నడూ నీకోసం నిలిచిపోదు!

ఎన్నో కథలను భరిస్తుంది పుస్తకం!
ఎందరి కథనాలతోనో జీవిస్తుంది సమాజం!!

వాత్సల్యం జాథ మరువ కూడదు!
వార్థక్యం రూపు మార్చ కూడదు!!

నిన్న తో పోరాడిన జీవితం!
రేపుతో రాజీ యత్నాలు సాగిస్తుంది!!

స్తుతి దేవునికి నైవేద్యం!
శ్రుతి రాగానికి ఆహార్యం!!

స్పందన భాషకు అతీతం!
వాంఛ వివేకానికి లొంగనిది!!

సహవాసం నమ్మకంతో సార్థకం!
జనవాసం స్వార్థంతో మమేకం!!

కూనిరెడ్డి శ్రీనివాస్





# సాహిత్య సిద్ధాంత ఆవిష్కర్తలు వినుకొండవారే

శిఖా అనిల్ కుమార్, శావల్యాపురం మండల రిపోర్టర్

★దళిత సాహిత్య సిద్ధాంత కర్త గుఱ్ఱం జాషువా

"నా కవితా వధూటి వదనంబు నెగాదిగా చూచి భళీభళియన్నవాడె నీదేకులమని ప్రశ్న వెలయించి చివాలున లేచిపో బాకున గుమ్మినట్లగున్ పార్థివచంద్రా వచింప సిగ్గగున్"-జాషువా



గుఱ్ఱం జాషువా, స్పెషల్ స్టోరీ,

బాల్యం నుండే అనుభ వించిన అంటరానితనమనే అమానవీయ వివక్షకు మూ లమైన నాల్గుపడగల హైందవ విష సంస్కృతిపై అక్షర పోరాటం చేసిన సాంస్కృతిక సైనికుడు జాషువా. ఆధునిక సాహిత్యంలో అరుదైన మానవతా వాది. తెలుగు సాహిత్యంలో దళిత సాహిత్య తాత్విక భూమికను ఇచ్చిన తొలి తెలుగు దళిత కవి జాషువా. తాను దళిత సాహిత్యానికి ప్రధమ ప్రవర్తకుడు కాగా, తాను రచించిన గబ్బిలం దళిత కవిత్వానికి ప్రార్థనాగీతమైంది.

జాషువా గుఱ్ఱం వీరయ్య, లింగమ్మలకు 1895 సెప్టెంబరు28న వినుకొండ శివారు గ్రామమైన చాత్రగడ్డపాడు గ్రామంలో జన్మించాడు. జాషువా పేదరి కంలో పుట్టాడు. ప్రాథమికోపాధ్యాయునిగా జీవితాన్ని ప్రారంభించి, టూరింగ్ టాకీస్ సినిమా వ్యాఖ్యాతగా ఉన్నా, రెండో ప్రపంచయుద్ధ సమయంలో ప్రాప గండ ఉద్యోగిగా పని చేసినా, ఆకాశవాణిలో ప్రొడ్యూసర్ పదవి పొందినా, యంయల్‌సి అయినా, క్రమంగా జాషువాకు పేదరికం దూరం అయినా ఆయ న కవిత్వంలో పేదరికం పట్ల అచంచలమైన ప్రేమ ఆయన సాహిత్య భూమిక అయింది.



కవికరీముల్లా

కవికోకిల, కవితా విశారద, కవిదిగ్గజ, మ ధురశ్రీనాధ, నవయుగ కవి చక్రవర్తి, విశ్వకవి సామ్రాట్ అను బిరుద ములతో వేయికిపైగా సన్మానాలు పొందాడు. తిరుపతి వేంకటకవులచే గండపెండేరము ధరించి కనకాభిషేకము పొంది, గజారోహనుడై పగటి దివిటీల పల్లకీలో ఊరే గించారు. గుంటూరు పట్టణం ఆయనకు స్వే చ్ఛా పౌరసత్వం ఇచ్చి గౌరవించింది. జాషువా రాసిన 'క్రీస్తు చరిత్ర'కు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు రాగా, అప్పటి రాష్ట్రపతి సర్వేపల్లి చేతుల మీదుగా 'పద్మభూషన్' అందుకున్నాడు. ఆంధ్ర విశ్వవిద్యా లయం 'కళాప్ర పూర్ణ' బిరుదుతో గౌరవించగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శాసన మండలి సభ్యునిగా నియమించింది.

హిందూ సమాజంలో వేళ్ళూనుకుని ఉన్న కుల పీడన, సాంఘిక దుర్నీతిని తీవ్రంగా నిరశిస్తూ జాషువా రాసిన గబ్బిలం గత సహస్రాబ్ది ఐదు గొప్ప పుస్త కాలలో ఒకటిగా (ప్రముఖ ఆంగ్లదినపత్రిక పయనీర్ నిర్వహించిన సర్వే ప్రకా రం) నిలిచింది. దళిత సాహిత్యోద్యమానికి పునాదులు వేసిన జాషువా కవిత్వం ఎప్పటికీ దళిత కవుల్ని వెంటాడుతూనే ఉంటుంది. దళిత సాహిత్య సిద్ధాంత కర్తగా జాషువా దళిత కవులకు స్ఫూర్తిగా నిలిచాడు. ముప్ఫైకి పైగా రచనలు చేసిన ఆయన 1971 జులై24న కీర్తిశేషులయ్యారు. వినుకొండ కీర్తిని దశ దిశలా చాటారు.

'రాజు మరణించె ఒక తార రాలిపోయె
సుకవి మరిణించె నొకతార గగనమెక్కె'

★ఇస్లాంవాద సాహిత్య సిద్ధాంతకర్త కరీముల్లా

తెలుగు సాహిత్యంలో శాంతి, సహజీవన సూత్రాల నేపధ్యం గల ఇస్లాం వాద సాహిత్యాన్ని ఆవిష్కరించినవారు షేక్ కరీముల్లా. వినుకొండకు చెందిన ఈయన వృత్తి ఉపాధ్యాయం, ప్రవృత్తి కవిత్వం. హిందువైనా, ముస్లిమైనా కన్నీ రొక్కటే కష్టాలొక్కటే అనే స్పష్టమైన అవగాహనతో సమాజంలోని అట్టడుగు వర్గాల గాయాలను గేయాలుగా మలుస్తున్న కవి కరీముల్లా. నాగార్జున విశ్వ విద్యాలయం నుంచి ఎం.ఏ., ఉస్మానియా నుండి బి.యిడి, డిగ్రీలు పొందిన కరీముల్లా కవిగా జాతీయ,రాష్ట్రస్థాయిల్లో అనేక బహుమతులు సన్మానాలు పొందారు.

కరీముల్లా వ్రాసిన 'సాయిబు' దీర్ఘ కవిత ఇస్లాంవాదాన్ని ఆవిష్కరించడమే కాక తెలుగు సాహిత్యంలో నూతనమైన ఆలోచనలకు దారి చూపింది. కరీముల్లా కవిత్వంపై అనేకవిశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరుగుతు న్నాయి. ఈయ న కవిత్వంపై ఉర్దూ, ఆంగ్ల దినపత్రికలలో విశ్లేషణలు రావ డం విశేషం. ఒక ముస్లిం దేశ భక్తునిగా తన హృదయ వేదనను కవిత్వంలో అంతర్లీనంగా మలిచి సామాజిక స్పృహతో ముందుకు సాగుతున్నారు కవి షేక్ కరీముల్లా. ఈ తరంలో వినుకొండ ప్రాంతానికే గర్వకారణంగా నిలిచిన కరీముల్లా తన సాహిత్యంతో ముమ్ముందు ఈ ప్రాంతానికి మరింత వన్నె తెస్తారనడంలో సందేహం లేదు.

## బడుగు బలహీనవర్గాలవారికి చేయూతనిచ్చి చేరువైన 'కేసన'



హాస్టల్ విద్యార్థులకు దుప్పట్లు పంపిణీచేస్తున్న కేసనశంకరరావు

రేపల్లె, మార్చి 30(మేజర్‌న్యూస్): బడుగు బలహీన వర్గాల పేద ప్రజలకు ఏ దో చేయాలన్న ఆశయంతో రాజకీయాల్లోకి ప్రవేశించి రాజకీయాలలో తన కంటూ గుర్తింపు ఏర్పరచుకుని కూచినపూడి నియోజకవర్గ టిడిపి ఇన్‌చార్జిగా బాధ్యతలు నెరవేరుస్తూ అందరి మన్ననలు పొందుతూ తోటివారితో కలసి అం దరినీ కలుపుకుని సాగిపోతున్న వ్యక్తి కేసన శంకరరరావు. నియోజకవర్గంలో ఏ చిన్న కార్యక్రమం జరిగినా తప్పకుండా హాజరై తనవంతు సహకారాన్ని అం దిస్తారు. అంతేకాకుండా పేద విద్యార్థులు సాంఘిక

(మిగతా 120వ పేజీలో)

# బడుగు బలహీనవర్గాలవారికి చేయూతనిచ్చి చేరువైన 'కేసన'

(119వ పేజీ తరువాయి)

సంక్షేమహాస్టళ్ళల్లో జీవిస్తు న్నవారి పరిస్థితులపై పార్టీ పిలుపుమేరకుపరిస్థితులను సమీక్షించి తోటివారితో కలసి తనవంతు సహాయంగా విద్యార్థులకు దుప్పట్లు పంపిణీ చేసి తన ఔదా ర్యాన్ని టుకున్నారు. మండలంలో రైతులకు ఉత్సాహాన్ని కలిగించాలన్న ఆలో చనరాగానే దానిని అమలుచేయాలన్న సంకల్పంతో స్వచ్ఛందసంస్థలతో కలసి రేపల్లె మండల పరిధిలో రాష్ట్రస్థాయి ఎండ్లపందాలు నిర్వహించి టిడిపి నాయ కులందరినీ ఒకతాటిపైకి తీసుకువచ్చి కార్యక్రమాన్ని విజయవంతంచేసి ప్రజల లో పార్టీపై



అకాలవర్షంతో పాడైన పంటను పరిశీలిస్తున్న కేసన శంకరరావు తదితరులు



రాష్ట్రస్థాయి ఎండ్ల పందాలలో పాల్గొన్న కేసనశంకరరావు

గౌరవాన్ని పెంపొందించిన ఘనత ఆయనకే దక్కింది.

ఇదేవిధంగా కొనసాగుతూ రాబోయే కాలంలో టిడిపి అధ్యక్షుడు నారాచంద్రబాబునాయుడు నాయకత్వంలో పార్టీ అధికారం చేపడుతుందన్న నమ్మకాన్ని కలిగించారు. అదేవిధంగా ప్రభుత్వంలో జరుగుతున్న అవినీతి కార్యక్రమాలపై తనదైన ధోరణిలో అడ్డుపడుతూ పార్టీ తరుపున వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తూ ప్రజలలో పార్టీపై నమ్మకాన్ని పెంపొందిస్తున్నారు. అకాల వర్షాలకారణంగా రైతులకు నష్టంవాటిల్లిన సమయం లో నాయకులు, అధికారు లెవరూ రైతులను ప ట్టించుకోని సమయంలో ఆయన రైతులదగ్గరికి వె ళ్లి వారి కన్నీరు తుడవటానికి తనవంతు కృషిచేసి ప్రభు త్వంపై నిరసన విధానాన్ని వ్యక్తపరిచి రైతులకు చేరు వై పలువురికి ఆదర్శమ య్యారు. ఇదేవిధంగా నా యకులందరు ఒకే తాటిపై నడిపిస్తే టిడిపి అధికారం చే పడుతుందన టంలో అతిశయోక్తిలేదు.

# డాక్టర్ చంద్రమౌళి నేటి తరానికి ఆదర్శకులు



డాక్టర్ సజ్జా చంద్రమౌళి

పొన్నూరు మేజర్ న్యూస్: పేదల కష్ట సు ఖాలు తెలిసిన వ్యక్తి గా వైద్య పరంగా వారికి ఉచిత, ప్రత్యేక రాయి తీలతో అత్యాధునిక వై ద్య సేవలందిస్తూ మంచి డాక్టర్‌గాగుర్తిం పు పొందారు. ప్రజాభి మానాలు మెం డుగా ఉన్న ఆయన రెండు సార్లు శాసన సభ్యు లుగా గెలుపొందారు ది. ఎన్నో ప్రజా సమస్య లను పరిష్కరించి నేటి కీ అందరి హృదయా లలో చెరగని ముద్ర వేసుకున్న డాక్టర్ సజ్జా చంద్ర మౌళి నేటి తరానికి ఆదర్శకులుగా నిలిచారు.

ప్రకాశం జిల్లా వేట పాలెంలో సజ్జా నాగభూషణం కోటమ్మల గర్భాన జన్మిం చిన చంద్రమౌళి చిన్నతనం నుంచి విద్య పట్ల ప్రత్యేక శ్రద్ధను కనపరిచేవారు. పేదవారికి వైద్యసేవలందించాలనే ఉద్దేశ్యంతో డాక్టరేట్ చదివిన ఆయన 1952లో పొన్నూరులో తొలిసారిగా అత్యాధునిక సదుపాయలతో వైద్యశాలను నిర్మించారు. మంచి శస్త్రచికిత్స నిపుణులుగా పేరొందిన డాక్టర్ చంద్రమౌళి



ఇటీవల ట్రస్టు తరుపున ఏర్పాటు చేసిన మెగా ఉచిత వైద్య శిబిరాన్ని ప్రారంభిస్తున్న డాక్టర్ రవీంద్రబాబు

గుంటూరు జిల్లాలోనేకాక కృష్ణా,ప్రకాశం జిల్లాలలో కూడా అత్యంత క్లిష్టమైన

(మిగతా 121వ పేజీలో)

















# డాక్టర్ చంద్రమౌళి నేటి తరానికి ఆదర్శకులు

(120వ పేజీ తరువాయి)

శస్త్రచికిత్సలను విజయవంతంగా పూర్తి చేసి ఎందరికో ప్రాణదానం చేశారు. 1981వ సంవత్సరంలో జనతా పార్టీ తరుపున చీరాల నియోజకవర్గం నుంచి శాసన సభ్యులుగా గెలుపొంది. ఆ ప్రాంతా ఎన్నో ప్రజా సమస్యలను పరిష్కరిం చారు. 1985వ సంవత్సరంలో తెలుగు దేశం పార్టీ తరుపున అదే నియోజక వర్గం నుంచి విజయ దుందిభి ఎగురవేసిన ఆయన సీనియర్ ప్రజా ప్రతి నిధిగా ఎనోక్న సమస్యలను పరిష్కరించటంతో పాటూ కీలకమైన అభివృద్ధి పనులను చేపట్టారు. చంద్రమౌళి కుమారుడు డాక్టర్ రవీంద్రబాబు తండ్రిలోని సేవా స్ఫూర్తిని, దాత్రుత్వాన్ని పులికిపుచ్చుకున్న రవీంద్రబాబు డాక్టర్ సజ్జా చంద్రమౌ ళి మల్లికాంబ చారిటబుల్ ట్రస్టు ఏర్పాటు చేసి గుంటూరు, ప్రకాశం తదితర జిల్లాలలో ఎన్నో ఉచిత మెగా క్యాంపులు ఏర్పాటు చేసి వేలాధి మంది పేదలకు ఉచిత వైద్య సేవలను అందజేశారు. పొన్నూరులోని డాక్టర్ చంద్రమౌళి వైద్యశాల దినదినాభివృద్ధి చేయటంతో పాటు గుంటూరులో అత్యాధునిక విదేశి పరిజ్ఞానంతో హెల్త్ హస్పటల్‌ను నిర్మించి పేద, మధ్యతరగతి వారికి కూడా అత్యాధునిక వైద్య సేవలు అందుబాటులో ఉండాలనే లక్ష్యంతో ఉచిత, ప్రత్యేక రాయితితో వైద్య సేవలను అందిస్తూ ఆ తండ్రికి తగిన తనయుడుగా గుర్తింపు పొందారు. డాక్టర్ రవీంద్రబాబు అర్ధాంగి డాక్టర్ సజ్జా హేమలత వారికిలాగానే సేవాతత్వంమెండు చంద్రమౌళి రాజకీయ వారసురాలిగా తెలుగు దేశం పార్టీలో ఎన్నో పార్టీ పరమైన పదవులను చేపట్టి ప్రస్తుతం ఆ పార్టీ రాష్ట్ర బిసిసెల్ మహిళా ఉపాధ్యక్షురాలు పదవిని సమర్ధవంతంగా నిర్వహిస్తున్నారు. పేదల కష్ట సుఖాలను అర్థం చేసుకోగలిగిన హేమలత రానున్న రోజుల్లో మంచి పదవులను అదిరోహించి పేద వర్గాల అభివృద్ధికి తొడ్పడతారని ఆసిద్దాం... రానున్న రోజుల్లో డాక్టర్ సజ్జా చంద్రమౌళి మల్లికాంబ చారిటబుల్ ట్రస్టు ఆధ్వర్యంలో ఎన్నో ఉచిత వైద్య మెగా క్యాంపులు ఏర్పాటు చేయనున్నట్లు డాక్టర్ సజ్జా రవీంద్రబాబు, డాక్టర్ హేమలతలు పేర్కొంటున్నారు.



# కళలకు జీవం పోస్తున్న స్వరలయ

టి.ఆర్.కోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి



స్వరలయ ఎనిమిదో వార్షికోత్సవ వేడుకలు

చీకటి తెరల మాటున శిధిలమవుతున్న కళల ఔన్నత్యాన్ని నేటి తరానికి అందించేందుకు కృషిచేసేవారు అరుదుగా కనిపిస్తారు. ఎంతటి రసహృదయులైనా వృత్తి ధర్మానికి తప్ప ప్రవృత్తికి అంత ప్రాధాన్యత ఇవ్వరు. మన సంస్కృతిని పరిరక్షించడంలో, భవిష్యత్తు తరాలకు అందించడంలో కళలను మించిన సాధనం మరొకటి లేదు. అలాంటి కళారంగాన్ని పునరుజ్జీవింపచేసేందుకు నిరంతరం కృషిచేస్తున్నవారిలో సాయిలక్కరాజు ఒకరు. ఆయన స్థాపించిన స్వరలయ వేదిక కళలను ప్రోత్సహిం చడంలో నిజమైన వేదికగానిలిచింది. 1999 లో స్వరల య వేదిక స్థాపనకు ముందు ఎన్నో సాంస్కృతిక కార్యక్ర మాలను నిర్వహించిన కళాపిపాసి లక్కరాజు. కళను సేవించు, పూజిం చు, తరించు అన్న వాక్కు నిజం చేసిన ఆయన వృత్తిరీత్యా బ్యాంకు ఉద్యో గి. అప్పట్లో స్పందన పే రుతో ఒక సామాజిక సంస్థను స్థాపించారు. వృద్ధాప్యంలో ఆదరించే ఆపన్న హస్తం కోసం ఎదురుచూసే వృద్ధులకు దీని ద్వారా సేవ చేశారు. మహా నటులు గోవిందరాజుల సుబ్బారావు శతజయంతిని పురస్కరించుకుని ఆయన స్మారకార్థం అవార్డును ఏర్పాటుచేసి ప్రముఖ క్యారెక్టర్ నటులు కోటా శ్రీనివాసరా వుకు అంద జేశారు. సాయిలోని కళాతృష్ణకు పరాకాష్ట సంగీత సాంస్కృతిక సంస్థ స్వరలయ వేదిక స్థా పన. ప్రముఖ సినీ సంగీత దర్శకు లు ఎం.ఎం.కీ రవాణి చేతుల మీ దుగా సంస్థ ప్రా రంభమైంది. ఎంతో మంది వర్ధ మాన కళాకా రులకు ఈ వేదిక అ వకాశాలు కల్పించింది. ప్రతి ఏటా ఉగాది పురస్కారాలు అందజేస్తున్నారు. గజల్ గాయ కులు శ్రీనివాస్, కోటా శ్రీనివాసరా వు, సినీ నటి సౌందర్య,

(మిగతా 122వ పేజీలో)

# ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులకు బీమా కల్పించరూ...

లీలానంద్, మేజర్‌న్యూస్, చిలకలూరిపేట

రాష్ట్రంలోని రాజకీయ నేతలు ఇటీవలికాలంలో ఆరోగ్యంగా ఉన్న ఓటర్లకు వరాలు కురిపిస్తున్నారు కానీ అనారోగ్యంతో ఉన్న ఓటర్లకు పథకాలు ప్రక టించకపోవటం విశేషం. దీర్ఘకాలం నుంచి దేశ వ్యాప్తంగా ప్రజలను వణికిస్తున్న వ్యాధి ఎయిడ్స్. ఈవ్యాధిగ్రస్తులు ఏవిధంగా మనుగడ సాధించాలి అనేది ప్రశ్నార్థకంగా మారింది. వీరి కొరకు ప్రభుత్వం నేటి వరకు వసతి గృహాలు, పాఠశాలలూ ఏర్పాటు చేయలేదు. రైతులకు, డ్వాక్రాసంఘాలకు తక్కువ ధరకే భీమా సౌకర్యాన్ని కల్పిస్తున్న ప్రభుత్వం ఎయిడ్స్ వ్యాధి గ్రస్తు లకు ఈసౌకర్యం కల్పించలేదు. వ్యాధి గ్రస్తులు ఓటర్లు కారా లేక రాజకీయ పార్టీలకు వీరి ఓట్లు అవసరం లేదా అని వారు చర్చించు కుంటున్నారు.

రాష్ట్రంలో సమారు ఐదు లక్షలమంది ఎయిడ్స్ వ్యాధి గ్రస్తుల ఓటర్లు ఉన్నారు. ఈసమస్య రాష్ట్రానికే పరిమితం కాదు దేశ వ్యాప్తంగా ఒకే విధానాన్ని అమలు చేసి వీరికి చేయూత నివ్వాల్సిన అవసరం ఏంతైనా ఉంది ప్రజాప్రతినిధులకు. ఎయిడ్స్ ఉన్న వారిని అంటరాని వారిగా చూడకూడదు వారిని ఆత్మీయులుగా చూడాలి అని తెలుపుతారు అంటరాని వారుఅయ్యారు కావున నేడు వారికి పథకము ప్రకటించలేదు. ఎయిడ్స్‌ను ఓడిం చటానికి పదిసూత్రాలను ఆచరించ మన్నా ఏఒక్కటీ ఆచరణలోకి రా లేదు. నిశబ్ధాన్ని బద్దలు కొట్టాలి అంటారు నిశబ్దాన్ని శబ్దం చేస్తే వ్యాధి గ్రస్థులను పలకరించేవారు ఉండరు. చైతన్యులను చేయాలి అంటారు ఏవిధంగా చేయాలి ప్రభుత్వ సౌకర్యాలు లేవు. వివక్షత అపార్థాలు చేయరాదని తెలుపుతారు ప్రజ లలో అక్షరాస్యత పెరిగినా అవహేళన తగ్గలేదు. ఎయిడ్స్ పరిష్కారానికి కార్యాచరణకు పూనుకోవాలన్నాఅందుకు అవసరమైన నిధులు లేవు కార్యాచరణ ఏవిధం గా సాధ్యమవుతుంది. చట్టసభల దృష్టి ఎయిడ్స్ పై మళ్ళించండి అని అన్నారు దీర్ఘకాలంనుండి కేంద్రం లో, రాష్ట్రంలో ఉభయ సభలు జరు గుతున్నా నేటి వరకు వ్యాధిగ్రస్తులపై ఒక్కనిమిషం ప్రసంగించారా లేదు. నిధుల కేటాయింపుకు కృషి చేయాలన్నారు గ్రామంలోని వార్డు సభ్యులనుంచి నియోజక వర్గ ప్రజాప్రతి నిధి వరకు ఉన్నా నిధులు సున్నా. ఈవిధంగా ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులకు ప్రభుత్వం ఏవిధమైన సాయాన్ని అందిం చలేదు. రోజురోజుకీ వ్యాధి పెరు గుతున్నా ప్రజా ప్రతి నిధులలో చలనం లే దు. రాష్ట్ర బడ్జెట్‌లో ప్రత్యేకంగా నిధులు కేటా యించ లేదు. ఆపదలో ఉన్న కుటుంబ యజమాని మృతి చెదినా,వాగులు వంకలలో వ్యక్తులు మరణిస్తే వారికి ఆపద్బంధు పథకంద్వారా ప్రభుత్వం ఆర్థిక సహాయం అందిస్తుంది ఎయిడ్స్ వ్యాధితో కుటుంబ యజమాని మృతి చెందితే అటువంటిది అమలుకు నోచుకోదు. తొలిసారిగా1986లో తమి ఈనాడు రాష్ట్రంలో ఈవ్యాధిని గుర్తించిన అధికారులు నాటి నుండి నేటివరకు నివారణా మార్గాలు చూసేందుకు ఉత్సాహం ప్రదర్శించరు. రాష్ట్రంలో సాక్స్,ఎయిడ్స్ నియంత్రణా సంస్థలను ఏర్పాటు చేసి చేతులు దులుపుకోవటం మినహా అంతకు మించి చేసింది శూన్యమే. జాతీయ ఎయిడ్స్ నియంత్రణా సంస్థ అయిన నాకో గణాంకాలను బట్టీ జాతీయ స్థాయిలో రోజురోజుకీ ఏవిధంగా పెరుగుతుందో రాష్ట్రంలో అదేవిధంగా ఉంది. వ్యాధిలో లోరిస్క్,హైరిస్క్‌లు ఉన్నట్లు వైద్యులు నిర్ధారించినా మానవ జీవితానికి రిస్కే అవుతుంది. రాష్ట్రంలో మద్యం అమ్మకాలు పెరుగుతున్న విధంగానే ఎయిడ్స్ వ్యాధిగ్రస్థుల సంఖ్య పెరుగుతూనే ఉంది. సాంప్రదాయ వేశ్యావృత్తులు, సెక్స్ బలహీనతలు, వలసలు కొనసాగటంతో వ్యాధి ఎవరికి ఉంది ఎవరికి లేదు అని ఏవరికి వారే నిర్ధారించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఎయిడ్స్ సోకిన వారికి ప్రజాజీవితంలో మనవహక్కులు మృగ్యమైనాయి.

రాష్ట్రంలో దీర్ఘకాలం నుంచి చిలకలూరిపేట, పెద్దాపురం, హైదరాబాద్ మెదలగు ప్రాంతాలలో వేశ్యావృత్తులు కొనసాగుతూనే ఉన్నాయి.

అంతేకాక ఆయా ప్రాంతాలలో హెచ్.ఐ.వి, ఎయిడ్స్ వ్యాధి గ్రస్థులు ఎక్కువగా ఉన్నారని గణాంకాలు తెలుపుతున్నాయి. ప్రభుత్వం ముందుగా ఆయా ప్రాంతాలలో సర్వే జరిపి ఎంత మంది వ్యాధిగ్రస్థులు ఉన్నారో లెక్కించి వారికి పునరావాసం వారి పిల్లల మనుగడ కొరకు ఏర్పాట్లు చేయాల్సిన అవసరం ఏంతైనా ఉంది. ముందుగా వేశ్యావృత్తులలోకి యువత ఎందుకు ఈరంగంలోకి వస్తున్నారు వారికి ఆర్థిక సామాజిక సమస్యలు ఉన్నాయా ఉంటే వాటిని ప్రభుత్వ పరిష్కరించాల్సిన అవసరం ఏంతైనా ఉంది.

ఎయిడ్స్ వ్యాధి గ్రస్తులను మేము మీ వ్యాధులను తగ్గిస్తాం అని అనేక మంది వైద్యులు దోచుకుంటున్నారు. అంతేకాక నాటు,భూత వైద్యాల పేరుతో కొందరు దోచుకుంటున్నారు. ఎక్కువ మంది వ్యాధిగ్రస్థులు పేదవారు ఉంటారు. వ్యాధి ఉన్నవారికి అప్పుపుట్టదు... పూట గడవదు ఈవిధంగా లక్షలాదిమంది జీవితాలు వెళ్ళదీస్తున్నారు. ఇప్పటికైనా అధికారులు ప్రజాప్రతినిధులు స్పందించి హెచ్.ఐ.వి.,ఎయిడ్స్ వ్యాధిగ్రస్థుల జీవనానికి, వారికి జన్మించిన పిల్లల భవిష్యత్‌కు పునాదులు వేయాల్సిన అవసరం ఏంతైనా ఉంది.



ఒక ప్రైవేటు కార్యక్రమంలో అతిథిగా లక్కరాజు

# కళలకు జీవం పోస్తున్న స్వరలయ

(121వ పేజీ తరువాయి)

జయప్రకాష్ నారాయణ, ఎస్.వి.కృష్ణారెడ్డి తదితర ప్రముఖులు ఈ అవా ర్డులు పొందారు. ప్రముఖ పాత్రికేయులు తుర్లపాటి కుటుంబరావు ఆయన చేస్తున్న కార్యక్రమాలను చూసి ఉక్కురాజు అంటూ ప్రశంసించారు. ఢిల్లీ తెలుగు అకాడమీ ఉగాది పురస్కారంతో పాటు రాష్ట్రీయ వికాస్ శిరోమణి బిరుదుతో సత్కరించింది. ఢిల్లీ తెలుగు సంఘం 2002వ సంవత్సరంలో డి.టి.ఎస్ అవార్డును అందజేసింది. ప్రపంచ తెలుగు సమాఖ్య స్వరలయను తమ అనుబంధ సంస్థగా ప్రకటించింది. ఇప్పటికి మూడు సార్లు ప్రపంచ తెలుగు సభల్లో ఉపన్యసించిన ఆయన సింగపూర్, దుబాయ్, మలేషియా తదితర దేశాలు పర్యటించారు. ప్రతిభ ఉండి ఆదరణకు నోచుకోని ఎంతో మంది కళాకారులకు వేదిక కల్పించి బాసటగా నిలిచే ఆయన హృదయ స్వరలయలు, హృదయ కవనాలు, కితకితలు వంటి రచనలు చేశారు.

తెనాలి పట్టణంలో ఫైన్ అర్ట్స్ కళాశాల నిర్మించాలన్నదే తన ఆశయమని చెప్పే సాయి తరచు ఒక మాట చెప్తుంటారు. "మాతృత్వం మూగబోతే సృష్టి ఆగిపోతుంది, దాతృత్వం ఆగిపోతే కళ నిలిచిపోతుంది" అని ఇది వాస్తవమే కదా.











# పరిశ్రమల్లో 'కుమార్' కొత్త వరవడి

తేళ్ళూరి రామకోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి

సరైన ప్రణాళిక, అందుకు తగిన కృషి చేస్తే ఏ రంగంలోనైనా విజయం సాధించవచ్చని ఎంతోమంది మహనీయులు నిరూపించారు. స్థిర సంకల్పంతో తనకుతానే లక్ష్యాన్ని నిర్దేశించుకుని ఆ దిశలో అనితరసాధ్యమైన విజయాలు సాధించిన వ్యక్తి కొత్త సుబ్రహ్మణ్యం. ఆయన స్థాపించిన కుమార్ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్, అక్కడ ఉత్పత్తి జరిగే కుమార్ పంపుల గురించి రాష్ట్రంలో తెలియని వారుండరు. కొయంబత్తూరు పరిశ్రమల అధిప త్యాన్ని కాదని తెనాలిలో పరిశ్రమను స్థాపించి కొత్త వరవడికి శ్రీకారం చుట్టిన ఆయన ఆ రంగంలో విజయం సాధించి మరింతమంది ఔత్సాహికులకు స్ఫూర్తిమంతంగా నిలిచారు. చుండూరు మండలం యడ్లపల్లి గ్రామంలో సాధారణ రైతు కుటుంబంలో జన్మించిన ఆయన అని వార్య కారణాలతో డిగ్రీ విద్యను మధ్యలోనే వదిలే శారు. ఆ తర్వాత తెనాలిలోని వహబ్‌చౌక్‌లో 1971వ సంవత్సరంలో ఆటోమొబైల్ విడి భాగాలు విక్రయించే షాపును నెలకొల్పారు. ఏదైనా తాను నాణ్యత కలిగిన వస్తుఉత్పత్తితో ప్రత్యేక గుర్తింపు పొందాలని తపించిన ఆయన 1973వ సంవత్సరంలో నీటి పంపును తయా రుచేసేందుకు ఉపక్రమించారు. దానికి కుమార్ అని నామకరణం చేశారు. నాణ్యతలో రాజీ పడక పోవడంతో వారి ఉత్పత్తి క్రమంగా ఆదరణ చూరగొంది. అప్పట్లో కొయంబత్తూరులో తయారయ్యే పంపులకు మాత్రమే విశేష ఆదరణ ఉండేది. పంపు సెట్ల విషయంలో కొయంబత్తూరు కేంద్రంగా నిలిచింది. దాన్ని కాదని 1976వ సంవత్సరంలో ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లో ఒక యూనిట్‌గా ప్రారంభించి క్రమంగా సంస్థ విస్తరించింది. పిస్టన్ పంపులు, మోనో బ్లాకులు, జెట్ పంపులు, హ్యాండ్ పంప్స్ ఇతర అన్ని రకాల పంపులను 0.5 అశ్వశక్తి నుంచి 10 అశ్వశక్తి వరకు పంపులను ఉత్పత్తి చేస్తున్నారు. గృహావ సరాలకు, వ్యవసాయ అవసరాలక నుగుణంగా ఉత్పత్తులను ఎప్పటి కప్పుడు ఆధునిక, సాంకేతిక పరిజ్ఞా నాన్ని ముందుకు జోడించి ముందుకు వెళ్తున్నారు. సంస్థ ఉత్పత్తులు, వాటి నాణ్యత గుర్తించిన భారత ప్రభుత్వం 1998 సంవత్సరంలో సంస్థ అధినేత ఉత్తమ పారిశ్రామికవేత్త అవార్డును ఇచ్చి సత్కరించింది. రాష్ట్ర స్థాయిలో, జిల్లా స్థాయిలో ఆయన పొందిన గౌరవాలకు లెక్కలేదు. ఇంత పెద్ద సంస్థ నిర్వహణలోనూ ఆర్థికపరమైన అంశాల విషయంలో కూడా ఎలాంటి ఒడిదుడుకులకు అవకాశం రానివ్వ కుండా వ్యవహరించడం సుబ్రహ్మణ్యం ప్రత్యేకత. అం దుకే ఆదాయ పన్ను శాఖ కూడా ఉత్తమ పన్ను చెల్లింపుదారుగా ఆయనను గౌరవించింది. ఇటీవలనే ఐ.ఎస్.ఐ ప్రమాణాలతో కూడిన తాగునీటి శుభ్రపరిచే యూనిట్‌ను ప్రారంభించారు. శుభ్రం పేరుతో ప్రస్తుతం మార్కెట్‌లో విక్రయాల్లో ముందంజలో ఉంది.



కుమార్ పంప్స్ అధినేత కొత్త సుబ్రహ్మణ్యం

కుమార్ ఉత్పాదనలు




# అందానికి మెరుగులు.. కురులకు హంగులు



ఫేషియల్స్ చేస్తున్న శివప్రసాద్





నేటి యువత రోజుకో కొత్తదనం కోరుకుం టోంది. అందులో భాగంగానే వేష, వస్త్రధారణలో పెనుమార్పులు వస్తున్నాయి. నలుగురిలో సరి కొత్తగా కనిపించేందుకు తహతహలాడుతోంది. ముఖాకృతికి తగినట్టుగా తలకట్టు, ఆకర్షణీయ మైన మోము కోసం విశ్వప్రయత్నాలు చేస్తోంది. ఇలాంటి వారి కోసమే..

గుంటూరు నగరంలో ఎన్నో బ్యూటీపార్లర్లు వెలిచాయి. ప్రప్రథమంగా లేడీస్, జంట్స్ కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిందే 'శ్రీ క్లాసిక్ సెలూన్'. హైదరాబాదులోని ప్రముఖ హెయిర్ స్టయిలిస్ట్ జావెద్ హబీబ్ వద్ద ఏడాది పాటు శిక్షణ పొంది నగర యువతకు అందుబాటులోకి ఈసేవలు తీసుకువచ్చారు. స్థానిక లాడ్జిసంటర్ అరండల్‌పేట ప్రధాన రహదారిపై ఏర్పాటు చేశారు. బ్యూటీషియన్ గత 25 ఏళ్లుగా కష్టమర్లకు విశేష సేవలందిస్తున్నారు. అందరికీ అందుబాటులో ఉంటూ ఎన్నో పేరు ప్రఖ్యాతలు సంపాదించారు. బ్యూటీషియన్ కోర్సుపై ఆసక్తి ఉన్న వారికి శిక్షణ కూడా ఇస్తున్నారు. మగవారితో పాటు మహిళలకు అధునాతన హెయిర్ స్టయిల్స్, వివిధ రకాల ఫేషియల్స్, పెడిక్యూర్, మానిక్యూర్, హెయిర్ కట్స్ ప్రత్యేకతల్లో శిక్షణ పొందారు.

## వేసవిలో జాగ్రత్తగా ఉండాల్సిందే: బ్యూటీషియన్ శివప్రసాద్



వేసవికాలం జుట్టు సంరక్షణలో జాగ్రత్తలు తీసుకోవాలని సూచించారు. హెల్మెట్‌ను వినియోగించేవారు తేలికపాటి, లేతరంగు వస్త్రాన్ని చుట్టుకోవాలి. రెండు రోజులకోసారి తలస్నానం చేయాలి. శరీర తత్వానికి అను గుణంగా షాంపూను ఎంపిక చేసుకోవాలి. ప్రతి మూడు నెలలకోసారి షాంపూను మా ర్చాలి. డాండ్రఫ్ నుంచి వెంట్రుకలను కాపాడు కోవాలంటే ఎవరి దు వ్వెన వారికి ప్రత్యే కంగా ఉండాలని బ్యూటీ షియన్, హెయిర్ స్టయిలిస్ట్ శివ ప్రసాద్ తెలియజేశారు.



జావెద్ హబీబ్‌తో శివప్రసాద్

# మహా పుణ్యక్షేత్రం కోటప్పకొండ

(ఎంఎస్ సుధాకర్, స్టాఫ్ రిపోర్టర్, నరసరావుపేట)





నరసరావుపేట మండలంలోని కోటప్పకొండ పుణ్యక్షేత్రంగానూ, పర్యాటక కేంద్రంగానూ అసాధారణ రీతిలో అభివృద్ధి చెందింది. భక్తుల కొంగుబంగా రమై త్రికోటేశ్వర సన్నిధి యాత్రికులకు అత్యంత చేరువైంది. అభివృద్ధి కార్యక్రమాలు పూర్తయి భక్తులకు పర్యాటకులకు అన్ని సౌకర్యాలు సమ కూరాయి. దీంతో పుణ్యక్షేత్రాని కి భక్తుల సంఖ్య రోజురోజుకీ పెరుగుతోంది. పర్యాటక కేంద్రంగానూ, పుణ్యం క్షేత్రంగానూ ఏదో ఒక రకంగా రాష్ట్రంలో వివిధ పుణ్యక్షేత్రాలు, పర్యాటక కేంద్రాలను అభివృద్ధి చేశారే తప్ప, పుణ్య క్షేత్రాన్ని పర్యాటక కేంద్రంగా చేసిన ఘనత కోటప్పకొండకే దక్కుతుంది. హర..హర.. చేదుకోకోటయ్య అని భక్తి సమ్మేళ ఆర్తితో పిలవగానే కాల కూటం లాంటి పాపాలను హరించి ఇహపర సౌఖ్యాలను అందించే ప్రత్యక్ష దైవం శ్రీ త్రికోటేశ్వర స్వామి అని భక్తుల విశ్వాసం. రాష్ట్ర నలుమూలలలోని భక్తులకు కోటయ్య స్వామి కొంగు బంగారం. ఎందరో దేవతామూర్తులకు జ్ఞానోపదేశం చేసిన మహిమాన్విత క్షేత్రమే కోటప్పకొండ, ఏటా లక్షలాది మంది భక్తుల నీరజనాలు అందుకుంటూ శివరాత్రి నాడు సాగే తిరునాళ్ళ రాష్ట్రంలోనే ప్రసిద్ధి చెందింది.

### పర్యాటక కేంద్రం

ఘాట్ రోడ్డులో ఇరువైపులా 18 ఎకరాల స్థలంలో పర్యాటక కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. దీనిలో వివిధ పార్కులు రూపుదిద్దుకున్నాయి. పర్యాటకు లకు విశేషంగా ఆకర్షించేందుకు జింకల పార్కు అలాగే విదేశాలకు చెందిన పక్షులు పర్యాటకులకు కనువిందు చేస్తున్నాయి. అందమైన గార్డెన్ నిర్మాణం జరిగింది. కాళిందిమడుగులో బోటు షికారు కల్పించారు. పిల్లలు ఆడుకు నేందుకు చిల్డ్రన్స్ పార్కు ఏర్పాటు చేశారు. జీవితంలో ఒకసారైనా ఈ క్షేత్రాన్ని ఒకసారైనా భక్తుడు సందర్శించాల్సిందే.





# వ్యూహకర్త 'కన్నా'

## ఓటమి ఎరుగని ధీరుడు.. నాలుగు సార్లు ఘనవిజయం

ఎ.వి.డి.శర్మ, సూర్యప్రతినిధి, గుంటూరు



తాను రూపొందించే వ్యూహం రెండో కంటికి తెలియకుండా అమలు చేయడంలో సీనియర్ మంత్రి కన్నా లక్ష్మీనారాయణ మంచి ప్రావీణ్యత గడించారు. పార్టీ అప్పగించిన బాధ్యతలను సక్రమంగా నిర్విర్తించడంతో పాటు తాను చేయాలనుకున్న పనిని కూడా మరొకరికి తెలియకుండా పనులు పూర్తి చేస్తారు. అలాగే తన నియోజకవర్గంలో తనపై ఎవరు పోటీ చేసినా వ్యూహాత్మకంగా వ్యవహరించి నాలుగు సార్లు పెదకూరపాడు నుంచి ఘనవిజయం సాధిస్తున్నారు. ఓటమి నెరుగని ధీరుడుగా జిల్లా రాజకీయాల్లో చక్రం తిప్పుతున్నారు. 1990 నుంచి 1994 వరకు యువజన సర్వీసులు, సహకార, కార్మికశాఖా మంత్రిగా పనిచేశారు. 1989లో తొలిసారిగా పెదకూరపాడు నియోజకవర్గం నుంచి శాసనసభ్యుడిగా గెలుపొందిన కన్నా 1994, 1999, 2004లో కూడా విజయపరంపరను కొనసాగించారు. నియోజకవర్గ ప్రజలకు నిత్యం అందుబాటులో ఉండి భారీగా అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టారు. ఎన్నో ఎత్తిపోతల పథకాలు, ఫ్లైఓవర్లు నిర్మించారు. క్రోసూరులో దీర్ఘకాలికంగా అగ్నిమాపక కేంద్రాన్ని కూడా మంజూరు చేయించారు. ఎవరైనా తనను కలిసి ఫలానా పని కావాలి అంటే సాధ్యాసాధ్యాలను పరిశీలించి చేస్తాను అంటే ఆ పని పూర్తయ్యే వరకు విశ్రమించకుండా పోరాడతారు. అయితే చూస్తాను అంటే మాత్రం ఆ పని కానట్టేనని ఆయన అనుచరులలో ప్రచారం ఉంది. ఇచ్చిన మాటకు కట్టుబడి పని చేసే వ్యక్తిగా ఆయనకు పేరుంది. గుంటూరు జిల్లాలోనే కాకుండా కోస్తా మొత్తం మీద మంచి అనుచరగణాన్ని కలిగివున్న కన్నా లక్ష్మీనారాయణకు కోస్తాలో ఒక బలమైన వర్గంలో మంచి పట్టుంది. 2004లో ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి బాధ్యతులు స్వీకరించిన తర్వాత తొలిసారిగా గుంటూరు జిల్లా నుంచి కన్నాకు ప్రాతినిధ్యం కల్పించారు. సహకార శాఖామంత్రిగా నియమితులైన ఆయన రాష్ట్రంలో గత పదేళ్ల కాలంలో అస్తవ్యస్తమైన సహకారవ్యవస్థను గాడిలో పెట్టి సమర్థవంతంగా 2005లో ఎన్నికలు నిర్వహించారు. ఆ తరువాత రవాణా శాఖామంత్రిగా ఆర్టీసీని లాభాలబాటలోకి నడిపించారు. రెండు సార్లు సమ్మె చేయాలని ప్రయత్నించిన ఆర్టీసీ కార్మికులను వ్యూహాత్మకంగా నిరోధించారు. వారంతట వారే సమ్మెను విరమించుకొనేలా చేశారు. ఆర్టీసీ కార్మికులకు గత 20 ఏళ్ళ కాలంలో ఎప్పుడూ జరగనంత మేలు కలిగేలా నిర్ణయాలు తీసుకున్నారు. గత ఏడాది జరిగిన మంత్రివర్గ విస్తరణలో కన్నా లక్ష్మీనారాయణకు కీలకమైన రవాణాశాఖను ఇచ్చి సహకార శాఖను తప్పించారు. 1993లో సహకార ఎన్నికల సందర్భంగా జిల్లా సహకార కేంద్ర ఛైర్మన్ పదవిని గుంటుపల్లి అప్పారావుకు దక్కేలా చేయడంలో కన్నా చేసిన వ్యూహరచన రాష్ట్ర స్థాయిలోనే ప్రశంసలు అందుకుంది. కాంగ్రెస్ పార్టీలోని ఒక వర్గం తెలుగుదేశం నాయకులతో చేతులు కలపడానికి ప్రయత్నించిన నేపథ్యంలో కాంగ్రెస్ పార్టీ చెందిన గుంటుపల్లి అప్పారావును ఛైర్మన్‌గా చేయడంలో కన్నా తీవ్రంగా శ్రమించారు. ఆ తర్వాత 2004 ఎన్నికల్లోనూ 2005 మున్సిపల్ ఎన్నికల్లోనూ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థులను గెలిపించడంలో విశేషమైన కృషి చేశారు. 2005 మున్సిపల్ ఎన్నికల్లో తన కుమారుడ్ని మేయర్‌గా చేయడంలో కూడా కన్నా రచించిన వ్యూహానికి ప్రత్యర్థి శిబిరం ఖంగుతింది. అప్పగించే ప్రతి బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించగలరన్న నమ్మకాన్ని ముఖ్యమంత్రి నుంచి కన్నా పొందగలిగారు. 1989లో నేరుగా రాజీవ్‌గాంధీ నుంచి పార్టీ టిక్కెట్‌ను పొందగలిగిన కన్నా లక్ష్మీనారాయణ కాంగ్రెస్ పార్టీ నుంచి ఏ ముఖ్యమంత్రి అధికారంలో ఉన్నా వారి విశ్వాసాన్ని చూరగొనడంలో సఫలీకతమౌతున్నారు.

## జిల్లాలోని పర్యాటక కేంద్రాలు

పి. వెంకటరావు, మేజర్ న్యూస్, గుంటూరు అర్బన్

గుంటూరు జిల్లా పర్యాటకంగా ఎంతో అభివృద్ధిని సాధిస్తోంది. నాగార్జున సాగర్, ఎత్తిపోతల జలపాతం, దుర్గిలోని శిల్పక్షేత్రం, గుత్తికొండ, చేజెర్ల, కొండవీడు, అమరావతి, ఉండవల్లి గుహలు, కోటప్పకొండ, భట్టిప్రోలు తదితర ప్రదేశాలు పర్యాటకులను ముగ్ధులను చేస్తున్నాయి. గుంటూరుకి 35 కిలోమీటర్ల దూరంలో ఉన్న అమరావతిలో నూతనంగా నిర్మించిన జ్ఞానబుద్ధ విగ్రహం, బౌద్ధ శిల్పారామం, మ్యూజియం, పర్యాటకులను ఆకర్షిస్తున్నాయి. అమరావతి అమరలింగేశ్వరస్వామి దేవాలయం, పంచారామక్షేత్రాల్లో ఒకటిగా, బౌద్ధమత కేంద్రంగా విరాజిల్లుతోంది. నర్సరావుపేటకు పది కిలోమీటర్ల దూరంలో కోటప్పకొండ, త్రికోటేశ్వరస్వామిని దర్శించడానికి భక్తులు పెద్దసంఖ్యలో తరలివస్తుంటారు. గుంటూరుకు 150 కిలోమీటర్ల దూరంలో, హైదరాబాదుకు అంతే దూరంలో ఉన్న నాగార్జునసాగర్‌ను దర్శించడానికి పర్యాటకులు భారీగా వస్తుంటారు. సాగర్ డ్యాం, నాగార్జున కొండ చూడదగ్గ పర్యాటక కేంద్రాలు. పకృతి రమణీయ దృశ్య కావ్యం నాగార్జునసాగర్‌లో ఆవిష్కృతమవుతోంది. నాగార్జున సాగర్, మాచర్ల మార్గ మధ్య ఎత్తిపోతల జలపాతం పకృతి దృశ్యాల మధ్య సందర్శకులకు ఉల్లాసభరితులను చేస్తుంది. ఇక్కడ మొసళ్ళ పెంపక కేంద్రం కూడా ఉంది. ప్రాచీనమైన శిల్పకళ, కళలకు కాణాచి దుర్గి, సాగర్‌కు సమీపంలోని శిల్పకారుల కుటుంబాలకు పునరావాసం కల్పించేందుకు దుర్గికి తరలించారు. గురజాలకు 23 కిలోమీటర్ల దూరంలో, కారంపూడి గ్రామానికి మూడు కిలోమీటర్ల దూరంలో గుత్తికొండ బిలం గుహ కూడా ఉంది. దక్షిణకాశిగా వెలుగొందిన ఈ ప్రాంతంలో ఋషులు తపస్సు చేశారని ప్రతీతి. దేశంలోని 21 జ్యోతిర్లింగాలలో చేజెర్ల ఒకటి. క్రీస్తు పూర్వం మూడో శతాబ్ది నుంచి చేజెర్లకు ఈ చరిత్ర వుంది. విజయవాడ మార్గంలో విజయవాడకు అయిదు కిలోమీటర్ల దూరంలో ఉండవల్లిలో ఈ గుహలు ఉన్నాయి. ప్రకృతి అందాలను నెలవైన ఉండవల్లి గుహల్లో అనంత పద్మనాభస్వామి శయన దృశ్యం, కొవ్వొత్తి వెలుగుల్లో కనిపించే సహజవర్ణ శిల్పచిత్రం ఒక అద్భుతం. గుంటూరు, నరసరావుపేట మార్గంలో కొండవీడులో క్రీస్తు శకం పదో శతాబ్దంలో రెడ్డిరాజుల సామ్రాజ్యం విరాజిల్లింది. శ్రీకృష్ణదేవరాయులు 1515 సంవత్సరంలో కొండవీడులపై దాడి చేశారు. నిజాం రాజుల కాలంలోనే ఈ ప్రాంతం దాడులకు గురైంది. శిధిలావస్థలోని కొండవీటి కోట 21స్థూపాలతో ప్రజలకు దర్శనమిస్తోంది.

# ఉగాది శుభాకాంక్షలు

## కాబోయే ముఖ్యమంత్రి చిరంజీవి గారికి ఉగాది శుభాకాంక్షలు





సామాజిక సేవే లక్ష్యంగా అన్నివర్గాల ప్రజల అండదండలతో, రాజకీయ రంగ ప్రవేశం చేస్తున్న పద్మభూషణ్ చిరంజీవిగారు రాష్ట్ర ముఖ్యమంత్రి పీఠాన్ని అధిరోహించాలని ఆకాంక్షిస్తూ...

**కోట శ్రీనివాసరావు సేవాసంస్థ, చిరంజీవి సేవాసమితి**

'చిరు' అభిమానులకు,
పొన్నూరు నియోజకవర్గ ప్రజలకు
ఉగాది శుభాకాంక్షలు

**సినీరంగంనుండే కాక సేవా కార్యక్రమాలద్వారా రాష్ట్ర ప్రజల హృదయాంతరాళాలలో చిరస్థానం సంపాదించుకున్న పద్మభూషణ్ డా॥ చిరంజీవి గారి ఆశయం సఫలమై జగద్విదితం కావాలని కోరుకుంటూ...**



మెగాస్టార్ చిరంజీవి ఆశయాలకు అనుగుణంగా సమాజంలో కుల,మత వర్గాలకు అతీతంగా సేవా కార్యక్రమాలు నిర్వహిస్తూ సామాజిక న్యాయం సాధించేందుకు కోట శ్రీనివాసరావు సేవా సమితిని ఏర్పాటు చేసి రాష్ట్ర స్థాయిలో సంస్థ తరుపున ఎన్నో మెగా సేవా కార్యక్రమాలు నిర్వహించాము.

ఇటీవల పొన్నూరులో నిర్వహించిన సామాజిక న్యాయ సాధన సదస్సు (సర్వజన సమ్మేళనం)కు అశేషంగా తరలి వచ్చిన పొన్నూరు నియోజకవర్గ ప్రజలకు, చిరు అభిమానులకు కృతజ్ఞతాభివందనాలు. రానున్న రోజుల్లో కె.యస్.ఆర్ సేవా సంస్థద్వారా మెగా బ్లడ్ డొనేషన్ క్యాంప్, మెడికల్ క్యాంప్, టాలెంట్ టెస్టులు (స్టూడెంట్స్), వృద్ధుల సేవా కార్యక్రమాలు చేపట్టనున్నాము.

మిలీనియం విద్యాసంస్థల ఏర్పాటు ద్వారా పేద, మధ్య తరగతి విద్యార్థులకు ఉచిత, ప్రత్యేక రాయితీపై విద్యాబోధన, గ్రామీణ నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలు మరియు వికలాంగులకు, మహిళలకు ఉచిత వృత్తివిద్యా కార్యక్రమాలలో శిక్షణను ఇచ్చి ఉపాధి కల్పించేందుకు ఏర్పాటు చేయటమైనది.

తాము చేపట్టనున్న కార్యక్రమాలకు పొన్నూరు నియోజకవర్గ ప్రజలు, చిరు అభిమానులు పూర్తి సహాయ సహకారాలను అందించి ఆదరిస్తారని ఆశిస్తూ... మీ



**కోట శ్రీనివాసరావు**

**అధ్యక్షులు**

**కోట శ్రీనివాసరావు సేవాసంస్థ**

**పొన్నూరు**

సెల్ :9848830515

# రాష్ట్రస్థాయి ర్యాంకుల 'వివేక'

తేళ్ళూరి రామకోటిరెడ్డి, స్టాఫ్‌రిపోర్టర్, తెనాలి

విద్యార్థి సర్వతోముఖాభివృద్ధే విద్య పరమార్ధమని విశ్వసించి ఆ దిశలో నిరంతరం కృషిచేస్తున్న విద్యా సంస్థలు వివేక విద్యాసంస్థలు. గ్రామీణ ప్రాంత విద్యార్థుల్లోని ప్రతిభ ను వెలికితీసి వారి నుంచి అత్యుత్తమ ఫలితాలు రాబట్టవచ్చుని పలు దఫాలు ఈ సంస్థ నిరూపించింది. మాటల్లో కాకుండా చేతల్లో తమ ఫలితాలు చూపుతూ ఇంటర్‌లో ఇప్పటికి మూడు సార్లు రాష్ట్రంలో ప్రధమ స్థానాన్ని పొందడం ఇక్కడి విద్యాభివృద్ధికి సాక్ష్యం. రావిపాటి వీరనారాయణ 1985 సంవత్సరంలో వివేక విద్యా సంస్థలను నెలకొల్పారు. ప్రతి ఉదయం రోజును ప్రతిబింబించినట్లే బాల్యం మనిషి జీవితాన్ని ప్రతిబింబిస్తుందని జాన్‌మిల్టన్ చెప్పిన వ్యాక్యాలు ఇక్కడ ఆచరణలో కనిపిస్తాయి. పూర్తి కాలం కళాశాల క్యాంపస్‌లో అధ్యాపకుల నుంచి డైరెక్టర్ వరకు నివాసముండడం గమనార్హం. ప్రారంభించిన దశాబ్ద కాలంలో ఫలితాలపరంగా ఉత్తమంగా ఉన్నా ఎవరి దృష్టిని ఆకర్షించని వివేక 1999 సంవత్సరంలో జి.అచ్యుతవాణి 970 మార్కులతో ఇంటర్‌లో రాష్ట్ర స్థాయిలో ప్రధమ స్థానంలో నిలవడంతో వార్తల్లోకి ఈ సంస్థ చేరింది. అప్పటి నుంచి క్రమం తప్పకుండా ర్యాంకుల పంట పండిస్తూనే ఉంది. 2001లో, 2003లో కూడా రాష్ట్రంలో ప్రధమ స్థానంలో ఇక్కడి విద్యార్థులను ఉంచారు. ఎంసెట్‌లోనూ కళాశాల విద్యార్థి 10వ ర్యాంకు సాధించారు. కె.జి నుంచి పి.జి వరకు ఒకే చోట విద్యనందించేలా మాంటిస్సోరి విద్యావిధానంలో వివేక ఫాస్టర్ స్కూల్ నడుస్తోంది. దీని శాఖలు పొన్నూరు, బాపట్లలో కూడా విస్తరించాయి. వివేక పబ్లిక్ స్కూల్‌లో పదో తరగతి వరకు ప్రత్యేక శిక్షణ ఇస్తారు. వివేకానంద జూనియర్ కాలేజీ , వివేక మహిళా కళాశాల, వివేక డేస్‌కాలర్స్ కాలేజీల్లో ఇంటర్ సైన్సు గ్రూపుల్లో విద్యాబోధన సాగుతుంది. వివేక ఆధ్వర్యంలోనే ఒక డిగ్రీ కళాశాల కూడా నడుస్తుంది. ఈ సంస్థపై విశ్వాసానికి మరో నిదర్శనం నేపాలి విద్యార్థులు అత్యధిక సంఖ్యలో ఇక్కడ విద్యాభ్యాసం చేస్తున్నారు. విజ్ఞాన, సాంస్కృతిక రంగాల్లో చక్కని ప్రతిభను ప్రదర్శించే నేపాలియులతో వివేక సంస్థ అభివృద్ధి పెనవేసుకుంది. 1991-93 విద్యా సంవత్సరం నుంచి ప్రారంభమైన నేపాలిల రాక ఇప్పుడు వందల సంఖ్యకు చేరింది. క్రీడల్లోనూ సంస్థ విద్యార్థులు సాధిస్తున్న ప్రగతి అత్యుత్తమైనది.




ఇటీవల వివేకలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలు. ప్రతిభ చూపిన విద్యార్థులకు డైరెక్టర్ అభినందనలు





## మహిళాసాధికారతే లక్ష్యం: ఛైర్‌పర్సన్ కోటేశ్వరి

లీలానంద్, మేజర్‌న్యూస్, చిలకలూరిపేట

మహిళాసాధికారితే లక్ష్యంగా చిలకలూరిపేట మున్సిపల్ ఛైర్‌పర్సన్ జరపల కోటేశ్వరి పట్టణంలోని మహిళలకు పావలా వడ్డీకి రుణాలు అందే ఏర్పాట్లు చేస్తూ, ఇందిరమ్మ వార్డులలోని మహిళలతో సమన్వయ సమావేశాలు ఏర్పాటు చేస్తూ మహిళలు అన్నిరంగాలలో ముందుండాలని తెలుపుతున్నారు. మున్సిపల్ ఎన్నికల లో మున్సిపల్ ఛైర్మన్ ఎస్టీ కావటంతో అధికారపార్టీ జరపల కోటేశ్వరిని ఎంపిక చేశారు. విజయం సాధించిన నాటినుంచి అధికంగా మహిళాసమావేశాలు ఏర్పాటు చేస్తూ మహిళలను సాధికారులను చేసే ప్రయత్నాలు సాగిస్తున్నారు. జిల్లాలోనే అధికంగా మహిళలు ఈప్రాంతంలో ఉండటంతో మహిళలు అన్ని రంగాలలో ముందుండాలని సూచిస్తున్నారు. పార్లమెంట్‌లో మహిళా రిజర్వేషన్లు అమలైతే నియోజక వర్గం మహిళలకు అవకాశం ఉంది. పారిశ్రామిక, విద్య, వైద్య, సేవా, పోటీపరీక్షలలో మహిళలు విజయవంతం కావాలని ఆశిస్తుంది. గిరిజన మహిళనైన తను మున్సిపల్ ఛైర్‌పర్సన్‌గా ఎంపికైనట్లు అందరూ ముందుండాలని కోరుతున్నారు.



వృద్ధులకు స్వీటు అందిస్తున్న ఛైర్‌పర్సన్ జరపల కోటేశ్వరి

రిజర్వేషన్లు రాకపోయినా జనరల్ స్థానాలలో మహిళలు పోటీ చేసే స్థానాలలో విజయం సాధించాలని కోరుతున్నారు. ప్రతిపురుషుని విజయం వెనుక ఒక స్త్రీ ఉంటుందని ఈరోజులలో విజయాన్ని స్త్రీలే సాధించాలని తెలుపుతున్నారు. ముందుగా స్త్రీలు గతాన్ని విస్మరించ కూడదని గత స్మరణతో ముందుకు పోవాలని అదే జీవితానికి సక్సెస్ అవుతుందన్నారు. భవిష్యత్ ఏవిధంగా ఉండాలో ప్రస్తుత పరిస్థితులలో నిర్ణయించుకుని దానికి అనుగుణంగా ముందుకు పోవాలని తెలిపారు. కుటుంబాలలో బాలికలు వద్దని పురుషులు తెలుపుతుంటారు వారి మాటలు పెడచెవిన పెట్టాలని వారికి జన్మనిచ్చింది మహిళలనే విషయాన్ని వారు విస్మరిస్తున్నారని పేర్కొంటున్నారు. బాలికలకు ఉన్న ఆసక్తిని తల్లి గమనించి ఆరంగంలో ముందుకు వెళ్ళేందుకు తల్లి సహకరించాలని తెలుపుతున్నారు. నేడు దేశానికి రాష్ట్రపతిగా ఉన్న ప్రతిభాపాటిల్, అంతరిక్ష వ్యోమగామి సునితా విలియమ్స్, కల్పనాచావ్లా, మెదటి ఐ.పి.ఎస్. అధికారిణి కిరణ్‌బేడి లాంటి వారిని ఆదర్శంగా తీసుకోవాలని కోరుతున్నారు.

# చైతన్యధీరుడు 'చెన్ను'

శంకర్‌బాబు, మేజర్‌న్యూస్, చెరుకుపల్లి

పదవులు ద్వారా పలుకుబడి, సోమ్ము కూడబెట్టుకోవాలనే తలంపుతో రాజకీయాలలో చేరుతున్న ఈ రోజుల్లో ప్రజాసేవ చేసి, ప్రజల మనన్నలు పొందాలన్నే తలంపు ఎంతమందికుంటుంది. ఆ కోవకు చెందినవారే చెరుకుపల్లి ఎంపిపి చెన్నుకోటేశ్వరరావు, రైతు కుటుంబంలో పుట్టి, వెనుకబడిన తరగతి నుంచి వచ్చిన కోటేశ్వరరావు గుళ్ళపల్లి గ్రామసర్పంచ్ పదవి చేపట్టి, ప్రజాసేవచేయాలనే తలంపుతో 1995వసంవత్సరంలో గ్రామపంచాయితీ ఎన్నికలల్లో పోటీచేసి గెలుపొందారు. అప్పటినుంచి గ్రామప్రజలకు సేవచేసి, జిల్లాస్థాయిలో ఉత్తమ పంచాయితీగా గుర్తింపుపొందాలనే తపన ప్రారంభమైనది. దీంతో గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. గత 30సంవత్సరాలలో జరగని అభివృద్ధి తన హయాంలో జరిగిందని అనిపించుకోవాలని అహో రాత్రులు శ్రమించి, గ్రామంలోని జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాలను అభివృద్ధి పరిచారు. హైస్కూల్లో కంప్యూటర్ విద్యనందించేందుకు తనవంతు కృషి చేశారు. అదేవిధంగా హైస్కూల్లో పదో తరగతి విద్యార్థులకు పరిక్షా కేంద్రం ఏర్పాటు చేయించారు. గ్రామంలో సిమెంటు రోడ్లు, మంచి నీటి సౌకర్యం, వీధివీధికి విద్యుత్తు దీపాలు ఎస్సీ,ఎస్టీ, కాలనీలలో పూర్తి సౌకర్యాలతో ఏర్పాటు చేయడంలో విజయవంతమయ్యారు. ఐదు సంవత్సరాల పాలనలో గ్రామప్రజలకు అన్ని సౌకర్యాలు అందించి ఉత్తమ పంచాయితీగా జిల్లా స్థాయిలో మొదటిస్థానంలో ఉంచారు. చెన్ను గ్రామానికి చేసిన అభివృద్ధిని చూసి గ్రామప్రజలు రెండోసారి గుళ్ళపల్లిగ్రామ సర్పంచ్‌గా పట్టంకట్టారు. గ్రామంలో రూ.5 లక్షల ఎగ్జీఆర్‌వై నిధులతో గ్రామపంచాయితీ నూతన భవనాన్ని నిర్మించారు. రూ.2 లక్షల వ్యయంతో పిహెచ్‌సి భవనాన్ని, రూ.1.5 లక్షలతో పశువైద్యశాలను నిర్మించారు. రూ.1.5 లక్షలతో గ్రంథాలయ భవనాన్ని నిర్మించారు. గ్రామంలో ప్రజల త్రాగునీటి కోసం




నిర్మితమవుతున్న నూతన గ్రామపంచాయతీ కార్యాలయం. గుళ్ళపల్లి ఛానల్‌కు రీమోడలింగ్

రూ.12లక్షలతో వాటర్‌ట్యాంకు, 12వఫైనాన్స్ నిధులతో గ్రామం మొత్తం పైపులైన్లు ఏర్పాటు చేశారు. చెన్ను సర్పంచ్‌గా ఉన్న కాలంలో 16 సిమెంట్‌రోడ్లు, 6 కంకరురోడ్లు, 20 గ్రావెల్ రోడ్లు, 12 మట్టిరోడ్లను ఏర్పాటు చేయించారంటే గ్రామం ఎంత సుందరంగా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు. ఎంపిపిగా ఉంటూ రాజకీయాలతో సంబంధం లేకుండా అన్నివర్గాలను కలుపుకుపోతూ మండల ప్రజానికానికి అందుబాటులో ఉంటూ తన సేవలను మండల ప్రజానికానికి అందించడంలో చెన్ను తనదైన ప్రత్యేకతను సాధించుకోవడంలో సఫలీకృతులయ్యారు.



# బడుగుల అభివృద్ధే ధ్యేయంగా బాబూజీ సేవా సంస్థ

అన్నం కేశవరావు, పొన్నూరు, మేజర్‌న్యూస్

నిరుపేద కుటుంబంలో పుట్టి పెరిగిన ఒ వ్యక్తి ఎంతో పట్టుదలతో ఉన్నత స్థానానికి ఎదిగి, తాను సంపాదించిన దానిలో ఎంతోకొంత పేదలకు సాయపడాలనే భావంతో ఓ స్వచ్ఛంద సేవాసంస్థను ఏర్పాటు చేసి పేదవారికి అండగా నిలుస్తోంది. సేవే పరమావదిగా అందరి మన్ననలు పొందుతున్న తోట రాంబాబు ఏర్పాటు చేసిన బాబూజి సేవాసంస్థ ఈ ప్రాంతలోని ఎందరో నిరుపేద వర్గాలకు బాసటగా నిలిచింది. బాధాతప్త జీవనం గడుపుతున్న వారిని ఆదుకోవటమే ధ్యేయంగా ఆ సంస్థ అధ్యక్షుడు రాంబాబు చేస్తున్న కృషి, సేవా పేదల బతుకుల్లో వెలుగులు నింపుతుందంటే అతిశయోక్తి కాదు. 1995లో పొన్నూరులో సేవా సంస్థను ఏర్పాటు చేసి కొన్ని వేల మందికి ప్రత్యక్షంగా సాయం అందించారు. ఆదర్శ భావాలు కలిగిన సభ్యులతో ఎన్నో సేవా కార్యక్రమాలు నిర్వహించి జిల్లా, రాష్ట్రస్థాయిలో అవార్డులను అందుకుని జిల్లా ప్రతిష్టను వినుమడింపజేశారు.



కలెక్టర్ చేతులమీదగా అవార్డునందుకుంటున్న రాంబాబు (ఫైల్‌ఫొటో)

## పేదల సేవే పరమావధిగా..

సేవా సంస్థ అందిస్తున్న సేవా కార్యక్రమాలను పరికిస్తే... నిరుపేదలకు బట్టల పంపిణీ, విద్యార్థులకు ఉపకారవేతనాల ఆందజేత, మహిళలు తమ కాళ్ళపై తాము నిలబడాలనే ఉద్దేశ్యంతో చేతివృత్తుల్లో శిక్షణ నిచ్చి ఎంతోమందికి సంస్థ ద్వారా జివన భృతి కల్పించారు. రూ. 2లక్షలు ఖర్చుచేసి 100 పొదుపు సంఘాలు ఏర్పాటు చేయించారు. రూ.2లతో మంచినీటి ట్యాంక్ నిర్మించి వందలాదిమందికి 24 గంటలు మంచినీరు అందిస్తున్నారు. ఒరిస్సా నుంచి విలు విధ్య కళాకారులను పిలిపించి విద్యార్థులకు శిక్షణను ఇప్పిస్తున్నారు. ఇంజినీరింగ్, వైద్య విద్యలను అభ్యసించే నిరుపేద విద్యార్థులకు చేయూతనందిస్తున్న ఘనత బాబూజి సేవాసంస్థకే దక్కుతుంది. సమాజ సేవకే పునరంకితమైన బాబూజి సేవాసంస్థ ప్రభుత్వం నిర్వహించే పల్స్ పోలియో, క్షయ, మలేరియా, చికెన్ గునియా నిర్మూలనా కార్యక్రమాల్లో విరివిగా పాలుపంచుకున్న సంస్థ సేవలను గుర్తించిన ప్రభుత్వ ఉన్నతాధికారులు అవార్డులు ఇచ్చి వెన్నుతట్టి ప్రోత్సహిస్తున్న సందర్భాలు ఎన్నో. ఉత్తమ సేవాసంస్థగా గుంటూరు జిల్లా కలెక్టర్ ఆలీరఫత్ చేతులమీదగా యూత్ అవార్డుని, ప్రసంశాపత్రాన్ని సంస్థ అధ్యక్షులు రాంబాబు అందుకున్నారు. తాజాగా జాతీయ స్థాయిలో నిర్వహించిన 'యువకృతి' అవార్డులను సంస్థ అందుకుంది. మునుముందు రోజుల్లో మరిన్ని సేవా కార్యక్రమాలు చేపట్టనున్నట్లు సంస్థ అధ్యక్షులు తోట రాంబాబు పేర్కొన్నారు. ఈ సంస్థద్వారా ఎందరో పేదలకు సాయం జరగాలని ఆశిద్దాం.



గోళ్ళమూడి రాజసుందరబాబు

# దళిత హక్కుల పునరుద్ధరణలో 'ఐడియా' (ఇండియన్ దళిత ఎంప్లాయీస్ అసోసియేషన్) అధ్యక్షులు గోళ్ళమూడి రాజ సుందరబాబు చేసిన పోరాటాలు - సాధించిన విజయాలు (1997-2008)

1997 సం॥లో 'ఐడియా' (ఇండియన్ దళిత ఎంప్లాయిస్ అసోసియేషన్) ఎ.సి. కళాశాల, ఉమెన్స్ కళాశాలల అనుబంధ హాస్టల్స్ వర్కర్లతో ప్రారంభమైనది. ప్రారంభ దశలోనే హాస్టల్స్ వర్కర్లకు కనీస వేతనాలకై 22 రోజుల పాటు ఆమరణ దీక్షలు చేసి విజయం సాధించడం జరిగింది. రూ. 350/-లు జీతంగా ఉన్నవారు ఈ ఆమరణ దీక్షలవల్ల ఒక్కసారిగా రూ. 1450 నుండి 1900/- దాకా కనీస వేతనాలు పొందారు.

2000 సం॥లో ఐడియా, 50 మంది ఎమ్మెల్యేలచే రాష్ట్రంలో శాశ్వత ఎస్.సి, ఎస్.టి. కమీషన్ ఏర్పాటును ఆర్టికల్ 338(1) ప్రకారం కోరుతూ ముఖ్యమంత్రిని ఉద్దేశించి లేఖలు సేకరించి వీటిని ముఖ్యమంత్రికి సమర్పించి అనుకూలమైన ఎండార్సుమెంట్ చేయించి, ప్రభుత్వంలో కమీషన్ ఏర్పాటునుద్దేశించి ఒక ఫైలును ప్రారంభించడం జరిగింది. 2001 సం॥ అక్టోబర్ 1న రాష్ట్ర కేబినెట్ ఎస్.సి, ఎస్.టి. కమీషన్ ఏర్పాటుద్దేశించి ఒకతీర్మానం చేయడం,2003 సం॥లో కమీషన్ ఏర్పాటుకై అసెంబ్లీలో బిల్లుఆమోదం, తదనంతరం రాష్ట్రపతి ఆమోదంతో కమీషన్ ఏర్పాటు చేయడం జరిగింది. 21మంది క్యాబినెట్ మంత్రుల సహకారంతో జస్టిస్ పున్నయ్యను కమీషన్ మొదటి చైర్మన్‌గా నియమించబడేట్లు 'ఐడియా' కృషిచేసి సఫలీకృతమైనది. ఎస్.సి. ఎస్.టి. ఉద్యోగులకు ప్రమోషన్లలో రిజర్వేషన్లకై 1998 నాటినుండి కృషి ప్రారంభించి 2003 సం॥లో జి.ఓ.నెం. 5ను సాధించడం జరిగింది.

2002 సెప్టెంబర్ 19న 5000 మంది ఎస్.సి, ఎస్.టి., బి.సి. మైనార్టీ మహిళలచే ఇండియన్ దళిత ఉమెన్ అసోసియేషన్ "ఇద్వా" ను ఇండియా ప్రారంభించి ప్రతి దళిత మహిళకు 1 ఎకరం భూమి, వృద్ధాప్య పింఛన్లు రూ. 500/- గ్రామీణ కుటీర పరిశ్రమలు ఏర్పాటు కోరుతూ 2003 సం॥ మే నెల వరకూ ధర్నాలు, ఛలో హైదరాబాద్, ఛలో అసెంబ్లీ కార్యక్రమాలు చేపట్టడం మూలంగా నేటి ప్రభుత్వం భూపంపిణీ విధానాన్ని అమలుచేస్తూ రూ. 75/-గా ఉన్న ఫించన్లను రూ. 200/- వరకూ పెంచింది. గుంటూరు నగరం అడవి తక్కెళ్ళపాడు గ్రామ పంచాయితీ పరిధిలోని అంబేద్కర్ ఇద్వా మహానగర్‌ను (10 ఎకరాలు) ఇద్వా సంఘం స్థాపించి 450 మంది నిరుపేదలకు ఇంటి స్థలాలు కల్పించింది. గుంటూరు నగరం వెంకటప్పయ్య కాలనీ ప్రక్కన, "శశాంక గోయల్‌కాలనీ"ని ఐడియా స్థాపించి 100మంది నిరుపేదలకు ఇండ్లస్థలాలు సాధించింది. 2006సం॥ మార్చిలో ఆల్ ఇండియా క్రిస్టియన్ అసోసియేషన్‌ను స్థాపించి దళితులకు మత స్వేచ్ఛ, క్రైస్తవులకు రిజర్వేషన్లు కోరుతూ 170మంది ఎమ్మెల్యేలచే ముఖ్యమంత్రికి లేఖలు వ్రాయించడం ఏప్రియల్ నెలలో జిల్లాలో 5రైల్‌రోకోలు జరపటం ఢిల్లీకి డెలిగేషన్ వెళ్ళి ముగ్గురు కేంద్రమంత్రులను కలసి వినతి పత్రాలు సమర్పించడం జరిగింది. తత్‌ఫలితంగా రంగనాధ్ మిశ్రా కమీషన్ కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేయగా కమీషన్ దేశం నలుమూలలా తిరిగి, దళిత క్రైస్తవులకు రిజర్వేషన్లు సిఫారసు చేసింది.

దళిత సేవాదళ్ లాంటి సంఘాలతో కలసి కామన్ డాక్టరేట్ వద్దంటూ, దళిత క్రైస్తవులకు రిజర్వేషన్లు కోరుతూ 2008 జనవరి, ఫిబ్రవరి, మార్చి మాసాల్లో పలుచోట్ల ధర్నాలు, ర్యాలీలు,ఛలో హైదరాబాద్ లాంటి ఆందోళనలు చేపట్టడం ఫలితంగా ముఖ్యమంత్రి దళిత క్రైస్తవులకు రిజర్వేషన్లు సమర్థిస్తూ ప్రధానికి , సోనియాకు లేఖలు వ్రాయించడమే కాకుండా, రాష్ట్రం నుండి ఒక బృందాన్ని పంపి ఢిల్లీ ప్రభుత్వంపై వత్తిడి చేయడానికి ముఖ్యమంత్రిని ఒప్పించడం జరిగింది.జిల్లాలో సంచలనాత్మక అత్యాచార సంఘటనలైన ఒప్పిచర్ల, పెదమక్కెన, తురకపాలెం, గోపాయపాలెం, పొన్నెకల్లు లాంటి అత్యాచార సంఘటనలందు, అత్యా చారాలకు పాల్పడిన వందలాది అగ్రకుల నిందితులను అరెస్టులు చేయించడమే కాకుండా పోరాటాలు నడిపి, బాధితులకు ఆత్మవిశ్వాసాన్ని గ్రామాలలో సామాజిక మార్పును, ఆర్థిక ప్రగతిని సాధించడం జరిగింది. మండల, జిల్లా, రాష్ట్రస్థాయిల్లో పలుమార్లు అత్యాచార నిరోధకచట్టం 1989,పి.సి.ఆర్. చట్టం 1955 మరియు వాటి రూల్సు ప్రభుత్వ సంక్షేమ పథకాలపై దళితులకు అవగాహన సదస్సులు ఏర్పాటు చేయడం జరిగింది. 1997 నుండి నేటివరకూ ఐడియాకు రాష్ట్ర అధ్యక్షుడిగా గోళ్ళమూడి రాజ సుందరబాబు కొనసాగుతున్నారు.

# సేవామూర్తి గుర్రం గోపాలకృష్ణారెడ్డి

బి.నరసింహారావు, మేజర్‌న్యూస్, పిడుగురాళ్ల

సేవామూర్తి గుర్రం వీర గోపాలకష్ణారెడ్డి గురించి తెలియనివారుండరు. ఆనాడే విద్య, వైద్యం తదితర అంశాలలో పేదలకు కల్పించేందుకు నడుంకట్టారు. గుర్రం వీరారెడ్డి, పేరమ్మ దంపతులకు నలుగురు సంతా నం. వారంతా అకాల మృత్యువు పాలయ్యారు. ముగ్గురు కుమార్తెలు వివాహాలు జరిగిన కొద్ది కాలానికే మృతి చెందారు. ఒక్క కొడుకు కష్ణారెడ్డి పైన ఆశలు పెట్టుకు న్నారు. పిఠాపురం రాజవారి కళాశాలలో కుమారుడు కృష్ణారెడ్డిని చేర్పించారు. కృష్ణారెడ్డి కందుకూరి వీరేశలిం గం, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, గురజాడ అప్పారావు తది తర సంస్కర్తల ఆశయాలకు ఆనాడే ప్రభావితడుయ్యాడు. ఆఖరి క్షణాల్లో తండ్రి వీరారెడ్డితో ఆస్తుల కన్నా శాశ్వతమైన సేవ ప్రధానమని, వైద్యం కూడా చేయించుకోలేని అభాగ్యులు సమాజంలో ఎందరో ఉన్నారు. మనకున్న స్థిర, చరాస్తులన్నీ వారి సంక్షేమం కోసం దానం చేయాలని, పేదలకు విద్య, వైద్య సదుపాయాలందించి వితంతువుల పునర్వివాహాలకు సహాయం చేయా లని, అనాథలకు అన్నవస్త్ర దానాలు చేయా లని, వృద్ధుల కోసం ఆశ్రమం ఏర్పాటు చేయాలని కృష్ణారెడ్డి తండ్రిని కోరారదాతల వితరణతో ప్రారంభమైన జివిజికె ఆర్ఓ ఎస్టేట్ అనాథ శరణాలయం కమిటీ వారు దేవాదా య శాఖకు అప్పగించిన సుమారు 300 ఎకరాల భూమిపై వస్తున్న ఆదాయంతో ఎంతోకాలం పాటు ఎందరో అనాథ విద్యార్థులకు, అభాగ్య విద్యార్థులకు ఆశ్రయమిచ్చింది.



గుర్రం గోపాలకృష్ణారెడ్డి

# ఉగాది శుభాకాంక్షలు


శ్రీమతి సోనియాగాంధీగారు
యు.పి.ఎ .చైర్‌పర్సన్


శ్రీ రాహుల్ గాంధీ గారు
ఎఐసిసి జనరల్ సెక్రటరీ


శ్రీ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డిగారు
ముఖ్య మంత్రి


శ్రీ డి.శ్రీనివాస్ గారు
పిసిసి అధ్యక్షులు


శ్రీ టి.జె.ఆర్. సుధాకర్ బాబు
యూత్ కాంగ్రెస్



**శ్రీమతి సోనియాగాంధీ గారి నాయకత్వంలో ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి గారి సారధ్యంలో రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ మరిన్ని విజయాలు సాధించాలని కోరుకుంటు....**

**కాంగ్రెస్ కార్యకర్తలకు, శాసనసభ్యులకు యువజన కాంగ్రెస్ నాయకులకు**

**ఉగాది శుభాకాంక్షలు.**

**దాసరి కిరణ్ కుమార్, అధ్యక్షులు**
**యూత్ కాంగ్రెస్, గుంటూరు జిల్లా**

# విజయకృష్ణాకే అపూర్వ ఆదరణ

మేజర్ న్యూస్, గుంటూరు



విజయకృష్ణా హోటల్ భవన సముదాయం

గుంటూరునగరంలో పేరెన్నికగన్న హోటళ్ళలో విజయ్‌కృష్ణా ఇంటర్నేషనల్ ప్రముఖస్థానంలో ఉంది. గుంటూరు నగరంలో స్టార్‌హోటళ్ళ సంస్కృతిని ప్రారంభించిన ఘనత విజయకృష్ణాకే దక్కింది. ప్రస్తుతం ఈ హోటల్‌ను పారిశ్రా మిక వేత్త కిలారి వెంకటరోశయ్య నిర్వహిస్తున్నారు. ఫ్లవర్ డెకరేషన్స్, స్పెషల్ లైటింగ్, స్పెషల్ వెజిటేరియన్, లంచ్, డిన్నర్ పార్టీలకు భారీస్థాయిలో ఇక్కడ ఏర్పాట్లు ఉంటాయి. వివాహాలు, రిసెప్షన్లు, ఎంగేజ్‌మెంట్స్, బర్త్‌డే పార్టీలు ఈ హోటల్‌లో ఎక్కువగా జరుగుతుంటాయి. వివాహం జరుపుకోవడానికి సువిశాలమైన రెండుహాళ్ళు ఉన్నాయి. అలాగే సభలు సమావేశాలు నిర్వహించుకోవడానికి అవకాశాలు ఇక్కడ పుష్కళంగా ఉన్నాయి. ఏ హోటల్‌కు లేనంత పార్కింగ్ సదుపాయం ఇక్కడ ఉండడంతో ఈ హోటల్‌కు ఇతర జిల్లాలు, రాష్ట్రాల నుంచి కూడా అధిక సంఖ్యలో పర్యాటకులు, విజిటర్స్ హాజరౌతుంటారు. హోటల్‌లో సర్వీసు కూడా సంతప్తికరంగా ఉంటుందని పలువురు వినియోగదారులు పేర్కొన్నారు. ప్రస్తుతం త్రీస్టార్ హోటల్‌గా ఉన్న విజయ కృష్ణా ఇంటర్నేష నల్‌లో పలువురు ప్రముఖ రాజకీయనాయకులు బస చేస్తుంటారు.

రాష్ట్రస్థాయి నాయకులు ఎవరొచ్చినా ఈ హోటల్‌లోనే బస చేయడం ఆనవాయితీ. కుటుంబ పరంగా కూడా పలు శుభకార్యాలు ఇక్కడే నిర్వహించుకోవడానికి అన్ని హంగులు ఉన్నాయి. ప్రభుత్వ కార్యాలయాలకు అందుబాటులో ఉండటం వల్ల ఉన్నతాధికారులు కూడా ఇక్కడే బసచేస్తుంటారు.

# ప్రణాళికాబద్ధంగా తాడికొండ అభివృద్ధి

మేజర్ న్యూస్, తాడికొండ



తాడికొండ నియోజకవర్గాన్ని అన్ని విధాలా అభివృద్ధి చేసేందుకు ఎమ్మెల్యే డి. మాణిక్య వరప్రసాద్ ప్రణాళికా బద్ధంగా కృషిచేస్తున్నారు. జిల్లాలో ఏ భారీ ప్రాజెక్టు వచ్చినా, అందులో తాడికొండ నియోజకవర్గానికి అధిక ప్రాధాన్యత ఉంటుంది. ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి తొలిసారిగా చేపట్టిన పల్లెబాట కార్యక్రమంలో తాడికొండ నియోజకవర్గానికే ఎక్కువ ప్రాధాన్యత లభించింది. అలాగే కాలచక్ర మహాసభలు, పుష్కరాల వల్లకూడా ఈ నియోజకవర్గంలోనే దాదాపు 70 కోట్ల రూపాయల మేరకు అభివృద్ధి పనులు జరిగాయి. తాజాగా గుంటూరు నుంచి గోరంట్ల హోసన్నా మందిరం వరకు రహదారిని నాలుగు లైన్లుగా విస్తరిస్తున్నారు. అలాగే పల్లెబాట కార్యక్రమంలో ముఖ్యమంత్రి ఇచ్చిన హామీకి అనుగుణంగా వైకుంతపురం నుంచి గోరంట్ల వరకు కృష్ణా జలాల పంపిణీ పథకం పురోగతిలో ఉంది. తుళ్ళూరు, అనంతవరం గ్రామాల్లో ఎత్తిపోతల పథకాలను కూడా చేపట్టారు. పొన్నెకల్లు గ్రామం నుంచి బైపాస్ రోడ్డును ఏర్పాటు చేయనున్నారు. కార్యకర్తలు ఎవరైనా పిలిస్తే పలికే నాయకుడుగా ఆయనకు పేరుంది.

ప్రధానంగా నియోజకవర్గంలో రహదారుల అభివృద్ధికి అగ్రతాంబూలం ఇచ్చారు. ఇందిరమ్మ ఇళ్ళ నిర్మాణంలో కూడా ప్రజలతో మమేకమై ఇళ్ళు పూర్తిచేసేలా కృషి చేస్తున్నారు. హాస్టల్ విద్యార్థుల సమస్యలు, చర్చిలు, మైనారిటీల ఆస్తులు కాపాడడం, సబ్సిడీ బియ్యం పథకం, కౌలు రైతులకు బ్యాంకు రుణాలు, ఎస్సీ, ఎస్టీ కమిషన్ కోసం పోరాటం తదితర కార్యక్రమాలు అటు శాసనసభలోనూ, అటు బయట ధీటుగా చేపట్టారు. వివాదరహితులుగా అతితక్కువ కాలంలో నియోజకవర్గ ప్రజలతో మమేకమై పనిచేస్తున్నారు.





భక్తుల కొంగుబంగారంగా, జిల్లాలోనే ప్రసిద్ధి చెందిన అమరావతిలోని అమరేశ్వరాలయం.

# న్యాయవాదుల ఖిల్లా.. గుంటూరు జిల్లా

చిలకలపూడి రాజశేఖర్,
మేజర్‌న్యూస్, గుంటూరులీగల్



రాష్ట్ర న్యాయశాఖ చరిత్రలో గుంటూరుకు విశిష్ట స్థానం ఉంది. హైదరాబాద్ తర్వాతి స్థానం గుంటూరుదే కావడం గమనార్హం. జిల్లాకు చెందిన కొందరు న్యాయవాదులు జాతీయ స్థాయిలో ఖ్యాతి గడించారు. అంతేకాకుండా రాష్ట్ర ముఖ్యమంత్రులు, కేంద్ర మంత్రులు, రాష్ట్ర క్యాబినెట్ మంత్రుల స్థానాలను అలంకరించారు. హైకోర్టు న్యాయమూ ర్తులుగా నియమితులై జిల్లా ఖ్యాతికి మరింత వన్నె చేకూర్చారు.

## స్వాతంత్ర సంగ్రామానికి చేయూత

భారతదేశ దాశ్యశృంఖలాలను తెంచే క్రమంలో న్యాయవాదులు తమ ప్రాణాలొడ్డారు. భావితరాలకు ఆదర్శప్రాయంగా నిలిచారు. తొలిరోజుల్లో గుంటూరు, కృష్ణా జిల్లాలు రెండు ఒకే జిల్లాగా ఉండేవి. అప్పట్లో గురజాల, బాపట్ల తదితర ప్రాంతాల్లో మేజిస్ట్రేట్ కోర్టులు పనిచేసేవి. కృష్ణా, గుంటూరు జిల్లాలు వేర్వేరు జిల్లాలుగా ఆవిర్భవించిన అనంతరం 1905 వ సంవత్సరంలో జిల్లా కేంద్రంగా గుంటూరులో న్యాయస్థానాలు ఆవిర్భవించాయి. తొలిరోజుల్లో ప్రకాశం జిల్లా న్యాయస్థానాలు కూడా గుంటూరులోనే ఉండేవి. ఇక్కడి కోర్టు భవనాలను 1913లో నిర్మించారు. ఇదిలావుండగా 1954వ సంవత్సరంలో రాష్ట్ర హైకోర్టును తొలుత గుంటూరులోనే ఏర్పాటు చేశారు. అనంతరమే ఇది అనేక పరిణామాల అనంతరం హైదరాబాద్‌కు తరలించారు. అప్పట్లో కొందరు ప్రముఖుల మధ్య కుదిరిన ఒప్పందం మేరకు గుంటూరు జిల్లాలో హైకోర్టు బెంచ్ ఏర్పాటు చేయాల్సి ఉంది. ఇప్పటివరకు ఈ అంశంపై న్యాయశాఖ ఏమీ తేల్చలేదు. జిల్లా న్యాయవాదులు హైకోర్టు బెంచ్ గుంటూరులో ఏర్పాటు చేయాలని ఇప్పటికీ పోరాడుతూనే ఉన్నారు. స్వాతంత్రోద్యమ కాలంనాటి నుంచి న్యాయవాద వృత్తిపై గౌరవం అంచెలంచెలుగా పెరుగుతూ వచ్చింది. దీంతో కొందరు విదేశాలకు వెళ్లి బారిష్టర్ చదివి, న్యాయవాద వృత్తిలోనే స్థిరపడిపోయారు. గతంలో మద్రాసు, విశాఖపట్టణం తదితర ప్రాంతాల్లో మాత్రమే న్యాయకళాశాలలు ఉండేవి. దీంతో న్యాయవాద వృత్తికి భారీ డిమాండు ఏర్పడేది. పైగా న్యాయవాదులు అంకితభావంతో పనిచేసి, పేదల తరుపున ఉచితంగానే తమ వాదన వినిపించేవారు కావడంతో క్రమంగా న్యాయవాద వృత్తివైపు యువత అడుగులు వేయడం ప్రారంభించింది. ప్రస్తుతం జిల్లా కేంద్రంలో రెండు న్యాయకళాశాలలు వచ్చాయి. అలాగే ఇతర ప్రాంతాల్లోనూ న్యాయ కళాశాలలు ఏర్పడ్డాయి.

## మరువలేం.. వారి ఖ్యాతి..

జిల్లాకు న్యాయకళాశాల వచ్చిన తొలిరోజుల్లో కొంపల్లి కోటిలింగం, దేశిరాజు హనుమంతరావు, అన్నంరాజు సీతాపతిరావు, మాధవపెడ్డి హనుమంతరావు, కె.వి.జయకష్ణారావు, గోవిందరాజులు శ్రీనివాసారావు తదితరులు అధ్యాపకులుగా, న్యాయవాదులుగా చిరస్థాయి గుర్తింపు పొందారు. ఎందరో యువ న్యాయవాదులను తీర్చిదిద్దారు. వీరందరిలోనూ గోవిందరాజులు శ్రీనివాసరావు ప్రత్యేకతను సంతరించుకున్నారు.

## ఆనాటి నుంచే అభ్యుదయ వాదం..

న్యాయవాద వృత్తిలో ఉన్న వారు స్వాతంత్రోద్యమ కాలంలోనే అభ్యుదయ భావజాలానికి ప్రాధాన్యం ఇచ్చేవారు. వారి సమకాలీకులను కూడా సమాజ శ్రేయస్సుకై పాటుపడేలా కృషిచేశారు. స్వాంత్రంత్యం కోసం జైళ్లకు వెళ్లివచ్చిన ఘటనలు కూడా చోటు చేసుకున్నాయి. ప్రఖ్యాతి గడించిన నడింపల్లి నరసింహరావు, కొండా వెంకటప్పయ్య పంతులు, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు నేటికీ మహోన్నత వ్యక్తులుగా నిరంతరం ప్రజల నాలుకలపై కదలాడుతూనే ఉన్నారు. జిల్లాలోని బాపట్లలో కొద్దికాలం మేజిస్ట్రేట్‌గా పనిచేసిన జస్టిస్ కోకా వెంకటసుబ్బారావు, భారత అత్యున్నత న్యాయస్థానానికి ప్రధాన న్యాయమూర్తిగా పనిచేశారు. దివంగత ఆవుల సాంబశివరావు, జస్టిస్ అంబటి లక్ష్మణరావులు రాష్ట్ర సర్వోన్నత న్యాయస్థానానికి ప్రధాన న్యాయమూర్తులుగా పనిచేశారు. జస్టిస్ సాంబశివరావు ఆంధ్రా విశ్వవిద్యాలయం వి.సి.గా పనిచేశారు. అలాగే ఆయన రాష్ట్ర తొలి లోకాయుక్తగానూ పనిచేశారు.....

మిగతా 132వ పేజిలో

# న్యాయవాదుల ఖిల్లా.. గుంటూరు జిల్లా

131వపేజీ తరువాయి

జస్టిస్ అమరేశ్వరి, జస్టిస్ సి.హెచ్.ఎస్.ఆర్.కె. ప్రసాద్‌లు రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తులుగా పనిచేశారు. జస్టిస్ పి.ఎస్.నారాయణ ప్రస్తుతం హైకోర్టు జడ్జిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

**నడింపల్లి** : న్యాయవాద వత్తిలో కొనసాగుతూ స్వాతంత్ర్యం కోసం జైలుకు వెళ్లివచ్చిన నడింపల్లి లక్ష్మీనరసింహరావు గుంటూరు పట్టణ పురపాలక సంఘం ఛైర్మన్‌గా అనేక సంవత్సరాలు పనిచేసి, తన ప్రతిభను నిరూపించుకున్నారు. అంతేకాకుండా ఈయన 'కర్నూలు' జిల్లా ఆంధ్రప్రదేశ్‌కు రాజధానిగా ఉన్న రోజుల్లో ప్రొటెం స్పీకర్‌గానూ పనిచేసిన అనుభవాన్ని గడించారు.

**కొండా వెంకటప్పయ్య:** విఖ్యాతి చెందిన 'దేశభక్త' కొండా వెంకటప్పయ్య పంతులు మహాత్మాగాంధీకి ప్రధాన అనుచరునిగా గుర్తింపు పొందారు. స్వాతంత్ర్యం పోరాటాలు, విద్యాదానం, మురికివాడల అభివృద్ధి కోసం వెంకటప్పయ్య పంతులు చేసిన పోరాటాలు ఎనలేనివి. ఈ నేపథ్యంలోనే ఈయనకు 'దేశభక్త' అని బిరుదును ఇచ్చి, గౌరవించుకుంటున్నాము. ఈయన కొంతకాలం కాంగ్రెస్ పార్టీ కార్యదర్శిగా పనిచేశారు.



న్యాయదేవత



జిల్లాలో పర్యాటక కేంద్రంగా బాపట్ల సూర్యలంక సముద్ర తీరం విరాజిల్లుతోంది. ఇక్కడకు వచ్చే సందర్శకులకు ప్రభుత్వం విస్తృత సౌకర్యాలను ఏర్పాటు చేసింది.

**ఉన్నవ:** ప్రముఖ స్వాంతంత్ర్య సమరయోధుడు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు స్త్రీ జనోద్ధరణకు పాటు పడిన మహోన్నత వ్యక్తి. స్త్రీలు విద్యారంగంలో రాణిస్తేనే వారి భవితకు అర్థం, పరమార్థం చేకూరుతుందని భావించిన వ్యక్తి. ఈ నేపథ్యంలోనే ఆయన బ్రాడీపేటలో మహిళల కోసం శాంతినికేతన్ విద్యాసంస్థను స్థాపించారు. ఉన్నవ రాసిన నవల 'మాలపల్లి' జాతీయ స్థాయిలో ఖ్యాతి గడించింది.

**ఎస్.వి.ఎల్.:** గుంటూరుకు తొలి ఎంపీగా ఎన్నికైన ఎస్.వి.ఎల్.నరసింహం జిల్లాలోనే ఖ్యాతి గడించిన న్యాయవాది. ఉన్నత విలువలు, వృత్తిపట్ల అంకితభావం కలిగిన వ్యక్తిగా ఎస్.వి.ఎల్. ప్రజల హదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయారు. ఆయన కాలం చేసేవరకు న్యాయవాద వృత్తిలోనే కొనసాగారు.

**ముఖ్యమంత్రులు.. మంత్రులు:** రాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేసిన కాసు



చెడు వినకు., చెడు మాట్లాడకు., చెడు చూడకు



కోర్టు భవన సముదాయం

బ్రహ్మానందరెడ్డి గుంటూరు జిల్లాకు చెందిన న్యాయవాధి. ఆయన కేంద్ర మంత్రిగా, రాష్ట్ర గవర్నర్‌గా పనిచేశారు. అలాగే భవనం వెంకట్రామ్, నాదెండ్ల భాస్కంరావులు రాష్ట్ర క్యాబినెట్ మంత్రులుగా బాధ్యతలు నిర్వహించారు. యడ్లపాటి వెంకట్రావు, భవనం జయప్రద, ఆలపాటి ధర్మారావు, ఆలపాటి రాజేంద్రప్రసాద్ తదితరులు కూడా క్యాబినెట్ మంత్రులుగా పనిచేశారు. ఆలపాటి రాష్ట్ర శాసన సభ స్పీకర్‌గా, న్యాయ, హోంశాఖలకు మంత్రిగా పనిచేశారు. ఈయన న్యాయశాఖ మంత్రిగా ఉన్నప్పుడే గుంటూరుకు నూతన కోర్టు భవనాలు మంజూరు అయ్యాయి. కేంద్రంలో పలు కీలక పదవులు అలంకరించిన కొత్త రఘురామయ్య కూడా తొలినాళ్లలో న్యాయవాద వృత్తిలోనే ఉన్నారు. కాగా నరసరావుపేటకు చెందిన నల్లపాటి వెంకటరామయ్య రాష్ట్ర అసెంబ్లీ స్పీకర్‌గా పనిచేయగా ఆయన సోదరుడు వెంకటేశ్వర్లు చౌదరి జిల్లా బోర్డు అధ్యక్షునిగా పనిచేశారు. నిశ్శంకరావు వెంకటరత్నం ఎమ్మెల్యేగా, ఎంపీగా పనిచేసి కొంతకాలం రాష్ట్ర అసెంబ్లీ స్పీకర్‌గానూ పనిచేశారు. దివంగాత జూపూడి యజ్ఞనారాయణ జనసంఘం పార్టీకి ఉపాధ్యక్షునిగా పనిచేసి, మాజీ ప్రధాని వాజ్‌పేయి, ఎల్.కె.అద్వానీల సన్నిహితులుగా మెలిగారు. సీనియర్ న్యాయవాది సింగం బసవపున్నయ్య గతంలో తెనాలి నుంచి ఎంపీగా ఎన్నికయ్యారు. ప్రస్తుతం ఆయన ఎమ్మెల్సీగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. రాష్ట్ర గ్రంథాలయ సంస్థల ఛైర్మన్ కూచిపూడి సాంబశివరావు, జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మన్ చిట్టా విజయభాస్కరరెడ్డిలు కూడా న్యాయవాదులే. మాజీ ఎమ్మెల్యే, రాష్ట్ర మౌలిక సదుపాయాల కల్పన సంస్థ మాజీ ఛైర్మన్ అంబటి రాంబాబు, ప్రస్తుతం చిలకలూరి పేట ఎమ్మెల్యేగా పనిచేస్తున్న మర్రి రాజశేఖర్, తాడికొండ ఎమ్మెల్యే డొక్కా మాణిక్య వరప్రసాద్, బాపట్ల ఎమ్మెల్యే గాదె వెంకటరెడ్డి తదితరులు న్యాయవాద వత్తినుంచి రాజకీయంలోకి వచ్చిన వారే.

**బార్... ప్రస్తానం...**

జిల్లా కోర్టులోని బార్ అసోసియేషన్ 1924లో కేవలం 45 మంది న్యాయవాదులతో ప్రారంభమైంది. ప్రస్తుతం 1600 మంది పైగా న్యాయవాదులు ఇక్కడ ప్రాక్టీస్ చేస్తున్నారు. జిల్లా వ్యాప్తంగా సుమారు 3500 మంది న్యాయవాదులు వృత్తిలో కొనసాగుతున్నారు. గుంటూరు నగరంలో పది, తెనాలి, నంసరావుపేటలలో ఒక్కో జిల్లా కోర్టు పనిచేస్తున్నాయి. ఐదు జిల్లాలకు సంబంధించిన కార్మిక న్యాయస్థానం కూడా గుంటూరులో పనిచేస్తుంది. సీనియర్ సివిల్ జడ్జి కోర్టులు గుంటూరులో నాలుగు, తెనాలి, నర్సరావుపేటల్లో రెండు చొప్పున పనిచేస్తున్నాయి. గురజాల, బాపట్లలో ఒక్కొక్కటి పనిచేస్తున్నాయి. జూనియర్ సివిల్ జడ్జి కోర్టులు గుంటూరులో తొమ్మిది, తెనాలిలో మూడు, నర్సరావుపేటలో మూడు, పొన్నూరులో రెండు, మంగళగిరిలో రెండు, బాపట్లలో రెండు, రేపల్లెలో మూడు, మాచర్లలో ఒకటి, సత్తెనపల్లిలో రెండు పనిచేస్తున్నాయి. కోర్టులన్నీ ఒకే ప్రాంగణంలో ఉన్నది రాష్ట్రవ్యాప్తంగా గుంటూరులో ఒక్కచోటే ఉన్నాయి.



జిల్లా న్యాయసేవాధికార సంస్థ





# చిరు ఆశయసాధనలో కోటా

అన్నం కేశవరావు,మేజర్‌న్యూస్, పొన్నూరు

నోబెల్ బహుమతి గ్రహీత మధర్‌థెరిస్సా సేవా కార్యక్రమాల పట్ల ఆకర్షితులైన మెగాస్టార్ చిరంజీవి చేపట్టిన సేవా కార్యక్రమాలు నేటి యువతకు ఆదర్శంగా నిలవడమే కాక వారిలో సామాజిక స్పృహ కలిగిస్తున్నాయనడంలో ఎలాంటి సందేహం లేదు. రాష్ట్రంలో అనేకమంది చిరంజీవి స్ఫూర్తితో పేదప్రజలకు సేవలనందిస్తూ తమకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుంటున్నారు. మరికొంతమంది చిరు సేవా కార్యక్రమాలకు స్పందించి తమవంతు సహాయసహకారాలు అందిస్తూ మానవత విలువలను చాటుకుంటున్నారు. రాష్ట్రవ్యాప్తంగా ఉన్న చిరు అభిమాన సంఘాల వల్ల ఆయా ప్రాంతాల్లో సేవా కార్యక్రమాలు మొగ్గ తొడిగి పేదప్రజలకు ఆసరాగా నిలుస్తున్నాయి. అభిమానులు చిరు ఆశయసిద్ధికి రూపకల్పన చేస్తూ ఆయన స్ఫూర్తితో ముందుకు సాగుతున్నారు. ఈ కోవకే చెందిన కోటా శ్రీనివాసరావు చిరంజీవిని ఆదర్శంగా తీసుకుని జిల్లాలో పలు రకాల సేవా కార్యక్రమాలు చేపట్టి మంచి గుర్తింపు పొందారు. పొన్నూరు మండలం వెల్లలూరు గ్రామానికి చెందిన ఈయన రెండేళ్ళ క్రితమే ఏకంగా తన పేరు మీద సేవాసంస్థను ప్రారంభించి విరివిగా సేవలందిస్తున్నారు. చిరంజీవి సేవాదృక్పథం తనను కదిలించిందని, మానవ సేవే మాధవ సేవ అన్న సూక్తికి కట్టుబడి ఉండడమే తన పరమావధిగా భావిస్తున్నట్లు ఆయన చెప్పారు. ఇంజినీరింగ్ చదివి, రియల్ ఎస్టేట్, బిల్డర్‌గా ఈయన స్వశక్తితో ఎదిగి పురోగతి సాధిస్తున్నారు. గృహ సంకల్ప రియల్టర్స్, ఇందూశ్రీ ఎస్టేట్స్, మిలీనియం విద్యా సంస్థలకు అధినేతగా ఉన్న శ్రీనివాసరావు చిరంజీవి ఛారిటబుల్ ట్రస్ట్‌కు రక్తదానం, నేత్రదానం చేయిస్తూ ఎందరికో పునర్జన్మ అందిస్తుండటంతో పాటు వృద్ధులు, వితంతువులు, వికలాంగులు, అనాధలకు శక్తివంచన లేకుండా సేవ చేస్తున్నారు. యువ కాపునాడు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, సమీకృత ఉమెన్ వెల్ఫేర్ అడ్వైజర్‌గా తాను నిర్వహిస్తున్న పదవులకు వన్నెతెచ్చారు. గ్రామాల్లో ఉన్న చిరంజీవి అభిమాన సంఘాలు ముందుకు వచ్చి తమ పూర్తి సహాయసహకారాలు ఎల్లవేళలా అందిస్తామని శ్రీనివాసరావుకు చెప్పడం ఆయన కృషికి అద్దం పడుతుంది. సర్వజనం సమ్మేళనం పేరుతో పొన్నూరులో ఇంతవరకు ఎన్నడూ నిర్వహించని రీతిన సామాజిక న్యాయ సాధనా సదస్సును ఏర్పాటుచేసిన ఘనత కోటాదే. రాష్ట్ర స్థాయిలో పేరెన్నికగన్న వివిధ వార్గలకు చెందిన నాయకులను మేమంతా ఒక్కటే అని చాటిచెప్పిన కోటా ఎన్ని శిఖరాలను అధిరోహించిన ఆయనలో ఉన్న ఒదిగిపోయో తత్వం పొన్నూరు నియోజక వర్గ ప్రజలను ఆకట్టుకుంది. త్వరలో పొన్నూరులో విద్యార్థులకు అంతర జిల్లాల క్రీడ పోటీలను చిరంజీవి పేరు మీద నిర్వహి ణ, ఉగాధి సంధర్భంగా ఎన్నో సేవాకార్యక్రమాలు నిర్వహించేందుకు ప్రణాళికలు సిద్ధం చేస్తున్నట్లు ఆయన చెప్పారు. పొన్నూరు, చేబ్రోలు, పెదకాకాని మండల కేంద్రాల్లో మెగా మెడికల్ క్యాంపులు నిర్వహించనున్నట్లు కోటా శ్రీనివాసరావు తెలిపారు



కోటా శ్రీనివాస్

# అభివృద్ధిలో రేపల్లె నియోజకవర్గం ముందంజ

జగదీష్, మేజర్‌న్యూస్, రేపల్లె

రేపల్లె నియోజకవర్గ అభివృద్ధికి తెనాలి ఎం.పి వల్లభనేని బాలశౌరి సహకారంతో గడచిన నాలుగు సంవత్సరాల కాలంలో రూ. 120 కోట్లకు పైగా అభివృద్ధి పనులు చేపట్టినట్లు రేపల్లె ఎమ్మెల్యే దేవినేని మల్లిఖార్జునరావు మేజర్ న్యూస్‌కి తెలిపారు. లంక గ్రామాలలో వర్షాల సమయాలలో రైతుల బాధలను చూడలేక డ్రైనేజి వ్యవస్థను మెరుగుకై రూ. 4 కోట్లతో టెండర్లు పిలవనున్నట్లు ఆయన తెలిపారు. కోటిపల్లి, పెదపాలెం, గొరికపూడి, పెదపులివర్రు, ఓలేరు, తూర్పుపాలెం, రావిఅనంతవరం కాల్వపై డబుల్ బ్రిడ్జిలు నిర్మించటానికి ఇరిగేషన్ స్కీమ్‌లో నిధులు మంజూరైనట్లు తెలిపారు. భట్టిప్రోలు మెయిన్ డ్రైన్ నుండి మురుగు పోవటానికి వెల్లటూరు దగ్గర కృష్ణానదిలో కలపటానికి రూ. 20 కోట్లతో పనులు ప్రారంభించినట్లు తెలిపారు. లంక గ్రామాల ప్రజలు వరదల సమయంలో మంచినీటి సమస్యను ఎదుర్కోవటంతో గొరికపూడి, వెల్ల టూరు, కనగాల తదితర గ్రామాలలో సమస్య పరిష్కారానికి సుమారు రూ. 2 కోట్లతో అభివృద్ధి పనులు ప్రారంభించామని ఆయన అన్నారు. పోతార్లంక లిఫ్టు ఇరిగేషన్ పనులు రూ. 10కోట్లతో ప్రారంభమైనాయని, వెల్లటూరు- భట్టిప్రోలు రహదారి రూ. 1కోటి 20 లక్ష లతో డబల్ రోడ్లు వేశామని తెలిపారు. మోర్లావారి పాలెం- రావిఅనంతవరానికి రూ. 1కోటి 90 లక్షలతో సిమెంటురోడ్డు నిర్మాణ పనులు చేపట్టనున్నట్లు తెలిపారు. కోళ్ళపాలెం, ఓలేరు, పెదపులి వర్రుల దగ్గర కాల్వపై హైలెవల్ బ్రిడ్జిలు నిర్మించనున్నట్లు తెలిపారు. పెనుమూడి-పెదపులివర్రు కాల్వకట్ట డబల్‌రోడ్డు నిర్మాణానికి సెంట్రల్ రోడ్ ఫండ్ నుండి నిధులు మంజూరయ్యాయని, దానికి టెండర్ల ప్రక్రియ మొదలైనట్లు తెలిపారు.



రేపల్లె శాసనసభ్యులు దేవినేని మల్లిఖార్జునరావు

# రోగుల పాలిట కల్పవృక్షం సంజీవి కొండ

టి.వి.యన్.ఎ.శర్మ,
మేజర్‌న్యూస్, ఈపూరు



కొండపై ఒక సోమవారం నెలకొన్న రద్దీ

ఒకప్పుడు అది మావోయిస్టుల నినాదాలతో మార్మోగిన కొండ. ఇప్పుడు మహేశ్వరుని శివనామ స్మరతో ప్రతిధ్వనిస్తున్న సంజీవికొండ. ఈ కొండపై జాగారం చేయడం వలన స్వస్థత చేకూరుతుందన్న నమ్మకం భక్తుల తాకిడిని వేలల్లోంచి లక్షల్లోకి చేర్చింది. ప్రసిద్ధ శైవ క్షేత్రాలైన శ్రీశైలం, కోటప్పకొండలకు ధీటుగా లక్షల సంఖ్యలో భక్తులు సంజీవి కొండకు వస్తున్నారు. సౌకర్యాల కల్పనలో అధికారుల అప్రమత్తత మాత్రం కనిపించడంలేదు. కోటయ్య స్వామికి కోటి దండాలంటున్న భక్తుల కోర్కె లు తీరుస్తూ, రోజురోజుకూ పెరుగుతున్న ప్రజాదారణతో సంజీవి కొండ ప్రతి సోమవారం నిత్య కళ్యాణం పచ్చతోరణంలా విలసిల్లుతూ ఆరు నెలల అనతి కాలంలోనే అశేష భక్తుల ఆదరణ చూరగొన్న సంజీవికొండ అనన్యం. శివునికి ప్రీతికరమైన సోమవారం భక్తులు కొండకు వెళ్లి స్వామి వారిని దర్శించుకొని రాత్రుళ్లు జాగారం చేస్తున్నారు. రాష్ట్ర నలు మూలల నుంచి లక్షలకొద్ది భక్తులు దర్శించుకుంటున్నారు. ప్రతి సోమవారం స్వామి వారికి లక్ష రూపాయలు పైగా ఆదా యం వచ్చిందని ఆలయ పూజారి చెప్పారు. ఈ కొండకు వెళ్ళాలంటే వినుకొండ నుంచి రవాణా సౌకర్యాలు ఉన్నాయి.

# బాలశౌరి పయనం ఎటు?

ఎ.వి.డి.శర్మ, సూర్యప్రతినిధి, గుంటూరు

నియోజక వర్గాల పునర్విభజనలో రద్దయిన తెనాలి లోక్‌సభ నియోజకవర్గం నుంచి ప్రాతినిధ్యం వహిస్తున్న వల్లభనేని బాలశౌరి ఈసారి ఆయన ఏ నియోజకవర్గం నుంచి పోటీ చేస్తారనే విషయం ఆసక్తి కరంగా మారింది. పార్లమెంట్ సభ్యుడిగా 2004 లో తెనాలి నుంచి ఎన్నికైన బాలశౌరి అతితక్కువ కాలంలో ఢిల్లీలో మంచి పలుకుబడిని సంపాదించారు. యు.పి.ఎ. ఛైర్పర్సన్ సోనియాగాంధీ కుటుంబానికి అత్యంత సన్నిహితంగా మారారు. ఎ.ఐ.సి.సి ప్రధాన కార్యదర్శి రాహుల్‌గాంధీతో కూడా బాలశౌరి మంచిమిత్రుడుగా ఉంటున్నారు. రాహుల్‌గాంధీతో కలిసి యువశాసనసభ్యులంతా ఇటీవల ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్‌ను కలిసి దేశంలో ఉపాధిహామీ పథకాన్ని సమర్ధవంతంగా అమలు చేయాలని వినతిపత్రం సమర్పించారు. ఈ బృందంలో రాహుల్‌తో పాటు ఎం.పి. బాలశౌరి కూడా ఉన్నారు. అలాగే ఢిల్లీ రాజకీయాల్లో ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డికి అనుకూలంగా చక్రం తిప్పడంలో కూడా బాలశౌరి కీలకభూమిక పోషిస్తున్నారు. రాష్ట్రంలో వై.ఎస్ తోనూ, కేంద్రంలో సోనియా కుటుంబంతోనూ అత్యంత సన్నిహితంగా మెలు గుతూ అతితక్కువ కాలంలో నియోజకవర్గానికి అత్యధికంగా నిధులు తీసుకురావడంతో పాటు రాష్ట్ర స్థాయిలోనూ ప్రత్యేకంగా గుర్తింపు పొందారు. చిన్న వయస్సులో పార్లమెంట్ సభ్యుడిగా ఎన్నికైన బాలశౌరి పలువురు కేంద్రమంత్రులతో రాష్ట్ర మంత్రులతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉన్నారు. జిల్లాలో తెరవెనుక రాజకీయాన్ని నడిపించడంలో కీలకభూమిక పోషిస్తున్నారు. ఈ నేపథ్యంలో ఆయన పునర్విభజన వల్ల తెనాలిలో పోటీ చేసే అవకాశం లేకపోవడంతో గుంటూరు లేదా సరసరావు పేట స్థానాన్ని పోటీ చేయడానికి ఉద్యుక్తులౌతున్నారు. తాను జిల్లాలోని ఏదో ఒక పార్లమెంట్ స్థానం నుంచి పోటీ చేస్తానని, మరో జిల్లాకు వెళ్ళే ప్రసక్తేలేదని, అసెంబ్లీకి పోటీ చేయబోనని స్పష్టం చేశారు. మరి ఆయన పయనం ఎటో?



వల్లభనేని బాలశౌరి














# దూసుకుపోతున్న రవాణా

ఎ.వి.డి.శర్మ, సూర్యప్రతినిధి గుంటూరు

గుంటూరు జిల్లాలో వివిధ మార్గాల్లో రవాణా వ్యవస్థ వేగంగా అభివృద్ధి చెందుతోంది. జిల్లాకు అనేక కొత్తరైళ్ళు రావడం, గుంటూరు, చెన్నై మార్గంలో న్యూగుంటూరు రైల్వే స్టేషన్ ద్వారా కొత్త రైళ్ళ ఆగమనంతో రైల్వే వ్యవస్థలో రైల్వే సదుపాయాలు జిల్లాలో క్రమంగా మెరుగు పడ్డాయి. గుంటూరు, విజయవాడ వద్ద ట్రాక్ డబ్లింగ్ పనులు కూడా దాదాపుగా పూర్తి కావస్తున్నాయి. డబ్లింగ్ పనులు పూర్తయితే 30 నిమిషాల్లో విజయవాడకు చేరు కోవచ్చు. అలాగే క్రాసింగ్‌ల బెడద నుండి బయటప డవచ్చు. చెన్నై- జమ్ముతావి, చెన్నై-లక్నో, చెన్నై- కాకినాడ పోర్టు, ఎక్స్‌ప్రెస్ రైళ్ళు న్యూగుంటూరు స్టేషన్ మీదుగా నడుస్తున్నాయి. అలాగే గుంటూరు-నంద్యాల బ్రాడ్‌గేజ్ లైను ఏర్పాటు అయిన తర్వాత గుంటూరు నుంచి బెంగుళూరుకు రైళ్ళ సంఖ్య పెరుగుతోంది. హుబ్లి, యశ్వంతపూర్, వాస్కోడిగామాకు ఎక్స్‌ప్రెస్ రైళ్లు నడుస్తున్నాయి. అలాగే గుంటూరు- సికింద్రాబాదు మీదుగా డీకి ఎక్‌పెస్ రైళ్ళు నడపాలనే డిమాండ్ ఉంది. మరోవైపు జిల్లాలో విజయవాడ- చిలకలూరిపేటల మధ్య జాతీయ రహదారిని ఆరు లైన్లుగా విస్తరిస్తు న్నారు. దీంతో ఈ మార్గంలో నిత్యం వెళ్ళే వేలాది వాహనాలు మరింత వేగంతో దూసుకుపోనున్నా యి.

అలాగే నౌకాయాన మార్గం కూడా అభివృద్ధి చెందనుంది. నిజాంపట్నం పోర్టు అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం చర్యలు చేపట్టింది. నిజాంపట్నం నుండి ఓడరేవు వరకు 1600 కోటరూపాయలతో పారిశ్రామిక క్యారిడార్‌ను అభివృద్ధి చేస్తున్నారు. ఇంకో వైపు జిల్లాలో విమానాశ్రయం ఏర్పాటుకు రంగం సిద్ధమైంది. స్థల సేకరణలో అధికారులు నిమగ్నం అయ్యారు. రవాణా వ్యవస్థలో ఆర్టీసీ అత్యంత వేగంగా దూసుకుపోతుంది. ఆధునిక బస్సులతో ప్రయాణీ కులను, ఇతర రాష్ట్రాలలోనూ, రాష్ట్రాల ప్రధాన నగరాలకు చేరుస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లో ఆర్టీసీ ధీటుగా ప్రత్యామ్నాయ రవాణా వ్యవస్థ ఏర్పాటవుతోంది.

ఆటోలు, ప్రైవేటు వాహనాలు, వ్యక్తిగత వాహనాలు కూడా పెరుగుతుండడంతో రహదారులను ఎంత విస్తరించినా ఇప్పటికి కిక్కిరిసి పోతూనే ఉన్నాయి. పెరుగుతున్న జనాభాకు అను గుణంగా రాబోయే శతాబ్ది కాలంలో ఎదురయ్యే సవాళ్ళను దృష్టిలో పెట్టుకొని రహదారులను మరింత అభివృద్ధి చేయాల్సిన అవసరం ఏర్పడింది.





# క్రీస్తుకు ముందే వర్ధిల్లిన నాగరికత


THE EARLY HISTORIC SITE MALLEPADU

Mallepadu is a Small Village (Hamlet of Pinapadu Village) Located about 3 Kms at The South of Tenali Town in Guntur District; A hemispherical Mound Spread over an area of 2.94 acres SY.no.197 Existing near Vijayawada-Chennai Railway track. This is a Protected Site by the Department of Archaeology and Museums, Government of Andhra Pradesh.

A Minor Excavation Conducted During 1987-88 Field Season at this Site Revealed, this area was Occupied uninterruptedly from the beginning of 5th C.B.S to 3rd C.A.D. The Study of the antiquities and Artifacts unearthed From the Site Suggests beyound doubt, that it was a good Early historic habitation Site, Reflecting their lije Style of the period.

DIRECTOR
ARCHAEOLOGY AND MUSEUMS
GOVT. OF. A.P

తొలి చారిత్రక స్థలం-మల్లెపాడు

స్థలంలో పురావస్తు శాఖవారు ఏర్పాటుచేసిన బోర్డు

మేకల సురేష్, ఆర్.సి ఇన్‌ఛార్జి, తెనాలి

క్రీస్తు శకం ఆరంభానికి ముందే నాగరికత వర్ధిల్లిన కేంద్రం మల్లెపాడు. పురావస్తు శాఖ జరిపిన పలు తవ్వకాల్లో లభ్యమైన ఆధారాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఇప్పటికీ పురావస్తు శాఖ సంరక్షణలోని మల్లెపాడు దిబ్బ నాటి ప్రత్యేకతలను చాటుతుంది. క్రీస్తు పూర్వం 5వ శతాబ్దం నుంచి క్రీ.శ. 3వ శతాబ్దం వరకు ఇక్కడ నాగరికత అభివృద్ధి చెందిందని తెలుస్తుంది. సారవంతమైన డెల్టా ప్రాంతంలో ఉన్న మల్లెపాడు చక్కని సం స్కృతికి కేంద్రమైంది. అయితే అప్పట్లో ఈ ప్రాం తాన్ని ఏ పేరుతో పిలిచేవారన్నది ఆధారాలు లభ్యం కాలేదు. అప్పటి రాజ్యాలను ధాన్యకటకం, భట్టిప్రోలు ప్రాంతాలతో సన్నిహిత సంబంధాలున్నట్లు తెలుస్తుంది. ఇక్కడ లభించిన ఇటుకల పరిమాణం, భిక్షపాత్రలు, రోమన్ మట్టిపాత్ర నమూనాలు, ధాన్య కటకంలో లభ్యమైన సామగ్రితో పోలి ఉన్నాయి. వీటి ఆధారంగా ఈ ప్రాంతం బౌద్ధ క్షేత్రమైన ధాన్యక టకంతో మంచి సంబంధాలను కలిగి ఉందని అర్ధమవుతుంది. ఇంత నాగరికత వర్ధిల్లిన ప్రాంతం క్రమంగా ఎలా అంతర్ధానమైందన్నది చరిత్రకారులకు శేష ప్రశ్నగానే మిగిలింది.

అప్పట్లో వైద్యం అంతగా అభివృద్ధి చెందని ఆ కాలంలో అంటు వ్యాధులు, క్షామ బాధలు వంటి కారణాలతో ప్రజలు ఇక్కడి నుంచి తరలివెళ్ళారని అభిప్రాయం ఉంది. ఊరికి దూరంగా కొందరు ప్రజలు నివాసమేర్పర చుకుని దాన్ని పినపాడుగా పిలుస్తూ ఉంటారని భావం ఉంది.

తెనాలిలో కనిపించే పినపాడు అలా ఏర్పడిందని అంటుంటారు. మల్లెపాడులోని మల్లేశ్వరస్వామిని పినపాడులోనూ ప్రతిష్టించారని అంటుంటారు. రెండు చోట్ల మల్లేశ్వరస్వామి దేవాలయాలున్నాయి.

మల్లెపాడులో నాలుగు ఎకరాల్లో వ్యాపించిన దిబ్బ ప్రస్తుతం ప్రభుత్వ సంరక్షణలో ఉంది. రెండు దశాబ్దాల ముందు రెండు సార్లుగా జరిగిన తవ్వకాల్లో 9 మానవ నివాసాలకు సంబంధించిన ఆధారాలు కనిపించాయి.



మల్లెపాడు దిబ్బ

# మాచర్లకు కెసిపి ఘనత

ఆలేటి కోటేశ్వరరావు, మేజర్‌న్యూస్, మాచర్ల

నాణ్యత - ఆధునికత - సమిష్టి కృషి మేళవింపుతో మాచర్ల కె.సి.పి సిమెంట్ ఫ్యాక్టరీ జాతీయంగా, అంతర్జాతీయంగా పేరు ప్రతిష్టలు ఆర్జించడానికి దోహదపడింది. మాచర్ల పట్టణానికి ప్రపంచవాప్తంగా గుర్తింపు తెచ్చిన ఘనత దక్కుతంది. నూతన ప్రక్రియల ద్వారా నాణ్యమైన సిమెంటును ఉత్పత్తి చేస్తూ గత కాలపు పేరు ప్రతిష్టలను నిలబెట్టకోవడమే గాక రీసెర్చ్ విభాగం ఎప్పటికప్పుడు ఇక్కడ కొత్తదనం తేవడానికి అహర్నిశలు కృషి చేస్తోంది. 1955 లో ఐ.ఎ.ఎస్ అధికారిగా పనిచేస్తున్న వెలగపూడి రామకృష్ణ స్వచ్ఛంద పదవీ విరమణ తరువాత మాచర్ల పట్టణంలో ఈ సంస్థను స్థాపించారు. ఏడాదికి లక్ష టన్నుల ఉత్పత్తి సామర్థ్యంతో కె.సి.పి సిమెంట్ ఫ్యాక్టరీ 1958లో ప్రారంభమైంది. ఆనాటి నుంచి దినదిన ప్రవర్ధమానమవుతూ నేడు 5 లక్షల టన్నుల ఉత్పత్తి సామర్థ్యం కలిగి ఎందరో కార్మికులకు, అధికారులకు ఉపాధిని కల్పిస్తోంది. బహుళార్థసాధక ప్రాజెక్ట్ నాగార్జున సాగర్ నిర్మాణానికి కె.సి.పి సిమెంటును వినియోగించారంటే ఆ సిమెంట్ నాణ్యత ఎటువంటిదో అందరికీ అవగతమవుతుంది. నాగార్జున సాగర్, శ్రీశైలం ప్రాజెక్టల నిర్మాణానికి 13,42,302 టన్నుల కె.సి.పి సిమెంటు వినియోగించటం జరిగింది. ప్రారంభ దశ నుంచి ఉత్పత్తి రంగంలో నూతన సాంకేతిక విలువలు పాటిస్తూ కె.సి.పి సిమెంటు రారాజుగా వెలుగొందుతోంది. ప్రపంచబ్యాంకు నిధుల సహకారంతో అయిదు అంచల ప్రీ కాల్సినర్ డ్రై ప్రాసస్ ప్లాంటును 420 మిలియన్ల పెట్టుబడితో స్థాపించటం జరిగింది. దీనితో హైస్ట్రెంగ్ పోర్టు లాండ్ సిమెంట్, సల్ఫేట్ రెసిస్టెన్స్ సిమెంట్, రైల్వే స్లీపర్‌లకు అయిల్ బావులకు పనికి వచ్చే సిమెంట్ తయారీకి కె.సి.పి ఉపక్రమించింది. 1994లో ఎల్.ఆర్.క్యూ.ఎ (ఇంగ్లండ్) ద్వారా ఐ.ఎస్.ఒ 9002 సర్టిఫికెట్‌ను కె.సి.పి పొందగలగడం గమనార్హం. ఆర్డినరీ పోర్ట్ ల్యాండ్ సిమెంట్ తయారీలో రామకృష్ణ సిమెంట్స్ దేశంలోనే మొదటిస్థానం అక్రమించింది. మాచర్ల పట్టణంలో ఎన్నో కార్యక్రమాలను చేపట్టి పట్టణ



మాచర్ల కెసిపి సిమెంట్ ఫ్యాక్టరీ, ఇన్‌సెట్‌లో ఫ్యాక్టరీ వ్యవస్థాపకులు వెలగపూడి రామకష్ణ

అభివృద్ధికి విశేష కృషి చేస్తున్న కె.సి.పి పరిసర గ్రామాలకు కూడా తన అండదండలను అందించటం ముదావహం. పట్టణంలో కూరగాయల మార్కెట్‌ను నిర్మించి ఎన్నో సిమెంట్ రోడ్లు వేయించింది. జన్మభూమి కార్యక్రమాలలో ప్రజల విరాళం 30 శాతం నిధులను కంపెనీ సమకూర్చి అనేక పనులు చేపట్టడానికి కారణభూతమైంది. పట్టణంలోని వివిధ వార్డులలో సిమెంట్ రహదారుల నిర్మాణానికి సుమారుగా 11 లక్షల రూపాయల విలువైన సిమెంట్‌ను విరాళంగా అందజేశారు. అన్నింటికి మించి మాచర్ల ప్రజలు ఎదుర్కొంటున్న నీటి ఎద్దడికి నివారించేందుకు గతంలో క్వారీగా ఉపనయోగపడిన సుమారు 35 ఎకరాల ప్రదేశాన్ని స్థానిక పురపాలక సంఘానికి ఉచితంగా ఇచ్చి పట్టణ ప్రజల దాహార్తిని తీర్చేందుకు దోహదపడింది. అందుకే పట్టణ పౌరుల కృతజ్ఞతా సూచకంగా కె.సి.పి మేనేజింగ్ డైరెక్టర్ వి.లక్ష్మణదత్తు మాచర్ల పట్టణ అభివృద్ధి కమిటీ గౌరవ అధ్యక్షునిగా గతంలో ఎన్నుకున్నారు. వేలాది మంది కార్మికులకు ఉపాధి కల్పిస్తున్న మాచర్ల కె.సి.పి కార్మికుల సంక్షేమం కోసం ఇతోధిక ప్రాధాన్యమిస్తోంది. కాలనీలు నిర్మించి, ఉద్యోగుల పిల్లలకు విద్య, వైద్య సౌకర్యాలను కలుగజేస్తోంది. కార్మిక కుటుంబాలలో మహిళలకు అక్షరదీప్తి, కుట్లు, అల్లికలు వంటి పనులు నేర్పి మహిళాభ్యుదయం కోసం కృషి చేస్తోంది.

(మిగతా 138వ పేజీలో)

# మాచర్ల కెసిపి ఘనత

(137వపేజీ తరువాయి)

ఇటీవల 10 లక్షల వ్యయంతో పార్క్ సెంటర్ నుండి రామాటాకీసు మీదుగా చంద్రవంక నది వరకు సిమెంట్ రోడ్డు నిర్మించారు. రింగ్‌రోడ్డు సెంటర్ నుంచి కొత్త పెట్రోల్ బంక్ వరకు ప్రధాన రహదారి డివైడర్ నిర్మించారు. కెసిపి సంస్థ స్థాపించి 50 వసంతాలు పూర్తి కావస్తున్నందున ప్రజల దాహార్తిని తీర్చేందుకు మినరల్ వాటర్ ప్లాంట్ ఏర్పాటు చేసేందుకు కెసిపి యాజమాన్యం సన్నాహలు చేస్తుందని ప్లాంట్ జనరల్ మేనేజర్ వేంజర్‌న్యూస్‌కి తెలిపారు.













# జిల్లాలోని ప్రముఖుల,అధికారులు,హోదాలు,వారిఫోన్ నెంబర్ల వివరాలు

కె.అనిల్‌కుమార్, స్టాఫ్ రిపోర్టర్, గుంటూరు.

| పేరు | హోదా | ఫోన్‌నెంబర్లు |
|---|---|---|
| బి.వెంకటేశం(ఐ.ఎ.ఎస్.) | జిల్లా కలెక్టర్, మేజిస్ట్రేట్ | 9849904002<br>కార్యాలయం-0863-2234200 , బంగ్లా:0863-2234824, 2234550<br>ఫ్యాక్స్ 0863-2234301,2228800, 2235131 |
| కాంతిలాల్ దండే(ఐ.ఎ.ఎస్.) | సంయుక్త కలెక్టర్ | 9849904003<br>బంగ్లా : 0863-2241797, కార్యాలయం-0863-2241475 |
| సిద్దార్థజైన్ (ఐ.ఎ.ఎస్.) | నగరపాలకసంస్థ కమిషనర్ | 9849908364<br>కార్యాలయం:0863-2221902,2224202,2224882,<br>బంగ్లా: 2241689 |
| సత్యనారాయణ్(ఐ.పి.ఎస్) | ఐ.జి., గుంటూరు | 9440627241<br>కార్యాలయం-0863-2320250, బంగ్లా:2230812, 2230912 |
| మహేష్‌చంద్ర లడ్హా (ఐ.పి.ఎస్) | ఎస్పీ, గుంటూరు | 9440796200,<br>9440796207,9440796297. 0863-2234828 (ఫ్యాక్స్), 2234000<br>(కార్యాలయం), 2352100, 2260151 (బంగ్లా) |
| అబ్దుల్ రషీద్ | అడిషనల్ ఎస్పీ, గుంటూరు | 9440796201<br>కార్యాలయం: 0863-2220220, 2241600, 2358950 (బంగ్లా) |
| ఎం.రవిప్రకాష్ , (ఐ.పి.ఎస్.) | ఒ.ఎస్.డి. | 9440796202<br>0863-2218340. |
| జి. జోషిబాబు | డి.ఆర్.ఒ. | 9849904004<br>0863-2225907 (ఫ్యాక్స్), 2234990(కార్యా), 2234194(రెసి) |
| పి.దుర్గాప్రసాద్ | జడ్పీ సి.ఇ.ఒ. | 9849903355 |
| పి.గోపాలకృష్ణారెడ్డి | ఎస్.ఇ. నీటిపారుదలశాఖ | 9440814947 |
| డాక్టర్ వి.దశరథరామిరెడ్డి | ఆర్.డి. ఎం.హెచ్.ఎస్. | 9849902245 |
| కె.సత్యనారాయణ | సి.పి.ఒ. గుంటూరు. | 9849901487 |
| డాక్టర్ కె.సురేష్‌కుమార్ | డి.ఎం.హెచ్.ఒ. | 9849902337 |
| బి.నాగేశ్వరరావు | ఎస్.ఇ. ఆర్ అండ్ బి | 9440818027 |
| సి.రామారావు | ఎస్.ఇ.ప్రజారోగ్యశాఖ | 9849905736 |
| కె.ఉమామహేశ్వరరావు | ప్రిన్సిపాల్ జి.ఎం.సి | 9849903084 |
| డాక్టర్ ఫణిభూషణ్ | సూపరింటెండెంట్, జి.జి.హెచ్. | 9849903089 |
| ఆర్.ఆదినారాయణ | జిల్లా మలేరియా అధికారి | 9849902347 |
| జి.నాగేశ్వరరావు | అసిస్టెంట్ ఫుడ్ కంట్రోలర్ | 9440440596 |
| పి.నర్సయ్య | డి.టి.ఒ. గుంటూరు | 9848045512 |
| డి.శాంతప్ప | డి.డి. మైన్స్, జియాలజీ | 9440817779 |
| షేక్ సలాం | పి.డి.జిల్లా నీటియాజమాన్యసంస్థ | 9849903742 |
| బి.రమాదేవి | పి.డి. మహిళా, శిశుసంక్షేమశాఖ | 9440814511 |
| కె.రామకష్ణ | డి.డి.సాంఘిక సంక్షేమశాఖ | 9849903603 |
| ఎం.లక్ష్మీసుధ | డి.ఎస్.డబ్ల్యూ.ఒ. గుంటూరు | 9849903606 |
| డి.ఎల్.కె.అరుణ | బీసీ సంక్షేమాధికారి,గుంటూరు | 9849904486 |
| పి.నరసింగరావు | ఇ.డి. బీసీ కార్పొరేషన్ | 9849906010 |
| కె.రాజశేఖరరావు | ఇ.డి. ఎస్సీ కార్పొరేషన్ | 9849904843 |
| కె.సరస్వతి | ఇ.డి. ఎస్టీ కార్పొరేషన్ | 9490957018 |
| ఇ.త్రిమూర్తులు | జి.ఎం.పరిశ్రమల శాఖ | 9848778543 |
| ఎస్.లక్ష్మీనారాయణ | డి.సి. కార్మిక శాఖ | 0863-2230605 |
| బాలకృష్ణయ్య | జిల్లా ఉపాధికల్పనాధికారి | 9959500274 |
| వి.మార్క్ | సి.ఇ.ఒ. స్టెప్ | 9849909066 |
| ఎల్.వెంకయ్య | ఎ.డి. హ్యాండ్లూమ్స్ | 9440474346 |
| ఎ.సూర్యనారాయణ | ఎ.డి.వికలాంగుల శాఖ | 9247304797 |
| ఎస్.రంగస్వామి | డివిజనల్ ఆఫీసర్, ఖాదీబోర్డు | 9440814616 |
| సోమేపల్లి వెంకటసుబ్బయ్య | ఆర్.డి.ఒ. గుంటూరు | 9849904006 |
| ఎం.రాఘవరావు | ఆర్.డి.ఒ.నరసరావుపేట | 9849904007 |
| ఐ.వెంకటేశ్వరరెడ్డి | ఆర్.డి.ఒ. తెనాలి | 9849904008 |
| బి.గోపాలకృష్ణ | డి.ఎం. పౌరసరఫరాల శాఖ | 9848789024 |
| జి.శ్రీరాం | జిల్లా పౌరసరఫరాల అధికారి | 9848779807 |
| పి.అజిత్‌కుమార్ | జె.డి. వ్యవసాయశాఖ | 9440816736 |
| కె.వి.సుబ్రహ్మణ్యం | డి.ఎఫ్.ఒ. గుంటూరు | 9440810127 |
| డా.పి.దామోదర్ నాయుడు | జె.డి.పశుసంవర్ధక శాఖ | 9440810748 |
| ఎస్.అస్లాం అన్సారీ | ఆర్.ఎం. గుంటూరు ఆర్టీసీ | 9959225412 |
| వి.సుధాకరరావు | జిల్లా ఖజానాధికారి | 9848778487 |
| పి.కోటిరెడ్డి | డి.సి.ఇ. ఎన్.ఎస్.కెనాల్స్ | 9949827370 |
| కె.రాయల్ | ఎస్.ఇ. ఎన్.ఎస్.కెనాల్స్, లింగంగుంట్ల | 9949556200 |
| పి.వీరాస్వామి | జిల్లా పౌరసంబంధాల అధికారి | 9949351609 |
| ఎన్.మోహనరావు | జిల్లా అగ్నిమాపకాధికారి | 9949991062 |
| బి.మురళీధర్ | డి.డి.మత్స్యశాఖ | 9440814735 |
| డి.మధుసూదనరెడ్డి | ఎ.డి. ఉద్యానశాఖ | 9490490311 |
| జి.హరినాథబాబు | డి.ఎం. నెడ్‌క్యాప్ | 9440431804 |









## జిల్లాలోని ప్రముఖుల, అధికారులు, హోదాలు, వారిఫోన్ నెంబర్లు

| పేరు | హోదా | ఫోన్‌నెంబర్లు |
|---|---|---|
| ఎస్.శివయ్యనాయుడు | జిల్లా ప్రధాన న్యాయమూర్తి | 9440621487 |
| 0863-2234315 (కార్యాలయం), 2354348 (బంగ్లా). | | |
| ప్రొఫెసర్ వి.బాలమోహన్‌దాస్ | వి.సి. ఎ.ఎన్.యు. | 9848010187 |
| 0863-2293238, 2293378 (ఫ్యాక్స్), 223334 (బంగ్లా). | | |
| కూచిపూడి విజయ | జడ్పీ ఛైర్‌పర్సన్ | 9948588588 |
| కన్నా నాగరాజు | మేయర్ నగరపాలక సంస్థ | 9849908363 |
| తాడిశెట్టి మురళీమోహన్ | డిప్యూటీ మేయర్ | 9849908365 |
| లేళ్ల అప్పిరెడ్డి | ఛైర్మన్, వ్యవసాయమార్కెట్ కమిటీ | 9885466888 |
| కుర్రి పున్నారెడ్డి | జి.డి.సి.సి.బ్యాంకు, ఛైర్మన్ | 9849228268 |
| గాజుల మోహన్ | సహకార మార్కెటింగ్ ఛైర్మన్ | 9247240378 |

### రైల్వే ఫోన్ నెంబర్లు...

| | |
|---|---|
| గుంటూరులో విచారణకు : | 133, 2268959 |
| గుంటూరు రిజర్వేషన్ : | 0863-2222901 |
| విజయవాడలో విచారణకు: | 0866-2577775 |
| విజయవాడ రిజర్వేషన్ : | 0866-2578955 |

### ఎ.పి.ఎస్.ఆర్టీసీ నెంబర్లు...

| | |
|---|---|
| గుంటూరు ఎంక్వయిరీ: | 0863-2220820 |
| గుంటూరు రిజర్వేషన్ : | 0863-2226820 |
| విజయవాడ ఎంక్వయిరీ: | 0866-2522200, 2521982 |
| విజయవాడ రిజర్వేషన్: | 0866-2522400 |

## గతమెంతో ఘనం..నేడు దుర్భరం..కొండవీటి వైభవం..!

లీలానంద్, మేజర్‌న్యూస్, చిలకలూరిపేట

పేరు గొప్ప ఊరు దిబ్బలా తయారైంది కొండవీటి పరిస్థితి. అత్యంత ప్రాతిత్యమూ,సాంస్కృతిక వికాసమూ, వెల్లివిరిసిన ఈ కోట పాలకుల నిర్లక్ష్యం కారణంగా రాళ్ళ దిబ్బగా మిగిలిపోయే పరిస్థితి కనపడుతుందని పర్యాటకులు, భక్తులు ఆందోళన చెందుతున్నారు. నాడు కొండవీడును పరిపాలించిన రెడ్డిరాజులే నేటి ప్రభుత్వ రథసారథులు కావటం విశేషం. గతమెంతో ఘన కీర్తి కలిగిన కొండవీడు గుంటూరు జిల్లా యడ్లపాడు సమీపంలోని ఓ చిన్న గ్రామం. ఈ చిన్న గ్రామమే 105 సంవత్సరాలు రాజ్యపాలన సాగించిన రెడ్డి రాజులకు రాజధాని. క్రీ.శ.1324 నుండి 1434 వరకు అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరం, కందుకూరు ప్రాంతాలు రెడ్డిరాజుల కైవసం అయ్యాయి.



శిథిలమైన నాటి కట్టడాలు

**రాజ్య ఆవిర్భావం:** కాకతీయ సామ్రాజ్యం అస్తమించిన తర్వాత అనేక ముక్కలుగా విడిపోయిన అంధ్రదేశంలో సామంత రాజులు స్వతంత్ర రాజ్యాలను స్థాపించారు. ఇలా స్థాపించిన రాజ్యాలలో కొండవీడు ఒకటి. వీరిలో రెడ్డి, వెలమ రాజ్యాలు ప్రధానమైనవి. రెడ్డిరాజ వంశానికి మూల పురుషుడు కొమటి ప్రోలారెడ్డి. ఇతను వైదిక మతాభిమాని వీరి కుమారుడు కోమటి వేమారెడ్డి ఓరుగల్లును ఆక్రమించిన తురుష్కలతో వీరోచితంగా పోరాడి వారిని దక్షిణ ప్రాంతం నుండి తరిమి కొట్టిన ఘనుడు. క్రీ.శ.1325 నుండి వేమారెడ్డి స్వతంత్రపాలనకు శ్రీకారం చుట్టారు. వేమారెడ్డి మరణాంతరం వారసులు అనవోతారెడ్డి, అనవేమారెడ్డి, కుమారగిరి, అనవేముడు, పెదకోమటి వేమారెడ్డిలు రాజ్యాన్ని సుభిక్షంగా పరిపాలించారు. వీరి పరిపాలన కేంద్రానికి కొండవీడును కేంద్రంగా చేసుకోవటానికి శత్రుదుర్భేద్యమైన పర్వత శ్రేణుల మధ్య కోట వీరికి అనుకూలంగా ఉండటంతో ఈ ప్రాంతాన్ని రాజధానిగా చేశారు.

**కోట నిర్మాణం:** 12వ శతాబ్దం ఆరంభంలో విశ్వంబరదేవ మహారాజు కోటను నిర్మించి పాలన సాగించారని చారిత్రాత్మక ఆధారాల వలన తెలుస్తుంది. తదుపరి పరిపాలించిన రెడ్డిరాజులు కోటలో పలు మార్పులకు శ్రీకారం చుట్టారు. అనేక బురుజులతో శత్రురాజ్యాలు తమపై దాడి చేయకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. కొండ చుట్టూ చెరువును తవ్వించి అందులో మొసళ్ళను పెంచేవారు. కొండ కింద నుండి కోట వరకు నేట మెట్లతో నిర్మించిన రాజమార్గం, మరోవైపు రహస్యమార్గం తమకు అనుగుణంగా నిర్మించుకున్నారు. కోటలో సైనిక పాలన, నివాసాలు, ఆయుధగారాల, ధాన్యకటకం, అశ్వ, గజశాలలు, అతి పెద్ద నేతి దుకాణం ఇప్పటికీ శిథిలావస్థలో దర్శనమిస్తాయి. మంచినీటి కోసం కొండపైన మూడు చెరువుల నిర్మాణం చేసి అన్ని కాలాలలో మంచి నీటి ఎద్దడి లేకుండా చర్యలు తీసుకున్నారు.



ముళ్ళ పొదలతో కుచించుకు పోయిన కాలిబాట

**సాంస్కృతిక, ఆధ్యాత్మిక వికాసం:** కొండవీడు కోటపై, పరిసర ప్రాంతాలలో 101 దేవాలయాలను నిర్మించినట్లు తెలుస్తుంది. ప్రపంచంలో మరెక్కడా లేని (మిగతా 140వ పేజీలో)

# గతమెంతో ఘనం.. నేడు దుర్భరం... కొండవీటి వైభవం



శిథిలమైన దేవాలయం, విగ్రహాలు

**(139వపేజీ తరువాయి)**

వెన్న ముద్ద బాలగోపాలస్వామి దేవాలయం, పుట్టకోటలో గల బొల్లుమూర వెంకటేశ్వర స్వామి దేవాలయం, లక్ష్మీ నరసింహస్వామి దేవాలయాలు ప్రసిద్ధి చెందాయి. సంగీత సాహిత్యాలకు కొండవీడు పుట్టినిల్లుగా విరాజిల్లింది. సాహితీ రంగానికే సవాలుగా నిలచిన గౌడఢిండిమభట్టును ఓడించి కంచు ఢక్కాను పగులగొట్టించి హరవిలాసము, శృంగార నైషధము వంటి కావ్యాలను రచించిన శ్రీనాథ మహకవి ఈప్రాంతము వారే. ప్రజల భాషలో కవిత్వము చెప్పి సమా జములో ఉన్న అంతరాలను సామాజిక రుగ్మతలను తొలగించిన యోగి వేమన రెడ్డిరాజుల కాలానికి చెందిన వ్యక్తి కావటం విశేషం. నాట్యశాస్త్రాన్ని రచించి నాదేవి, జ్యోతిష్య శాస్త్రవేత్త



శిథిలమైన ప్రాంతంలోనే పూజలు చేస్తున్న భక్తులు



కూలుతున్న చారిత్రక కట్టడాలు

మామిడి సింగనామాత్యుడు కొండవీటి వైభవానికి తోడ్పడినవారే.

**కత్తుల బావి:** కొండ కింద భాగాన శిల్పకళా శాస్త్రానికి తలమానికంగా నిలచిన గోపీనాథ స్వామి దేవాలయం రెడ్డిరాజుల వ్యూహాత్మక బలిపీఠంగా ఉండేది. తిరుగుబాటు చేసిన సామంత రాజులను, వధించటానికి దేవాలయం లోపల కత్తుల బావి ఉండేదని అందులో కత్తులను అమర్చారనే ప్రతీతి. తిరుగుబాటు చేయడానికి సంకల్పించిన 72 మంది సామంత రాజులను ఓ పథకం ప్రకారం భోజనానికి ఆహ్వానించి ఆలయ అంతర్భాగంలో ఉన్న కత్తుల బావిలో దైవదర్శనం పేరుతో హతమార్చారని ఓకథ ప్రచారమైంది. క్రీ.శ.1437లో రెడ్డిరాజులపై శ్రీకృష్ణ దేవరాయలు దండెత్తి విజయం సాధించారు. దీనికి చిహ్నంగా తూర్పు దిశలో విజయనగర సామ్రాజ్యధినేత శ్రీకృష్ణాదే వరాయలు ప్రతిష్టించిన విజయస్థూపం నేటికి చూపరులను విశేషంగా అకర్షి స్తోంది. 1565 తర్వాత కొండవీడును గోల్కొండ నవాబుల ఆధీనమైంది. 1788లో కొండవీటి సీమ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధీనంలోకి వచ్చింది. స్వాతంత్రానంతరం ఈప్రాంతంలో అభివృద్ధి కొరవడింది. ఇప్పటికైనా అధికారులు ప్రజాప్రతి నిధులు స్పందించి కోట పునర్నిర్మాణంల చేపట్టాల్సిన అవసరం ఎంతైనా ఉందని భక్తులు, పర్యాటకులు, ఆప్రాంత ప్రజలు కోరుతున్నారు.



కొండపై ఏర్పాటు చేసిన మంచినీటి చెరువు

# మహిళల చెంతకు చేరని గృహహింస రక్షణ చట్టం

శిఖా అనిల్ కుమార్,
మేజర్‌న్యూస్, శావల్యాపురం

'చిన్నప్పుడు
బొమ్మకునే అమ్మను
ఇప్పుడు బొమ్మను నేనే అమ్మను నేనే ...' ఓ కవయిత్రి ఆవేదన ఇది. నిజం.. ఆకాశంలో సగమైన ఆడది కూడా మనిషేనని, తనకూ మనసుంటుందని కనీస వివేచన కోల్పోయిన పితృస్వామ్య వ్యవస్థ మహిళను సాటి మనిషిగా కూడా పరిగణించలేని స్థితికి చేరుకుంది. నిజం... ఇక్కడ స్త్రీ అంటే మగాడికి సౌఖ్యాన్నందించే జీవం ఉన్న బొమ్మయింది. కార్యేషు దాసి, కరణేషు మంత్రి, భోజ్యేషు మాత, శయనేషు రంభ అంటూ ఆది నుంచి మనువాదపు కుట్ర స్త్రీని బోన్ సాయ్ మొక్కను చేసింది. ఇప్పుడిప్పుడే స్త్రీ మాట్లాడడం నేర్చుకుంటుంది. అది సహించలేని పురుషస్వామ్యం ఆమెను చిత్రహింసల పాల్జేసింది. రాచి రంపాన పెడుతుంది. పరిమళాలు వెదజల్లే మల్లెలాంటి మహిళను కాలి క్రింద తొక్కిపెట్టాలని ప్రయత్నిస్తుంది. వివక్షతో కూడుకున్న ఆచారా లు, అభిప్రాయాలలో స్త్రీ పురుష సంబంధాలలో ఏర్పడిన అసమానతలకు 'గృహ హింస రక్షణ చట్టం-2005' ఒక ఉపశమనం. మానసిక, శారీరక హింసలనుండి ఈ చట్టం రక్షణ కల్పిస్తుంది. 'గృహ హింస రక్షణ చట్టం-2005' పరిధిలోకి దౌర్జన్యాలకు పాల్పడడం, మానసిక, శారీరక, ఆర్థిక, లైంగిక హింసలను పెట్టడం, మహిళలను బెదిరించడం, ఆరోగ్యాన్ని కుంటుపరిచే చర్యలన్నీ వస్తాయి. ఈ చట్ట ప్రకారం బాధితురాలు, ప్రతివాది మధ్య సంబంధం భార్యా భర్తల సంబంధం కానవసరంలేదు. పుట్టుక ద్వారా, పెళ్ళి ద్వారా, దత్తత ద్వారా కలిసి ఉన్న వారు, ఒకే ఇంటిలో ప్రస్తుతం కానీ గతంలో కానీ కలసి నివశిస్తున్న స్త్రీ, పురుషులు ఈ చట్ట పరిధిలోకి వస్తారు.

ఈ చట్టాన్ని అమలు చేసే యంత్రాంగం రక్షణ శాఖాధికారి, న్యాయ సేవల అధికారి, సేవలు అందించే సంస్థలు, ఆశ్రయం అందించే సంస్థలు, పోలీసు అధికారై ఉంటారు. బాధితురాలు సమాచారాన్ని ఆమె



కాని, ఆమె తరపున వారు ఎవరైనా హింస జరుగుతోందని లేదా జరగబోతోందని రక్షణ అధికారికి ఫిర్యాదు ఇవ్వవచ్చు.

రక్షణ అధికారి బాధ్యతాయుతమైన పాత్ర వలన ఈ చట్టం సక్రమంగా అమలు జరుగుతుంది. జరిగిన గృహహింసను 'గృహ ఘటన నివేదిక' రూపంలో మెజిస్ట్రేట్ కోర్టుకందించి దాని నకలును బాధితురాలికి అందజేయాల్సిన బాధ్యత ఉంది. ఆపై చట్టపరమైన సహాయం కోసం, ఉచిత న్యాయ సేవల కోసం, ఆర్థిక

(మిగతా 142వ పేజీలో)

# గురుకుల విద్యలో కలికితురాయి శ్రీరామా రూరల్ విద్యాసంస్థలు



శ్రీరామా రూరల్ విద్యా సంస్థలు

తేళ్ళూరి రామకోటిరెడ్డి, మేజర్‌న్యూస్, తెనాలి.

గురుకుల విద్యా విధానంలో గ్రామీణ ప్రాంతంలో విద్యావకాశాలను పెంపొందించే లక్ష్యంతో స్థాపించిన విద్యా సంస్థ శ్రీరామా రూరల్ విద్యా సంస్థలు ఎందరో మహనీ యులను విద్యావంతులుగా తీర్చిదిద్దిన ఈ సంస్థ తెనాలి పట్టణానికి 16 కిలోమీటర్ల దూరంలో కృష్ణానదీ తీరాన చిలుమూరు గ్రామంలో ఉంది. 1949 సంవత్సరంలో కొలసాని వెంకటసుబ్బయ్యచౌదరి, గాదిరాజు కోటేశ్వరశర్మ, తూములూరు వెంటక సుబ్బరావులు ఈ సంస్థను స్థాపించారు. ప్రారంభంలో ఈ కళాశాల ఆంధ్రా విశ్వవిద్యాలయం నిర్వహించే మెట్రిక్‌లేషన్ పరీక్షకు వెళ్ళే విద్యార్థులకు శిక్షణ ఇచ్చేది. 1977 సంవత్సరం వరకు ఇదే విధానం కొనసాగింది. అప్పటి నుంచి బోర్డు ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ నిర్వహించే పరీక్షలకు వెళ్ళే విద్యార్థులకు శిక్షణ ఇస్తుంది. స్కూలు విభాగంలో ఎల్.కె.జి. నుంచి పదో తరగతి వరకు విద్య లభిస్తుంది. గురుకుల విద్యా విధానం ద్వారా సాధించిన అత్యుత్తమ ఫలితాలు స్ఫూర్తినివ్వగా 1979లో కొలసాని వెంకటసుబ్బయ్యచౌదరి శ్రీరామా రూరల్ రెసిడెన్షియల్ జూనియర్ కళాశాలను స్థాపించారు. అదే పేరుతో 1993 వరకు కొనసాగిన ఈ కళాశాల కొలసాని వెంకటసుబ్బయ్య, రామతులసమ్మ జూనియర్ కళాశాలగా మారింది. ప్రభుత్వ అనుమతితో అత్యుత్తమ ప్రమాణాలతో ముందుకు సాగుతుంది. 15 ఎకరాల క్యాంపస్, నాలుగు బ్లాకుల్లో 22 తరగతి గదులు, 1500 చదరపు గజాల గ్రంథాలయం, మూడంతస్తుల హాస్టల్ భవనం, సిబ్బంది కోసం క్వార్టర్లు, ఒపెన్ ఆడిటోరియం, 3 వేల చదరపు గజాల డైనింగ్ హాల్, మల్టీపర్పస్ జిమ్, అక్కినేని కళామందిర్ వంటి వసతులున్నాయి. మాజీ మంత్రి ఆలపాటి ధర్మారావు ఈ కళాశాల పూర్వ విద్యార్థి. 2003-04 విద్యా సంవత్సరం నుంచి ఈ విద్యా సంవత్సర ఆధ్వర్యంలో బి.ఇ.డి కళాశాల కూడా నడుస్తుంది. ఆశ్చర్య ఎన్.జి.రంగా కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్ పేరుతో నడిచే కళాశాలలో అన్ని కోర్సులు ఇక్కడ లభ్యమవుతాయి. గురుకుల విద్యా విధానానికే కాకుండా సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణకు కూడా కళాశాల యాజమాన్యం అత్యధిక ప్రాధాన్యతనిస్తుంది. తుమ్మల వెంకట్రామయ్య, చక్రపాణి వంటి మహనీయుల వర్ధంతులు, జయంతులు ఇక్కడ నిర్వహిస్తారు.



గ్రామీణ ఉత్తమ విద్యా సంస్థ అవార్డును గవర్నర్ సూర్జిత్‌సింగ్ బర్నాలా నుంచి అందుకుంటున్న సంస్థ డైరెక్టర్ తులసీప్రసాద్



## గృహ హింస రక్షణ చట్టం

(141వ పేజీ తరువాయి)

సహాయం, పిల్లల సంరక్షణ వైద్య సేవలు వంటి సమాచారాన్ని బాధితురాలికి అందించాలి. గృహహింస గురించి ప్రాథమికంగా నమ్మిన తర్వాత మేజిస్ట్రేట్ రక్షణ ఆదేశాలు జారీచేయాల్సి ఉంటుంది. ఈ ఆదేశాలలో ఆర్థిక, ఆరోగ్య పరమైన నష్టాల భర్తీ, పిల్లల పోషణ, ఇతర ఖర్చులను ఏకమొత్తంగా లేక నెలనెలా చెల్లించే ఏర్పాటు ఉంది. బాధితురాలు కోరినచో ప్రస్తుతం నివశించే ఇంటిలోనే హక్కును ఆమెకు కల్పించవచ్చు.

గృహహింస చట్టాన్ని తీసుకు వచ్చిన ప్రభుత్వం దీని గురించి గ్రామీణ ప్రాంత మహిళల వరకు తీసుకు వెళ్ళడంలో విఫలమైందని చెప్పవచ్చు. చట్టం అమలులోకి వచ్చి మూడు సంవత్సరాలు కావస్తున్నప్పటికీ దీని ఫలితాలు ప్రభావితం చేసే స్థాయిలో వెలువడలేదు. అందుకే ఇప్పటికీ గృహహింస కొసాగుతూనే ఉంది. దీనికి ఉదాహరణగా ఇటీవల రాష్ట్ర మంత్రి ఒకరు తన భార్యను హింసించినట్లు ఆరోపణలు రావడం చెప్పుకోవచ్చు.

కేవలం కాగితాలపై చట్టాన్ని తీసుకు రావడంతోనే చేతులు దులుపు కోకుండా నిబద్ధతగా చట్టాన్ని అమలు చేసి ఆకాశంలో సగమైన మహిళకు రక్షణ కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది.

# భక్తుల కొంగుబంగారం మాచర్ల చెన్నకేశవ స్వామి

ఆలేటి కోటేశ్వరరావు,
మేజర్ న్యూస్, మాచర్ల.

పల్నాటి ప్రజల పాలిట మణిహారంగా వెలసిన శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి ఆలయం చారిత్రకంగా ఎంతో ప్రసిద్ధికెక్కింది. త్రేతా యుగంలో ఈ ప్రాంతమంతా దండ కారణ్యం. పూర్వకాలంలో కార్తవీర్యార్జుని వంశీకులు నిర్మించిన చెన్నకేశవ ఆలయాన్ని పల్నాటి బ్రహ్మనాయుడు 13 వ శతాబ్దంలో పునర్నిర్మించినట్లు చారిత్రక గ్రంథాలు చెబుతున్నాయి. క్రీస్తు శకం 1397 వరకు మాచర్లను మహా దేవి చర్లగా పిలిచేవారని, నాటి ఆ పేరే మాచర్లగా మారిందని, రెండవ ప్రతాపరుద్రమహాదేవ రాజు సామంత రాజైన మాచాయ నాయుడు పేరు మాచాయశబ్దం కాలక్రమేణ మాచుర్లగా మారి ఉండవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శాసనం తరువాత లభించిన అనేక ఆధారాల్లో మాచర్ల అని రాయబడి వుంది. అంతేకాక బ్రహ్మనాయుడు మజిలి చేసిన తావు మాచర్ల అయిందని, తన స్వస్థలమైన మాచపురానికి బదులుగా బ్రహ్మనాయుడు మాచర్లను నిర్మించాడని పద్మనాభ చరిత్ర చెబుతోంది. మాచర్లకు విష్ణుపురి అనే మరొక పేరు. చంద్రవంక నది తీరంలో ప్రవహం తూర్పు-పశ్చిమ దిశల నుండి ఉత్తరం వైపునకు ప్రవహిస్తోంది. ఉత్తరవాణి స్థలం పరమ పవిత్రమైనదని భావిస్తూ ఉంటారు. అలాంటి పవిత్రమైన ప్రదేశంలో శ్రీ చెన్నకేశవ స్వామి వెలిశాడు. సర్వమానవ సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని 13వ శతాబ్ధంలోనే చాటి చాపకూటి సిద్ధాంతంతో మానవులంతా ఒక్కటేనని నిరూపించిన బ్రహ్మనాయుడు పేరు వింటే ప్రతి ఒక్కరికి స్ఫూరించేది ఆయన పునర్నిర్మించిన మాచరలోని శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి వారి దేవాలయమే. పౌరుషాల పురిటిగడ్డగా, పంతాలకు పోతుగడ్డగా ప్రసిద్ధికెక్కిన పల్నాడులో 13వ శతాబ్దంలో మలిదేవరాజు ఆస్థాన మంత్రి బ్రహ్మనాయునిచే పునర్నిర్మించబడిన ఈ దేవాలయం సుప్రసిద్ధమైన పలనాటి పుణ్య క్షేత్రం.



శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి ఆలయం

## అలనాటి శిల్ప కళకు ప్రతీక

ఈ ఆలయంలోని శిల్ప కళా వైభవం నాటి కళాకారుల నైపుణ్యతనను తెలియజేస్తాయి. అందానికి ప్రతిరూపమైన విష్ణువు చెన్నుని రూపంలో ఈ ఆలయంలో వెలిశాడని ప్రతితీ. స్వామి వారి విగ్రహం గర్భగుడిలో మూడు ఎడుగుల ఎత్తులో ఉంది. అందులో భూదేవి, శ్రీదేవి సమేత చెన్నకేశవుడు యాగభేరాలు, తీర్థ, బకిబేరాలు, ఆళ్వారులు, రామానుజులు, వడయరాజులు, వెన్నముద్దల కృష్ణయ్య, ఉత్సవమూర్తులు ఉన్నాయి. గర్భగుడి ముందు రంగ మండపం ఉంది. దీనిని పరిశీలిస్తే నాటి శిల్పకళా చాతుర్యం ఏవిధంగా ఉందో విశదమవుతుంది. ఈ మండపంలోని నాలుగు స్థంబాలపై ఈశాన్య దిశ వైపు ఉన్న స్తంభంపై భారత ఘట్టాలైన సుగ్రీవ యుద్ధం, కైలాస గిరిని ఎత్తడం, నైరుతి స్తంభం పై భాగవతంలోని వినాయక, గజాసురుని యుద్ధం, త్రిపుర సంహారం, సాగర మథనం, దేవతాకూటమి, ఏనుగుల అభిషేకం, అమృతం పంచటం వంటివి శిల్పాలలో మలచబడ్డాయి. ఇటువంటి ఎన్నో ఘట్టాలను మనోహరంగా శిల్పులు మలిచారు.

## శ్రీ లక్ష్మీ ఆలయం

కాలగమనంలో చెన్నకేశవ ఆలయం ఎన్నోసార్లు పునరిద్ధరించినట్లు తెలస్తుంది. సూరపురాజు వంశీయుల సంతానం అయిన లక్ష్మీ దేవమ్మ చెన్నునిలో ఐక్యమైనందున ఇదే ఆలయంలో లక్ష్మీదేవికి మరో ఆలయం నిర్మించారు. ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధి పంచమి నాడు స్వామి వారి కల్యాణంతో ప్రారంభమై 16 రోజుల పాటు ఉత్సవాలు జరిగి రథోత్సవంతో ముగుస్తాయి. దుర్గి వాస్తవ్యుడు కుంచనపల్లి నారాయణ పంతులు 1980 ఏప్రియల్ 29న స్వామి వారి రథాన్ని తయారుచేయించారు. ప్రథమ ఉత్సవం ఆరోజు జరిగింది. జై చెన్నకేశవ, జైజై చెన్నకేశవ అంటూ భక్తులు చేసే జయజయధ్వానాలతో ఈ ప్రాంతం మారుమ్రోగుతుంది.

## ప్రశ్నార్థకమైన అభివృద్ధి!

వందలాది ఎకరాలు ఆలయం తరుపున ఉన్న ఆస్తులు నేడు అన్యాక్రాంతమై స్వామివారి పోషణ ప్రశ్నార్థకమైంది. 2 వేల ఎకరాలకు పైగా ఉన్న దేవుని మాన్యం హారతి కర్పూరంలా కరిగిపోయింది. ఉన్న కొద్దిపాటి భూముల ద్వారా ఆదాయం నామమాత్రంగా ఉంది. నిత్య కళ్యాణ వేడుకల ద్వారా స్వామి వారికి పూజలు జరుగుతున్నాయి. ఎన్నో విశిష్టతలు ఉన్న స్వామివారిని దర్శించే భక్తులకు ఎటువంటి సౌకర్యాలు లేవు. భక్త జనం బస చేసేందుకు గదులు నిర్మించాలని అనేకసార్లు దేవాదాయ శాఖాధికారులకు విన్నవించినా ఎటువంటి ప్రయోజనం లేకపోవటం గమనార్హం.

# సినీ నాటక రంగంలో మైమరపించిన ధూళిపాళ

మేజర్‌న్యూస్, గుంటూరు

గుంటూరు జిల్లా దాచేపల్లిలో జన్మించిన ధూళిపాళ సీతారామశాస్త్రి సినీ, నాటకరంగంలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్నారు. గత ఏడాది ఆయన మృతిచెందారు. గుంటూరులోని మారుతీ సేవాపీఠం కేంద్రంగా ఆధ్యాత్మిక కార్యకలాపాలను నిర్వహిస్తూ ఆయన తుదిశ్వాస విడిచారు. పది హేనేళ్ల వయస్సులో స్త్రీ పాత్రతో ధూళిపాళ సీతారామశాస్త్రి రంగస్థల నటజీవితం ప్రారంభమైంది. బొబ్బిలి నాటకంలో తాను పోషించిన మల్లమాంబ పాత్రను పెరిగిన వయస్సు, మారిన కంఠ స్వరం మూలంగా రక్తి కట్టించలేక బాధ పడుతుంటే "అబ్బీ! నీ గొంతు మారింది. పెట్టు మీసం... వేయక ఆడవేషం" అని చెప్పిన మహానటుడు మాధవపెద్ది వెంకట్రామయ్య మాటలతో పురుషపాత్రలకు శ్రీకారం చుట్టాడు. ధూళిపాళ గుంటూరు ఎ.సి. కళాశాలలో నిర్వ హించిన అఖిలాంధ్ర పాండవోద్యోగ పోటీ నాటకాలు ధూళిపాళను రంగస్థల రారాజును చేశాయి.

కీర్తిని సంపాదించి పెట్టాయి. ఆయన పోషించిన గయుడు, మైరావణుడు, రంగారాయుడు, బ్రహ్మనాయుడు, బిల్వమంగళుడు, రామసింహుడు, లాయర్ జగన్నాథం తదితర పాత్రలు ప్రేక్ష కనీరాంజనాలు అందుకున్నాయి. ఆంధ్ర నాటక రంగాన్ని సుసంపన్నం చేశాయి. రామనామమే ఉఛ్వాస నిశ్వాస నిశ్వాసలు ఈ హనుమత్ భక్తుడికి. ధూళిపాళ రంగస్థల నటానా ఖ్యాతి ఆనోట ఈ నోట చిత్ర పరిశ్ర మకు చేరటంతో సినిమాల్లో నటించే అవకాశాలు లభించాయి. ఆయన నటించిన తొలి చిత్రం భీష్మ. శకునిగా, మంత్రిగా, రామానుజారిగా, తాగుబోతుగా మంగళసూత్రాల మల్లయ్యగా పలు తమిళ, తెలుగుచిత్రాలలో విభిన్న పాత్రలు పోషించి, ప్రేక్షకులను మైమరపించి!... వారి హృదయాలలో సుస్థిర స్థానాలను సంపాదించారు. హావ భావనటనా ధురీణుడు ధూళిపాళ. చిత్రరంగంలో నటుడిగా ఆయనకు తీరికలేని సమయం అది. జగన్నాటకం మొదలైంది.

దూళిపాళ్ళ రంగ స్థలంలో ఆధ్యాత్మిక భావప్రసారంతో మారుతి వాణి విన్పించడం. దివ్యకాం తిని దర్శించడం. అలయం నిర్మిం చమని ఆజ్ఞాపించడంతో అభినయ రంగాన్ని వదిలి ఆధ్యాత్మిక రంగానికి ఆయన వచ్చారు. నటరాజసేవలో తరించి మారుతి నామస్మరణతో జీవి స్తున్న కళానియతి ధూళిపాళ. ఆయన తురీయాశ్రమం స్వీకరించి శ్రీశ్రీశ్రీ మారుతీసేవేంద్ర సరస్వతిగా మారారు. మారుతి పరసేవ చేస్తున్నారు.

86 ఏళ్ళ కిందట దాచేపల్లి ధూళిపాళ రత్నమ్మ, శంకరయ్యలకు జన్మించారు. ధూళిపాళసీతారామశాస్త్రి, స్వగ్రామంలో ఎనిమిదవ తంగతి వరకు పాఠశాల విద్య, బాపట్లలో వేదాభ్యాసం చేశారు. వకీల్ గుమస్తా పని నిమిత్తం గుంటూరుకు వచ్చిన ఆయన రంగస్థల నటజీవితం కూడా ఇక్కడే ప్రారంభమైంది. సుమారు 21 నాటకాలు, 300 పైగా సినిమాల్లో నటించారు.

1935లో నాటకరంగ ప్రవేశం స్త్రీపాత్ర ధారణ, 1940లో పురుషపాత్రధారణ, 1960లో సినిమా రంగప్రవేశం చేశారు. ప్రస్తుతం గుంటూరు మారుతీ సేవా పీఠం ఆయన పర్యవేక్షణలో పనిచేస్తోంది.







## బాలబాట బాలలకు మంచి జీవితం చూపించుట బాలలు భారత సమాజాన్ని తీర్చిదిద్దుట.

CARDS PROGRAMME IS GOD'S PROGRAMME

సామాజిక మార్పుకు బాలలు పనిముట్టు. నేటి బాలలే రేపటి పౌరులు. మంచి పౌరులుగా బాలలను తీర్చిదిద్దడమే బాలబాట ధ్యేయం. మంచి పౌరులున్నదేశం అభివృద్ధి బాటలో నడుస్తుంది. ఆ బాటను చూపించుట బాలబాట ఆశయం.

నేటి పోటీ ప్రపంచంలో చదువు" కొనుట" అవుతోంది."కొనుట" గ్రామీణ దళిత బాలలకు అందుబాటులో లేదు.దళితవాడలలో ప్రాథమిక పాఠశాలలున్నాయి. అయినా నూటికి డెబ్బై మంది పిల్లలకు విద్య దూరంగా ఉంది. దీనికి ప్రధమ కారణం తల్లిదండ్రుల నిరక్ష్యరాస్యత. నిరక్షరాస్యులు తమ పిల్లలతో అక్షరాభ్యాసం చేయించలేరు. అక్షరాభ్యాసం చేస్తున్న తమ పిల్లల అనుమానాలను తీర్చలేరు.

అందుకే ఆ పిల్లలలోని విద్యాసక్తికి ఆదరణ లోపిస్తుంది. ఆదరణలోపంతో పిల్లలు పాఠశాలలకు దూరమవు తున్నారు. పొలం పనులకు దగ్గరాతున్నారు. విద్య నేర్చుకొనుటకు ఆశవుంది. అలాంటి పిల్లలకు చేయూత కావాలి. అందుకే బాలబాట. ఈ ఆశయసాధనకై 21 జిల్లాలు మరియు 4 రాష్ట్రాలలో 1250 బాలబాటలు పనిచేయుచున్నవి.

ఒక్కొక్క బాలబాటలో 40 మంది పిల్లలు. వీరి విద్యా వికాసానికి కృషి చేయడానికై ఓ అభివృద్ధి కార్యకర్త.(బాలఉపాధ్యాయుడు)బాలబాట ఉదయం 7 గంటల నుండి 8.30ని.ల వరకు సాయంత్రం గం.5.30 నుండి గం.7 గంటల వరకు జరుగును. బాలబాట బాలలందరిని ప్రభుత్వ ప్రాథమిక పాఠాశాల సమయంలో హాజరుపరచుట అభివృద్ధి కార్యకర్త కర్తవ్యం.

### బాలబాట విద్యావిధానం

| | |
|---|---|
| 1. ఆటపాటలతో చదువు. | 3.పల్లెల్లో పచ్చదనం-పరిశుభ్రత |
| 2.ఇంటి దగ్గర పెరటి తోటల పెంపకం. | 4.తల్లిదండ్రుల స్వయం సహాయక జీవన విధానానికి తోడ్పడుట. |

పై ఆశయాలతో గుంటూరు జిల్లాలో 2000-01లో 36 మండలాలలో బాలబాటలు ప్రారంభించబడినవి. బాలబాటలు ప్రారంభించక ముందు గుంటూరు జిల్లాలో గురుకుల పాఠాశాలలో 294 మంది 6వ తరగతిలోను,గవర్నమెంట్ హైస్కూల్ లో 2720 మంది చేరినారు.బాలబాట ప్రారంభించిన తరువాత గురుకుల పాఠశాలలో 1214 మంది 6వ తరగతి లోను, గవర్నమెంట్ హైస్కూల్‌లో 6299 మంది విద్యార్థులు ప్రవేశము పొందినారు. బాలబాటల ద్వారా సాధించిన ఈ ప్రగతితో ఈ బాలబాటల కార్యక్రమాన్ని ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలు మరియు ఇరుగు-పొరుగు రాష్ట్రాలైన మహారాష్ట్ర, ఒరిస్సా, కర్నాటక, ఛత్తీస్‌ఘడ్‌లలో కూడా ప్రారంభించడం జరిగింది. ప్రస్తుతం మొత్తం1310 బాలబాటలలో 52400 మంది విద్యార్థులు చదువుచున్నారు.

డాక్టర్. పి.రంజన్ బాబు
డైరెక్టర్, కార్డ్స్.

## దర్శనీయ స్థలాలు



అమరావతిలోని బుద్ధ ప్రాజెక్టు



మాచర్లలో ప్రాంతంలోని ఎత్తిపోతల జలపాతం



పొన్నూరులోని ఆంజనేయ స్వామి దేవాలయం

# శ్రీ అమరేశ్వర స్వామి దేవస్థానము

అమరావతి-గుంటూరు జిల్లా- ఫోన్: 08645-255241



**శాశ్వత అభిషేకము :** ఈ పథకము నందు రూ. 516/-లు చెల్లించినచో ప్రతి సంవత్సరము పథకములో చేరునపుడు వ్రాయబడిన రోజున మీ గోత్రనామములతో అభిషేకము జరిపించబడును. అభిషేకము జరుపు తేది గురించి 10 రోజులు ముందుగా తెలియపరచబడును. డబ్బు చెల్లించిన వారు అభిషేకమునకు హాజరు కానిచో వారి గోత్రనామములతో అభిషేకము జరిపించి ప్రసాదము పోస్టు ద్వారా పంపబడును.

**ఉచిత ప్రసాదము:** శ్రీ స్వామివారి దర్శనమునకు వచ్చిన భక్తులకు ఉచిత ప్రసాదము పంపిణీ చేయబడుచున్నది. 1కేజి పులిహోర తయారి, పంపిణీకి రూ. 75/-లు 1కేజి దద్దోజనం తయారీ పంపిణీకి రూ. 80/-లు విరాళం ఇవ్వమనవి. ప్రసాదము పంపిణీ రోజున దాతపేరు బోర్డుపై వ్రాయబడి వారికి ఉచిత దర్శనము కల్పించబడును. వారు హాజరు కానిచో ప్రసాదము పోస్టు ద్వారా పంపబడును.

**కార్తికమాస అభిషేకము:** రూ. 500/-లు చెల్లించినచో వారి పరోక్షములో కార్తీకమాసము మొత్తము వారి గోత్ర నామములతో అభిషేకము జరిపించబడును. కార్తీకమాస అనంతరము వారికి శేషవస్త్రము, విశేష ప్రసాదము పోస్టు ద్వారా పంపబడును.

**అన్నదానము:** ప్రతి ఆది,సోమవారములందు రోజు 1కి 30మందికి మిగిలిన దినములలో అన్నదానము 15మందికి జరుపబడుచున్నది. అన్నదానమునకు రూ. 1,116/-లు మించి ఎంత మొత్తమునైనా విరాళము ఇవ్వవచ్చును.

**అభివృద్ధి కార్యక్రమములు:** భక్తుల సహకారముతో 1) నూతన రధశాల 2) యాత్రికుల విశ్రాంతి మందిరము నిర్మింపవలసి యున్నది. కావున భక్తులు విరివిగా విరాళములు ఇవ్వమనవి.

పై పథకములకు డబ్బు చెల్లించువారు వారి పూర్తి చిరునామ, గోత్రము, ఫోన్ నెంబరుతో ఏ పథకమునకు డబ్బు చెల్లించుచున్నది తెలియజేయుచు సదరు మొత్తము రొఖ్ఖముగా గాని, మనియార్డరు ద్వారాగాని లేదా శ్రీ అమరేశ్వర స్వామి వారి దేవస్థానము, అమరావతి పేర ఆంధ్ర బ్యాంకు, అమరావతి లేదా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ధరణికోట నందు చెల్లుబాటగునటుల డి.డి.ని తీసుకొని పై చిరునామాకు పంపమనవి.



**గూడూరు సుబ్బారావు**
కార్యనిర్వహణాధికారి.
సెల్: 9346509797

---

సమగ్రశిశుఅభివృద్ధి సేవా పథకము - అంగన్‌వాడి కేంద్రము

# మహిళాభివృద్ధి మరియు శిశు సంక్షేమ శాఖ

గుంటూరు జిల్లా

**శాఖ ద్వారా అమలు చేయుచున్న ముఖ్య పథకాలు**

- సమగ్ర శిశు అభివృద్ధి సేవా పథకం (ICDS)
- బాలికా సదనములు కళాశాల బాలికల వసతి గృహము
- సేవా సదనం, రాష్ట్ర సదనం
- ఉద్యోగినుల వసతి గృహము
- తెలుగు బాల మహిళా ప్రగతి ప్రాంగణము, ఆం.ప్ర.
- మహిళా ఆర్థిక సహకార సంస్థ
- ఉచిత కుటుంబ న్యాయ సలహా కేంద్రము
- ఆం.ప్ర మహిళా కమిషను, స్వచ్ఛంధ సేవా సంస్థలు
- ఆత్యాచార, బాలికల అక్రమ వ్యాపార నిరోధక కమిటి



**బాలికలకు ప్రత్యేక పథకాలు**

బాలికా ఇన్సూరెన్స్ పథకం
బాలికా సమృద్ధి యోజన
కిశోర బాలికల పథకం

**స్వయం సిద్ధ పథకము**

గ్రామాలలో మహిళల ఆర్థిక స్వావలంబనకు స్వయం సహాయక గ్రూపుల ద్వారా సేవ.

## మహిళాభివృద్ధి విజన్

స్త్రీ కి ఆర్థిక స్వావలంబన, రాజకీయ పరిపక్వత, సంపూర్ణ ఆరోగ్యం, ఉన్నత విద్యా ప్రమాణాలు, సమాజ పునర్నిర్మాణంలో సమాన బాధ్యత సామాజిక పరిస్థితులపై పరిపూర్ణ అవగాహన, అన్ని రంగాలలో సమాన అవకాశంపై అంచాలను సాధించగలగడం మహిళాభివృద్ధికి నిర్వచనం,

## శిశు సంక్షేమ విజన్

సంపూర్ణ ఆరోగ్యం, హక్కుల పరిరక్షణ, నిర్బంధ విద్య, వివక్షతలేని సహజీవన పునాది శిశు మరణాలు తగ్గించడం, అనాధ బాలలను రక్షణ, దేశ ప్రగతికి బలమైన పునాదిగా శిశువును మలచగలగడం

# దత్తత

**ఎందుకు:** అనాధ పిల్లలు, వీధి బాలలగా మారి సమాజాభివృద్ధికి ఆటంకాలుగా మారకుండా నిరోధించుటకు, సంతానం లేని దంపతులకు బిడ్డలను ఇచ్చుటకు

**ఎవరిద్వారా:** ప్రాజెక్టు డైరెక్టర్ వారి కార్యాలయం ద్వారా

**ఎవరికి:** అనాధ పిల్లలు వీధి బాలలు కాకుండా శిశు వికాస కేంద్రం హైదరాబాదులో ముందుగా చేర్చుకుని తదుపరి వారిని సంతానం లేని దంపతులకు చట్టరీత్యా దత్తతను ఇవ్వడం జరుగుతుంది.

**శ్రీమతి బి.రమాదేవి,** ప్రాజెక్టు డైరెక్టర్,
జిల్లా మహిళా శిశు అభివృద్ధి కార్యాలయం స్వశక్తి బిల్డింగ్, గుంటూరు.

---



స్వర్గీయ ఎన్.టి.ఆర్
టి.డి.పి. వ్యవస్థాపకులు



శ్రీ నారా చంద్రబాబునాయుడు
రాష్ట్ర టి.డి.పి అధ్యక్షులు



పుష్పరాజ్
మాజీ మంత్రివర్యులు



కొల్లి లక్ష్మయ్య చౌదరి
రాష్ట్ర సర్పంచ్‌ల సంఘం కన్వీనర్

# ఉగాది శుభాకాంక్షలు

తెలుగుదేశం పార్టీ నాయకులకు, కార్యకర్తలకు, అభిమానులకు, పెదకాకాని ప్రజలకు ఉగాది శుభాకాంక్షలు



**ఉప్పాల రాములు**
సర్పంచ్, పెదకాకాని
రాష్ట్ర సర్పంచ్‌ల సంఘం ఉపాధ్యక్షులు

| | | |
|---|---|---|
| **బెజవాడ కృష్ణమూర్తి**<br>1వవార్డు మెంబరు | **బెజ్జం శరత్‌కుమార్**<br>4వవార్డు మెంబరు | **పఠాన్ జాన్‌బి**<br>5వవార్డు మెంబరు |
| **గరికముక్కల మల్లేశ్వరి**<br>7వవార్డు మెంబరు | **పోతురాజు మల్లేశ్వరి**<br>8వవార్డు మెంబరు | **గోపి సీతారావమ్మ**<br>9వవార్డు మెంబరు |
| **పాలపర్తి రామస్వామి**<br>10వవార్డు మెంబరు | **వరికూటి రమేష్**<br>11వవార్డు మెంబరు | **కంచర్ల రవికుమార్**<br>12వవార్డు మెంబరు |
| **తోకల శ్రీనివాసరావు**<br>13వవార్డు మెంబరు | **పాగోలు శ్రీనివాసరావు**<br>14వవార్డు మెంబరు | **దూపాటి శివశంకరరావు**<br>17వవార్డు మెంబరు |
| **షేక్ రౌఫాని**<br>18వవార్డు మెంబరు | **దర్శి భాస్కరరావు**<br>ఎం.పి.టి.సి. | **అమిరె సుధాకర్**<br>ఎం.పి.టి.సి. |



**బెజవాడ కృష్ణమూర్తి**
ఉపసర్పంచ్, పెదకాకాని

# ప్రజానీకానికి ఉగాది శుభాకాంక్షలు



డా॥ బి.ఆర్. అంబేద్కర్



డా॥ జ్యోతారావు పూలే



డా॥ బాబూ జగజ్జీవనరావు



డా॥ మౌలానా అబ్దుల్ కలాం అజాద్



డా॥ మధర్ థెరిస్సా

# కాబోయే ముఖ్యమంత్రి చిరంజీవికి శుభాకాంక్షలు

సామాజిక సేవే లక్ష్యంగా బి.సి., ఎస్.సి., ఎస్.టి., ముస్లిం మైనారిటీ మరియు కాపుల అండతో రాజకీయ రంగప్రవేశం చేస్తున్న శ్రీ చిరంజీవి గారు రాష్ట్ర ముఖ్యమంత్రి పీఠాన్ని అధిరోహించాలని ఆకాంక్షిస్తూ...

## బి.సి., ఎస్.సి., ఎస్.టి., ముస్లిం, మైనారిటీల మరియు కాపుల ఐక్యవేదిక ఏర్పాటు

| ఐక్యవేదిక తరపున | డి.సి. రోశయ్య ఐ.ఎ.ఎస్.(రిటైర్డ్) | వి.దానం ఐ.ఎ.ఎస్.(రిటైర్డ్) | కఠారి అప్పారావు |
|---|---|---|---|
| | కూచిపూడి సూర్య నారాయణరావు | ఐ. వెంకటేశ్వర్లు, ఐ.ఎ.ఎస్.(రిటైర్డ్) | పి.వి. ఎన్ భూషణ్ |

## లక్ష్యాలు...ఆశయాలు...చేయాల్సినవి....



బి.సి., ఎస్.టి., ఎస్.టి., ముస్లిం మైనారిటీ మరియు కాపుల రాష్ట్ర జనాభాలో 85%మందివున్నారు స్వాతంత్ర్యము లభించిన 60 సంవత్సరాల తర్వాత కూడా నిజమైన రాజ్యాధికారానికి దరిదాపులలోలేరు. వీరికి ప్రజాస్వామ్యములో నిజమైన రాజ్యాధికారాన్ని (అంటె ముఖ్యమంత్రిపదవిని) పొందటానికి అవకాశమున్నా, కేవలము 15%జనాభా ఉన్న ఇతర వర్గాలవారు ఇన్నాళ్ళు ఈ నిజమైన రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొని అభివృద్ధి అంతా వారి ప్రజలు. వారి ప్రాంతాల చుట్టూ కేంద్రీకృతమై అనుభవిస్తున్నారనుట వాస్తవం. నిజమైన రాజ్యాధికారమే అన్ని రంగాలలో అభివృద్ధికి మూలము అని మహాత్మ జ్యోతిరావు పూలే బాటల నడిచిన డా॥ అంబేద్కర్ చెప్పారు. ఈ ఐక్యవేదిక ముఖ్య ఉద్దేశ్యం ఏమంటే జనాభా ప్రతిపాదికన, అన్ని కుల, వర్గాల వారికి అసెంబ్లీ పార్లమెంటు మరియు ఇతర రాజకీయ వ్యవస్థలలో తగిన ప్రాతినిత్యము కలిగించడము. ఇది నూటికి నూరుపాళ్ళు రిజర్వేషన్ అన్నమాట. రాజ్యాధికారానికి దూరమైన ప్రజలను చైతన్యపరచి వారి రాజకీయ హక్కులు, ఓటు విలువను గురించి ఉద్బోదించి, వారిని ఐక్యమత్యము చేయుటకు రాజకీయ అవగాహన సదస్సులను, యింతకు ముందు హైదరాబాద్, కాకినాడ, విజయవాడ, తిరుపతి, విశాఖపట్టణములో నిర్వహించడమైనది. . ఈ సదస్సులు ఈ ఐక్యవేదిక అధ్వర్యములో సర్వశ్రీ కూచిపూడి సూర్యనారాయణరావు, వి.ఎన్. భూషణరావు తదితర ప్రముఖ బి.సి. నాయకులు సర్వశ్రీ ఐ. వెంకటేశ్వర్లు, బి. దానం, డి.సి. రోశయ్య నిర్వహణలో జరుపబడుచున్నాయి. పై సిద్ధాంతికతపై అఖండ విశ్వాసం కలిగి, ఆ లక్ష్యం దిశలో నిరంతర కృషి చేయుచున్న జాతీయస్థాయి బి.సి. నాయకులైన డా. ఎస్. రామదాసు (పి.ఎం.కె. పార్టీ వ్యవస్థాపక అధ్యక్షులు) ఈ వర్గ ప్రజల్లో చైతన్యం కలిగించి వారిని సంఘటిత పర్చడానికి అన్ని సదస్సులకు హాజరై వారినుద్దేశించి ప్రసంగిస్తున్నారు.

### ప్రజలందరి కొరకు

1. జనాభా ప్రాతిపదికన, అన్ని కులాల ప్రజలకు అసెంబ్లీ, పార్లమెంట్ మరియు ఇతర రాజకీయ వ్యవస్థలో ప్రాతినిధ్యము కల్పించుట
2. రాజకీయ పదవులు రొటేషను పద్ధతిలో పై వర్గాలు అనుభవించుట.
3. రాజకీయ పదవులలో స్త్రీలకు కనీసం 15%తగ్గకుండారిజర్వేషన్ సౌకర్యము కలిగించుట
4. కేంద్రప్రభుత్వము కులవర్గాల గుణాంక లెక్కలు సేకరించుట.
5. సుప్రీంకోర్టు, హైకోర్టు జడ్జీల నియామకాలలో రాజ్యాంగబద్ధమైన రిజర్వేషన్లు పై వర్గాల వారికి కల్పించుట. ఉన్నత న్యాయాధీశులను నియమించేందుకు, రిటైర్డు కోర్టు, హైకోర్టు జడ్జీలు మరియు ప్రముఖ న్యాయవాదులన్న జాతీయ జుడీషియల్ కమీషన్ ఏర్పాటు చేయుట
6. ప్రభుత్వ సర్వీసుల్లో అసెంబ్లీ, పార్లమెంటులో, ఎస్.సి. ఎస్.టి, లాగ బి.సిలకు 45%, ముస్లింలకు 8%నకు తగ్గకుండా రాజ్యాంగబద్ధ రిజర్వేషన్ కల్పించుట.
7. రాష్ట్ర కేంద్ర వనరులన్నింటిని, జనాభా ప్రాతిపదికపై అన్ని వర్గాల అభివృదికద అవసరాలకు కేటాయించుట.
8. నిరుపేద కుటుంబలో ప్రతి వ్యక్తికి 8కేజీల చొప్పున గరిష్టంగా 40కేజీల బియ్యాన్ని కేజీ 1కి రూ. 2/-లు చొప్పున ప్రతినెలా అందజేయుట.
9. ప్రతి సంవత్సరం ప్రతి పేద కుటుంబానికి ప్రభుత్వ ఖర్చుతో రెండు జతల చీరలు మరియు ధోవతులు అందజేయుట.
10. పాఠశాల విద్యార్థులకు ఉన్నత పాఠశాలస్థాయి వరకు రోజుకు రెండు పర్యాయాలు ఉచితంగా భోజనాన్ని ఏర్పాటు చేయుట.
11. పాఠశాలలో ఆహారాన్ని భుజించే ప్రతి విద్యార్థికి సంవత్సరమునకు రెండు జతల దుస్తులను ఉచితంగా అంజేయుట.
12. ఉన్నతపాఠశాల స్థాయి వరకు ప్రతి ఒక్కరికి నిర్బంధ మరియు ఆంగ్ల విద్యాభోధన ఉచితంగా కల్పించుట
13. ప్రతి వ్యవసాయ, చేనేత, చేతివృత్తుల పేద కుటుంబములలోని 65సం॥లు నిండిన ఒక వ్యక్తికి నెల 1కి రూ. 450/-లు చొప్పున వృద్ధాప్య పింఛను అట్టి కుటుంబములోన్ని స్త్రీ పేరున అందజేయుట. వీరి సంఖ్యకు పరిమితి ఉండరాదు.
14. సన్న, చిన్నకారు రైతుల భూములకు గరిష్టంగా 5.00 ఎకరాలకు ఉచిత విద్యుత్తు సరఫరా. ఒకవేళ పెద్దరైతు సంబంధిక గడులలో వ్రాయబడి ఉన్నట్లయితే, అట్టి విధంగా కౌలుకు తీసుకున్న వ్యక్తి గరిష్టంగా 5.00 ఎకరాల వరకు ఉచిత విద్యుత్తుకు అర్హత కల్పించుట.
15. పేద ప్రజల గుడిశెలు మరియు ఇండ్లకు 2 బల్బుల వరకు ఉచిత విద్యుత్తు సరఫరా చేయుట
16. ఇప్పటివరకు బలహీన వర్గాల పథకముల క్రింద ఋణసౌకర్యం పొంది, ఆశించిన ప్రయోజనము పొందక పేదరికములో మ్రగ్గుచున్న వారికి అన్ని రకముల ఋణముల మాఫీ చేయబడుట.
17. బలహీన వర్గాల సొసైటీలు/కార్పొరేషన్లచే మంజూరు చేయబడే అన్ని క్రొత్త ఋణాలు కేవలం పదిపైసల వడ్డీ.
18. పెద్ద అపార్టుమెంటల్లో జరిగిన అగ్నిప్రమాదములలో మరణించిన కూలీలో ఒక్కొక్కరికి రూ. 5.00 లక్షల నష్టపరిహారము. చొప్పున ఆ భవన నిర్మాణదారుడు ఇన్సూరెన్స్ చేయించుట
19. ప్రజలకు అవసరమైన అన్ని మందులూ తయారుచేయుటకు అయ్యే ఖర్చుపై కనీస లాభముతో రేట్లు ఉండుట.
20. సినిమాహాళ్ళు మరియు ఇతర వినోద ప్రదేశాలలో నేలతరగతి వీక్షకులకు/ప్రేక్షకులకు వినోదపుపన్ను విధింపబడదు.
21. ఎక్సైజు షాపుల ద్వారా విక్రయించబడే చీప్‌లిక్కర్ రకాలపైన విధింపబడే అమ్మకపు పన్ను కనీసస్థాయికి తగ్గింపబడుట.

### ప్రభుత్వ ఉద్యోగుల కొరకు

1. కేంద్రప్రభుత్వ ఉద్యోగుల వలెనే పదవీవిరమణ వయస్సు అరవై.(60) సంవత్సరాలకు పెండబడుట. వేతన స్కేళ్ళు కూడా కేంద్రప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా ఉండుట.
2. అన్ని రిజర్వుడు కమ్యూనిటీలకు పదోన్నతులలో రిజర్వేషన్లు అమలు చేయబడుట
3. నైతిక పతనము మరియు అవినీతికి చెందిన కేసులుగాకుండా మిగిలిన అన్ని సాధారణ క్రమశిక్షణ కేసులూ ఆరు మాసాలలోపుగానే పరిష్కరింపబడుట. ఆరు మాసాలలోపుగా కేసు పరిష్కరింపబడక పోయినట్లయితే అటువంటి ఉద్యోగుల పదోన్నతికి అర్హులుగా పరిగణించపబడుట.

### విద్యావంతులైన నిరుద్యోగుల కొరకు:

1. రాష్ట్ర పబ్లిక్ కమీషన్‌వారు ప్రతి సంవత్సరము పరీక్షలు, ఇంటర్యూలు నిర్వహించి భారత దేశపు యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ మాదిరిగానే అదే సంవత్సరములో ఎంపిక విధానాన్ని పూర్తిచేయుట.
2. సర్వీసు కమీషనలో మొత్తం 11మంది సభ్యులు ఉండాలి. వీరిలో అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం కల్పించుట
3. రాష్ట్ర ప్రభుత్వం బయటి సంస్థల ద్వారా నియామకములు చేయు పద్ధతిని రద్దుచేయుట. మూడు సంవత్సరముల కాలము వరుసగా కొనసాగింపబడిన ఉద్యోగములను శాశ్వత ఉద్యోగములుగా పరిగణించుట.

ప్రైవేటు రంగములలో పారిశ్రామిక సంస్థలలోగాని ఉద్యోగాలలో రిజర్వేషన్ కల్పించే పద్ధతికి కావలసిన అన్ని విధములైన చర్యలు ప్రభుత్వము చేపట్టుట.



డి.సి. రోశయ్య
ఐ.ఎ.ఎస్.(రిటైర్డ్)

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M241 |
| పుస్తకం పేరు | సూర్య |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | ఉల |
| వెనుక అట్ట | ఉల |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Naveena |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |